# బ్రహ్మ పురాణము
## (వచనం)

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్



Like us to follow
@mohanpublications


ఆధ్యాత్మిక గ్రంథ నిలయం
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

1 21 | 9

శ్రీ దేవాయనమః

# బ్రహ్మపురాణము.

## (ఆంధ్రవచనము.)

శ్రీ వెలయఁగ నారాయణ
దేవునకు నమస్కరించి దివ్యముని నరుల్
భావమున నెంచి భాషా
దేవికిఁ బ్రణమిల్లి వ్యాసదేవుఁ దలఁచుచున్.

ఉ. ఏవిభు తేజమందు జనియించి వసించుచుఁ బంచభూతమా
యావృతమైన విశ్వము లయంబును గాంచునొ కల్పకల్ప ; మే
దేవునిఁ గొల్చి మానవులు దుదిన్ ధ్రువమోక్షపదంబుఁ గాంతురో
యావిభునాశ్రయింతు మమలాత్మ నచ్యుతుఁ బురుషోత్తమాహ్వయున్.

ఉ. సారసనాభునిష్ఠ లగు సంయము లాత్మఁ దలంచువాని సం
సారవినాశకారణుఁ బ్రసన్నుఁ బ్రమోదమయుం బ్రభున్ నిరా
కారు విశుద్ధు నీశు నవికారుఁ బ్రపంచవిదూరు ముక్తిసం
చారు హరిం దలంతు మనిశంబు నభీష్టపదార్థసిద్ధికిన్.

# అవతారిక.



పరమపవిత్రంబును, పుణ్యనిలయంబును, మనోహరప్రదేశంబును, నానామునిజనాకీర్ణంబును, నానాపుష్పోపశోభితంబును, సరళ, కర్ణికార, పనస, ఖదిర, చూత, జంబూ, కపిత్థ, న్యగ్రోధ, దేవదారు, పారిజాత, చంద, నాగరు, పాటల, వకుళ, సప్తపర్ణ, పున్నాగ, నాగకేసర, సాల, తాల, తమాల, నారికే, ళార్జున, చంప, కాశ్వత్థాది బహువిధ వృక్ష విరాజితంబును, వివిధపక్షిగణ సంకీర్ణంబును, నానా మృగసమూహ సంయుక్తంబును, వాపీకూపతటాకాద్యనేకజలాశయాలంకృతంబును, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాది బహుజన సమాకీర్ణంబును, యతి వానప్రస్థ గృహస్థ బ్రహ్మచారి జనసంకలితంబును, సంపన్నగోకులాభిశోభితంబును, యవ గోధూమాది సకలసస్యసంపన్నంబును నగు నైమిశారణ్యంబునం దొకప్పుడు మహర్షులచే ద్వాదశవర్ష సత్త్రయాగంబు గావింపబడుచుండెను. యజ్ఞారంభసమయంబునందు హుతాశనుండగు వైశ్వానరుండు యాగకుండంబునం బ్రజ్వలించుచుండెను. ఆమహాయజ్ఞమును సందర్శింప ననేక తాపసగణంబులును, నితరద్విజగణంబులును, నచ్చటికి విచ్చేసి యథోచితపూజాసత్కారంబుల నంది యుపవిష్టులై యుండిరి. మహామునులును, ఋత్విగ్గణంబును యథాస్థానంబుల నలంకరించియున్న సమయంబున, మతిమంతుండును, రోమహర్షణపుత్త్రుండును నగు సూతుండేతెంచి, నిజాగమనంబుం గాంచి యమితానందభరితు లగుచున్న యచ్చటిమునివర్యులచే నభ్యర్చితుండై, మరల వారికిం బ్రతిపూజనంబులం గావించి యుత్తమాసనంబున నాసీనుండై యుండెను. పరస్పర కుశలప్రశ్నానంతరంబున ఋత్విక్కులతోడను, సదస్యులతోడను గూడి

యున్న యజ్ఞదీక్షితులగు నమ్మహర్షు లందఱును వ్యాసశిష్యుండైన యాసూతుం గాంచి హర్షముతో నిట్లనిరి.

పరమపూజ్యుండ వైన యోరోమహర్షణీ! సమస్తపురాణాగమశాస్త్రేతిహాసంబులయందును, దేవదైత్యుల జన్మకర్మములతోఁ గూడిన చరిత్రంబులయందును నీ వెఱుంగని విషయంబులు లేవు. మోక్షశాస్త్రంబులయందు నీవు సర్వజ్ఞుండవే. సచరాచరం బగు నీజగం బంతయుఁ దొలుత నెట్లుత్పన్నం బయ్యెను? ఇంకను నెట్లు కాఁగలదు? దీని యుత్పత్తి స్థితి లయంబు లెట్టివి? ఈమాసంశయంబుల నివారింపుము. మునీంద్రు లిట్లడుగుటయు, ధీమంతుం డైన యాసూతపుత్త్రుం డిట్లనియెను.

నిర్వికారుండును, విశుద్ధుండును, నిత్యుండును, పరమాత్ముండును, నిత్యైకాకారుండును, విష్ణుండును, సర్వజిష్ణుండును, హిరణ్యగర్భుండును, హరుండును, శంకరుండును, వాసుదేవుండును, నేకానేకస్వరూపుండును, స్థూలసూక్ష్మాత్మకుండును, వ్యక్తావ్యక్తస్వరూపుండును, ముక్తికారణుండును, జగదుత్పత్తిస్థితిలయహేతుభూతుండును, అజరామరుండును, మూలకారణుండును, విశ్వాధారుండును, సూక్ష్మాతిసూక్ష్ముండును, సర్వభూతస్థితుండును, అచ్యుతుండును, పురుషోత్తముండును, జ్ఞానస్వరూపుండును, కేవలనిర్మలుండును, పరమార్థస్వరూపుండును, సర్వవ్యాపకుండును, సర్వజ్ఞుండును, సర్వేశ్వరుండును, అజుండును, అక్షయుండును, అవ్యయుండును, ఆద్యుండును, విశ్వనాథుండును, నగు భగవానునకును, బ్రహ్మాదిదేవతలకును నమస్కారంబు లొనర్చి, మఱియు నితిహాసపురాణవేత్తయు, వేదవేదాంగవిదుండును, సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞుండును, పరాశరసుతుండును, మత్ప్రభుండును మదీయగురుండును, మునివర్యుండును నగు వేదవ్యాసమహర్షికిఁ బ్రణామంబు లాచ

రించి, వేదసమ్మితంబును, పరమపవిత్రంబును నగు నొకయుత్తమపురాణము నిప్పుడు మీకు వినుపించుచున్నాను. ఋషీంద్రులారా! తొల్లి దక్షప్రజాపతి మొదలగు మునిసత్తములచేఁ బ్రశ్నింపఁబడి భగవంతుండగు బ్రహ్మదేవుండు వారికుచ్చిన విధం బంతయును గల కథను మీకు నెఱుంగించుచున్నాను. ఆకథ సమస్తపాపవినాశకరంబును, బహ్వర్థసమన్వితంబును, చిత్రచరిత్రసంయుక్తంబును, వేదవిశ్రుతంబును నై యొప్పుచున్నది. అట్టిదీని నెవ్వఁడు నిత్యమును ధారణము చేయునో, ఎవ్వఁడు శ్రద్ధాభక్తులతో వినునో వానివంశ మాచంద్రార్కమభివృద్ధి నొందుచుండుటయే కాక, యాపుణ్యాత్ముం డంతంబునఁ బుణ్యలోకప్రాప్తిం బొందువాఁ డగుచున్నాఁడు. ఇట్లు చెప్పి సూతుండు మరల నీరీతిం బలికెను.

## ఆదిసృష్ట్యభివర్ణనము.

అవ్యక్తుండును, కారణుండును, నిత్యుండును, సదసదాత్మకుండును, ప్రధానపురుషుండును నగు నీశ్వరునినుండియే యీవిశ్వమంతయు వినిర్మితం బగుచున్నది. మునిశ్రేష్ఠులారా! నారాయణపరాయణుండును, అమితతేజసుండును నగు నవ్విధాతయే యీభూతసృష్టికంతకును కర్త యని యెఱుంగుఁడు. మహత్తునుండి యహంకారంబును, యహంకారంబునుండి భూతసముదాయంబును నుత్పన్నంబై ఆభూతసమూహమునుండి కాలక్రమమున ననేకవిధంబు లగు సంఘంబు లావిర్భవించెను. ఇదియ సనాతనసృష్టిక్రమంబు. మునీంద్రులారా! నాకుం గల శాస్త్రజ్ఞానంబునుం బట్టియు, వినికినిబట్టియు వర్ణనీయంబును, పుణ్యవర్ధనంబును నగు సృష్టిక్రమంబును, సంతతస్మరణీయంబులును, కీర్తివర్ధనంబులును నగు స్థిరకీర్తిశాలుల పుణ్యచా

క్షేత్రంబులును నాబుద్ధికోలంది మీకు సవిస్తరంబుగ వర్ణించి చెప్పెదను. సావధానచిత్తులరై యాకర్ణింపుడు.

స్వయంభువైన భగవంతుండు వివిధప్రజలను సృజియింప నభిలషించినవాఁడై, ప్రప్రథమమున నుదకంబులను సృజియించి వానియందు స్వకీయం బగు వీర్యంబును నిక్షేపించెను. ఉదకంబులు నారంబులని చెప్పంబడును. ఆజలంబులు "అయనంబు" (స్థానంబు)గాఁ గలవాఁడు గావుననే యాభగవానుఁడు నారాయణనామంబున విఖ్యాతుండయ్యెను. అట్లు జలవినిక్షిప్తమైన యావీర్యము బంగరురంగు గల యొకగుడ్డుగాఁ బరిణమించెను. దానినుండి బ్రహ్మదేవుండు స్వయముగ నుద్భవించెను. కావుననే యాతఁడు స్వయంభు వని యస్మదాదులచే నాకర్ణింపఁబడుచున్నాఁడు. భగవంతుం డగు హిరణ్యగర్భుండాజలంబునం బడియున్న యాయండంబున నొకసంవత్సరమువఱకు సంవసించి యుండి పిమ్మట దానిని రెండుభాగములుగాఁ జీల్చుకొని వచ్చి, యొకభాగమును స్వర్గలోకముగను, రెండవభాగమును భూలోకముగను, ఆరెంటికిని నడుమ నున్న యంతరము నాకాశముగను సృజియించెను. పిమ్మటఁ గ్రమక్రమముగాఁ బృథ్వి, దశదిశలు, కాలంబు, మనంబు, వాక్యంబు, కామంబు, క్రోధంబు, రతి మొదలుగాఁ గల సృష్టియంతయు నయ్యెను. అంతట బ్రహ్మదేవుండు ప్రజాపతిగణంబును జయింప సంకల్పించినవాఁడై తదనురూపముగ దక్షాదిప్రజాపతులను సృష్టించెను పిమ్మట మరీచి, అత్రి, అంగిరసుఁడు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు, వసిష్ఠుఁడు—అను సప్తమానసపుత్త్రులాతని తేజంబునుండి యుద్భవించిరి. పితామహుని యీయేడుగురుపుత్త్రులును పురాణములయందు విశేషప్రసిద్ధిం గాంచియున్నవారు. వీరు నారాయణాత్మకు లనియుఁ జెప్పంబడుచున్నారు. పరమేష్ఠి తనరోషంబునుండి

రుద్రుని సృజియించెను. తరువాత సనత్కుమారుఁడు సృష్టింపఁబడి యెను. ఈసనత్కుమారుఁడు బ్రహ్మమానసపుత్త్రులకంటెను బూర్వుఁ డని తలంపఁబడుచున్నాఁడు. ద్విజశ్రేష్ఠులారా! పైని జెప్పంబడిన బ్రహ్మమానసపుత్త్రసప్తకమునుండియే ప్రజాగణంబును, రుద్రగణం బును నుత్పత్తిం గాంచిన దయ్యెను.

స్కందుఁడును, సనత్కుమారుఁడును స్వస్వతేజంబుల సంవర ణంబు గావించుకొని యుండిరి. మరీచిమొదలగు విరంచిమానసపుత్త్రు లేడ్వురనుండియు దివ్యంబులును, సకలదేవగణాన్వితంబులును, క్రియా సంపన్నంబులును, బ్రజాభివృద్ధికరంబులును, మహర్షిగణాలంకృతంబు లును నగు మహావంశంబులు సముత్పన్నంబు లయ్యెను. భగవానుఁ డగు బ్రహ్మదేవుఁడు ప్రప్రథమమున మెఱుపులను, పిడుగులను, మేఘములను, ఇంద్రధనుస్సును, పక్షిగణంబులను, వర్షాధిదేవతను, యజ్ఞాదిసత్కార్యసిద్ధికొఱకు ఋగ్యజుస్సామాది వేదంబులను, మఱియు సాధ్యాదిదేవగణంబులను సృజించెను. ఇట్లే యమ్మహాత్మునిగాత్రం బునుండి యుత్తమమధ్యమాధమ భూతసంఘంబులు క్రమక్రమంబుగ నుత్పన్నంబు లయ్యెను. ప్రజాపతియైన బ్రహ్మదేవుం డీరీతి నెంతగా సృష్టించుచున్నను బ్రజాభివృద్ధి యంతగాఁ గానరాకుండెను. దానం జేసి యాపరమేష్ఠి తనదేహంబును రెండుభాగములుగా విభాజించి యం దొక్కభాగమును బురుషునిగఁ జేసి రెండవభాగమును స్త్రీగా నొసర్చి యామెవలన నానావిధముగఁ బ్రజాభివృద్ధిం గావించినవాఁడై యీ విధముగఁ దనమహామహిమను స్వర్గమర్త్యాదిలోకంబుల వ్యాపింపఁ జేసెను. భగవంతుండైన విష్ణువు విరాట్టును సృజియించెను. ఆవిరా ట్పురుషుండు వేఱొక మహాపురుషుని సృష్టించెను. ఆమహాపురుషునే మను వని యెఱుంగఁదగు. ఆతనికాలము మన్వంతర మనఁబడుచు

న్నది. ఇది ద్వితీయమానసమన్వంతరంబు. అనంతరము మహాత్ముండును, విరాట్పుత్త్రుండును నగు మనువు ప్రజాసృష్టిని గావించెను. ఆప్రభువు నారాయణాత్మజుం డగుటం జేసి యాతనిసంతతివా రయోనిజు లైరి.

మునిశ్రేష్ఠులారా! ఇయ్యాదిసృష్టివృత్తాంతము నెఱింగినమానవుండు దీర్ఘాయుష్మంతుండును, కీర్తిమంతుండును, పుణ్యవంతుండును, ప్రజావంతుండును నగుటయే కాక యంతంబున యథేష్టగతిం బొందుచున్నాఁడు.

## సృష్టికథనము.

రోమహర్షణతనయుం డగు సూతుండు మరల నిట్లు చెప్పనారంభించెను——ప్రజాపతి యగుబ్రహ్మదేవుం డారీతిని జగత్సృష్టికార్యమును నెఱవేర్చినవాఁడై తనమహిమ నెల్లలోకంబులను వ్యాపింపఁజేసెను. మునిశ్రేష్ఠులారా! ఇంతకుమున్ను చెప్పిన మహాపురుషుం డగుమనువు సౌందర్యశాలినియు, నయోనిసంజాతయు నగుశతరూప యనుకన్యను బత్నిగఁ జేకొనెను. ఆశతరూపాకన్య ధర్మునికుమారిక. ఆమె పదివేలయేండ్లు తపం బొనరించి తపోనిధియైన యాతనిని భర్తనుగాఁ బడసెను. అమ్మహాపురుషుఁడే స్వాయంభువమను వను ప్రసిద్ధనామము గలవాఁడు. డెబ్బదియొక్కదివ్యయుగములకాలము మన్వంతర మని చెప్పంబడుచున్నది. మహాత్ముఁ డగుస్వాయంభువమనువువలన శతరూపాదేవిగర్భంబున వీరుండును, ప్రియవ్రతుండును, ఉత్తానపాదుండును జన్మించిరి. అందు జ్యేష్ఠుం డగువీరుండు కర్దమప్రజాపతి జ్యేష్ఠపుత్త్రిక యగుకామ్యాదేవిని భార్యగాఁ బరిగ్రహించి యామెయందు సమ్రాట్టు, కుక్షి, విరాట్టు, ప్రభువు అను నలుగురునందనులను బడ

సెను. ఉత్తానపాదుఁ డనువాఁడు ప్రజాపతియైన యత్రిచేఁ బుత్త్రుఁడుగా గ్రహింపఁబడియెను. ధర్మునితనయయు, సుశ్రోణియు, నశ్వమేధయాగఫలంబున జననంబుఁ గాంచినదియు నగు సూనృతాదేవిగర్భంబున నుత్తానపాదునకు నల్వురు పుత్త్రులు గలిగిరి. భద్రవతియైన యాసూనృతాదేవియే సుప్రసిద్ధుఁడైన ధ్రువునిజనని. సూనృతగర్భమునఁ బ్రజాపతి యైన యుత్తానపాదునకు జనియించిన నలువురు పుత్త్రులును—ధ్రువుఁడు, కీర్తిమంతుఁడు, ఆయుష్మంతుఁడు, వసువు అనువారలు.

ద్విజశ్రేష్ఠులారా! మహాభాగుం డైన ధ్రువుండు సువిశాలయశస్సు నభిలషించినవాఁడై మూఁడువేల దివ్యసంవత్సరంబులు మహాతపస్సు నొనర్చెను. ఆతనితపంబునకు సంప్రీతుండై భగవంతుండైన బ్రహ్మదేవుం డాతనికి సప్తమహర్షులసమ్ముఖమ్మున నాత్మసమంబగు నిశ్చలస్థానంబు నాతనికిఁ బ్రసాదించెను. ఆధ్రువునకు లభియించిన మహత్తరం బైన యాగౌరవంబు నవలోకించి తొల్లి సురాసురగురుండైన శుక్రుండు సంతసించినవాఁడై “అహాహా! ఏమి యీమహాత్మునితపోవీర్యము! ఏమి యీతనిప్రసిద్ధి! ఏమియద్భుతము! ఇప్పుడీధ్రువు నగ్రవర్తిగాఁ జేసికొని సప్తమహర్షులును వెలుంగుచున్నారు గదా!” అని ప్రశంసించెను.

ధ్రువునకు శ్లిష్టి, భవ్యుఁడు, శంభుఁడు నను ముగ్గురుకొమరు లుద్భవించిరి. శ్లిష్టి భార్యయైనసుచ్ఛాయయందు, రిపుఁడు, రిపుంజయుఁడు, వీరుఁడు, వృకలుఁడు, వృకతేజుఁడు నను పవిత్రులైన నందను లేవురు వొడమిరి. రిపునకు బృహతీగర్భమున తేజోమయుం డగు చక్షుషుండు జనియించెను. మహాత్ముండును, ప్రజాపతియు నగు వీరణునితనయ యైనపుష్కరిణిగర్భమునుండి చాక్షుషమనువు ప్రభవిం

చెను. ఆమనువునకు వైరాజ (స్వాయంభువమను) ప్రజాపతి దుహిత యైన నడ్వలయందు తేజస్సంపన్నులగుపుత్త్రులు—కుత్సుఁడు, పూరుఁడు, శతద్యుమ్నుఁడు, తపస్వి, సత్యవాక్కు, కవి, అగ్నిష్టుత్తు, అతిరాత్రుఁడు, సుద్యుమ్నుఁడు, అభిమన్యుఁడు—అనువార లుదయించిరి. పూరువునుండి ఆగ్నేయియందు, అంగ, సుమనస, ఖ్యాతి, క్రతు, ఆంగిరస, గయు లను నామంబులుగల తేజోమూర్తు లాఱుగు రుద్భవించిరి. అంగునకు సునీథయందు వేనుఁ డనుపుత్త్రుఁ డుద్భూతుండయ్యెను. ఆవేనుఁడు దుష్టుఁడై ప్రజాకంటకుఁ డయ్యెను. వానిదుర్మార్గతకు మునీంద్రు లెల్లరును గినిసి ప్రజాపరిపాలనార్థము వేఱొకరాజును సృష్టింప నెంచి యవ్వేనునిదక్షిణకరంబును మథించిరి. ఇట్లు మథింపఁబడిన యాతనికుడిచేతినుండి యొకమహాపురుషుం డుద్భవించెను. ఆతనిం గాంచి మునీంద్రులు మహాతేజుండు, కీర్తిమంతుండును, ప్రజారంజకుండును నగు నని వక్కాణించిరి. ఆవేననందనుండు పృథుచక్రవర్తి యనునామంబున సుప్రసిద్ధుండయ్యెను. ఆతఁడు జన్మించినప్పుడే ధనుర్ధరుండును, కవచధారియు నై యుండెను. క్షత్త్రియకులంబునకు మూలపురుషుండును, రాజసూయాభిషిక్తుల కాద్యుండును, వైశ్వానరసమతేజుండును నగు నప్పృథుమహారాజుచేఁ బృథివియంతయు సురక్షితమై ప్రకాశించెను. ఆతనిప్రభుత్వకాలంబుననే నిపుణులయిన సూతమాగధు లుత్పన్నులైరి. అతఁడే గోరూపధారిణి యైనపృథ్వినుండి దేవర్షిసాహాయ్యంబున సస్యరూపక్షీరములను బిదికి ప్రజలకు వృత్తులను గల్పించెను. అటుపిమ్మట, పితృదేవతలును, దానవులును, గంధర్వులును, అప్సరోగణంబులును, నాగులును, పుణ్యజనులును, గుల్మంబులును, పర్వతంబులును క్రమక్రమంబుగఁ దమతమ విభిన్న పాత్రంబులయం దిట్లె వసుంధరను బిదుకుకొనిరి. వసుంధరయు వారి

యభీష్టక్షీరములను యథేష్టంబుగ నొసగెను. దానివలననే ప్రజలు సుఖంబుగ జీవింపఁగలిగిరి. ఆపృథుచక్రవర్తికి ధర్మజ్ఞు లగు 'అంతర్ధి, పాలి' అను నిరువురు కొమారులు గలిగిరి. అంతర్ధికి శిఖండిని యను భార్యయందు హావిర్ధానుండు పుట్టెను. హావిర్ధానునకు అగ్నినందినియైన ధిషణయందు ప్రాచీనబర్హి, శుక్ర, గయ, కృష్ణ, వ్రజాజిను లను నా ల్గురుపుత్త్రులు పొడమిరి. భగవానుం డగుప్రాచీనబర్హి ప్రధానప్రజా పతులలో నొకం డయ్యెను. యజ్ఞసమయములయందు తఱచుగఁ బ్రాచీనాగ్రంబు లగునట్లు బర్హిస్సు (కుశసముదాయము) లను బఱచుచుండెడివాఁడు గావున నాతండు ప్రాచీనబర్హి యను నామంబునం బరగెను. మునిశ్రేష్ఠులారా! హావిర్ధానునియగ్రనందనుం డగు ప్రాచీన బర్హి రాజ్యశాసనకాలంబునందు ప్రజావర్గం బెంతయు ధనసమృద్ధంబు ను సౌఖ్యసంపన్నంబునునై యుండెను. ఆప్రాచీనబర్హి సముద్రతనయ యగుసవర్ణ యను నొకవనితారత్నంబుం బెండ్లియాడెను. బహుకా లంబు తపస్సు చేసి యామహారాజు సముద్రసందినియైన సవర్ణాదేవి గర్భంబునఁ బదుగురుకొమారులను బడసెను. ఆరాజేంద్రునిపుత్త్రు లందఱును ప్రాచేతసనామంబునఁ బ్రఖ్యాతులైరి. వారెల్లరును ధను ర్వేదపారగులును, ఏకధర్మనిరతులు నై యుండిరి. వారు పదివేలసం వత్సరంబులు కఠోరతపస్సును గావించుచు సముద్రసలిలంబుల శయ నించియుండిరి. ఏతాదృశంబగు వారిదీర్ఘకాలతపంబుచేఁ దొంటివలె ధరిత్రీరక్షణంబు లేకపోయెను. పృథివి యంతయు మహావృక్షజాలం బులచే నావృతం బైపోయెను. ఆవృక్షజాలంబులు వాయుప్రసారంబు నకుసయితమెడమీయనియంత దట్టముగాఁ బెరిఁగిపోయి యాకాశంబు నొరయుచుండెను. ఈపదివేలవత్సరంబులును రాజరక్షణంబు లేకయుఁ జేయుపనులు గానరాకయుఁ గ్రమక్రమంబుగాఁ బ్రజాగణంబు నాశం

బు నొంద నారంభించెను. తపోనిరతులై యున్న ప్రాచేతసు లెల్లరును జగంబునకుం గలిగిన యాదురవస్థ నాలించి క్రోధాన్వితులై తమముఖంబులనుండి వాయువు నగ్నినిఁ గ్రొత్తగా సృజియించినవా రయిరి.

అప్పు డావాయుదేవుం డావృక్షసమూహంబులనెల్ల మొదలంటఁ బెకలించి యెండించి నైచుచుండ, నాయగ్నిదేవుండు వానిని దగ్ధము గావించుచుండెను. క్రమక్రమముగా నయ్యనిలానలప్రభావంబునఁ బృథ్వియందు గల సకలవృక్షంబులు చాలవఱకు దగ్ధములై పోయెను. ఇఁక నల్పసంఖ్యాకంబు లగు మహీరుహంబులు మిగిలియుండుసమయంబున నోషధీనాథుం డగుచంద్రుండు ప్రజాపతు లగునాప్రాచేతసుల నెల్లరను సమీపించి “ రాజేంద్రులారా! మీర లందఱును ప్రాచీనబర్హి మహారాజునందనులును, ప్రజారంజననిరతులునై యున్నారు. మీప్రచండక్రోధంబునఁ బృథివి యెల్లను వృక్షశూన్య మైపోయినది. కోపము నుపసంహరింపుఁ డని మిమ్ముం గోరుటకై యిప్పుడు వచ్చియుంటిని. మీయాజ్ఞచే క్షణంబునన యగ్నిమారుతులు ప్రశాంతు లగుదురుగాక!

మహాభాగులారా! ఇదిగో! రత్నస్వరూపిణియు, వరవర్ణినియు నగు నీమె వృక్షకన్య యని యెఱుంగుఁడు. ఈమెపేరు మారిష. ఈమె భవిష్యద్వృత్తాంతంబు నాకుఁ దెలియును. సోమవంశవివర్ధని యగునీమె మీకు భార్య యగుఁగాక! తపోనిష్ఠు లగు మీదైన సగము తేజంబును, మదీయం బగునర్ధతేజంబును గర్భంబునం దాల్చి యీమె విద్వాంసుం డగు దక్షప్రజాపతి నవతరింపఁజేయును. అమ్మహాత్ముండును మీతేజోనలముచే నైశ్వానరనిభుండై, దగ్ధభూయిష్ఠమైన యీపృథివి నుద్ధరించి, ప్రజాగణంబును సంవర్ధితముం గావించును.” అని పలికెను. భగవానుం డగు చంద్రుని వాక్యంబుల ననుసరించి

తపోధను లైనయాప్రాచేతసులు వృక్షంబులయెడలఁ దమకుం బొడమిన కోపంబు నుపసంహరించుకొని, వృక్షనందిని యగు మారిషాదేవిని బత్నిగాఁ బరిగ్రహించిరి.

ద్విజోత్తములారా! ఆపదిమంది ప్రాచేతసులవలనను మారిషాదేవిగర్భమునుండి భగవంతుం డగు సోమునియంశముచే మహాతేజశ్శాలి యైన దక్షప్రజాపతి యావిర్భవించెను. మహాత్ముం డైన యా దక్షుండు తన మానసికశక్తిచేఁ గ్రమముగా స్థావర, జంగమ, ద్విపా, చ్చతుష్పాత్ప్రభృతి యగుసృష్టి నొనర్చి యనంతర మేఁబదిమంది స్త్రీ సంతానమును సృజియించెను. పిమ్మటఁ దత్కన్యకలలోఁ బదిమందిని ధర్మదేవతకును, పదమువ్వురను కశ్యపప్రజాపతికిని, నక్షత్రనామము గల తక్కిన యిరువదియేడ్గురను రాజయిన చంద్రునకును సమర్పించెను. ఆదక్షకన్యకల యందలిగర్భములయందును గ్రమముగా దేవ, దానవ, దైత్య, గో, ఖగ, నాగ, గంధర్వాప్సరఃప్రభృతిసమస్తజాతులు నుత్పత్తిం గాంచెను. ద్విజోత్తములారా! అదిమొదలుగఁ బ్రపంచము నందు గలప్రజావర్గమంతయు మిథునధర్మమువలన నుద్భవమును జెందుచున్నది యయ్యెను; తత్పూర్వము సంకల్పముచేతను, దర్శనముచేతను, స్పర్శముచేతను గలుగుచు నుండెడిది.

సూతుని యాకథనమును విని మునీంద్రు లిట్లనిరి. మహానుభావుఁడ వైన యోరోమహర్షణతనయా! దేవ, దానవ, గంధ, ర్వోరగ, రాక్షసాదుల సంభవవృత్తాంతమును, ప్రజాపతియైన దక్షుని యుత్పత్తివిశేషమును మాకు నీవలన శ్రవణగోచరము లైనవి. మహాత్మా! శుభవ్రతుఁ డైన దక్షప్రజాపతి బ్రహ్మదేవుని దక్షిణాంగుష్ఠమునుండియు నుద్భవించినట్లు మే మింతకుమున్ను వినియున్నాము గదా ఆతఁ డిప్పుడు ప్రాచేతసనందనుఁ డెట్లయ్యెను? మఱియు నాతఁడు చం

త్రముని దౌహిత్రుఁడై యుండియు మరల నాతనికి మామయై ట్లయ్యె నుఁ? రోమహర్షణీ! ఈమా సంశయముల నెల్లఁ బోఁగొట్టుము. అని మునీశ్వరులు వేఁడికొనుటయు సూతుం డీరీతిని వాక్రుచ్చెను.

ద్విజశ్రేష్ఠులారా! ఉత్పత్తివినాశములు రెండును భూతకోటికి నిత్యసంఘటనములు. పరిపూర్ణజ్ఞానవంతు లగుటచే ఋషీంద్రులుమాత్ర మివ్విషయంబున మోహముగ్ధులు గారు. దక్షాదు లైన రాజేంద్రులు యుగయుగమునను నావిర్భవించుచుందురు; తిరోహితు లగుచుందురు. ఏది యెట్లయినను విజ్ఞానులుమాత్రి మవ్విషయంబున మోహాగ్రస్తులు గారు. పూర్వకాలంబున గౌరవవిషయమందు జ్యేష్ఠ కనిష్ఠభావంబులు లేవు. అట్టిగౌరవంబునకుఁ దపఃప్రభావంబులే కారణంబులై యుండెను. చరాచరాత్మకంబైన యీదక్షసృష్టి నెఱింగినవాఁడు సంతానవంతుఁడై యాయుష్మంతుఁడై యంతంబున స్వర్గసుఖభోగంబుల ననుభవించును.

సూతుం డిట్లు చెప్పినతరువాత మహర్షులు మరల నిట్లు ప్రశ్నించిరి. మహాత్మా! ఇంతకుమున్ను సంగ్రహంబుగ వచించిన దేవ దానవగంధర్వోరగరాక్షసాదుల సంభవక్రమంబును సవిస్తరంబుగ వర్ణింపుము. అనుటయు సూతుండిట్లు చెప్ప నారంభించెను.

ఋషిసత్తములారా! పూర్వకాలంబునందు స్వయంభు వైన బ్రహ్మదేవుండు దక్షునిం గాంచి ప్రజాసృష్టి యొనర్పు మని యాదేశించెను. అప్పుడు దక్షప్రజాపతి సృష్టించినవిధంబును జెప్పెద నాకర్ణింపుఁడు. బ్రహ్మదేవుఁ డట్లాజ్ఞాపింపఁగానే తపోనిధి యైన దక్షుఁడు తన మనస్సంకల్పంబుచే దేవ, ఋషి, గంధర్వ, దానవ, యక్ష, రాక్షసాదుల ననేకులను సృజియించెను. ఎప్పుడు చూచినను తాను సృజియించినభూతంబులే కాని ప్రజాభివృద్ధి గానరా దయ్యెను. అంతట ధర్మా

త్ముండైన యాదక్షప్రజాపతి ప్రజాభివృద్ధి సేయునుపాయం బేది యని మనంబున బాగుగ నాలోచించి యాలోచించి మిథునధర్మమువలనఁ బ్రజ లుత్పత్తిం గాంచు మార్గంబును గనిపెట్టి ప్రజాసృష్టి కుత్సహించినవాఁడై, వీరణునితనయ యైన అసిక్నీదేవిని బాణిగ్రహణ మొనర్చెను. తపస్వినియు, మహాత్మురాలును, లోకధారిణియు నగునామెయందు వీర్యవంతుండైన యాదక్షుండైదువేలమందిపుత్త్రులను బడసెను. వారు హర్యశ్వులనునామంబునఁ బ్రసిద్ధులైరి. అమ్మహాభాగు లందఱును బ్రజావృద్ధిం గావించుట కుత్సుకులై యుండుటం గాంచి వారి వినాశముకొఱకు నారదుండు వారికేమియో యుపదేశంబుం గావించెను. దేవర్షిప్రవరుం డగునారదుని కపటవాక్యంబులను విని వారందఱు నెచ్చటికోపోయి యదృశ్యులైరి. దానంజేసి యమితవిక్రముం డగు దక్షుండు క్రుద్ధుండై నారదుని వినాశంబుకొఱకు నుద్యుక్తుం డయ్యెను. అప్పుడు భగవానుం డగుబ్రహ్మదేవుండు ఋషిగణసమేతుండై దక్షసమీపంబునకు వచ్చి యాతనిఁ గోపంబు నుపసంహరించుకొనుమని వేఁడికొనియెను. దక్షుండును బ్రసన్నుండై నాతనయగర్భంబున నారదుండు నీపుత్త్రుండై జన్మింపఁగలఁ డని చెప్పి బ్రహ్మదేవునకుఁ బ్రియానామ్ని యగుతనతనయ నర్పించెను. దక్షశాపభయంబున నారదుండును నామె గర్భంబున జనియించెను.

సూతుం డిట్లు వచింపఁగా, మహర్షులు మరల నిట్లు ప్రశ్నించిరి. “పరమపూజ్యుఁడ వైన యోరోమహర్షణపుత్త్రా! దక్షప్రజాపతిపుత్త్రు లందఱును నారదుని యెట్టివాక్యములను విని వినాశంబుం గాంచిరో యావృత్తాంతం బంతయు వినవలయు ననుకోరిక మాకుం గలదు గావున దానిని సవిస్తరంబుగ వినిపింపుము.” అని వేఁడుటయు సూతపుత్త్రుం డిట్లు పలికెను—ద్విజశ్రేష్ఠులారా! దక్షతనయులును, మ

హావీర్యులును నగునాహర్యశ్వు లందఱును బుడమిపైఁ బ్రజావృద్ధిం గావించుపొంటె నొకచో సమావేశ మగుటను దేవర్షి యగునారదుం డవలోకించి చల్లఁగా వారిం జేరి యీరీతి వచియించెను. ప్రాచేతసా త్మజు లైన యోమూర్ఖులారా! మహావిశాలం బైనయీపృథివి యెంత పరిమాణంబు గలదో యందినుమంతర్యైన యెఱుంగని మీరు ప్రజా సృష్టిని జేయుటకా యిచ్ఛయించుచున్నారు? ఈభూమి యూర్ధ్వాధో మధ్యభాగంబులచే నెంతపరిమాణము గలిగియున్నదో మీ కించుకం తయైనఁ దెలియునా? ఇట్టిమీరు ప్రజాసృష్టి నేరీతి నొనర్పఁగలరు? నారదునియీవచనంబుల నాకర్ణించి యాదక్షపుత్త్రు లందఱును భూ పరిమాణంబు నవలోకింప నానాదిశలకుం బ్రయాణమై పోయి మహా సముద్రంబులయందు సంగమించిన మహానదులంబోలె మరలఁ దిరిగి రారైరి. తనతనయు లైన యాహర్యశ్వుల వినాశము నెఱింగి మహా త్ముండైన దక్షప్రజాపతి వైరణ్యయైన యసిక్నీదేవిగర్భంబునుండి వేయి మంది పుత్త్రులు మరల నుదయించున ట్లొనరించెను. శబలాశ్వు లను పేరం బరగు నా దక్షపుత్త్రులును బ్రజాసృష్టి నొనర్ప మనంబున నెం చునంతలో దేవర్షి యగునారదుండును మరల వారిం జేరి పూర్వోక్త విధంబుననే వారికిసయితము ప్రబోధించుటయేకాక పుడమిపరిమాణం బును గనుంగొనుటకై వారియన్న లందఱును సరిగినవిధంబునుగూడఁ దెలిపెను. మహర్షులారా! ఆనారదవాక్యంబుల నాలించి వారును తమసోదరులపోకడలనరయుటకును దానింబట్టి పృథ్వీప్రమాణంబుం దె లిసికొనుటకును పిమ్మటఁ బ్రజాసృష్టిం గావించుటకును నిశ్చయించు కొని, తమయన్నలమార్గంబులంబట్టి నానాదిక్కులకును జెదరిపోయి వెనుకటివారివలెనే మరలఁ గానరాకుండఁ బోయిరి. వారిజాడ మఱి యెవ్వరికిని మరలఁ దెలియరా దయ్యెను. అనంతరము దక్షప్రజాపతి

తనపుత్త్రుల యదృశ్యత్వము నెఱింగినవాఁడై, అసిక్నీదేవియందు మ
రల నఱువదిమంది పుత్త్రికలను బడసెను. విప్రోత్తములారా! ఆకన్య
కలలోఁ బదిమందిని ధర్మునికిని, పదుమువ్వురను గశ్యపమహర్షికిని
చంద్రున కిరువదియేడ్వురను, దక్కినపదిమందికన్యకలను మహర్షులకు
ను నాతఁడు కన్యాదానము చేసెను. కడపటిపదుగురుకన్యకలలోను
అరిష్టనేమికి నలువురును, బహుపుత్త్రికున కిరువురును, అంగిరసున కిద్ద
ఱును, విద్వాంసుఁడైన కృశాశ్వున కిద్దఱును భార్యలైరి. మహర్షు
లారా! ఆదక్షప్రజాపతి పుత్త్రికలనామంబుల వినుఁడు. అరుంధతి,
వసువు, యామి, లంబ, భానువు, మరుద్వతి, సంకల్ప, ముహూర్త,
సాధ్య, విశ్వ — అనువారలు ధర్మునిభార్యలు. వారికిం గలిగినసంతాన
క్రమము ననయితము చెప్పెద నాలింపుఁడు. విశ్వ యనునామెయందు
విశ్వేదేవులును, సాధ్యయందు సాధ్యులును, మరుత్వతికి మరుత్వంతు
లును, వసువునందు వసువులును, భాను వనునామెయందు భానులును,
ముహూర్తయందు ముహూర్తంబులును, లంబయందు ఘోషులును,
యామియందు నాగవీథియు, అరుంధతియందు సకలపృథివీవిషయంబు
లును, సంకల్పయందు సమస్తసంకల్పంబులును జననంబుం గాంచెను.
యామిసంజాతమైననాగవీథిగర్భంబున నృషలుం డనుపుత్త్రుం డొక్కఁ
డు ప్రభవించెను. చంద్రునిభార్యలైన అశ్వినిమొదలగు నక్షత్రనామ
ములు గలవార లిరువదియేడుగురు జ్యోతిశ్శాస్త్రమునందు సుప్రసిద్ధ
ముగఁ జెప్పఁబడువారలే. జ్యోతిష్ప్రముఖులైనయితరదేవత లసువను
వులుగా విఖ్యాతులైరి. ఆపుఁడు, ధ్రువుఁడు, సోముఁడు, ధవుఁడు,
అనిలుఁడు, అనలుఁడు, ప్రత్యూషుఁడు, ప్రభాసుఁడు — అను నెనమం
డ్రును వసువు లనంబడుదురు. ఆపుఁ డనువానికి వైతండ్యుఁడు, శ్రే
ముఁడు, శాంతుఁడు ననువారు పుత్త్రులు. ధ్రువునకు భగవంతుండును

సకలలోకాంతకుండు నైనకాలుండు పుట్టెను. సోమునకు వర్చసుండు
ను, నాతనికి వర్చస్వియు జనియించిరి. ధవునకు ద్రవిణుండును, అన
లునకు మనోహర యను పత్నియందు శిశిరుఁడు, ఘ్రాణుఁడు, రమ
ణుఁడు ననుపుత్త్రులును గలిగిరి. అనిలునకు శివయందు మనోజవుం
డు, అవిజ్ఞాతగతియు ననువార లుద్భవించిరి. అనలునకు శరస్తంబంబు
నుండి కుమారుం డనునింకొకతనయుండును బుట్టెను. ఆతనికి శాఖుఁ
డు విశాఖుఁడు నైగమేయుఁడు ననువారలు సహచరు లైరి. అక్కు
మారుండు కృత్తికాగణంబుల కపత్యం బగుటచేఁ గార్త్తికేయుం డను
నామంబునఁ బ్రసిద్ధుఁ డయ్యెను. ప్రత్యూషునకు దేవలుండు పుత్త్రుం
డై ఋషి యయ్యెను. ఆదేవలునకు క్షమావంతుఁడు మనీషియు నను
నిరువురు నందనులు పొడమిరి. అష్టమవసు వగుప్రభాసుఁడు బృహ
స్పతిసోదరిని బరిణయ మయ్యెను. ఆమె వరవర్ణనియు బ్రహ్మవాదిని
యు యోగసిద్ధయు నై యోగబలంబుచే సకలజగంబులయందును బ
రిభ్రమించుచుండెను. ప్రభాసున కామెయందు విశ్వకర్మ యను మ
హాభాగుండు పుత్త్రుండై పుట్టెను. ఆతఁడు శిల్పిసమూహమున కంతె
కున్న గర్త్తయు వివిధభూషణనిర్మాతయు సకలసురసమాజసంవర్ధనుండును
నయ్యెను. దేవతావిమానంబు లన్నియు నాతనిచేతనే నిర్మితంబు ల
య్యెను. ఆమహాత్ముని శిల్పకార్యంబుల ననుసరించియే మానవులు
తమజీవితములను నిర్వహించుకొనుచున్నారు. కశ్యపుని భార్య యైన
సురభి తపం బొనర్చి మహాదేవుం బ్రసన్నుం గావించుకొని సతియై
యాతనివలన అజుఁడు, ఏకపాదుఁడు, అహిర్బుధ్న్యుఁడు, త్వష్ట, రు
ద్రుఁడు, హరుఁడు, త్ర్యంబకుఁడు, అపరాజితుఁడు, శంభుఁడు, రైవ
తుఁడు, శర్వుఁడు—అను నేకాదశరుద్రులను గాంచెను. వీరందఱును
త్రిభువనాధిపత్యమునం దధిష్ఠితు లైరి. అమితతేజు లగు నీరుద్రుల

సంఖ్య శతపరిమాణంబుగఁ బురాణములయందు ప్రశంసితంబగుచుండు ను. ఈరుద్రగణంబులచే చరాచరం బగు నీవిశ్వ మంతయుఁ బరిపూరి తమై యుండును. కశ్యపునకు అదితి, దితి, దనువు, అరిష్ట, సురస, ఖస, సురభి, వినత, తామ్ర, క్రోధవశ, ఇల, కద్రు, ముని—అను వారు పదుమువ్వురును పత్ను లైరి. వీరి సంతతిక్రమం బభివర్ణించెద ను వినుండు—

పూర్వము చాక్షుషమన్వంతరంబునఁ దుషితులు పండ్రెండు గురు సురోత్తములై యుండిరి. వా రందఱును గలిసికొని లోకహితం బుకొఱకు వైవస్వతమన్వంతరంబున నదితిగర్భంబున జన్మింపవలయు ననియు నందువలనఁ దమకు శ్రేయస్సాధన మమరు ననియుఁ బరస్ప రము నిశ్చయించుకొనిరి. అనంతరము వారు దక్షకన్య యగు నదితి గర్భంబునఁ గశ్యపునివలన విష్ణు, శక్రుఁడు, అర్యముఁడు, ధాత, త్వష్ట, పూషుఁడు, వివస్వంతుఁడు, సవితృఁడు, మిత్రుఁడు, వరుణుఁడు, అం శుఁడు, భగుఁడు—అనునామంబులతో ద్వాదశాదిత్యులై జన్మించిరి. భగవానుం డగుసోముని సప్తవింశతి ధర్మపత్నులును మహాపతివ్రతచా రిణులై సంతానవతు లైరి. ఆసంతతివా రందఱును మహాతేజస్వులై యుండిరి. అరిష్టనేమికిఁ బదునార్వురు పుత్త్రులును, బహుపుత్త్రునకు నలు పురుతనయులును గలిగిరి. వారు నలుపురును విద్యున్నామములు. ఋక్కు లన్నియు నంగిరసునిసంతానము. శ్రేష్ఠంబు లగునాఋక్కులు బ్రహ్మ ర్షులచే సత్కృతంబు లగుచుండును. దేవర్షి యగుకృశాశ్వునితనయులు దేవప్రహరణనామంబుల విఖ్యాతు లైరి. వీరు యుగసహస్రంబులు గడచినచో మరల జన్మించుచుందురు. వీరిలో ముప్పదిమువ్వురు దేవ తలు కామజులు. వీరికిని నుత్పత్తివినాశంబులుగలవు. ఆకాశమునందు సూర్యునియుదయాస్తమయంబులవలెనే ప్రతియుగంబునందును దేవ

తాగణంబుల కావిర్భావతిరోభావంబులు గలుగుచుండును. కశ్యపునకు దితివలన హిరణ్యకశిపుఁడు, హిరణ్యాక్షుఁడు ననువీర్యవంతు లగు తనయులు గలిగిరి. మఱియు నాదితికి సింహిక యను తనయ యొకతె యుదయించెను. ఆమెను విప్రచిత్తి పెండ్లియాడెను. ఆదంపతులసంతాన మంతయును సైంహికేయనామంబున విఖ్యాతం బయ్యెను.

హిరణ్యకశిపునకు హ్లాదుఁడు, అనుహ్లాదుఁడు, ప్రహ్లాదుఁడు, సంహ్లాదుఁడు ననునలువురు పుత్త్రులు గలిగిరి. వారందఱును సుప్రసిద్ధప్రభావు లైరి. హ్లాదునకు హ్లాదుండును, ఆతనికి మాయావు లగుశివుఁడు, కాలుఁడును బుట్టిరి. ప్రహ్లాదునకు విరోచనుండును, ఆతనికి బలియును జనించిరి. బలికి నూర్వురు పుత్త్రులు. అందు బాణాసురుఁడు జ్యేష్ఠుఁడు. బాణుని కనిష్ఠభ్రాతలు ధృతరాష్ట్రుఁడు, సూర్యుఁడు, చంద్రముఁడు, చంద్రతాపనుఁడు, కుంభనాభుఁడు, గర్దభాక్షుఁడు, కుక్షి—యనునామంబులచేఁ బ్రసిద్ధు లైరి. వారికి సర్వజ్యేష్ఠుండును, బలిష్ఠుండును నగుబాణాసురుఁడు భగవంతుం డగుపశుపతికిఁ బరమభక్తుండై పూర్వకల్పంబున నయ్యుమాపతిని బ్రసన్నుం గావించుకొని తనపార్శ్వచరునిఁగా నొనర్చుకొనియెను. హిరణ్యాక్షునకు ఉర్జరుఁడు, శకుని, భూతసంతాపనుఁడు, మహానాభుఁడు, కాలనాభుఁడు ననునైదుగురు పుత్త్రులు గలిగిరి. వా రందఱును విద్వాంసులును మహాబలులు నై యుండిరి.

దనువునకుఁ దీవ్రపరాక్రమములును, తపస్వులును, మహావీర్యులును నగు నూర్వురు నందనులు జనియించిరి. వారిలో ద్విమూర్ధుఁడు, శంకుకర్ణుఁడు, హయశిరుఁడు, అయోముఖుఁడు, శంబరుఁడు, కపిలుఁడు, వామనుఁడు, మరీచి, మేఘవంతుఁడు, ఇల్వలుఁడు, కస్రుముఁడు, విక్షోభణుఁడు, కేతువు, కేతువీర్యుఁడు, శతహ్రదుఁడు, ఇంద్రజిత్తుఁ

డు, సర్వజిత్తు, వజ్రనాభుఁడు, ఏకచక్రుఁడు, తారకుఁడు, వైశ్వానరుఁడు, పులోముఁడు, విద్రావణుఁడు, స్వర్భానుఁడు, వృషపర్వుఁడు, విప్రచిత్తి—అనువారు ప్రధానులు. కశ్యపపుత్త్రు లగునీదానవు లందఱును మహాబలసంపన్నులు. వీరిలో వీర్యవంతుఁ డగు విప్రచిత్తియే సర్వప్రధానుఁడు. అపరిమితం బగుటచే వీరిసంతానమును బరిగణించుట యశక్య మైనది.

స్వర్భానునకు ప్రభయు, పులోమునకు శచియు, హయశిరున కు ఉపదానయు, వృషపర్వునకు శర్మిష్ఠయు జనియించిరి. వైశ్వానరునకు పులోమయు, కాలికయుఁ బుట్టిరి. ఆయిరువురును బుత్త్రవతులును మహాసత్త్వశాలినులు నైరి. వారిని మరీచి పెండ్లియాడెను. ఆ మరీచివలన వారి కఱువదివేలమందిపుత్త్రిలు పుట్టిరి. మరీచి మహాతపంబు గావించి మఱియుఁ బదునాలుగువందలమంది తనయులం బడసెను. వారందఱును హిరణ్యపురవాసు లైరి. ఇట్లు మరీచిపుత్త్రిలు తమతమతల్లులనామములనుబట్టి పౌలోమి కాలకేయులను నాఖ్యలచేఁ బ్రసిద్ధులై బ్రహ్మవరంబున నందఱును దేవతల కవధ్యులై యుండిరి. తుదకు వారి నందఱను సవ్యసాచి నిహతులం గావించెను. ఆదానవు లందఱు నట దారుణపరాక్రమతులై యుండిరి.

విప్రచిత్తికి సింహికాగర్భంబున ననేకదానవు లుత్పన్నులైరి. వారే సైంహికేయులు. వారు దైత్యదానవసంయోగమున జనించినవా రగుటంజేసి యతితీవ్రపరాక్రములైరి. వారిలో వంశ్యుఁడు, శల్యుఁడు, నలుఁడు, బలుఁడు, వాతాపి, నముచి, ఇల్వలుఁడు, ఖసృముఁడు, అంజికుఁడు, నరకుఁడు, కాలనాభుఁడు, సరమాణుఁడు, స్వరకల్పుఁడు ననుపదుముగ్గురు దానవు లతితరపరాక్రములై యుండిరి. హ్లాదునకు మూఁకుడు, తుభుండుఁడు, నను నిరువురు పుత్రులు గలిగి

రి. సుందునివలనఁ దాటకకు మరీచి యుదయించెను. ఈవిధముగాఁ బ్రధానులగుదానవులచే దనువంశము విస్తరిల్లెను. ఆదానవులకంచలకు ను శతసహస్రపుత్రికాత్రాదులు గలిగిరి.

దైత్యవరుం డగు సంహ్లాదునివంశమునందు నివాతకవచు లను నసేకదానవు లుదయించిరి. వీరందఱు నతితరంబగు తపంబును గావించిరి. వారిసంఖ్య మూఁడుకోట్లుగాఁ బరిగణితం బయ్యెను. వారందఱును మణిమతీపురంబున నివసించి యుండిరి. దేవతలు వీరిని వధింపఁజాలకపోయిరి. తుదకర్జుననిచే వీరందఱును నిహతులైరి. తామ్రికు క్రౌంచి, శ్యేని, భాసి, సుగ్రీవి, శుచి, గృధ్రి యను నార్గురు తనయలు పుట్టిరి. అందు క్రౌంచికి, ఉలూకప్రత్యులూకగణంబులును, శ్యేనికి శ్యేనగణంబులును, భాసికి భాసగణంబులును, గృధ్రికి గృధ్రగణంబులును, శుచికి జలపక్షిగణంబులును, సుగ్రీవికి అశ్వోష్ట్రగర్దభంబులం లును బుట్టెను. కశ్యపపత్నియగు తామ్రికు వీరే వంశధరులైరి.

వినతకు అరుణుఁడు, గరుడుఁడు నను నిరువురుతనయులు గలిగిరి. అందు గరుడుఁడు తనదారుణకర్మముచేఁ బక్షిగణంబుల కధీశ్వరుఁ డయ్యెను. సురసకు వేలకొలఁది సర్పంబులు పుట్టెను. అమితతేజస్సంపన్నము లగు నాసర్పములన్నియు బహుశిరస్సమంచితంబులును గగనచరంబులు నయ్యెను. కశ్యపపత్నియగుకద్రువకు నాగగణంబు లుదయించిరి. వీరిసంఖ్యయు సహస్రాతీతమైనదియే. బహుమస్తకులగు వీరి తేజోబలంబులుగూడ సపరిమితములైనవియే. వీరు గరుడునకు వశీభూతులై యుండిరి. వీరిలో అనంతుఁడు, వాసుకి, తక్షకుఁడు, ఐరావతుఁడు, మహాపద్ముఁడు, కంబళుఁడు, అశ్వతరుఁడు, ఏలాపత్రుఁడు, శంఖుఁడు, కర్కోటకుఁడు, ధనంజయుఁడు, మహానీలుఁడు, మహాకర్ణుఁడు, ధృతరాష్ట్రుఁడు, వలాహకుఁడు, పుష్పదంష్ట్రుఁడు, దుర్ముఖుఁడు,

సుముఖుఁడు, శంఖుఁడు, శంఖపాలుఁడు, కపిలుఁడు, వామనుఁడు, న హుషుఁడు, శంఖరోముఁడు, మణి యనువారు ప్రధానులు. వీరిపుత్రపౌత్రాదులసంఖ్య శతసహస్రాతీతమైనది.

క్రోధవశకుఁ గ్రూరప్రకృతులు, వాయుభోజనులు, దంష్ట్రాశాలులు నగుచతుర్దశసహస్రనాగు లుదయించిరి. ధరకు నసంఖ్యంబులగునసంతజలపక్షులును, సురభికి గోమహిషీసమూహంబులును, ఇలకు వివిధంబు లగు తరుగుల్మలతాదులు పుట్టెను. ఖసకు యక్షరక్షోగణంబులును, మునికి అప్సరోగణంబులును, అరిష్టకు మహాసత్త్వసంపన్నులును, అమితతేజులును నగు గంధర్వగణంబులును బుట్టిరి. ఈచెప్పంబడిన స్థావరజంగమాత్మకం బగు సంతతి యంతయుఁ గశ్యపవంశముగాఁ గీర్తింపఁబడియెను. వీరందఱకును శతసహస్రాతీతు లగు పుత్త్రపౌత్త్రాదులు జనియించిరి. ఇది యంతయు స్వారోచిషమన్వంతరమునందు గల సృష్టివిస్తరము.

వైవస్వతమన్వంతరమున సుప్రసిద్ధ మగు వారుణయజ్ఞము ప్రారంభింపఁబడియెను. అందు బ్రహ్మదేవుండు స్వయముగా హోతయయ్యెను. అప్పటి ప్రజాసృష్టిప్రకార మభివర్ణించెదను. పూర్వము బ్రహ్మదేవుఁడు సప్తబ్రహ్మర్షులను తనమానసపుత్త్రులుగా సృష్టించినట్లే, వర్తమానమన్వంతరంబునను సృష్టించెను. దేవదానవుల విషమసంఘర్షణంబున దితిసంతానం బంతయు వినష్టం బగుటయు నామె కశ్యపునారాధించి ప్రసన్నుం గావించుకొని యింద్రుని వధియించుటకు సమర్థుండగు నొకపుత్త్రునిఁ బ్రసాదింపవలయు నని యభ్యర్థించెను. కశ్యపుండును దితి కవ్వరంబును బ్రసాదించి నీవు శుచివై బ్రహ్మచారిణివై శతవత్సరంబులు గర్భంబున ధరింపఁగలిగెదవేని నీగర్భమున నింద్రుని వధింపఁగలకుమారుఁడు జనియించు నని యానతిచ్చెను. దితియు దానికి

నంగీకరించి భక్తిపూర్వకంబుగ శుచిభావముతో గర్భధారణముం గా వించెను. ప్రశంసితవ్రతుం డగు కశ్యపుం డిట్లు దితి ననుగ్రహించి తపంబునకుం బోయెను. ఈసంఘటనంబున నిందు్రండు చింతితుండై యెట్లయిన దితిపవిత్రవ్రతాచరణంబునకు భంగము గలిగింపవలయు నని నిరీక్షించు చుండెను. ఇవ్విధంబుగా శతవర్షంబులు గడచునన నొకప్పుడు దితి పాదశౌచంబు సేయక శయ్య నాశ్రయించి యలసభా వంబున నిదురించెను. ఇంద్రుండీఛిద్రింబుం గనిపెట్టి వజ్రహస్తుండై ని ద్రావస్థయందున్న దితి కుక్షిమధ్యంబునం బ్రవేశించి యాగర్భంబు నేడుభాగంబులుగా ఛేదించివైచెను. గర్భస్థుం డగుబాలుండు వజ్ర ప్రహారంబుచే విదీర్ణుండై రోదనముసేయ నారంభించెను. ఏడువవల దని యెంతగా నాశ్వాసించినను శాంతింపకుండుటచే నిందు్రండు కు్రద్ధుండై యాసప్తశకలంబుల నొక్కొక్కదాని మరల నేడేసి ఖండంబు లుగా నఱికెను. అట్లు విభక్తంబైన గర్భంబు తుట్టతుదకు మరుద్గణం బుగా జనించెను. ఆమరుత్తులు నలువదితొమ్మండుగురును నింద్రుం డు చెప్పినరీతి సంచరించుచు వజ్రపాణి యగు నింద్రునకు సద్వితీయ సహాయులై యుండిరి. ఈవిధంబుగ భూతప్రవృత్తి యగుటయు, అమితౌజసుండును, దేవగణగరిష్ఠుండును, భగవానుండు నగుహరి ప్ర త్యేకముగ రాజ్యవిభాగంబు గావించు నుద్దేశంబుతో నొక్కొక్కని బ్రజాపతిపదంబున నియోగించెను. క్రమముగా నీసకలరాజ్యవ్యవస్థయుఁ బృథుమహారాజు నధికారమునుండియే ప్రతిష్ఠింపఁ బడియెను.

ఓద్విజోత్తములారా! ఆహరియే పురుషోత్తముఁడు, కృష్ణుఁడు, విష్ణుఁడు, ప్రజాపతి, పర్జన్యుఁడు, తపనుఁడు—అనురూపములం దాల్చి యుండెను. ఆతఁడే యీవిశ్వమంతటను వ్యాపించి విరాజిల్లుచుండును. ఇదిభూతసృష్టిప్రకారము. దీనిని లెస్సగ నెఱుంగువానికిఁ బునర్జన్మభ యంబు లేదు. ఆతనికిఁ బరలోకభయంబును లేదు.

## పృథుజన్మమాహాత్మ్యము.

ఇట్లు సెప్పి సూతుండు మరల నిట్లనియెను. భగవానుం డగు పితామహుండు వేణనందనుం డగుపృథువును రాజాధిరాజుగా నభిషేకించి క్రమంబుగ సకలరాజ్యంబును విభక్తంబు గావించుటకుఁ బ్రవృత్తుండై, ద్విజులకును, గ్రహంబులకును, యజ్ఞంబులకును, తపంబుల కధిపతిగా సోముని నభిషేకించెను. ఈవిధముగా జలరాసులకు వరుణుని, రాజగణంబులకుఁ గుబేరుని, ఆదిత్యగణంబులకు విష్ణుని, వసుగణంబులకు దక్షుని, మరుద్గణంబులకు వాసవుని, దైత్యదానవగణంబులకు నమితతేజుం డగుప్రహ్లాదుని, పితృగణంబులకు వైవస్వతుం డగుయముని, యక్ష, రాక్షస, పార్థివ, సర్వభూత, పిశాచగణంబులకు శూలపాణి యగు శంభుని, శైలగణంబులకు హిమవంతుని, అధిపతులుగా నియోగించెను. మఱియు నాతఁడు నదీనిచయంబుకు సాగరుని, గంధర్వనిచయంబులకుఁ జిత్రరథుని, నాగగణంబులకు వాసుకిని, సర్పగణంబులకుఁ దక్షకుని, గజగణంబుల కైరావతుని, అశ్వగణంబులకుచ్చైశ్శ్రవుని, పక్షిగణంబులకు గరుడుని, మృగగణంబులకు శార్దూలుని, గోగణంబులకు వృషభుని, వనస్పతిగణంబులకుఁ బ్లక్షభూజంబును నధీశులను గావించెను. బ్రహ్మ యీవిధముగా సమస్తరాజ్యంబును గ్రమముగ విభజించి, దిక్పాలకులను స్థాపించెను. ఆతఁడు పూర్వదిక్కునఁ బ్రజాపతి యగు వైరాజికి నందనుం డైనసుధన్వుని, దక్షిణదిక్కునందు కర్దమప్రజాపతిపుత్త్రుం డగు శంఖపదుని, పశ్చిమదిక్కునందు రజపుత్త్రుం డగు కేతుమంతుని ఉత్తరదిక్కునందు పర్జన్యప్రజాపతిపుత్త్రుం డగు హిరణ్యరోముని దిక్పాలకులుగా నభిషేకించెను. ఈదిక్పతు లందఱును మహాత్ములును దుర్ధర్షులును నై యుండిరి. వీరు సప్తద్వీపవిలసితం బగు సమస్తభూమండలంబును ధర్మానుసారంబుగఁ

జమతమవిభాగక్రమంబున నిప్పటికిని ప్రతిపాలించుచున్నారు.

ఏ రందఱును గలసి విధ్యుక్తంబుగ రాజాధిరాజగు పృథునిఁ రాజసూయమునం దభిషిక్తుం గావించిరి. పిమ్మట చాక్షుషమన్వంతరంబున నీసమస్తధరణీరక్షణభారము వైవస్వతమనువుహస్తంబులకు సమర్పింపఁబడెను. మీరు వినఁదలంచితిరేని యావైవస్వతమనువుం గూర్చి సవిస్తరంబుగఁ జెప్పెదను. ఈతనియధికారము పురాణముల యందు సుప్రసిద్ధం బయి యున్నది.

సూతుం డిట్లు సెప్పుటయు మునీంద్రులు "మహాత్మా! పృథుజన్మవృత్తాంత మామూలచూడంబుగ వివరింపవేఁడుచున్నాము. అమ్మహాత్ముండు వసుంధర నెట్లు సందోహనంబు గావించెనో, పితృగణంబులును, ఋషిగణంబులును, దైత్యనాగయక్షగణంబులు, ద్రుమ, శైల, పిశాచ, గంధర్వ, ద్విజగణంబులును, మహాసత్త్వసంపన్నంబు లగురాక్షసగణంబులును ధాత్రీదోహనంబు నెట్లు గావించిరో, ఎవ్వరెవ్వ రేయేపాత్రంబుల నుపయోగించిరో, ఎవ్వరు వత్సము లైరో, ఎవ్వరు దోగ్ధ లైరో ఎవ్వరి కెట్టిక్షీరవిశేషంబు లుత్పన్నము లయ్యెనో పూర్వ మేకారణంబున మహర్షు లందఱును క్రుద్ధులై వేనునిహస్తమును మథించిరో యీసకలవృత్తాంతములును మా కెఱింగింపవలయును." అని ప్రార్థించుటయు లోమహర్షణుం డిట్లనియెను.

ద్విజవరులారా! ఏకాగ్రచిత్తముతో మీ రందఱు నాలకింపుఁడు. అశుచియు, క్షుద్రచేతస్కుండును, అనియముండును, అశిష్యుండును నగువానికి నీపవిత్రచరిత్రంబును దెలుపందగదు. గుణవంతుం డగు శ్రోతకుమాత్రమే దీని నెఱింగింపవలయును. ఈచరిత్రము స్వర్గ్యంబును, యశస్కరంబును, ఆయుష్కరంబును, ధన్యతమంబు నైనది. పురాతనమహర్షులు పూర్వ మీరహస్యమును వ్యక్తీకరించి యుంచిరి.

బ్రాహ్మణులకు నమస్కరించి సంపూర్ణముగ నీపృథుచరిత్రమును గీర్తించువానికిఁ గృతాకృతకర్మంబులవలన శోకభయంబులు గలుగవు.

పూర్వ మత్రివంశంబున నత్రిసమప్రభాశాలియగు అంగుండను ప్రజాపతి యుదయించెను. ధర్మకోవిదుం డగు నాతనికి వేణుం డను నొకతనయుండు గలిగెను. ఆవేణునకు ధర్మజ్ఞాన మించుకంతయు లేకుండెను. మృత్యుతనయ యగు సునీతిగర్భంబునం దాతఁడు జనియించుటచే మాతామహదోషంబున నాతనికి ధర్మవిచ్యుతి గలిగెను. ఆతఁడు స్వధర్మము నుల్లంఘించి కామలోభనిరతుఁడయ్యెను. ఆవేణుఁడు రాజై ధార్మికులమర్యాదలను వినష్టంబులఁ గావించుచు వేదవిధుల నతిక్రమించి, అధర్మసేవాసక్తుం డయ్యెను. ఆతనిరాజ్యశాసనంబునఁ బ్రజలలో సాధారణముగా స్వాధ్యాయవషట్కారములు శూన్యము లైపోయెను. యజ్ఞంబులయందు దేవతలకు హవిర్గ్రహణంబులు లేకుండఁబోయెను. అధర్మచర్యయందే వేణునికాలము క్రమముగా నాసన్నమగుచుండెను. ఆతఁడు నారాజ్యమునం దెవ్వరును యజ్ఞహోమాదులఁ గావింపఁగూడ దనియు నేనే యజ్ఞమును, యష్టను, ఇజ్యుఁడను గావున యజ్ఞస్వాహాస్వధాములు నాయందే వినియోగింపవలయుననియు నతిదారుణముగఁ జాటించెను. అప్పుడు మరీచిప్రభృతు లగు మహర్షు లందఱును వచ్చి అధర్మాసక్తుండును సాధుజనగర్హితకర్మాచరణుండును నగు వేణుం గాంచి యిట్లనిరి. "రాజా! మేము బహుసంవత్సరంబులవఱకును యజ్ఞదీక్షితుల మయ్యెదము. కావున నీ కొకయుపదేశముం జేయవచ్చితిమి. నీ విఁక నధర్మాచరణంబు గావింపవలదు. మహర్షి యగు నత్రికి వంశధరుండ వగు నీవు సనాతనధర్మ మాచరింపవలయును. నీవు ప్రజాపతిపదంబు నధిష్ఠించునప్పుడు సాధురీతిని ప్రజాపాలనంబొనరింతు నని ప్రతిజ్ఞ చేసియుంటివి. ఇవ్విషయము నిప్పుడు నీకు జ్ఞప్తికిఁ దెచ్చుచుంటిమి."

అని చెప్పుటయు దుర్బుద్ధియు నసత్యజ్ఞుఁడును నగు వేనుండు నవ్వుచు నిట్లనియెను.—ధర్మమును సృష్టించువాఁ డింకను నెవ్వఁ డున్నాఁడు? నే నింకను నెవ్వని యుపదేశంబులను వినవలయును? శ్రుత, వీర్య, తప, స్సత్యబలంబులయందీ భూమండలంబున నాతో సమానుఁ డిం కెవ్వఁ డున్నాఁడు? విశేషించి సర్వభూతంబులకు ధర్మకర్తను నేనే. మీరు కేవలము మూఢు లగుటచే నాతత్త్వం బెఱుంగఁజాలకుంటిరి. నేను దలంచినచో నీవిశ్వం బంతయు దగ్ధముగను జలనిమగ్నముగను గావింపఁగలను. ఈద్యావాపృథ్వులను నే నింతలో సంరోధింపఁగలను. ఇట్టినాసామర్థ్యముంగూర్చి యించుకంతయును మీరు సందేహింపవలదు. అని చెప్పుచున్న వేనుం గాంచి మహర్షులందఱును అతని గర్వమోహంబులకుఁ గ్రోధావేశపరవశులై తక్షణమే యావేనుని నిగ్రహించి యాతనిదక్షిణోరుమంథనంబు గావించిరి. అట్లు మథింపఁబడిన యూరువునుండి హ్రస్వాకారుండును, అతిఘోరకృష్ణవర్ణుండును నగు నొకపురుషుం డుదితుం డయ్యెను. అతఁడు భయవిహ్వలుండై చేతులు జోడించుకొని నిలిచియుండుటం గాంచి మహర్షి యగు అత్రిమునీంద్రుండు భీతుం డగునాతని "నిషీద (కూర్చుండుము)" అనియెను. అతఁడే యనంతరము నిషాదవంశమునకు మూలపురుషుం డయ్యెను. ఆవేనునిపాపములనుండి క్రమంబుగ ధీవరగణంబు లుత్పన్నులైరి. మఱియు, వింధ్యాచలనివాసులును, అసభ్యులును, అధర్ములును నగు కిరాతులుకూడ జనియించిరి. పిమ్మట మహర్షులు క్రుద్ధులై మరల నవ్వేనుని దక్షిణబాహువును అరణింబోలె మథించుటయు, దానినుండి పావకప్రతిభుం డగుపృథుమహారాజు భూమిపై నవతరించెను. వైశ్వానరసముజ్జ్వలదేహుండును, అజగవనామకధనుర్ధరుండును, దివ్యశరసంశోభితుండును పరిదీప్తకవచధరుండును నై యాతఁ డావిర్భవించినంతటనే

సకలభూతంబులును బహువిధానందభరితంబు లయ్యెను. వేనుండును స్వర్గస్థుం డయ్యెను. మహాత్ముండగు పృథునివంటిపుత్త్రుంఁడు పొడమినంతనే పురుషశ్రేష్ఠుం డగు వేనుండు పున్నామనరకవిముక్తుం డయ్యెను. అప్పుడు సకలసముద్రంబులును, సకలనదులును వివిధరత్నంబుల తోఁగూడ జలంబులం గొనితెచ్చి పృథుమహారాజు నభిషేకింపవచ్చెను. సకలదేవతలును, అంగిరఃప్రభృతిమహర్షిగణంబులును, భగవానుం డగుపితామహుండును, చరాచరంబు లగునిఖిలభూతగణంబులును నచ్చటి కేతెంచి వేనసందనుని బట్టాభిషిక్తుం గావించిరి. రాజాధిరాజును మహాతేజుండును నగు నాతఁ డిట్లభిషిక్తుండై, ధర్మజ్ఞు లగు మంత్రిగణంబులతో నాలోచించి సత్యశాసనంబునఁ బ్రజారంజనంబు నొనర్చుటకుఁ బ్రవృత్తుండయ్యెను. ప్రతాపశాలి యగునాతనిపాలనంబున నిదివఱ కాతనితండ్రి యగువేనుని తీవ్రశాసనంబులచే విరక్తులై యున్న ప్రజ లెల్లరును కొలఁదికాలంబునకే యనురక్తు లైరి. ప్రకృతిరంజనంబున నాతనిరాజనామంబు సార్థకం బయ్యెను. ఆతనిప్రయాణంబుల కెల్ల సముద్రంబులును బర్వతంబులును సుగమంబు లగుమార్గంబుల నొసఁగుచు వచ్చెను. ఆతని కెన్నఁడును ధ్వజభంగంబు గాలేదు. ఆతనిరాజ్యంబున భూమి దున్నకయ ఫలించుచుండెను. కోరినంతనే సమృద్ధిగా సస్యోత్పత్తి యగుచుండెను. గోగణంబులు పిదుకకయె క్షీరంబుల నవ్వారిగ నిచ్చుచుండెను. ప్రతిపత్త్రపుటంబునుండియు వర్షణం బగుచుండెను.

ఆకాలంబున శుభకరంబును బైతామహంబు నగుయజ్ఞంబు ప్రారంభింపఁబడియెను. అందు మహామతి యగుసూతుండు జన్మించెను. అనంతర మమ్మహాయజ్ఞమునుండి మాగధజాతి యుదయించెను. అప్పు డమ్మహర్షిగణంబులు పృథుమహారాజుంగూర్చి స్తోత్రపాఠంబులఁ

గావించుటకై సూతమాగధులం బిలిచి మీ రందఱు నిమ్మహారాజు
ను స్తుతించుచుండవలయునని నియోగించిరి. వారి కదియే యనురూ
పకర్మంబుగా నిర్దిష్టంబయ్యెను. మీస్తవంబుల కీప్రభునర్హుండే యో
గ్యుం డని మునులు చెప్పుటయు సూతమాగధు లిట్లనిరి. మహాత్ము
త్ములారా! మేము మాస్తోత్రపాఠంబులచే దేవర్షిగణంబుల నైనం
బరితృప్తులం గావింపంగలము. కాని, యీనరపాలుని యెట్టియుత్తమక
ర్మంబును, ఎట్టికీర్తిచరిత్రంబును, ఎట్టిశుభలక్షణంబును నింకను నెఱుం
గము. మే మెట్లీతని స్తుతియింపంగలము? అనుటయు మహర్షు లీతని
భవిష్యచ్చరిత్రమును గూర్చి కీర్తింపుం డని యానతిచ్చిరి. వారును పృ
థుచక్రవర్తి గావించు భవిష్యత్సకల సత్కర్మంబులంగూర్చియు గానం
బుసేయుటయు నాతనిచరిత్ర మప్పటినుండియుఁ త్రైలోక్యవిదితం బ
య్యెను. అప్పుడు సూతమాగధప్రభృతివందిగణంబులు వివిధరీతుల స
మ్మహీనాథు నాశీర్వదించుటయుఁ బృథుచక్రవర్తి ప్రీతుండై సూతున
కనూపదేశంబును మాగధునకు మగధదేశంబును సంప్రదానంబు గా
వించెను.

ఆసూతమాగధులం గాంచి ప్రజలందఱు నానందపులకితులై
తమకందఱకును మహారాజుచితవృత్తులం గల్పింపఁగలఁడని యొండొ
రులకుఁ జెప్పుకొనుచు, మహాత్ముం డగుపృథుచక్రవర్తిసన్నిధికిం బో
యి మాకందఱకును దగినవృత్తులం బ్రసాదింపు మని ప్రార్థించిరి. మ
హర్షులచేఁ బ్రేరితులై ప్రజలిట్లు తన్ను వేఁడుటయు నమ్మహీనాథుండు
జగద్ధితంబుకొఱకు బాణబాణాసనధారియై పృథ్వీవిదారణంబు గావింప
నుద్యుక్తుం డయ్యెను. అప్పుడు భూదేవి భయభ్రాంతయై గోరూపము
ను ధరించి పలాయనంబు గావించుచుండుటయు నాభూపాలుండును
దానిని వెంబడింపఁ దొడంగెను. భూదేవి యిట్లు పృథుభయంబున

బ్రహ్మలోకాది సమస్తలోకములను బరిభ్రమించి సముద్దీప్తశరశరాస
నధారియై తన్ను వెంబడించివచ్చుచున్న పృథుసార్వభౌముం గాంచి
యమరగణంబులకైనను దుర్జయుం డగునాతనికంటెఁ దనకన్యశరణ్యం
బు లేదని చింతించి త్రిలోకపూజ్య యగునవ్వసుంధరాదేవి యప్పుడు
కృతాంజలియై యవ్వేణునందనుం గూర్చి యిట్లు ప్రార్థించెను.

మహారాజా! స్త్రీవధం బధర్మంబనువిషయము నీ వెఱుంగనిది
గాదు. నేను లేకున్నచో నీవు ప్రజల నెట్లు భరింపఁగలవు? సకలజీవు
లును నాయందే నిలిచి యుందురు. నేనే సమస్తజగంబును ధరించి
యుందును. నాకు వినాశంబు గావించుట నీప్రజాసమూహమునంతను
వినష్టంబు గావించుకొనుటయే యగును. కావున నావినాశనము నా
లింపుము. నీవు ప్రజాహితంబుఁ గోరెదవేని నాకమంగళంబు గావింప
కుము. ఉత్తమోపాయంబునఁ గార్యారంభంబు గావించినచో నవశ్య
ముగఁ గార్యసిద్ధి గాఁగలదు. నీప్రజలు సుఖంబుగ జీవించునట్టి సదు
పాయమును నీవాలోచింపుము. నన్ను వధించుటవలన నీప్రజలకెట్టి
లాభంబును గలుగఁబోదు. మహాప్రభూ! నీకోపము నుపసంహరింపు
ము. నేను నీయిచ్చవచ్చినరీతిని మెలఁగుచుండెదను. స్త్రీజాతి యెన్నఁ
టికి నవధ్యంబైనదని సాధువులు చెప్పుదురు. శాస్త్రజ్ఞాతులచేఁగూడ నీ
నియమము ప్రతిపాదింపఁబడుచున్నది. వినియుండియు, నెఱింగియుం
డియు నీవిట్టియధర్మకార్యమునకుఁ గడంగవలదు.

అని ధాత్రీదేవి ప్రార్థించుటయు సుదారుఁడగు నమ్మహానుభావుఁడగు మ
హీపతి క్రోధము నుజ్జగించి యిట్లనియెను. ఓవసుంధరా! స్వార్థపరుం
డైగాని, పరార్థపరుండైగాని యొక్కనికొఱకు బహువ్యక్తులను హిం
సించువాఁడు మహాపాపంబు నందగలఁడు. కాని యొక్కని వధించుట
వలన బహువ్యక్తులకు సుఖంబుగ జీవికానిర్వహణంబు గాను న్నచో న

స్త్రీసమయంబున నాతనివధించినను మహాపాతకంబుగాని యుపపాతకం
బుగాని కలుగదు. కావున నోధాత్రీ! నేను నిన్నుఁ బ్రజాహితంబు
కొఱకు సంహరింపఁదలఁచితిని. నీవు నాచెప్పినచొప్పునఁ బ్రజాహితసా
ధనంబు గావింపకున్నచో నాశాసనము నుల్లంఘించిన నిన్ను మదీయ
బాణప్రయోగంబున సంహరించి నాశరీరమునే విస్తరింపఁజేసి నేన
(స్వయముగ) సమస్తప్రాణులను ధరించెదను. కావున నోధర్మచారిణీ!
నీ కింకను జెప్పుచున్నాను. నీవు నాశాసనమును మన్నించి యీసమ
స్తప్రజలను సంజీవితులను గావింపుము. ప్రజాధారణంబునకు నీవే స
మర్థురాలవు. నీవు నాతనయవై యుండుము. అట్లయినచో, నిన్ను వ
ధించుటకై కూర్చిన యతిదారుణం బగునీశరంబు నుపసంహరించెదను.

అనుటయు వసుధాదేవి "ఓవీరవరా! నేను నీయాజ్ఞచొప్పున
సమస్తమును గావించెద నని నిశ్చయముగాఁ జెప్పుచున్నాను. నీవు
నాకొకవత్సమును సంగ్రహించి యిమ్ము. నేను దానిసాహాయ్యంబు
న క్షీరంబుల నొసఁగెదను. నీవుమాత్రము నన్ను సమతలము గలదా
నినిగాఁ జేయుము." భూదేవి యిట్లు పలుకఁగా, వేనునందనుండు తన
ధనుష్కోటిచే శతసహస్రంబు లగుశైలంబుల నుత్సారితంబులను గా
వించెను. దానంజేసి పర్వతంబు లెల్ల సమధికోన్నతంబులై వర్ధిల్లెను. పూ
ర్వసృష్టియందు, ఈపృథ్వికి సమత్వం బెచ్చటను లేదు. అంతయు వి
షమత్వము గలిగియుండుటచే నప్పుడు కేవలము పురగ్రామవిభాగంబై
నను లేకుండెను. మఱియు, సస్యోత్పత్తియు, గోరక్షణంబును, కృషి
యు, వణిక్పథంబులును, సత్యానృతంబులును, లోభమాత్సర్యంబులును
గూడ లేకుండెను. ఇప్పుడు వైవస్వతమన్వంతరంబునఁ బృథుమహా
రాజుకాలమునుండియే యివి యన్నియు నుత్పన్నంబు లయ్యెను.

అప్పుడు ప్రజలందఱును సమతలం బగు భూప్రదేశంబునే

నివాసయోగ్యంబుగాఁ జేసికొనఁదొడంగిరి. ప్రప్రథమంబునఁ బ్రజాగణంబులకు ఫలమూలాదులే యాహారము లగుచు నుండినట్లు మేము వినియున్నాము. అవి యైనను నతికష్టముచేఁ గాని లభించుటలేదు. పురుషశ్రేష్ఠుం డగుపృథుసార్వభౌముఁడు స్వాయంభువమనువును వత్సముగఁ జేసి స్వయముగాఁ బృథ్వినుండి వివిధసస్యములను బిదికినప్పటినుండియే సస్యాన్నమువలనఁ బ్రజలు జీవించుచున్నారు. అప్పుడు పృథుచక్రవర్తియే కాక దేవర్షిపితృగణంబులును దైత్యయక్షగంధర్వకిన్నరగణంబులును, సరీసృపవృక్షగణంబులును గూడ వెవ్వేఱుగ నివ్వసుంధరను సందోహనంబు గావించియుండిరి. వీరికి దోగ్ధంబులును వత్సంబులును పాత్రలును క్షీరంబులును వేఱువేఱుగాఁ గల్పింపఁబడియెను. ఋషులు సోముఁడు వత్సముగను, బృహస్పతి దోగ్ధగను, ఛందస్సులు పాత్రగను జేసి తపస్సు, బ్రహ్మమును క్షీరంబులుగాఁ బిదికికొనిరి. దేవతలు శతక్రతుని వత్సంబుగను, భగవంతుం డగు రవిని దోగ్ధగను జేసికొని కాంచనపాత్రంబున నోజస్కరం బగుక్షీరంబును బిదికికొనిరి. పితరులు యముని వత్సంబుగను, అంతకుని దోగ్ధగను జేసికొని రజతపాత్రంబున సుధాక్షీరములను, నాగగణంబులు తక్షకుని వత్సముగను, ఐరావతుని దోగ్ధగనుజేసికొని అలాబూపాత్రంబున విషక్షీరంబులను, అసురులు విరోచనుని వత్సంబుగను, మధుదైత్యుని దోగ్ధగను జేసికొని యాయసపాత్రంబున మాయామయక్షీరంబును, యక్షులు వైశ్రవణుని వత్సంబుగను రజతనాభుని దోగ్ధగను జేసికొని ఆమపాత్రంబున అంతర్ధానక్షీరంబును, రాక్షసులు సుమాలిని వత్సంబుగను రజతనాభుని దోగ్ధగను జేసికొని కపాలపాత్రంబున శోణితక్షీరంబును, గంధర్వులు చిత్రరథుఁడు వత్సంబుగను వసురుచి దోగ్ధగను పంకజపాత్రంబునఁ బవిత్రగంధక్షీరంబును, పర్వతంబులు హిమవంతుఁడు

సత్యాగ్నిసహితంబుగ నుత్తీర్ణుఁడు గాఁగలఁడు. పృథుసార్వభౌముఁడు వైశ్యులకును శూద్రులకునుగూడ వృత్తివిధానంబును గావించెను. కావున, విత్తార్థు లగువైశ్యులును, పరమమంగళాభిలాషు లగుశూద్రగణంబులుసయితము సద్భావముతో నమ్మహీనాథునకు నమస్కరింపవలయును.

## —◆ మన్వంతరసంకీర్తనము. ◆—

సకలమనువులంగూర్చియు, మన్వంతరంబులయందలి పూర్వసృష్టింగూర్చియు, మనుగణంబుల నిర్దిష్టకాలంబులంగూర్చియుఁ, గీర్తింపవలయు నని ఋషులు ప్రశ్నించుటయు సూతుం డిట్లనియెను. మునీంద్రులారా! సకలమన్వంతరవృత్తాంతంబులును శతవర్షంబుల కైనను వర్ణింపఁజాలము. కావున దానిని సంక్షేపించి చెప్పెదను వినుండు. స్వాయంభువుఁడు, స్వారోచిషుఁడు, ఉత్తముఁడు, తామసుఁడు, రైవతుఁడు, చాక్షుషుఁడు ననువారలు పూర్వమనువులు. వర్తమానకాలంబున మనువు వైవస్వతుఁడు. సావర్ణియు, భౌత్యుఁడును, రౌచ్యుఁడును, మేరుసావర్ణిచతుష్కంబును భవిష్యన్మనువులు. ఇది యతీతవర్తమానభావిమనువృత్తాంతంబు. ఇఁక దేవర్షిగణంబుల వంశంబులనుగూర్చి చెప్పెదను. మరీచి, అత్రి, అంగిరుఁడు, పులహుఁడు, క్రతువు, పులస్త్యుఁడు, వసిష్ఠుఁడు ననునీసప్తర్షులును బ్రహ్మపుత్త్రులు. వీరుత్తరదిశయందు నివసించియుందురు. ఆగ్నీధ్రుఁడు, అగ్నిబాహుఁడు, మేధ్యుఁడు, మేధాతిథి, వసువు, జ్యోతిష్మంతుఁడు, ద్యుతిమంతుఁడు, హవ్యుఁడు, సబలుఁడు, పుత్త్రుఁడు నను పదుండ్రురు స్వాయంభువమనువుపుత్త్రులు. ఇది ప్రథమమన్వంతరము. ఔర్వుఁడు, వసిష్ఠపుత్త్రుఁడు, స్తంబుఁడు, కశ్యపుఁడు, ప్రాణుఁడు, బృహస్పతి, దత్తుఁడు, అత్రి,

చ్యవనుఁడు నను మహర్షులు మహావ్రతు లని వాయుదేవునిచేఁ జెప్పం బడిరి. స్వారోచిషమన్వంతరంబున దేవతలు తుషితనామంబున విఖ్యాతులైరి. హవిష్మంతుఁడు, సుకృతి, జ్యోతి, ఆపోమూర్తి, ప్రతీతుఁడు, నభస్యుఁడు, నభుఁడు, ఊర్జుఁడు ననువారు స్వారోచిషునిపుత్త్రులు. వీ రందఱును మహావీర్యపరాక్రమసంపన్నులై పృథ్వీపాలనంబు గావించిరి. ఇది ద్వితీయమన్వంతరంబు. వసిష్ఠునకు వసిష్ఠనామంబునఁ బుత్త్రిసప్తకం బుదయించెను. హిరణ్యగర్భునకు ఊర్జనామంబునఁ దేజస్వు లగుకొందఱు తనయులు గలిగిరి. వారందఱును మహర్షులైరి. ఉత్తమమనువునకు ఇషుంఁడును, ఊర్జుంఁడును, తనూర్జుంఁడును, మధుండును, మాధవుండును, శుచియు, శుక్రుంఁడును, సహుంఁడును, నభస్యుంఁడును, నభుండును బుత్త్రులైరి. ఈమన్వంతరంబున భాను గణంబులు దేవతలైరి. చతుర్థమన్వంతరంబునఁ గావ్యుంఁడును, పృథుండును, అగ్నియు, జహ్నుంఁడును, ధాతయు, కపీవంతుంఁడును, అకపీవంతుంఁడు ననువారు సప్తర్షులైరి. వీరిపుత్త్రపౌత్త్రాదులంగూర్చి పురాణంబులయందు సవిస్తరముగా వర్ణింపఁబడియెను. ఈతామసమన్వంతరంబున దేవతలు సత్యనాములైరి. తామసునకు ద్యుతియు, తపస్యుంఁడును, సుతపుంఁడును, తపోమూలుంఁడును, సనాతనుంఁడును, తపోవ్రతియు, కల్మషుంఁడును, తన్వియు, ధన్వియు, పరంతపుఁడు నను పదుగురును పుత్త్రులైరి. ఇది చతుర్థమన్వంతరం బని వాయుదేవుండు వక్కాణించెను. అసంతరమన్వంతరంబున దేవబాహుంఁడును, యదుధ్రుంఁడును, దేవశిరుంఁడును, హిరణ్యరోముంఁడును, పర్జన్యుంఁడును, ఊర్ధ్వబాహుంఁడును, సత్యనేత్రుండు ననువారు సప్తర్షులైరి. ఈమన్వంతరంబున దేవగణంబులును ప్రకృతిగణంబులును అభూతనాములైరి. ఇదిరైవతమన్వంతరంబు. ఈరైవతునకు ధృతిమంతుంఁడును,

అవ్యయుండును, యుక్తుండును, తత్త్వదర్శియు, నిరుత్సుకుండును, అరణ్యుండును, ప్రకాశుండును, నిర్మోహుండును, సత్యవాక్కును, కృతియు ననువదుండ్రు పుత్త్రులు గలిగిరి. షష్ఠం బగుచాక్షుషమన్వంతరంబున భృగుండును, నభుండును, వివస్వంతుండును, సుధాముండును, విరజుండును, అతినాముండును, సహిష్ణుండు ననువారు సప్తర్షులు. ఈ మన్వంతరంబున ఋషులకు నప్రసూతు లనియు, దేవతలకు లేఖు లనియు నామంబులు గలిగెను. ఈదేవతలు పంచగణంబులుగాఁ బరిగణింపఁబడుచుండిరి. ఈమన్వంతరంబున మహర్షి యగు నంగిరునకు నడ్వల యను పత్నియందు రురుప్రభృతు లగు పుత్త్రులు పదుగు రుద్భవించిరి. వా రందఱును మహాత్ములును, మహాతేజస్వులు నైరి. ఇఁక సప్తమం బగు వైవస్వతమన్వంతరం బభివర్ణించెద. ఈమన్వంతరంబున అత్రి, వసిష్ఠుఁడు, కశ్యపుఁడు, గౌతముఁడు, భరద్వాజుఁడు, విశ్వామిత్త్రుఁడు, మహాత్ముం డగుఋచీకతనయుం డగుజమదగ్నియు సప్తర్షులు. వారిప్పుడు స్వర్గంబున నున్నారు. ఈవైవస్వతమనుకాలంబున సాధ్య రుద్ర విశ్వేదేవగణంబులును, వసుమరుద్గణంబులును, ఆదిత్యగణంబులును, అశ్వినీకుమారులును విరాజిల్లుచుండిరి. ఈవైవస్వతునకు మహాతేజస్వులును, కీర్తిమంతులును, నగు ఇక్ష్వాకుప్రభృతులు పదుగురు తనయులు గలిగిరి. వీరిపుత్త్రపౌత్త్రాదులు సకలదిగంతంబులయందును నిండియుండిరి. ప్రతిమన్వంతరంబునను లోకధర్మవ్యవస్థకొఱకును, లోకరక్షణంబుకొఱకును, సప్తర్షులు ప్రసిద్ధులైయుండిరి. ఒక్కొక్కమన్వంతరం బతీతం బైనంతనే యాసప్తర్షులయందును, నలువురు నలువురు సత్కర్మానుష్ఠానంబుల నొనరించి బ్రహ్మలోకంబున కేఁగుచుందురు. ఇతరులు తపోనుష్ఠానంబుఁ గావించి వారివాసస్థానంబులం బూరించుచుందురు. అతీతవర్తమానఋషిగణంబులసంబంధ మిూ

విధముగాఁ జెప్పంబడియెను. భవిష్యన్మన్వంతరంబునందలి సప్తర్షులు ను ఇప్పుడు స్వర్గమునం దున్నారు. పరశురాముఁడు, వ్యాసుఁడు, ఆత్రేయుఁడు, ద్రౌణి యగునశ్వత్థామ, గౌతమాత్మజుఁ డగు శరద్వంతుఁడు, కౌశికుఁ డగుగాలవుఁడు, ఔర్వుఁ డగుకాశ్యపుఁడు అనునీమహాత్ము లేడ్వురును భవిష్యన్మునిశ్రేష్ఠు లగుదురు. వైరియు, అధ్వరీవంతుండును, శమనుండును, ధృతిమంతుండును, వసుండును, అరిష్టుండును, అధృష్టుండును, వాజియు, సుమతియు ననువారు సావర్ణమనువుపుత్రు లగుదురు. ప్రభాతకాలంబున నీయతీతానాగతమహర్షిగణంబులనామంబులను స్మరించుచు లేచువానికి ఆయురారోగ్యయశస్సుఖంబులు లభింపఁగలవు.

మునివరులారా! గతమన్వంతరంబులనుగూర్చి సంక్షేపముగాఁ జెప్పితిని. ఇఁక ననాగతమన్వంతరంబులను వచించెదను వినుఁడు. సావర్ణమనువు లయిదుగురు. అందు పరమేష్ఠితనయులగు నలువురు మేరుసావర్ణి నామంబున విఖ్యాతులైరి. వీరు దక్షకన్య యగు ప్రియగర్భంబున జనియించిరి. దక్షప్రజాపతిదౌహిత్రులును మహౌజసులును నగువీరు మేరుపృష్ఠంబునం దుండి మహాతపంబును గావించిరి. ప్రజాపతి యగు రుచిపుత్త్రుండు రౌచ్యుం డౌకమను వయ్యెను. రుచికి భూతదేవిగర్భంబున భౌత్యుం డనువాఁడు పుట్టి మను వయ్యెను. ఈ కల్పంబున వారేడ్వురును మనువు లయ్యెదరు. వారివలననే ద్వీప పట్టణమయం బగుపృథ్వి యంతయుఁ బరివ్యాప్తం బగును. వీరు యుగసహస్రంబులు భూపరిపాలనంబు గావింతురు. ప్రతియుగాంతంబునను ప్రజాపతి తపశ్చరణంబు గావించుచుండును. డెబ్బదియొక్క దివ్యయుగంబు లొక్కమన్వంతరం బని చెప్పంబడును. చతుర్దశమనువులచరిత్రంబును వేదపురాణములయందు

ప్రసిద్ధమైనది. అమ్మనువు లందఱును ప్రభువులును ప్రజాపతివాచ్యులు నై యుండిరి.

వీరినామంబులను గీర్తించువారు ధన్యు లగుదురు. మన్వంతరాంతంబున సంహారంబును మరల సృష్టియు నగుచుండురు. ఇవ్విధంబున సృష్టిప్రళయంబు లెన్ని మైనవో నూఱేండ్ల కైనను లెక్కింపఁజాలము. మన్వంతరావసానంబునఁ బ్రళయారంభంబునందు తపోబ్రహ్మచర్యజ్ఞానబలంబున దేవతలును, సప్తర్షులుమాత్రము నిలిచియుందురు. తక్కినవా రందఱును విలయంబు నందుదురు. యుగసహస్రంబులకుఁ గల్పాంతంబగును. కల్పాంతకాలంబున సకలభూతంబులును బరస్పరము రవిరశ్మిచే దగ్ధంబులై బ్రహ్మాదిత్యగణసహితంబుగ సర్వభూతస్రష్టయు, సురశ్రేష్ఠుండును, ప్రభుండును, హరియు నగు నారాయణునందు విలీనంబు లగును. ప్రతికల్పాంతంబున నిట్లే జరుగుచుండును. ఈ జగం బంతయును అవ్యక్తుండును, శాశ్వతుండు నగు నా దేవదేవుని లీలయే. మునివరులారా! వృష్ణికులావతంసుండును, మహాత్ముండు నగు హరి యావిర్భవించిన సద్వంశమునుగూర్చి వర్ణించుప్రసంగముగల వైవస్వతమన్వంతర సృష్టివృత్తాంతమును మీకు వర్ణించి చెప్పెదను.

## ఆదిత్యోత్పత్తికథనము.

ద్విజోత్తములారా! కశ్యపునివలన దాక్షాయణీగర్భంబున వివస్వతుండు జన్మించెను. ఆతనికి విశ్వకర్మకూఁతు రగు సంజ్ఞాదేవి భార్య యయ్యెను. భావిని యగునామె సురేణునామంబునఁద్రిభువనములయందును విఖ్యాత యయ్యెను. రూపయౌవనవతియు, కీర్తిమతియు, మహాతపస్వినియు నగుసంజ్ఞాదేవి మార్తాండునిభార్య యయ్యెను. నాతనితీక్ష్ణరూపంబుచే నామె పరితృప్తింగానలేకపోయెను. ప్రచండతే

జుం డగు నాసూర్యభగవానుని స్వాభావికతీక్ష్ణరూపజ్యోతి సోకినంతనే శరీరంబు దగ్ధంబై పోవును. అదియే సంజ్ఞాదేవి కప్రియం బయ్యెను. పూర్వకాలంబునఁ గశ్యపుఁడు స్నేహభావంబున "ఈఅండస్థుండు మృతినందఁడు" అనియెను. అందువలన "మార్తాండుం" డనునామంబు సూర్యునకు సుప్రసిద్ధం బయ్యెను. ఆవివస్వంతునితేజం బత్యధికంబై త్రిభువనంబులను దపింపఁజేయుచుండెను. అతనివలన సంజ్ఞాగర్భంబునుండి వైవస్వతుండును, శ్రాద్ధదేవుండు నను నిరువురు తనయులును, యమున యను నొకతనయుఁ గలిగిరి. ఆపుత్త్రు లిరువురును ప్రజాపతులైరి. అందు శ్రాద్ధదేవుం డగు యముండును, యమునయుఁ గవలు.

వివస్వంతుని శ్యామలవర్ణముం గాంచి సహింపఁజాలక మాయామయి యగు సంజ్ఞాదేవి తనకు సవర్ణ యగు ఛాయాదేవిని సృజించెను. అప్పు డాఛాయ ప్రాంజలియై "ఓశుచిస్మితా! నే నేమిచేయవలయునో యాజ్ఞాపింపు మనియెను. అప్పుడు సంజ్ఞాదేవి ఓసుందరీ! నీకు శుభమగుఁగాక! నేను నాపుట్టినింటికిఁ బోయెదను. ఈనాభవనంబున నిస్సంశయముగా నివసించి నాయిరువురుపుత్త్రులను, పుత్త్రికలను బెంచుచుండుము. నే నిట్లు పోయిన విషయమును భాస్కరున కెన్నఁడును నివేదింపకుము." అని బోధించుటయు ఛాయ "ఓదేవీ! ఎట్టిశాపంబును, ఎట్టికచగ్రహణంబును సిద్ధింపకుండునంతవఱకు నేను నీ యాజ్ఞను బరిపాలించెదను. నీవు యథాసుఖంబుగఁ బొమ్ము. నీకు నమస్కారము" అని చెప్పెను.

తపస్విని యగు సంజ్ఞ, సవర్ణ నట నుంచి యామె యంగీకారముం బడసి సిగ్గుతోఁ దండ్రి యగు విశ్వకర్మసమీపమునకుం బోయెను. కాని, యామె తండ్రిచే ననేకవిధంబులఁ దిరస్కరింపఁబడియెను. విశ్వకర్మ యామెను భర్తృసన్నిధికిం బొమ్మని మాటిమాటికి నాజ్ఞాపిం

చుచుండెను. ఆమె తనరూపమును మార్చుకొని బడబా (ఆఁడుగుఱ్ఱ
ము) రూపముం దాల్చి యుత్తరకురుదేశములకుం బోయి తృణక్షేత్రం
బున సంచరించుచుండెను. ఇట నాదిత్యుండును ఛాయాసంజ్ఞను దన
పత్నిగనే తలంచి యుండెను. ఆదిత్యునకు ఛాయయందు ఆత్మతు
ల్యుండును, పూర్వజాతుండగు వైవస్వతున కనురూపుండును అగుసా
వర్ణి యను నొకపుత్త్రుండు గలిగెను. ఆతఁడు వైవస్వతునియనంతర
ము మనువు గాఁగలఁడు. మఱియు, ఛాయకు సూర్యునివలన శనైశ్చ
రుం డను నింకొకపుత్త్రుండు గలిగెను. ఛాయ తనపుత్త్రులను సపత్నీ
పుత్త్రులకంటె నధికముగఁ బ్రేమించుచుండెను. ఛాయాదేవి పక్షపాత
మును వైవస్వతుండు సహింపఁగలిగెను గాని రోషవశంబునను బాల
స్వభావముచేతను విధినియోగంబువలనను యముండుమాత్రము సహిం
పఁజాలక తల్లి యగుఛాయను నిందించుచుఁ గాలెత్తి యామెను ద
న్నఁబోయెను. సావర్ణిజనని యగు ఛాయయుఁ గ్రోధావేశంబున నీచర
ణంబు పతితం బగుఁగాక యని యముని శపియించెను. దానికి య
ముం డతిదుఃఖితుండై తండ్రిచెంగటికిం బోయి కృతాంజలియై సమస్త
వృత్తాంతంబును విస్పష్టముగ నాతనికి విన్నవించి, "తండ్రీ! మాతల్లి
శాపమునుండి న న్నుద్ధరింపుము. తల్లి యనునది సకలసంతానంబునం
దును సమానప్రేమము గలదియై యుండవలయును. అట్లు తుల్యస్నే
హమును జూపుటయే యామెకుఁ గర్తవ్యము. కాని, ఆమె మమ్ముఁ
బరిత్యజించి, కనిష్ఠసంతానమునెడల నధికవాత్సల్యముం జూపుచున్నది.
అందుచే నే నామెపైఁ గాలెత్తి బెదరించితిని. అంతియకాని నాపాద
మామెదేహము నంటనేలేదు. బాల్యముచే నైన నేమి? మూఢత్వ
ముచే నైన నేమి? నే నొనర్చిన యీయపచారమును మన్నింపుము.
ఓలోకేశ్వరా! తల్లిచే నేను శపింపఁబడితిని. నాచరణంబు భూపతితం
బు గాకుండ ననుగ్రహింపుము.

అని ప్రార్థించుటయు వివస్వంతుండు "కుమారా! ఈవిష యంబున నిశ్చయంబుగ నేదియో నిగూఢకారణం బున్నది. అందుచే తనే నీవంటిధర్మజ్ఞుఁడును, సత్యవాదియు నగుపుత్త్రుని నీతల్లి క్రోధవ శంబున శపింపఁగలిగినది. కాని, నీతల్లివాక్యమును వ్యర్థముగఁ జేయు టకు నేను సమర్థుఁడను గాఁజాలను. కేవల మీశాపోపశమనంబును మాత్రము చేసెదను. నీపాదమునందలి మాంసమును క్రిమిగణంబులు గైకొని భూతలంబునకుం బోఁగలవు. అందువలన నీతల్లివాక్యంబును నిరర్థకంబు గానేరదు. త్వదీయచరణ మాంసాపహరణంబు గారణంబు గా నీవును శాపంబునుండి విముక్తుండవు గాఁగలవు." అని యూఱడిం చి యాదిత్యుండు ఛాయయొద్దకుం బోయి "దేవీ! సంతానం బంత యును తుల్యంబై యుండ, నీవొక్కనియందే యధికవాత్సల్యముంచుట కుఁ గారణం బేమని ప్రశ్నించెను. ఆప్రశ్నకు సంతృప్తికరంబుగాఁ జె ప్పుటకు ఛాయ యసమర్థయై ఏమియు బదులుచెప్పక యూరకుండెను. ఆదిత్యుండును యోగబలంబున సర్వమును గ్రహించి, ఛాయాసంజ్ఞ ను శపింపం దలంచి, క్రోధముతో నామెకచగ్రహణంబు గావించు టయు, ఛాయాదేవి భయభ్రాంతయై సమస్తవృత్తాంతమును సూర్యభ గవానునకు విన్నవించెను.

ఆవృత్తాంతమును విని ప్రభాకరుండు కుపితుండై విశ్వకర్మయొ ద్దకుం బోయెను. విశ్వకర్మయు నాతనిని యథావిధి సత్కరించి, రోషభ రంబున దహనోద్యతుం డగుదివాకరునిం గాంచి, సాంత్వవచనంబుల "ఓదేవా! నీతేజ మతితీక్ష్ణమైనది. ఇట్టిరూపంబు దురవలోకం బైన ది. ఇది నీ కుచితమైనది గాదు. నీభార్య యగు సంజ్ఞ యిట్టినీతే జంబును సహింపఁజాలక యే వనశాద్వలతలంబులం బరిభ్రమించు చున్నది. శుభచారిణియు, శ్లాఘ్యయు, యోగబలోపేతయు నగు నీవు

హాధర్మిణిని దివ్యదృష్టిచే నీవు గనుఁగొంటివిగదా! నీ కిష్ట మగునేని నే నును నీకు యథోచితరూపంబును గల్పింపఁగలను. ఈతీక్ష్ణరూపంబునకు మాఱుగఁ గమనీయరూపంబును నీకుం గూర్చెదను." అని చెప్పుట యు, మార్తాండుండు క్రోధంబు నుపసంహరించుకొని యట్లొనర్చుట కంగీకరించెను. అప్పుడు విశ్వకర్మ సూర్యదేవుని భ్రమియంత్రంబున నారోపించి యాతనియధిక తేజంబు గొంతవఱకు తగ్గునట్లొనర్చెను. దానంజేసి సంహృతతేజుం డగు సూర్యునిరూప మత్యుజ్జ్వలంబై య త్యంతమనోహరంబై విరాజిల్లెను.

సూర్యదేవుండు యోగబలంబున దనభార్య యగు సంజ్ఞాదేవి సర్వజీవులకు నదృష్యయై యతినియమంబున బడబారూపముతో ని ర్భయంబుగ విహరించుచున్నవిషయము నెఱింగి యాతండును అశ్వ రూపంబుం దాల్చి యామె యున్నయెడకుం బోయి తదీయముఖంబు నఁ దనముఖంబుం జేర్చి మోహావశంబున రేతస్సును జాఱవిడిచెను. బడబయుఁ బరపురుషసంశయంబునఁ దననాసికారంధ్రంబులనుండి యా శుక్రంబు నుద్గీర్ణంబుఁ గావించెను. దానినుండి యత్యంతమనోహరా కారు లగు అశ్వినీదేవత లుదయించి దేవవైద్యు లైరి. ఆయశ్వినీకు మారు లిరువురును నాసత్యదస్రనామంబుల విలసిల్లిరి. అష్టమప్రజాప తి యగు మార్తాండునకు నీవిధముగా నశ్వినీకుమారులు పుట్టిరి. అనం తరము భాస్కరుండు తనమనోహరదివ్యరూపమును బ్రదర్శించుటయు, సంజ్ఞాదేవి చూచి సంతుష్టయయ్యెను. యముండు దాను గావించిన యపచారంబునకుఁ జింతించి ధర్మముచేఁ బ్రజలను రంజించి ధర్మరా జయ్యెను. ఆతఁడు తనశుభకర్మంబులచే దీప్తిమంతుండై పితృగణాధి పత్యంబును లోకపాలకత్వంబును గాంచెను. ఆతనిపై మాత్రేయుం డగు (సవతితమ్ముండగు) సావర్ణియుఁ బ్రజాపతియై మనవయ్యెను. ఈ

వైవస్వతుని యనంతర మతఁడే మనువు గాఁగలఁడు. ఆతఁ డిప్పటికిని మేరుపృష్ఠంబునఁ దపంబు గావించుచున్నాఁడు. ఆతనితమ్ముఁ డగు శనైశ్చరుఁడు గ్రహత్వముం గాంచెను. విశ్వకర్మ, శాతితతేజోరజంబువలన దానవవిదళనసమర్థంబును అప్రతిహతంబును నగు విష్ణుచక్రమును సృజియించెను. సూర్యకన్యయగు యమి లోకపావని యగు యమునానది యయ్యెను. వైవస్వత సావర్ణిమనుసంభవం బీవిధంబుగ జగత్ప్రసిద్ధం బయ్యెను. సూర్యునకు ఛాయాదేవియం దుదయించిన సావర్ణమనుభ్రాత యగుశనైశ్చరునకు లోకపూజ్యం బగుగ్రహత్వలాభంబు గలిగెను. ఈదేవగణోత్పత్తిచరితంబును వినువారు ధరించువారును నిరాపన్నులును యశస్వంతులును నగుదురు.

## —♦ సూర్యవంశనిరూపణము. ♦—

మునివరులారా! వైవస్వతునకు నాత్మతుల్యు లగు ఇక్ష్వాకుఁడు, నాభాగుఁడు, ధృష్టుఁడు, శర్యాతి, నరిష్యంతుఁడు, ప్రాంశుఁడు, రిష్టుఁడు, కరూశుఁడు పృషధ్రుఁడు, ననుతొమ్మండ్రు పుత్త్రులు గలిగిరి. ప్రజాపతి యగు నమ్మనువు పుత్త్రకామేష్టి గావించుటచే నాతనికి పుత్త్రులందఱును గలిగిరి. అయ్యజ్ఞమునం దాతఁడు మిత్రావరుణులం గూర్చి కావించిన యాహుతివలన దివ్యాంబరధారిణియు దివ్యాభరణభూషితయు, దివ్యసంహననయు నగు ఇల యనురమణీమణి యుద్భవించెను. మను వామెంగాంచి యోభద్రా! నావెంట రమ్మనుటయు నామె ధర్మమయంబులగు వాక్యంబులతో, "ఓవాగ్మివరా! నేను మిత్రావరుణులయంశంబున జనియించినదాన నగుటంజేసి నాకు ముందుగ వారిసందర్శనం బొనర్చుట కర్తవ్యంబు. న న్నధర్మనిరతం జేయకుము." అని ప్రార్థించి యాతనియనుమతిం బడసి మిత్రావరుణులచెం

తకుం బోయి కృతాంజలియై "ఓ దేవవరులారా! నేను మీయుభయకులయంశంబునను బుట్టితిని. ఇట్టి నే నేమిచేయవలయునో యాజ్ఞాపింపుఁడు. ప్రజాపతి యగు మనువు నన్నుఁ దనవెంటరమ్మని కోరుచున్నాఁడు." అని ధర్మపరాయణయు, సాధ్వియు, నగు యిలాదేవి విన్నవించుటయు, మిత్రావరుణులామెం గాంచి, "ఓ వరవర్ణినీ! మేము నీధర్మంబునకును, వినయంబునకును, సత్యంబునకును, దమంబునకును సంప్రీతుల మైతిమి. నీవు మాతనయవై ప్రఖ్యాతిం గాంచుటయే కాక మనువునకు వంశధరుండును విశ్వజనప్రియుండును ధర్మశీలుండును నగు తనయుండవై సుద్యుమ్ననామంబునఁ ద్రిజగంబులం బ్రసిద్ధుండవు గాఁగలవు."

అని యానతిచ్చుటయు, యిలాదేవి వారికడ సెలవుగైకొని వచ్చుచుండఁగా, మార్గమధ్యంబున చంద్రునికొడుకైన బుధుని సంయోగంబుచే నామెకుఁ బురూరవుం డను పుత్త్రుండు గలిగెను. ఆ పుత్త్రప్రసవానంతరమువందే యామెకు సుద్యుమ్నత్వంబు గలిగెను. ఆసుద్యుమ్నునకు—ఉత్కలుఁడు, గయుఁడు, వినతాశ్వుఁడు అను మువ్వురుపుత్త్రులు గలిగిరి. అందు ఉత్కలుఁడు, ఉత్కలదేశమును, వినతాశ్వుఁడు పశ్చిమదేశమును, గయుండు పూర్వదిక్సంస్థితం బగుగయాప్రదేశమును బరిపాలించిరి. మనువు ననంతరంబున నీభూమండలమంతయుఁ బదిభాగములుగా విభక్తం బయ్యెను. అందు జ్యేష్ఠుం డగు నిక్ష్వాకునకు మధ్యదేశము లభించెను. సుద్యుమ్నుండు కన్యాభావము గలవాఁ డగుటచే నాతనికి భాగము లభింపదయ్యెను. వసిష్ఠునియుపదేశానుసారంబుగ నాతఁడు ప్రతిష్ఠాననగరంబున నివసించెను. ఆతఁడు ధర్మపరుండును, మహాత్ముండు నై ప్రతిష్ఠానలాభముం గాంచి దానిని బురూరవున కొసగెను. మనుపుత్త్రుం డగు నాసుద్యుమ్నుండు స్త్రీపు

రూపలక్షణంబులు గలిగి యుండెను. ఇలాసుద్యుమ్ననామంబులచే నాతఁడు ప్రఖ్యాతుం డయ్యెను.

నరిష్యంతునకు శకుంతుఁను, నాభాగునకు సుప్రసిద్ధుండగునంబరీషుండును గలిగిరి. ధృష్టునకు రణదుర్మదుం డగుక్షత్త్రుండనుపుత్త్రుండు పుట్టెను. కరూశునకుఁ గరూశనామకక్షత్త్రియు లుదయించిరి. నాభాగధృష్టవంశజు లగురాజులందఱును వైశ్యత్వముం గాంచిరి. ప్రాంశునకుఁ బ్రజాపతియనుతనయుండు జనించి ప్రఖ్యాతుం డయ్యెను. నరిష్యంతునకు దండధరుండగుయముండు వంశధరుండై రాజయ్యెను. శర్యాతికి, ఆనర్తుం డనుసుతుండును, సుకన్య యనుతనయయుఁగలిగిరి. సుకన్య చ్యవనుం డనుఋషికిఁ బత్ని యయ్యెను. ఆనర్తునకు మహాప్రభావసంపన్నుఁ డగురైవుండనునాత్మజుండు గలిగి సుప్రసిద్ధరాజధాని యగుకుశస్థలియందు నివసించి యుండెను. ఆరైవునకు, కకుద్మియను నపరనామంబు గలరైవతుండనుసూనుండు గలిగెను. రైవునిపుత్త్రశతంబునందు నతఁడే యగ్రజుండగుటచేఁ గుశస్థలికిఁ బ్రభుండయ్యెను. రాజగునారైవతుఁడు తనయయగురేవతితోఁగూడి బ్రహ్మలోకమునకుం బోయి యట సంగీతమునాలకించుచు నొకముహూర్తమాత్ర ముండెను. ఆకాలము మానవమానంబుచే బహుయుగాంతరములయ్యెను.

పిమ్మట నాతఁ డటనుండి బయలుదేఱి యాదవగణపరివృతంబును, బహుద్వారసమన్వితంబు నగుద్వారకానగరమునకు నచ్చెను. ఆపురంబప్పుడు వసుదేవప్రముఖులగు యదువృష్ణిభోజాంధకులచే సురక్షితమై యుండెను. అప్పుడు రైవతుండు తా నెఱుంగవలసినవిషయము లన్నియుం దెలిసికొని, సువ్రతచారిణి యగుతనతనయ రేవతిని బలదేవునకుఁ గన్యాదానంబు గావించి యనంతరము మేరుశిఖరంబున

కుం దపంబు సేయంబోయెను. ఇట ధర్మరతుం డగుబలరాముండు రేవతీసహితుండై మహాసుఖంబున విలసిల్లుచుండెను.

అని సూతుండు చెప్పుటయు మును లిట్లు ప్రశ్నించిరి. మహాభాగా! రాజగు రైవతుండు పుత్రీసహితముగ బ్రహ్మలోకంబునకుం బోయెనుగదా! అంతకాల మటనున్నను వారికి జరాప్రాప్తి యేల కాకుండెను? శర్యాతివంశధరుం డగు రైవతుం డప్పుడే తపంబునకుం బోయెనంటివి. ఇప్పటికిని శర్యాతివంశము భూమండలమునం గానంబడుచున్నది. రైవతుండు తపంబునకుం బోయినచో నీవంశ మెట్లు నిలిచినది? ఈవృత్తాంతము సవిస్తరంబుగ నెఱింగింపవలయును.

అనుటయు సూతుం డిట్లనియెను. మునివరులారా! బ్రహ్మలోకంబున, జరామరణములు, క్షుత్పిపాసలు మొదలగునెట్టి క్లేశంబులును లేవు. ఋతుగణంబు లచ్చటం దమప్రభావమును విశేషముగ విస్తరింపం జేయంజాలవు. రైవతుండు బ్రహ్మలోకమునకుం బోయినంతనే దుర్వృత్తపరాయణు లగురాక్షసు లానగరంబును ధ్వస్తంబు గావించిరి. రైవతునితమ్ములు నిరుపాయులై పాఱిపోయి యందందు నివసించి యుండిరి. అచ్చటనే వారివంశంబులు వర్ధిల్లం దొడంగెను. ఆవంశములవారందఱును నరణ్యభూముల నాశ్రయించి యుండిరి. వారే శర్యాతివంశజులై ప్రసిద్ధిం గాంచిరి. నాభాగపుత్త్రుం డొక్కండును, ధృష్టపుత్త్రుండొక్కండును మొదట వైశ్యులై మరల బ్రాహ్మణత్వముం గాంచిరి. రణదుర్మదులును, క్షత్రియులు నగుకరూశునిపుత్త్రులంగూర్చి యిదివఱకే చెప్పియుంటిని. పృషధ్రుండు గురుధేనువును హింసించి గురుశాపవశంబున శూద్రుం డై పోయెను. ఇది వైవస్వతపుత్త్రవృత్తాంతము.

ఒకప్పుడు మనువు తుమ్ముటయు నిక్ష్వాకుండను తనయుండు

జనించెను. ఇక్ష్వాకునకు నూర్గురుపుత్త్రులు. వారందఱును బహుదక్షిణలతో ననేకయజ్ఞములం గావించిరి. వారిలోఁ బరాక్రమవంతుండగువికుక్షియనువాఁడు సర్వజ్యేష్ఠుఁడై యుండుటచే నాతఁ డయోధ్యాసింహాసనము నధిష్ఠించి తనప్రభుత్వమును విస్తరింపఁజేసెను. ఆతనికి మహాబలవంతులగు శకునిప్రముఖులైదువందలమందిపుత్త్రులు గలిగిరి. అందుఁగొందఱుత్తరాపథంబును, గొందఱు దక్షిణప్రదేశమును బాలించుభారమును వహించిరి.

ఒకనాఁ డిక్ష్వాకుం డష్టకాశ్రాద్ధంబు గావింపఁదలంచి పుత్త్రుండగువికుక్షిం బిలిచి వేటకుఁ బోయి శశమాంసమును గొనితెమ్మని యాజ్ఞాపించెను. వికుక్షియు నిర్దిష్టం బగుశ్రాద్ధము సంపన్నంబు గాకుండఁగనే శశమాంసమును భుజించి వేఁటకుం బోవుటచే నప్పటినుండియు నాతనికి శశాదుం డనునామము గలిగెను. ఇట్లపచారముం గావించిన శశాదునియెడల నిక్ష్వాకుండు విరక్తుండై వసిష్ఠానుమతంబున నాతనిఁ బరిత్యజించెను. కాని యిక్ష్వాకు ననంతరమునందు శశాదుండు మరల వచ్చి యయోధ్యాసింహాసనము నాక్రమించుకొనియెను.

ఆశశాదునకు వీర్యవంతుం డగుకకుత్స్థుండును, అతని కనేనుండును, ఆతనికిఁ బృథుండును, అతనికి విష్టరాశ్వుండును, ఆతని కార్ద్రుండును, ఆతనికి యువనాశ్వుండును, అతనికి యౌవనాశ్వుండును, ఆతనికి శ్రావస్తుండును జనించిరి. శ్రావస్తునికాలమునందే శ్రావస్తీనగరము నిర్మింపఁబడియెను. ఆతనికి బృహదశ్వుండును, ఆతనికిఁ గువలయాశ్వుండును జనించిరి. పరమధార్మికుం డగుకువలయాశ్వుండు ధుంధుం డనురాక్షసుని వధించుటచే నాతనికి ధుంధుమారుండనునామము గలిగెను. అని చెప్పుటయు మునీంద్రులు కువలయాశ్వచరిత్రమును సవిస్తరంబుగఁ గీర్తింపవలయు నని ప్రార్థించిరి.

## కువలయాశ్వచరిత్రము.

లోమహర్షణుం డిట్లనియెను. మునీంద్రులారా! కువలయాశ్వునకు నూర్గురు పుత్త్రులు గలిగిరి. వారలును ధనుర్వేదవిదులును, విద్వాంసులును, బలవంతులును, దుర్ధర్షులును, ధార్మికులు నై భూరిదక్షిణలతో బహుయజ్ఞములం గావించిరి. బృహదశ్వుండు పుత్త్రుండగు కువలయాశ్వుని రాజ్యాభిషిక్తుం గావించి తాను వనగమనంబునకుద్యుక్తుండై యుండెను. అప్పు డుతంకుం డనుబ్రహ్మర్షి వచ్చి వానప్రస్థధర్మంబు నవలంబింపవల దని యాతని వారించుచు "మహారాజా! నీవు న్యాయముగ రాజ్యరక్షణభారంబు వహింపకున్నచో నేను నిర్విఘ్నముగఁ దపోనిర్వహణంబు చేసికొనఁజాలను. నాయాశ్రమసమీపమున సముద్రవాలుకామయంబగు నొక సమప్రదేశముగలదు. మధుదైత్యతనయుం డగుధుంధుం డనుమహాసురుం డచ్చట భూగర్భమునందు వాలుకాస్తూపంబున నంతర్హితుండై యున్నాఁడు. మహాకాయుండును, మహాబలవంతుండు నగు నమ్మహాసురవీరుండు దేవతలకుఁగూడ నవధ్యుఁడై యున్నాఁడు. ఆతఁడు దారుణతపంబు నవలంబించి లోకవినాశంబుకొఱకే యచ్చట శయనించి యుండెను. ఆరాక్షసుండు సంవత్సరమున కొకసారి నిశ్వాసమును విడుచుచుండును. దానిచే నీసమస్తభూమండలమును సంచలితంబై పోవుచుండును. అప్రబలవాయువశంబున ధూళిరాశి యెగసి సప్తాహపర్యంతము నాదిత్యునాచ్ఛన్నంబు గావించుచుండును. అంతవఱకు నీభూమండలమంతయుఁ గంపితమగుచునే యుండును. అప్పుడు ధూమసహితంబు లగుజ్వాలామాలిక లతిదారుణంబుగ బయలు వెడలుచుండును. అందుచే నేనయ్యాశ్రమంబున నిలువఁజాలకున్నాను. భూపాలచంద్రా! కావున నీవమ్మహాకాయుం డగు రక్కసుని లోకహితంబుకొఱకు సంహరింపవల

యును. ఆతఁడు నీచే నిహతుండైనచో సకలలోకంబులును స్వస్థంబులు గాఁగలవు. ఆతని వధించుటకు నీ వొక్కఁడవే సమర్థుఁడవు. పూర్వము నాకు వరప్రదానంబు గావించుసమయంబున విష్ణుదేవుండు, ఆక్రూరరాక్షసు నెవ్వండు వధియించునో యాతని తేజమును నీవు వర్ధిల్లఁజేయఁగల వని యానతిచ్చియున్నాఁడు. ఓమహారాజా! అమ్మహాతేజం డగుధుంధుఁడు కేవలము దుర్ధర్షుఁడు. అల్పతేజునిచే వాఁడు శతయుగంబులకైనను దగ్ధుండు గాఁడు. మహాబలుం డగునాతని దేవతలైనను జయింపఁజాలరు."

అని యుతంకుండు సెప్పుటయు రాజర్షి యగు బృహదశ్వుండు తనకుమారు నక్కార్యంబునకు నియోగింపం దలంచి "ఓమహాభాగా! నేను శస్త్రంబును త్యజించితిని. ఈనాకుమారుం డగు కువలయాశ్వునంపెదను. ఈతనిహస్తంబునందే ధుంధుండు నిహతుం డగును." అని చెప్పి కుమారుని ధుంధువధార్థము నియోగించి వ్రతావలంబనంబుఁ గావించి పర్వతాభిముఖుండై పోయెను.

కువలయాశ్వుండును తండ్రియాజ్ఞను శిరసావహించి తనసూర్వురు పుత్రులతోడను ధుంధుసంహారంబునకై యుతంకునివెంట బయలుదేఱి పోయెను. అయ్యుతంకునిప్రార్థనముచేతను, లోకహితంబుకొఱకును, భగవానుం డగు విష్ణుదేవుండు తన తేజంబుతోఁగూడఁ గువలయాశ్వుని శరీరంబునం బ్రవిష్టుండయ్యెను. కువలయాశ్వుం డట్లు రాక్షససంహారంబునకై యాత్ర గావించునప్పు డాకసమునుండి "శ్రీమంతు డగు కువలయాశ్వుం డిప్పు డమృతదేహుండై ధుంధుమారణంబు సేయంగలండు." అనువాక్యంబులు మేఘగంభీరస్వనంబుల వినవచ్చెను. విమానచారు లగు దేవతలు నలుదెసలనుండియు సుగంధకుసుమవర్షంబులు గురియింపఁదొడంగిరి. దేవదుందుభులు మొరయుచుండెను.

అప్పుడు విజయశ్రేష్ఠుండును వీర్యవంతుండును నగు కువలయాశ్వుం
డట్లు చని చని ప్రపథమంబున వాలుకాపూర్ణం బగు సముద్రంబును
త్రవ్వ సంకల్పించెను. కువలయాశ్వునిపుత్రులు నూర్వురును సముద్ర
మును త్రవ్వి త్రవ్వి వాలుకాస్తూపమధ్యగతుం డగుధుంధునిం జూడం
గాంచిరి. ఆరాక్షసుండు క్రోధభరంబునం దనవదనంబునుండి యగ్ని
జ్వాలలం బఱపి పశ్చిమదిశ నంతను గప్పివైచెను. మఱియు నాతండు
చంద్రోదయంబున మహాతరంగకల్లోలితం బగు సముద్రంబునుంబోలిన
జలప్రవాహము నతివేగముగం బరగించెను. అట్లు విజృంభించుచున్న
యారాక్షసునిచే నాక్షణంబుననే కువలయాశ్వుని పుత్రశతంబునందు
మువ్వురుదక్కం దక్కినవా రెల్లరును నిహతు లైరి. అనంతరము ద్యు
తిమంతుండును మహాతేజుండును నగు కువలయాశ్వమహారాజు మహా
బలుం డగు నారాక్షసుని సమీపించి వేగవంతం బగు వానిజలప్రవా
హంబు నొక్కమ్మడిం బానముగావించి యోగబలంబుచే నారాక్షసుని
మహానలజ్వాలలను శమింపంజేసి మహాకాయుం డగు నాతని గతాసుం
జేసి కృతార్థుండై యుదంకునిం బరితృప్తు నొనర్చెను. ఉదంకుండును
మహాత్ముం డగు నమ్మహీనాథున కక్షయధనంబును శత్రువిజయంబు
ను, నిరంతరధర్మాసక్తియు, శాశ్వతస్వర్గభోగంబులును నిహతులగు
నాతనిపుత్రులకు నాకలోకప్రాప్తియుం గలుగునట్లు వరంబులను బ్రసా
దించెను.

కువలయాశ్వునకు మిగిలిన మువ్వురుపుత్రులలోను—దృఢా
శ్వుండు జ్యేష్ఠుండును, చంద్రాశ్వకపిలాశ్వులు కనిష్ఠులు నై యుండిరి.
దృఢాశ్వునకు హర్యశ్వుండును, ఆతనికి క్షాత్రధర్మరతుండగునికుంభుం
డును, నాతనికి రణదక్షుండగు సంహతాశ్వుండును జనియించిరి. సం
హతాశ్వునకు, అకృశాశ్వకృశాశ్వ లను నిరువురు పుత్రులును హై

మవతి యను కన్యకయుఁ బొడమిరి. హైమవతి త్రైలోక్యంబున దృషద్వతీనామంబునఁ బ్రఖ్యాత యయ్యెను. ఆహైమవతికిఁ బ్రసేనజిత్తు పుట్టెను. ఆతనికి గౌరి యనునామె భార్య యయ్యెను. ఆమె భర్తచే నభిశప్తయై బాహుదానది యైపోయెను. ప్రసేనజిత్తునకు రాజాధిరాజగు యువనాశ్వుండు పుట్టెను. ఆతనికి త్రిలోకవిజయుం డగు మాంధాత యుదయించెను. ఆతఁడు శశిబిందుతనయ యగు చైత్రరథిని బెండ్లియాడెను. అమెకు బిందుమతి యను నపరనామంబు గలదు. ఆబిందుమతి యతిలోకరూపలావణ్యవతియు సతియు నై యుండెను. ఆమె దశసహస్రభ్రాతలకు జ్యేష్ఠభగిని. ఆమెవలన మాంధాతకు పురుకుత్సుఁడు, ముచుకుందుఁడు ననుధర్మజ్ఞు లిరువురు తనయు లైరి. పురుకుత్సునకు త్రసదశ్వుండును, ఆతనికి నర్మదయందు సంభూతుండును, ఆతనికి రిపుమర్దనుం డగు త్రిధన్వుండును, ఆతనికి విద్యాప్రభావసంపన్నుం డగు త్రయ్యారుణియు, ఆతనికి సత్యవ్రతనాముం డగు పుత్త్రుండును బుట్టిరి.

## —♦ సత్యవ్రతచరిత్రము. ♦—

మహాబలుం డగు సత్యవ్రతుఁడు దుర్మతియై వివాహమంత్రంబులకు విఘ్నంబు గావించి కృతోద్వాహ యైన పరభార్య నపహరించెను. బాల్యముచేతను, కామముచేతను, మోహముచేతను, సాహసముచేతను, నాతఁడు పురవాసియగు నొకనికన్య నపహరించెను. ఈయపరాధంబులవలన రాజైన త్రయ్యారుణి యధర్మశంకచేఁ బుత్త్రుని జయించుచుఁ గ్రోధంబున ననేకపర్యాయములు, "అపధ్వంస, అపధ్వంస," అని ధిక్కరించెను. అట్లు త్యక్తుం డైన తనయుండు తండ్రింగాంచి, "నన్నెక్కడకుఁ బొమ్మనియెదవు?" అని యడిగెను. అప్పుడు తం

ఢిని “ఓరి కులపాంసనా ! నీవంటిపుత్త్రుని నేను వాంఛించుటలేదు. నీవు చండాలగణంబులతోఁ గలసి వసింపుము.” అని యాజ్ఞాపించెను. తోడనే సత్యవ్రతుండు పురంబు నిర్గమించెను. భగవానుం డగు వసిష్ఠుం డైనను వానిని వారింపలేదు.

సత్యవ్రతుం డిట్లు తండ్రిచే బహిష్కృతుం డై చండాలావాసంబునకుం బోయి వాసము చేయుచుండెను. త్రియ్యారుణియు వానప్రస్థుం డయ్యెను. అనంతర మారాజ్యంబున నధర్మంబు గారణంబుగాఁ బాకశాసనుండు ద్వాదశవర్షంబులవఱకును వర్షంబు గురిపింపఁడయ్యెను. మహాతపుం డగువిశ్వామిత్రుం డప్పు డారాజ్యంబునం దొక యూరిమింబునఁ బత్నీపుత్త్రుల నునిచి సన్న్యసించి సాగరతీరంబున కుం బోయి మహాతపంబు గావించుచుండెను. అప్పుడు రాజ్యంబున మహాదారుణంబుగ నన్నాభావంబు గలుగుటయు, విశ్వామిత్రునిపత్ని తనమధ్యమపుత్త్రునిగళంబున రజ్జువును బంధించి తనయితరపుత్త్రుల రక్షణార్థము గోశతంబునకు విక్రయింపఁ జూచెను. అప్పుడు ధర్మాత్ముండును, నృపనందనుండు నగుసత్యవ్రతుండు గళబంధితుం డగుమహర్షిపుత్త్రునిం గాంచి విశ్వామిత్రుని సంతుష్టికొఱకు నాతని బంధవిముక్తుం గావించెను. గళబంధనంబున నమ్మునికుమారునకు గాలవుం డను నామంబు గలిగెను. వీరుం డగు సత్యవ్రతుం డీవిధముగాఁ గాలవముని బంధమును విడిపించెను.

సత్యవ్రతుండు భక్తిచేతను కరుణచేతను బ్రతిజ్ఞచేతను విశ్వామిత్రకుటుంబమును బ్రతిపాలించుచుండెను. అతఁడు ప్రతిదినంబును వనంబునకుం బోయి మృగవరాహమహిషాదులను జంపి విశ్వామిత్ర కుటుంబము నివసించు నాశ్రమసమీపంబున నొకవృక్షంబునకుఁ గట్టిపోవుచుండెను. పితృనియోగంబున నారాజనందనుఁడు వనంబునకు వ

చ్చి ద్వాదశవర్షపర్యంతము ఉపాంశువ్రతము నవలంబించి యుండెను.

సత్యవ్రతుని తండ్రి వనంబునకుఁ బోవుటయుఁ బౌరోహిత్యమును, అధ్యాపకత్వంబును గలిగియున్న వసిష్ఠుఁడే అయోధ్యాపురంబును రాజాంతఃపురంబును సమస్తరాజ్యమునుగూడఁ బరీక్షించుచుండెను. సత్యవ్రతుండు చిన్నతనంబునుండియు భవితవ్యతావశంబున వసిష్ఠునియెడ నతిక్రుద్ధుండై యుండెను. తండ్రి తన్ను రాజ్యపదచ్యుతుం గావించినప్పుడు వసిష్ఠుం డేవిధంబునను వారింపలే దనియు, సప్తపదాంతంబైనచోఁ బరిపూర్తి గానున్న తనవివాహమును వసిష్ఠుండు ధర్మజ్ఞుం డయ్యును సముద్ధరింపలే దనియు వసిష్ఠు నెడల నాతనికిఁ బ్రబలక్రోధము జనియించును. వసిష్ఠుండు మంగళాకాంక్షి యై యుండుటచేతనే యిట్లు గావించె నని యాతఁ డెఱుంగఁజాలకపోయెను. అందుచేతనే యాతనికి వసిష్ఠునిపైఁ గోపము గలిగెను. సత్యవ్రతునిపైఁ దండ్రి యగు త్రయ్యారుణికిని దారుణక్రోధము గలిగెను. ఈసకలకారణంబులచేతను బాకశాసనుండు క్రుద్ధుం డగుట వలన రాజ్యమునందు ద్వాదశవర్షపర్యంతము ననావృష్టి యయ్యెను. ఈదేవకోపము నుపశమింపఁజేసి స్వకులంబునకు నిష్కృతిం గూర్పవలయుననియే సత్యవ్రతుండు ద్వాదశవర్షపర్యంతమును గఠోరదీక్షితుం డై యుండెను.

## సత్యవ్రతునకు త్రిశంకునామప్రాప్తి.

ఒకనాఁడు సత్యవ్రతునకు మాంసాభావం బగుటయు నాతఁడు సర్వకామప్రదయు, దుగ్ధవతియు నగు వసిష్ఠమునీంద్రుని గోవుం గాంచి వసిష్ఠుండు తనకనిష్టంబు గావించె ననియుఁ, బైతృకరాజ్యమునకుఁ దన్నెప్పు డభిషిక్తుం గావించునో యింతవఱకు నభిప్రాయమును దె

ఉపలేదనియు భావించి క్షుద్బాధచేఁ గ్రోధమోహాక్రమాభిభూతుం డై యాగోవును వధించి దానిమాంసమును దానుకొంతభుజించి కొంతమాంసమును విశ్వామిత్రపుత్త్రులకుం బెట్టెను. మునివరుం డగువసిష్ఠుం డీగోవధవృత్తాంతము నాకర్ణించి సత్యవ్రతునియెడలఁ గ్రోధావిష్టితుండై యోక్రూరా! నాశాపంబుచే నీవవశ్యముగ నధఃపతితుండ వయ్యెదవుగాక! జనకుని కసంతుష్టిం గూర్చుటయు, గురుగోహత్యయు నను రెండుశంకువులే కాక నీయందిప్పు డప్రోక్షితగోపయోగం బను మూఁడవశంకువుగూడ నుపస్థితం బైనది. ఈకారణంబుచే నీవుత్రిశంకుండ వైతివి. అని వసిష్ఠుండు శపించుటయు నప్పటినుండియు సత్యవ్రతుండు త్రిశంకునామంబున విఖ్యాతుం డయ్యెను.

అనంతరము గొంతకాలమునకు విశ్వామిత్రుండు వచ్చి తనకుటుంబము నింతకాలమువఱకును బోషించినత్రిశంకునియెడలఁ బ్రీతుండై వరంబు గోరుకొమ్మనుటయుఁ ద్రిశంకుండు దనకు సశరీరస్వర్గగమనంబు గావలయు నని కోరుకొనియెను. విశ్వామిత్రుండు నాతని కవ్వరంబును బ్రసాదించెను. అప్పటికి ద్వాదశవర్షక్షామం బపగతం బగుటయు విశ్వామిత్రుండు త్రిశంకుని పైతృకరాజ్యంబునకుఁ బట్టాభిషిక్తుం గావించి తాను స్వయముగా నాతనికిఁ బురోహితుం డయ్యెను. పిమ్మట మహాతపుండగువిశ్వామిత్రుండు దేవగణంబులను, మహర్షియగువసిష్ఠునిగూడఁ దిరస్కరించి త్రిశంకునకు సశరీరస్వర్గసుఖంబును బ్రసాదించెను.

ఆత్రిశంకునకుఁ గేకయరాజనందనయగుసత్యరథయనుపత్నియందనఘుండగు హరిశ్చంద్రుండు పుత్త్రుండై జన్మించెను. త్రిశంకుననంతరమున హరిశ్చంద్రుఁడే రాజ్యపట్టాభిషిక్తుఁడై రాజసూయంబు గావించి చక్రవర్తిపదముం గాంచి సుప్రసిద్ధుం డయ్యెను. ఆహరిశ్చం

ద్రునకు రోహితుండును, ఆతనికి హరితుఁడు, చంచుఁడు, హరీతుఁడు, [illegible] యులు [illegible] గలిగిరి. అందు మధ్యముండగుచంచునకు విజయుండనునొకతనయుండు పుట్టెను. అతఁడు సకలభూమండలమును జయించుటచే విజయనామంబున విఖ్యాతుండయ్యెను. ఆవిజయునకు రాజధర్మవిదుండగురురుకుండును, ఆతనికి వృకుండును, ఆతనికి బాహుండును బుట్టిరి. ఆబాహుని హైహయులు, తాళజంఘులు నను రాజగణంబులు రణరంగంబున నిహతుం గావించిరి.

గర్భవతి యగుబాహునిపత్ని యౌర్వాశ్రమంబునకుఁ బాఱిపోయి యాత్మరక్షణము గావించుకొనియెను. ఆబాహుండు ధర్మయుగంబునందు తనపూర్వపురుషులవలె సంతధర్మాత్ముండు గాలేదు. ఔర్వాశ్రమమం దాతనికి గరళసహితంబుగా సగరుండనుపుత్త్రుండు జన్మించెను. మహర్షి యగునౌర్వుఁడే యాతని సంరక్షించెను. సగరుం డమ్మునీంద్రునియొద్దనే యాగ్నేయాస్త్రము బడసి తత్ప్రభావముచే హైహయతాళజంఘులను నిహతులం గావించెను. ఈవిధముగా నాతనికి సమస్తభూమండలమును వశీభూతం బయ్యెను. ఆతఁడు శక, పహ్లావ, పారదక్షత్రియులను ధర్మవిచ్యుతులం గావించెను.

## సగరచరిత్రము.

అని సూతుండు చెప్పుటయు మునీంద్రులు సగరచరిత్రం బంతయును సవిస్తరంబుగా నెఱింగింపవలయు నని ప్రార్థించిరి. సూతుండు మరల నిట్లనియెను. మునీంద్రులారా! బాహుం డతివ్యసనాసక్తుండై మెలంగుచుండుటవలన నాతనిసమస్తరాజ్యమును విపక్షులచే నపహృతం బయ్యెను. ఆరాజ్యాపహరణవ్యాపారమునందు హైహయతాళజంఘులే ప్రధానులై యుండిరి. వారికి శక, యవన, పారద, కాంభోజ,

పహ్లవులు సహాయులైరి. బాహుం డిట్లు రాజ్యపదభ్రష్టుండై వనంబునకుం బోయి యచ్చటనే మరణించెను. అప్పటికాతనిపత్ని గర్భవతియై యుండెను. అట్లుండియు నామె సహగమనంబునకు సంసిద్ధయై యుండెను. ఆమె సవతి యామె కదివఱకే గరళప్రయోగముం గావించియుండెను.

అప్పు డామె పతికిఁ జితిని సిద్ధము చేసి తానుగూడఁ జితారోహణముం గావింప నుద్యుక్త యగుచుండఁగా భార్గవుండగు నౌర్వుండు వచ్చి కారుణ్యవశంబున నామె నక్కార్యమునుండి మరలించి తనయాశ్రమంబునకుఁ దీసికొనిపోయెను. ఆయాశ్రమమునందే యామె గరళసహితుం డగుపుత్త్రునిం గనియెను. ఆతఁడే సగరనామంబున విఖ్యాతుం డయ్యెను. ఔర్వుం డమ్మహాత్మునిజాతకర్మాదుల నిర్వర్తించి యథావిధిగ నాతనిచే వేదశాస్త్రాధ్యయనంబు సేయించెను. అనంతర మౌర్వుం డాతని కాగ్నేయాద్యస్త్రంబులఁ బ్రసాదించెను. అయ్యాగ్నేయాస్త్ర మమరగణంబులకుఁగూడ దుస్సహమైనది.

బలవంతుం డగుసగరుండు క్రుద్ధుండై యాప్రధానాస్త్రప్రభావముచేతనే సంగ్రామరంగంబున హైహయగణంబులను సంహరించెను. ఆతనియీసంహారకార్యము ప్రళయకాలంబున రుద్రునిసంహారకృత్యముం బోలి యుండెను. కీర్తిమద్వరుం డగుసగరుండు త్రైలోక్యంబున నప్రతిమానకీర్తి నార్జించెను. ఆతఁడిట్లు హైహయులను నిర్జించి యనంతరము శకయవనపారదకాంభోజపహ్లవగణంబుల నిర్మూలంబు గావింప నుద్యుక్తుం డయ్యెను. మహాత్ముం డగుసగరునిచే నిరంతరము హన్యమానులగుచున్నవారందఱును నిష్కృతిం గాంచఁజాలక తుదకు వసిష్ఠునిపాదంబులపైఁబడి యాతనిశరణముం గోరుకొనిరి.

ద్యుతిమంతుం డగువసిష్ఠుండు శరణాగతులగువారిం గటాక్షిం

చి యుభయంబొసంగి సగరుని శతృనిధనోద్యమమునుండి మరలించె ను. సగరుండును గురువాక్యంబులను మన్నించి శత్రులగువారిని దర్మ చ్యుతులను, వ్యత్యస్తవేషులను గావించెను. అప్పు డాతండు శకుల కర్ధమస్తకంబును, గాంభోజయవనులకు సమస్తమస్తకంబును ముండ నంబు గావించి వారిని బరిత్యజించెను. మఱియు మహాప్రభావుండగు నాతనిచేఁ బారదగణంబులు ముక్తకేశులుగను, పహ్లవగణంబులు శ్మశ్రుమాత్రధారులుగను జేయంబడిరి. ఆమహీపాలునియాజ్ఞచే శకయవనకాంభోజపారదులకు స్వాధ్యాయవషట్కారాదులు లేకుండఁబోయెను. ఇంతియకాక వసిష్ఠునాదేశముచే నస్త్రధారియగునమ్మహారాజు మూలమున, కోణసర్పులును, మాహిషకులును, కేరళులును మొదలగుక్షత్రియులు స్వధర్మబహిష్కృతులైపోయిరి.

ధర్మవిజయుం డగుసగరమహీపతి యీవిధముగా నెల్లరాజులను జయించి యశ్వమేధయజ్ఞదీక్షితుండై యశ్వంబును విడిచెను. ఆహయంబు క్రమంబుగాఁ బూర్వదక్షిణంబులకుం బోయి యచ్చట సపహృతంబై భూగర్భంబునఁ బ్రవేశించెను. అప్పుడు సగరపుత్త్రులు తండ్రియాదేశంబుచే నాప్రదేశంబును ద్రవ్వ నారంభించిరి. అట్లు మహాసాగరంబును ద్రవ్వుచుఁ బోయి వారొకచో నాదిదేవుండును, కృష్ణుండును, విష్ణుండును, గపిలరూపియు, ధ్యాననిష్ఠుండు నగుహరిం గాంచిరి. అప్పు డప్పరమపురుషునకు ధ్యానభంగం బగుటయు నాతని నయనతేజముచే సగరసంతానం బంతయు దగ్ధంబైపోయెను. కాని వారిలో బర్హికేతుండు, సుకేతుండు, ధర్మరథుండు, పంచజనుండు నను నలువురుమాత్రము దగ్ధావశిష్టులైరి. ఆనలుగురే సగరవంశమును విస్తరింపఁజేసిరి.

భగవానుం డగు నారాయణుం డిక్ష్వాకువంశము శాశ్వతం

బగునట్లును, దదీయంబగుకీర్తి యవిలుప్తంబగునట్లును సగరునకు వరం బిచ్చియుండెను. మఱియు నాతనికి సముద్రింపు పుత్త్రుం డగునట్లును, అక్షయం బగుస్వర్గసుఖం బాతనికి లభించునట్లును గూడ నను గ్రహించెను. నారాయణుం డిట్లు వరం బొసంగినంతనే సముద్రిం డర్ఘ్యముం గైకొని మహీపతి యగుసగరు నర్చితుం గావించెను. ఈ హేతువుచేతనే సముద్రినకు సాగరత్వము ప్రాప్తించెను. సగరునకు యజ్ఞాశ్వము సముద్రమునుండియే లభించెను. అనంతరము సగరుండు శతాశ్వమేధములం గావించెను. ఆసగరున కఱువదివేలమందితనయులు గలిగిరని వినియుంటిని.

సగరునకుఁ దపఃపవిత్ర లగు నిరువురుభార్య లుండిరి. అందు విదర్భరాజదుహిత జ్యేష్ఠురాలు. ఆమెపేరు కేశిని. రెండవయామె యరిష్టనేమితనయ. ఆమె పరమధర్మచారిణియు, అతిలోకరూపగుణ మణియు, రమణీమణియు నై యుండెను. మహర్షి యగునౌర్వుం డా యిరువురు దేవులకును వరప్రదానంబు గావింపం దలంచి యాయిరువు రిలో నొక్క రఱువదివేలమంది పుత్త్రిలను, మఱియొక్కరు వంశధరుం డగునేకపుత్రుని గాంచఁగలరు. ఇందు మీలో నెవ్వరికేది యిష్టమో యెఱింగింపవలయునని చెప్పెను. అప్పుడు జ్యేష్ఠభార్య యేకపుత్రుని, ద్వితీయభార్య షష్టిసహస్రపుత్రులను వాంఛించెను. "తథాస్తు" అని యౌర్వుండు వారి ననుగ్రహించి వెడలిపోయెను.

అనంతరము కేశిని సగరునివలనఁ బంచజనుం డనునేకపుత్త్రిం బడసెను. రెండవయామె యొకతుంబీఫలమును బ్రసవించెను. ఆ తుంబీఫలమును బీజపూర్ణం బై యుండెను. వానియందుఁ దిలాకారం బున షష్టిసహస్రగర్భంబులు విలసిల్లి యుండెను. అవి యథాక్రమం బుగ, యథాకాలంబున నొక్కొక్కపుత్త్రిం బ్రసవింపఁదొడంగెను.

ఱుకుమారులను బెంచుటకై ప్రత్యేకముగ నొక్కొక్కదాది నియమింపఁబడియెను. ఈసమస్తపుత్రులను గాంచినసగరుని యానందమున కవధి లేకుండెను. అలాబూగర్భమునుండి యీవిధముగా సగరున కఱువదివేలమంది తనయులు గలిగిరి.

కపిలరూపధరుండగు నారాయణునితేజమునందు మహాత్ముండగు సగరునిసంతానం బంతయు విలీనంబగుటయుఁ గేశినితనయుండగు పంచజనుండు రాజయ్యెను. ఆతనికి వీర్యవంతుం డగునంశుమంతుండును ఆతనికి దిలీపుండును బుట్టిరి. ఆదిలీపునకు ఖట్వాంగనామము గలిగెను. ఆతఁడు స్వర్గమునుండి మరల భూతలంబునకు వచ్చి ముహూర్తమాత్రము జీవితముం గాంచి బుద్ధిబలంబుచేతను, సత్యబలంబుచేతను మూఁడులోకంబుల నభిసంధితంబులం గావించెను. ఆదిలీపునకు మహారాజగు భగీరథుండుదయించెను. అమ్మహాత్ముండు స్వర్గమునుండి గంగను భూమికిం దెచ్చి సముద్రునితోఁ గలిపి యాగంగాదేవిని దనతనయగాఁ జేసికొనియెను. ఆకారణంబుచేతనే గంగకు భాగీరథీనామంబు గలిగెను.

ఆభగీరథునకు శ్రుతుండును, అమ్మహారాజునకు నాభాగుండును, ఆతని కంబరీషుండును, ఆతనికి సింధుద్వీపుండును, ఆతనికి వీర్యవంతుం డగునయుతాజితుండును, ఆతనికి ఋతుపర్ణుండును బుట్టిరి. ఆతఁడు దివ్యం బగునక్షహృదయంబు నెఱింగి నలసార్వభౌమునకు సఖుం డయ్యెను. ఆఋతుపర్ణునకు యశస్వి యగు, ఆర్తపర్ణుండును, ఆతనికి సుదాసుండును జనించిరి. ఆసుదాసుం డింద్రసఖుం డయ్యెను. ఆతనిపుత్త్రుం డగుసౌదాసుండు కల్మాషపాదనామంబున విఖ్యాతుం డయ్యెను. ఆకల్మాషపాదునకు సర్వకర్ముండును, ఆతని కనరణ్యుండును, ఆతనికి నిఘ్నుండును, ఆతని కనమిత్రుండును, రఘుండు నను నిరువురుపుత్త్రులును గలిగిరి. ఆయిరువురును మహీపతులయం దగ్రగణ్యులైరి.

అనమిత్రునకు విద్వాంసుం డగుదులిదుహుండు పుట్టెను. ఆతని సుతుండు దిలీపుఁడు. ఆదిలీపుఁడే శ్రీరామచంద్రునిపితామహుఁడు. ఆతనికి మహాబాహుం డగురఘుండుపుట్టి యయోధ్యాధిపతియయ్యెను. ఆతని కజుండును, ఆతనికి దశరథుండును, ఆతనికి ధర్మాత్ముండును, కీర్తిమంతుండు నగుశ్రీరామచంద్రుండును బుట్టిరి. శ్రీరామునకు విఖ్యాతుం డగుకుశుండును, ఆతనికతిథియు, ఆతనికి నిషధుండును, ఆతనికి నలుండును, ఆతనికి నభుండును, ఆతనికిఁ బుండరీకుండును, ఆతనికి క్షేమధన్వుండును, ఆతనికి దేవానీకుండును, ఆతని కహీనగుండును, ఆతనికి సుధన్వుండును, ఆతనికి శలుండును, ఆతనికి ఉక్థుండును, ఆతనికి వజ్రనాభుండును, ఆతనికి నలుండును గలిగిరి.

పురాణప్రస్తావమునందు నలనామంబున నిరువురురాజులువిఖ్యాతులై యుండిరి. అందొకఁడిప్పుడు పేర్కొనఁబడిన యిక్ష్వాకువంశధరుం డగు నలుండును, రెండవవాఁడు వీరసేనతనయుం డగునలుండు నై యుండిరి. నేనిప్పుడు ముఖ్యముగా నిక్ష్వాకువంశీయులను సవిస్తరంబుగా వర్ణించి చెప్పితిని. భూరితేజులగునీసకలభూపాలురును సూర్యవంశోత్పన్నులై యుండిరి. మునీంద్రులారా! వివస్వంతుఁడు, ఆదిత్యుఁడు, ప్రజాపతి, శ్రాద్ధదేవుఁడు మొదలగువారి సృష్టిచరిత్రమును బఠించువాడు ప్రజావంతులై యంతంబున సూర్యలోకవాసు లగుదురు.

## సోమోత్పత్తికథనము.

లోమహర్షణుం డిట్లనియెను. ద్విజవరులారా! భగవానుం డగువత్రిమహాముని సోమునకు జనకుఁడు. పూర్వము బ్రహ్మదేవుండు సృష్టిగావింప నుత్సుకుండై నప్పు డాతనిమానసమునుండి యత్రిమునీంద్రుం డుదయించెను. ఆతఁడు మహాతపంబు గావించెను. తపఃప్రభా

వసంపన్నుం డగునాతనిచేత మూర్ధ్వగతంబయ్యెను. అదియే సోమత్వముం గాంచెను. అమ్మునీంద్రునినయనయుగళమునుండి దశదిశలను వెలింగించుచుఁ దేజము వినిర్గతం బగుటయు విధివిధానంబుచే దశదిక్కాంతలు నా తేజమును గర్భమునందు ధరించిరి. ఆదిద్దేవత లందఱును గలసియే యాగర్భమును ధరించిరి, గాని చాలకాలమా తేజమును దాల్పఁజాలకపోయిరి. ఇఁక భరింపఁజాలమని తోఁచినప్పుడు వారాగర్భమును బరిత్యజించుటయు నది భూపతితంబై దానినుండి సోముం డావిర్భూతుం డయ్యెను.

అది యంతయుం గాంచి లోకపితామహుం డగుబ్రహ్మదేవుండు జగద్ధితంబునకై యాసోముని దనరథంబు నధిరోహింపఁజేసికొనియెను. అత్రినందనుం డగుసోమదేవుండు భూపతితుం డైనంతనే దేవగణంబులును, బ్రహ్మపుత్త్రగణంబులును, మునిగణంబులును నాతని స్తుతింపం దొడంగిరి. అట్లు సంస్తూయమానుం డగు నాసోముని తేజము లోకాహ్లాదకరంబుగా సర్వత్ర వ్యాపింపఁదొడంగెను. యశస్వి యగు నాసోమదేవుండు బ్రహ్మరథారోహణంబు గావించి యిరువదియొక్క పర్యాయము సాగరవలయితం బగువసుంధరామండలము నంతను బ్రదక్షిణంబు గావించెను. క్షరితం బగునాతని తేజము భూపతితం బగుట వలన భూమియందు సకలౌషధులును జనించెను. ఆయోషధులే యీ జగంబునకంతకు నాధారంబు లయ్యెను.

భగవానుం డగుసోముండు మహర్షిస్తోత్రంబులవలనను, లోకహితకరకర్మంబులవలనను దేజోలాభంబు గాంచి శతపద్మవత్సరంబులు మహాతపంబు గావించెను. అనంతరము బ్రహ్మజ్ఞుం డగుపితామహుం డాతనికి రాజ్యదానంబు గావించెను. అప్పటినుండియు నాతఁడు సకల బీజంబులకును, ఓషధులకును, సముద్రంబులకు నధీశుం డయ్యెను.

అతిలోకసుందరుండగుసోముం డట్లు మహారాజ్యప్రాప్తుండై శతసహస్ర దక్షిణాన్వితం బగురాజసూయయజ్ఞముం గావించెను. ఆయజ్ఞంబునం దనేకబ్రహ్మర్షులు సదస్యులై యుండిరి. సోమదేవుండు వారికిఁ ద్రిభువనంబులను దక్షిణగా సమర్పించెను.

స్వయముగా హిరణ్యగర్భుండగుబ్రహ్మయు, నత్రిమునీంద్రుండును, భృగుండును మొదలగువా రయ్యజ్ఞమునందు ఋత్విక్కులై యుండిరి. మునిగణపరివృతుం డగుసాక్షాద్విష్ణుదేవుం డందు సదస్యుఁడై యుండెను. సోమదేవుండు బహుమునిగణపరివృతుండై విరాజిల్లుచుండెను. సిని, కుహూ, ద్యుతి, పుష్టి, ప్రభ, వసు, కీర్తి, ధృతి, లక్ష్మి యను నీతొమ్మండ్రుదేవీమూర్తులును నాతని సేవించుచుండిరి. ఇట్లు యజ్ఞంబు సర్వసంపన్నం బగుటయు నాతఁడు నిఖిలదేవర్షిగణసన్మానితుండై తనప్రభావమును దశదిశల వ్యాపింపఁ జేయుచు మహారాజాధిరాజుం బోలి విరాజిల్లుచుండెను.

క్రమముగా సోమదేవుం డసాధారణం బగునైశ్వర్యమున కధినాథుం డయ్యెను. మహర్షు లందఱు నాతని నాదరించుచుండిరి. ఐశ్వర్యాధిక్యముచే నాతనిమనంబు భ్రమించుటయు నాతఁడు వినయవిచ్యుతుం డయ్యెను. సోముం డిట్లైశ్వర్యమందు విమోహితుండై బృహస్పతిదార యగుతార నపహరించెను. సోమునిచే బృహస్పతి యవమానితుం డగుటం గాంచి సకలదేవతలును, ఋషులును గూడి యెట్లయినఁ దారాదేవిని మరల బృహస్పతికి సమర్పింపవలయు నని యనేకవిధంబుల సోమదేవునకు బోధించిరి. కాని యాతఁ డెంతమాత్రము నంగీకరింపలేదు.

ఆసందర్భమునందు శుక్రుఁడు చంద్రునిపక్షంబును, అజగవధనుర్ధారియైరుద్రుండు బృహస్పతిపక్షంబును వహించి యుండిరి. అప్పు

డు యుద్ధారంభ మగుటయు మహోత్కృం డగుశుక్రుండు దేవగణంబులపై బ్రహ్మశిరోనామకాస్త్రమును బ్రయోగించెను. అమ్మహాస్త్రప్రతాపముచే దేవగణంబులు విలుప్తయశులై పోయిరి. లోకక్షయకరంబగునా దేవదానవభీషణసంగ్రామ మప్పుడు తారకామయనామంబున విఖ్యాతం బయ్యెను. అంత వసిష్ఠుండును, సకలదేవతలును బ్రాహ్మణులును బ్రహ్మపాలికిం బోయి శరణార్థులగుటయు వనజాసనుండు దయాళుండై రణరంగంబున కేతెంచి శుక్రశంకరులమహాటోపంబును వారించి చంద్రునికడనున్నతారను మరల బృహస్పతి కర్పించునట్లొగావించెను.

బృహస్పతియు నప్పటికిఁ దార యంతస్సత్వయై యుండుటం గాంచి క్రోధావిష్టుండై యీగర్భంబు పరిత్యాజ్యంబని యుగ్గడించుటయుఁ దారాదేవి యప్పు డొకయిషీకస్తంబంబుచాటునకుంబోయి గర్భమోచనంబుగావించుకొనియెను. ఆగర్భమునుండి మహాప్రభాసంపన్నుం డగునొకకుమారుండుదయించెను. పుట్టినప్పుడే యాతనిరూపము దేవతాసౌందర్యమును దిరస్కరించుచుండెను.

అప్పుడు సకలదేవతలును సంశయాపన్నులై యీపుత్రుఁడు సోమునివలనఁ గలిగెనో, బృహస్పతివలనఁగలిగెనో సత్యము చెప్పవలయునని తారంగూర్చి పలుమాఱు ప్రశ్నించిరి. తారయు సిగ్గుచే నెట్టిప్రత్యుత్తరము నీయకుండుటంగాంచి జనించినయక్కుమారుండును దల్లినసేకవిధంబులఁ దిట్టుచు సత్యము చెప్పవలయునని పీడింప నారంభించెను. బ్రహ్మదేవుం డప్పు డక్కుమారుని వారించి స్వయముగాఁ దారచెంతకుం బోయి సత్యము చెప్పవలయునని యడిగెను. బ్రహ్మదేవునకుఁ గృతాంజలియై తారయు యస్పష్టస్వరంబున వ్రీడాగద్గదకంఠముతో నీతఁడు సోమపుత్రుఁడే యని సత్యముం జెప్పివైచెను.

ఆమాట విన్నంతనే ప్రజాపతి యగుసోముం డాబాలకుని మూ
ర్ధాఘ్రాణంబు గావించి యాతనికి బుధుండనునామకరణముం గావించె
ను. ఆబుధుండు ప్రతికూలభావముతో గగనము నధిష్ఠించి యుండె
ను. ఆతనివలన రాజపుత్రియగునిలాదేవి మహాతేజుం డగుపురూరవుం
డనుతనయుం గాంచెను. ఆపురూరవున కూర్వశీగర్భంబున నేడ్వురుపు
త్త్రులు గలిగిరి. వారందఱును మహాత్ములై యుండిరి. ఇది సోమోత్ప
త్తి చరిత్రము. ఇంక సోమవంశముం గూర్చి సవిస్తరంబుగఁ జెప్పెద
ను. ఈసోమోత్పత్తిం గూర్చి వినువారు సకలసంకల్పసంసిద్ధులై యా
యురారోగ్యైశ్వర్యసంపన్నులగుదురు. మఱియు సత్పుణ్యాత్ములు
సకలపాపవిముక్తు లగుదురు.

## —♦ చంద్రవంశవర్ణనము. ♦—

మునివరేణ్యులారా! ఆబుధునకుఁ దేజస్వియు, దానశీలుండు
ను, బ్రహ్మవాదియు, యజ్వయు, బహుదక్షిణాప్రదాతయు నగుపు
రూరవుండు పుట్టెను. పరాక్రమవంతుం డగునాతఁడు శత్రుమర్దనుం
డును, అగ్నిహోత్రియు, సత్యవాదియు, పుణ్యమతియు నై యుండెను.
ఆతనికి సమాను లగుయశస్వులు త్రిభువనములయందు నెవ్వరును లే
కుండిరి. కీర్తిమతి యగునూర్వశి తననాకలోకగౌరవమును విడిచి ధర్మ
జ్ఞుం డగునాపురూరవుని వరించెను. మహారాజగు పురూరవుండును
గ్రమముగాఁ బది, ఐదు, ఆఱు, ఐదు, ఏడు, ఎనిమిది, పది, ఆఱుసం
వత్సరము లయ్యూర్వశితోఁ గలసి చైత్రరథవనంబునను, మందాకినీ
తటంబునను, అలకాపురంబునను, విశాలానగరంబునను, నందనకాన
నంబునను, మనోహరఫలద్రుమశోభితంబులగు నుత్తరకురుదేశంబుల
ను, గంధమాదనశైలంబునను, ఉత్తరమేరుపృష్ఠంబునను మహానంద

సుతో యథేచ్ఛావిహారము గావించెను. మహర్షులచేఁ బ్రశంసితం బును, పుణ్యతమంబు నగుప్రయాగభూమి యాతనిరాజధానియై యుం డెను. చక్రవర్తి యగుపురూరవుండు ప్రయాగయందుండి రాజ్యశాస నము గావించుచుండెను. ఇలానందనుం డగుపురూరవుం డిట్లు ప్రభావ సంపన్నుఁడు.

ఆయూర్వశియందుఁ బురూరవునకు దేవకుమారతుల్యు లగు ఆయువు, అమావసువు, విశ్వావసువు, శ్రుతాయువు, దృఢాయువు, వనాయువు, బహ్వాయువు నను నేడ్వురుపుత్త్రులు గలిగిరి. అం దమా వసువునకు రాజాధిరాజగు భీముండును, అతనికి శ్రీమంతుం డగు కాం చనప్రభుండును, ఆతనికి మహాబలశాలియు, విద్వాంసుండు నగు సుహోత్రుండును, ఆతనికిఁ గేశిని యనుపత్నియందు జహ్నుండును బుట్టిరి. ఆజహ్నుండు సర్వమేధం బనునొక మహాయజ్ఞముం గావిం చుటకుఁ బ్రారంభించెను. గంగాదేవి యాతని భర్తగా వరించుటకై వచ్చుటయు నాతఁ డందుల కంగీకరింపఁడయ్యెను.

అప్పుడాగంగాదేవి యాతనియజ్ఞభూమినంతను జలప్లావితంబు గావించెను. అంత జహ్నుండు క్రోధోద్రిక్తుండై యోగంగా! నేని ప్పుడు నీసమస్తజలంబును పానముచేసివైచెదను. అందుచే నీసకలప్ర యత్నములును విఫలములై పోవును. నీయుద్ధతస్వభావమునకుఁ దగిన ఫలంబు ననుభవింపఁగలవు. అని గద్దించి పలుకుచు నమ్మహారాజు గంగాజలము నంతను పానము చేయఁదొడంగెను. అది యంతయుం గాంచి మహర్షు లందఱును గంగాదేవిని జహ్నునకు దుహితృరూపం బున నుపనీతం గావించిరి. అప్పటినుండియు గంగకు జాహ్నవీనామం బు గలిగెను.

జహ్నుండు యువనాశ్వనందన యగుకావేరిని పెండ్లియాడెను.

ఆకావేరి యువనాశ్వశాపముచే గంగార్థభాగమునుండి వినిర్గతం బయ్యె ను. అనిందితయు, జహ్నుపత్నియు నగుకావేరి సరిద్వర యని విఖ్యా తిం గాంచెను. జహ్నుండు గావేరియందు సునద్యుండను పుత్త్రుం గనియెను. ధార్మిం డగు నాతనికి అజకుండును, అతనికి మృగయాస క్తుం డగుబలాకాశ్వుండును, అతనికిఁ గుశుండును జనించిరి. కుశునకుఁ గుశికుండును, కుశనాభుండును, కుశాశ్వుండును, మూర్తిమంతుండు ననునలువురుతనయులు పుట్టిరి.

## —• గాధిరాజచరిత్రము. •—

అందు కుశికుండు రాజయ్యును నిరంతరమును వల్లవగణసహి తంబుగ వనచరుండై యింద్రతుల్యుం డగుతనయుం బడయవలయు నని తపంబు గావింపఁదొడంగెను. అతనితపంబువలన మహేంద్రునకు మహాభయంబు గలిగెను. అట్లాతఁ డతితీవ్రంబుగ మహాతపంబు గా వించుచుండుటయు నెట్లయిన నాతనికోరిక సిద్ధింపకమాన దని తలంచి సహస్రాక్షుం డగుపురందరుఁడే స్వయముగ నక్కుశికునకుఁ బుత్త్రుం డై యావిర్భవించి గాధిరాజనామంబున విఖ్యాతుం డయ్యెను. కుశి కునిభార్య కుత్స- ఆమెయే గాధిరాజుజనని.

గాధిరాజునకు మహాభాగ్యవతి యగుసత్యవతి యనునొకతనయ జనించెను. ఆమె నాతఁడు కావ్యనందనుఁ డగుఋచీకున కిచ్చి పెండ్లి చేసెను. భృగునందనుం డగుఋచీకుం డాసత్యవతియెడల నతిప్రీతి మంతుండై యుండెను. అతఁడు తనకును, దనమామయగు గాధిరా జునకును బుత్త్రసంతానము లభించుటకై యొకచరువును సిద్ధముచేసి రెండుభాగములుగఁ జేసి తనభార్య యగుసత్యవతిం బిలిచి « దీనిని నీవును, నీజననియు భుజింపుఁడు. ఈభాగము భుజించుటవలన నీజననికి

క్షత్త్రియశ్రేష్ఠుండును, దీప్తిమంతుండు నగుసుతుం డుదయించును. మఱియు నీ రెండవభాగమును భుజించుటచే నీకు ధృతిమంతుండును, దపోధనుండును, శాంతుండు నగునందనుండు జనించును. ఆపుత్త్రుండు ద్విజగణంబులలోఁ బ్రధానుం డగును." అని చెప్పి యాతఁడు తపశ్చరణంబునకై యరణ్యమునకుం బోయెను.

కొంతకాలమునకు గాధిరాజు పత్నీసహితుండై తీర్థయాత్ర గావించుచుఁ బుత్త్రికాసందర్శనార్థమై ఋచీకాశ్రమంబునకు వచ్చెను. అప్పుడు సత్యవతి పతియొసగినచరువును దెచ్చి తనతల్లికి సమర్పించెను. విధివశంబున నామె యాచరుభాగద్వయమును దుల్యంబనియే తలంచి పుత్త్రికాభాగమును దాను గ్రహించి తనభాగమును బుత్త్రికకిచ్చెను. కాలక్రమంబున సత్యవతీదేవి క్షత్త్రియాంతకం బగుగర్భముం దాల్చెను. క్రమముగా నామెదేహకాంతి ప్రదీప్తం బగుచు నాకార మతి భీషణం బగుచుండెను. ఋచీకుం డదియంతయును దివ్యదృష్టివలన గ్రహించి వరవర్ణిని యగుభార్యం గాంచి యోభద్రా! నీవు నీజననిచే వంచింపఁబడితివి. చరుభాగములు వ్యత్యస్తము లై పోయినవి. అందుచే నీకుఁ గ్రూరకర్ముండును, భయంకరుండు నగుపుత్త్రుండు పుట్టఁగలఁడు. నీజననికిఁ దపోధనుం డగునొకతనయుం డుదయించి యాతఁడు బ్రాహ్మణుం డగును.

అని చెప్పుటయు మహాభాగ్యవతి యగుసత్యవతి తనపతిని బ్రసన్నుం జేసికొని "స్వామీ! మీరు బ్రాహ్మణులు. ఇట్టిమీవలన బ్రాహ్మణాధముండును, దారుణచరిత్రుండు నగుతనయుండు నాగర్భంబున జనించుట యుచితము గాదు" అని ప్రార్థించుటయు ఋచీకుండు ప్రియా! నేనట్లు సంకల్పించి యాచరుభాగములను సమకూర్చితిని. ఇప్పుడు నేనింకొకవిధముగాఁ జేయఁజాలను. ఇది యిట్లుజరుగవలసినదే.

జననీజనకులయుపచారఫలముతో సంతానమునకు సంభవించునుగదా!

అనుటయు సత్యవతీదేవి మునికులతిలకా! మీరు తలంచినచో నీవిశ్వమంతను సృజింపఁగలరు. ఇట్టిమీకొక్క పుత్త్రసంతానమును సృష్టించుట యసాధ్యమగునా? కావున మీరు నాయందనుగ్రహించి సరళస్వభావుఁడును, శాంతగుణప్రధానుఁడు నగునొకపుత్త్రుని నాకుఁ బ్రసాదింపవలయును. కేవలదారుణస్వభావుఁడే నాతనయుఁడై జనించుట తప్పదంటిరేని స్వామీ! నాప్రార్థనమును మన్నించి నాపుత్త్రుండుగాక, పౌత్త్రుండట్టివాఁ డగునట్లయిన ననుగ్రహింపుఁడని ప్రార్థించెను. అంతఋచీకుండు ప్రసన్నుండై తనతపోబలంబుచే భార్యకోరిక సిద్ధించునట్లు వరంబిచ్చి "ప్రేయసీ! పుత్త్రపౌత్త్రుల కెట్టిభేదంబును లేదుగావున నీవు కోరినరీతిని నీపౌత్త్రుఁడే యట్టివాఁడు గాఁగలఁడు" అనియెను.

అనంతరము సత్యవతీదేవి శమదమాదిసద్గుణసంపన్నుండును, మహాతపస్వియు నగు నొకపుత్త్రుని గాంచెను. ఆతనిపేరు భార్గవజమదగ్ని. పుణ్యవతియు, నిత్యధర్మనిరతయు నగుసత్యవతీదేవి కౌశికియను మహానదియై ప్రఖ్యాతిం గాంచెను. అది యిప్పటికిని బ్రవహించుచున్నది.

ఇక్ష్వాకువంశజుం డగురేణుండనునొకరాజు గలఁడు. ఆతనికి రేణుక యనుభాగ్యవతి యగునొకతనయ యుండెను. తపోవిద్యాసంపన్నుండును, ఋచీకనందనుండు నగుజమదగ్ని యారేణుకను బెండ్లియాడెను. ఆమెయందు జమదగ్నికి దారుణచరిత్రుండగునొకతనయుండు దయించెను. ఆతఁడు సకలవిద్యాప్రపూర్ణుండును, ధనుర్వేదపారదర్శియు, నిఖిలక్షత్త్రియకులసంహారకుండు నయ్యెను. ఆతఁడే ప్రదీప్తపావకప్రతిముం డగుపరశురాముఁడు. సత్యవతికి మఱియు శునశ్శేఫుండను, శునఃపుచ్ఛుండను ననుతనయులు గల్గిరి. కుశికనందనుం డగుగాధి

విశ్వామిత్రుండు పుట్టెను. ఆతఁడు జ్ఞానతపోనిధానుండై బ్రహ్మర్షితుల్యుండై తుదకు బ్రహ్మర్షియయ్యెను. ధర్మాత్ముం డగువిశ్వామిత్రునకు విశ్వరథుం డనునింకొకనామము గలదు. భృగుప్రసాదంబున నాతఁడు గాధివంశధరుండై యుదయించెను.

విశ్వామిత్రునకు దేవరాతుఁడు మొదలగుకొంతమంది పుత్త్రులు జనించిరి. వారందఱును త్రిభువనవిఖ్యాతచరిత్రులే. అందు దేవరాతుఁడు, కతి యనువారు ప్రముఖులు. కతివలననే కాత్యాయనగణంబు పుట్టెను. ఇంతియకాక విశ్వామిత్రునకు శాలవతి యనుభార్యయందు హిరణ్యాక్షుఁడు, రేణుఁడు, రేణుకుఁడు, సంస్కృతి, గాలవుఁడు, ముద్గలుఁడు, మధుచ్ఛందుఁడు, జయుఁడు, అష్టకుఁడు, కచ్ఛపుఁడు, దేవలుఁడు, హారీతుఁడు మొదలగువారు జనించిరి. కౌశికులగు నమ్మహాత్ములగోత్రములయందు పాణినులు, బభ్రవులు, ధ్యానజప్యులు, పార్థివులు, దేవరాతులు, సాలంకాయనులు, వాష్కలులు, లోహితులు, యమదూతలు, కారూశకులు ననువంశములవారు జన్మించిరి. పౌరవుండును, బ్రహ్మర్షియు నగునకౌశికునిసంబంధమువలన నీవంశము బ్రహ్మక్షత్త్రనామంబున విశ్రుతం బయ్యెను.

విశ్వామిత్రునిసంతానమునందు శునశ్శేపుండు జ్యేష్ఠుఁడు. ఆతనికి భృగుధర్మంబును, కౌశికధర్మంబునుగూడఁ బ్రాప్తించెను. ఆశునశ్శేపుండు హరిదశ్వునియజ్ఞంబునఁ బశువుగాఁ జేయఁబడి పిమ్మట దేవతలయనుగ్రహంబుచే మరల విశ్వామిత్రునొద్దకుఁ బంపఁబడియెను. దేవతలచే నిట్లు ప్రసాదింపఁబడినవాఁడు గావున శునశ్శేపున కప్పుడు దేవరాతనామంబు గలిగెను. విశ్వామిత్రునకు దేవరాతాదు లేడ్వురు పుత్త్రులుండిరి. మఱియు నాతనికి దృషద్వతి యనుభార్యయందు, అష్టకుం డనుతనయుఁ డుదయించెను. ఆతనికి లౌహి యనువాఁడు

జనించెను. ఇది జహ్నువంశప్రకారంబు. ఇంక మహాత్ముం డగునా యువువంశముంగూర్చి చెప్పెదను.

—♦ రజిచరిత్రము. ♦—

మునివరేణ్యులారా! ఆయువునకు స్వర్భానుతనయ యగుప్రభాదేవిగర్భమునుండి మహారథులును, మహావీరులును, మహారాజులునగు నహుషుఁడు, వృద్ధశర్మ, రంభుఁడు, రజి, అనేనుఁడు ననునైదుగురుపుత్త్రులు జనించిరి. వీరందఱును త్రిలోకవిఖ్యాతులై యుండిరి. రజిమహారాజునకుఁ బంచశతపుత్త్రులుదయించిరి. విశాలం బగువీరివంశమునకు రాజేయం బగునామము గలిగెను. వీరింగూర్చి మహేంద్రుఁడు గూడ భయపడుచుండెను.

పూర్వకాలంబున నతిదారుణం బగుదేవాసురసంగ్రామము తటస్థించినప్పుడు దేవాసురు లిరుతెగలవారునుగూడఁ బ్రత్యేకముగ బ్రహ్మపాలికిం జోయి మాలో నేపక్షమువారికి విజయముగలుగునో యానతీయవలయు నని ప్రార్థించిరి. అప్పుడు బ్రహ్మదేవుం డిట్లనియెను. రణరంగమునందు రజిమహారాజు ధనుర్ధారియై యెవ్వరిపక్షమున నిలిచి యుద్ధము చేయునో యాపక్షమునకే త్రిలోకవిజయంబు నిశ్చయముగా నగును. రజియున్నచోటనే ధృతి యుండును. ధృతియున్నచోటనే లక్ష్మియుండును. ధృతియు, లక్ష్మియుఁ, గలచోట ధర్మంబును, ధర్మంబున్నచోట నిశ్చయముగా విజయంబును విరాజమానం బగుచుండును.

అని పితామహుండు చెప్పుటయు దేవదానవులు జయాభిలాషులై రజిమహారాజును దమకు సహాయునిగా, జేసికొనవలయు ననుతలంపులతో వెడలిపోయిరి. మహారాజగురజి స్వర్భానుదౌహిత్రుండును,

సుధాంశువంశవివర్ధనుండు నగుటంజేసి యాతఁడు దేవాసురు లిరువురి తోడను సంబంధము గలవాఁడై యుండెను. అందుచే దేవతలును, రాక్షసులునుగూడఁ బ్రహృష్టహృదయులై రజిచెంతకుం బోయి ‹‹నీవు ధనుర్ధారివై మాపక్షమునందుండి యుద్ధము చేయవలయును” అని ప్రత్యేకముగఁ బ్రార్థించిరి.

అప్పుడు రజి యుభయపక్షంబుల వాక్యంబుల నాకర్ణించి స్వార్థసాధనోద్దేశముతోడను, నాత్మయశఃప్రతిష్ఠాపనాభిప్రాయముతోడను ముందుగా దేవతలంగూర్చి యోమహేంద్రా! నేను బలపరాక్రమంబులచే రాక్షసులను బరాజితులం గావించినచో నాకప్పుడు ధర్మానుసారంబుగ నింద్రత్వము లభింపవలసియుండును. అట్లు మీరంగీకరింతురేని నేను మీపక్షమున నిలిచి యుద్ధము చేయుదునని చెప్పెను.

రజి యిట్లు కోరినంతనే దేవతలందఱును బ్రహృష్టహృదయులై సమ్మతించి ‹‹నరనాథా! నీవెట్లుకోరిన నట్లే యగుఁగాత. ఆవిషయంబున మాకెట్టికష్టంబును లేదు.” అని చెప్పిరి. దేవతలయుత్తరంబును విని రజిమహారాజు రాక్షసులంగూర్చికూడ నట్లే ప్రశ్నించెను. కాని దర్పితులగుదానవు లాతఁడు స్వార్థపరుండై యున్నాఁడని తలంచి సాభిమానసంబులగువచనంబులతో ‹‹రాజా! నీయుద్దేశము మాకు సమ్మతంబు గానేరదు. మాకుఁ బ్రహ్లాదుఁడే మహేంద్రుఁడు గావలయును. మేమట్టికోరికతోడనే విజయంబునకుఁ బ్రయత్నించుచున్నారము. ఓభూపాలా! ఇష్టమున్నచో నీవు మాప్రతికూలపక్షముననే నిలిచి యుద్ధము చేయవచ్చును.” అని ప్రత్యుత్తర మిచ్చిరి.

రజిమహారా జట్లే యగుఁగాక యని దానవులను వీడ్కొలిపి సమరవిజయానంతరమునఁ దన్నుస్వర్గనాయకుం గావించునట్లు దేవతలందఱిచే నంగీకరింపఁజేసి దేవతాపక్షమునువహించిరణరంగమున నిందుప్రి

న కఁజేయు లగుదానవులనందఱను నిహతులం గావించి వినష్టం బగు దేవతలవిజయలక్ష్మిని బునరుద్ధారణంబు గావించెను.

అప్పుడు శతక్రతుండు దేవతాసహితుండై నేను రజిపుత్రుండ నని చెప్పుచు రజియొద్దకుం బోయి "తండ్రీ! నీవిప్పుడు నిశ్చయముగా దేవేంద్రుండ వైతివి. ఇంద్రుండ నగునేను నీతనయుండనైతిని. నేను నీకర్మంబులచే విఖ్యాతుండ నయ్యెదను." అని చెప్పుటయు దేవమాయామోహితుం డగురజి యందులకు సమ్మతించెను. అనంతరము కొంతకాలమునకు రాజర్షి యగురజి కాలగతుం డయ్యెను. అప్పుడు రజిపుత్రులేనూర్గురును మహేంద్రపదము నధిష్ఠింపనుద్దేశించి యందఱు నొక్కటిగఁ జేరి స్వర్గరాజ్యము నాక్రమించుకొనిరి. అంతియకాక వారు మర్త్యలోకంబులను వశపఱచుకొని యధికారముం గావించుచుండిరి.

క్రమముగా వారైశ్వర్యమదముచే మోహాచ్ఛన్నులై విషయలంపటులై, యున్మత్తులై, ధర్మజ్ఞానశూన్యులై పోయిరి. దేవబ్రాహ్మణద్వేషంబువలనను, దుర్వృత్తంబువలనను వారిబలపరాక్రమంబులు సర్వంబును నశించిపోయెను. అందుచే వారియైశ్వర్యముగూడఁ దొలఁగిపోయెను. మరల నింద్రుఁడు తనస్వర్గరాజ్యమును, సురగణాధిపత్యమును సంపాదించుకొనియెను. కామక్రోధపరాయణు లగురజినందను లందఱు నింద్రునిచేనిహతులై పోయిరి. ఈవిధముగా శతక్రతునిరాజ్యము విధ్వస్తం బగుటయు, మరలఁ బ్రతిష్ఠితం బగుటయు గలయీచరిత్రమును సవిస్తరముగ నాకర్ణించువారికిని ధరించువారికిని దుర్గతులు గలుగవు.

## దివోదాసచరిత్రము.

లోమహర్షణుం డిట్లనియెను. మునులారా! రంభుం డనపత్యుఁడై పోయెను. ఇఁక అనేనునివంశముం గూర్చి వర్ణించెదను. అనేనునకు

మహాయశస్వియు, మహారాజును, మహాపురుషుండు నగుప్రతిక్షత్రుం డు పుట్టెను. ఆతనికి విఖ్యాతుం డగుసంజయుండును, ఆతనికి జయుండును, ఆతనికి విజయుండును, ఆతనికిఁ గృతియు, ఆతనికి హర్యత్వతుండును, ఆతనికిఁ బ్రతాపవంతుఁడగుసహదేవుండును, ఆతనికిఁ బరమధార్మికుండగు నదీనుండును, ఆతనికి జయత్సేనుండును, ఆతనికి సంస్కృతియు, ఆతనికి ధర్మాత్ముం డగుక్షత్రవృద్ధుండును జనియించిరి. ఆ క్షత్రవృద్ధుండు తనమూలపురుషుం డగునసేనునింబోలి లోకవిఖ్యాతుం డయ్యెను. క్షత్రవృద్ధునకు మహాయశుం డగుసునహోత్రుండును, ఆతనికిఁ బరమధర్మపరాయణులగు కాశుఁడు, శలుఁడు, గృత్సమదుఁడు నను ముగ్గురుతనయు లుదయించిరి.

అందు గృత్సమదునకు శునకుండును, ఆతనికి శౌనకుండును గలిగిరి. శునకునివలననే బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులుత్పన్నులైరి. శలునకు ఆర్ష్టిషేణుండును, ఆతనికిఁ గాశ్యపుండును బుట్టిరి. కాశునకుకాశిపుండును, ఆతనికి దీర్ఘతపుండును బుట్టిరి. ఆతఁడు వృద్ధవయస్కుండై సంతానములేక మహాతపంబు గావించుటయు ధన్వంతరి యాతనికిఁ బుత్త్రుండై జన్మించెను. సర్వరోగవినాశకుం డగునాధన్వంతరిమహారాజు కాశిరాజనామంబున విఖ్యాతుం డయ్యెను. ఆతఁడు భరద్వాజునొద్ద నాయుర్వేదమును జికిత్సాపద్ధతులను నభ్యసించి యావేదము నెనిమిది భాగములుగా విభజించి తనశిష్యపరంపరచేఁ బ్రచారము సేయించెను.

ఆధన్వంతరికి విఖ్యాతుం డగుకేతుమంతుండును, ఆతనికి వీర్యశాలి యగుభీమరథుండును, ఆతనికి దివోదాసుండును జన్మించిరి. దివోదాసుఁడు ప్రఖ్యాతప్రజాపరిపాలకుఁ డయ్యెను. ఆతనికిఁ బరమపవిత్రంబగువారణాసీనగరము రాజధాని యయ్యెను. మహాత్ముండును మతిమంతుండు నగునికుంభుం డొకప్పుడు కాశీనగరము సహస్రవర్షపర్యంత

మును జనశూన్యంబై పోవుఁగాక యనిశపించి యుండెను. అది కార ణంబుగా క్షేమకుం డనురాక్షసుండు వచ్చి కాశీపురంబునమస్తంబును నిర్జనంబుగాఁ జేసినై చెను.

అపురం బట్లు శాపగ్రస్తం బైనకొలఁదికాలమునకే ప్రజాపాల కుండగు దివోదాసు తనరాజధానిని మార్చుకొని గోమతీనదీతీరంబున నూతనముగ నొకసుందరనగరమును నిర్మించుకొని యందుండి రాజ్య పాలనము చేయుచుండెను. పూర్వ మీకాశీరాజ్యము భద్రశ్రేణ్యుని యధికారమునందుండెను. ఆతనికి ధనుష్కాళావిశారదులగునూర్గురు త నయులుండిరి. దివోదాసు వారినందఱను నిహతులం గావించి యా రాజ్యమునాక్రమించుకొనియెను.

ఆభద్రశ్రేణ్యునకు సుప్రసిద్ధుఁ డగుదుర్దముం డనునింకొకపు త్త్రుం డుండెను. అప్పటికి బాలకుండగుటచే నాతని దివోదాసుఁడు నిర్లక్ష్యముగ విడిచినై చెను. కాలక్రమంబున దుర్దముండు హైహయ రాజ్యమును స్థాపించి ప్రభుడై దివోదాసునితో రణంబు గావించి తన పైతృకరాజ్యమును మరల నుద్ధరించుకొనియెను. దుర్దముం డిరీతిగాఁ దనయసాధారణప్రభావముచే నైరనిర్యాతనంబు గావించెను.

ఆదివోదాసునకు దృషద్వతియనుభార్యయందు మహావీరుం డగుప్రతర్దనుండు పుట్టెను. ఆతఁడు చిన్నతనమునందే పైతృకం బగు వినష్టరాజ్యమును బునరుద్ధారణంబు గావించెను. ప్రతర్దనునకు వ త్సుండును, భర్గుండు నను నిరువురుతనయులు గలిగిరి. అందు వత్సున కలర్కుండును, ఆతనికి సన్నతియు, ఆతనికలర్కుండును జనించిరి. అ య్యలర్కుండు సత్యవాదియు, బ్రహ్మజ్ఞానసంపన్నుఁడు నయ్యెను. ఆ తఁ డఱువదియాఱువేలవత్సరములవఱకు సంపూర్ణయౌవనముతోనుం డి యతివిశాలం బగురాజ్యపాలనంబు గావించె ననియు, నాతఁడు లో

పాముదాన్రినుగన్రిహంబున దీర్ఘాయుష్యమును గాంచె ననియుఁ బ్రాచీన రాజర్షులు కీర్తించి యుండిరి. అలర్కుఁడతి లోకరూపయౌవనశాలియై యుండెను. అతనిరాజ్యమపారమైనది. వారణాసీనగరమునకు శాపావసానంబైనంతనే యాతఁడు క్షేమకాసురుని సంహరించి మరల నాపట్టణమును దనరాజధానిగాఁ జేసికొనియెను.

భూపాలుండగుసన్నతికి సునీథుండను నింకొకకుమారుఁడు గలఁడు. ఆతనికి క్షేముండును, ఆతనికిఁ గేతుమంతుఁడును, ఆతనికి ధర్మకేతుండును, ఆతనికి మహారథుండగుసత్యకేతుండును, ఆతనికి విభుండును, ఆతని కొనర్తుండును, ఆతనికి సుకుమారుండును, ఆతనికి ధృష్టకేతుండును, ఆతనికి వేణుహోత్రుండును, ఆతనికి భార్గుండును గలిగిరి. వారందఱును ధర్మనిష్ఠులగుప్రజాపాలకులైరి. వత్సునివలన వత్సభూమియు, భార్గునివలన భార్గభూమియుఁ గలిగెను. అంగిరులు, భార్గవులు కాశ్యపులు నగుబ్రహ్మక్షత్రియవైశ్యగణంబుల విస్తృతవంశంబులం గూర్చి చెప్పితిని. ఇఁక నహుషవంశంబును గీర్తించెదను.

## —♦ యయాతిచరిత్రము. ♦—

నహుషునకుఁ బితృకన్య యగు విరజయందు ఇంద్రోపేంద్రసమానతేజులగు యతి, యయాతి, సంయాతి, ఆయాతి, యాతి, సుయాతి యను నార్గురుతనయులు గలిగిరి. అందు యయాతియే రాజయ్యెను. పరమధార్మికుండగునాతఁడు కకుత్స్థకన్యం బెండ్లియాడెను. యతి మోక్షధర్మంబు నవలంబించి బ్రహ్మస్వరూపుండయ్యెను. ఇతరులగు నైదుగురుసోదరులలోను యయాతియే భూమండలమునంతను జయించెను. అతఁడు శుక్రాచార్యతనయ యగు దేవయానిని వృషపర్వనందన యగు శర్మిష్ఠను బెండ్లియాడెను. యయాతికి దేవయాని

యందు యదుఁడు, తుర్వసుఁడును, శర్మిష్ఠయందు ద్రుహ్యుఁడు, అనువు, పూరుఁడును జన్మించిరి. శుక్రాచార్యుండు ప్రీతుండై యయాతికిఁ బరమదీప్తిమంతంబును, కాంచనమయంబును, దివ్యంబును నగు నొక రథమును బ్రసాదించెను. ఆరథంబు మనోవేగవంతంబు లగు నుత్తమాశ్వంబులచే సంయోజితమై సర్వకార్యజయప్రదమై యుండెను. యయాతి యాస్యందన మధిరోహించి యాఱురాత్రులలో మహీమండలం బంతయు జయించెను. అయ్యరదంబువలననే యయాతి దేవదానవుల కజయ్యుం డయ్యెను. క్రమముగ నారథము కురువంశీయు లెల్లరచేతను నుపయోగింపఁబడుచు వచ్చెను. కౌరవుండును, బరీక్షిన్నందనుండును నగుజనమేజయునియనంతర మీరథము ధీమంతుం డగు గర్గమహామునిశాపమువలన వినష్టంబై తరువాతిరాజుల కనుపయుక్తం బయ్యెను.

జనమేజయుం డొకప్పుడు గర్గమునీంద్రునితనయుండగు నొక బాలుని సంహరించి బ్రహ్మహత్యాన్వితుం డయ్యెను. ఆరాజర్షి సకలాంగకములనుండియు లోహగంధము వినిర్గతం బగుచుండెను. అతని కెందును శాంతి లేకుండెను. పౌరులును జానపదులునుగూడ నాతనిఁ బరిత్యజించిరి. అప్పు డాతఁడు నిష్కృతిం గానక దుఃఖసంతప్తుండై శౌనకమునీంద్రునిశరణంబు గోరుకొనియెను. జ్ఞాని యగు శౌనకుండు ఆతనిఁ బవిత్రునిఁ గావించుటకై యాతనిచే నశ్వమేధంబును జేయించెను. అయ్యాగాంతంబున నమ్మహారాజు శరీరదుర్గంధం బపనీతం బయ్యెను. పూర్వోక్తం బగు నారథము చేదిరాజునకు వశమయ్యెను. ఇంద్రుండు సంతుష్టుండై దాని నాబృహద్రథునకుఁ బ్రసాదించెను. అనంతర మది బార్హద్రథుం డగు జరాసంధునకు వశమయ్యెను. ఆజరాసంధుని వధించి యయ్యుత్తమరథంబును భీమసేనుండు వాసుదే

వునకుఁ బ్రీతిపూర్వకముగా సమర్పించెను.

యయాతిమహారాజు సాగరవలయితంబును, సప్తద్వీపవిలసితంబును నగుపృథ్వీమండలమును జయించి తనరాజ్య మంతయుఁ దనపుత్త్రులకు నైదుభాగములుగా విభజించి యిచ్చెను. అందు జ్యేష్ఠుఁడగు యదునకుఁ బూర్వభాగంబును, పూరునకు మధ్యభాగంబును తుర్వసునకు దక్షిణభాగంబును, ద్రుహ్యునకు నుత్తరభాగంబును, అనువునకుఁ బశ్చిమభాగంబును నిచ్చెను. వారు క్రమముగా నాభూఖండముల ధర్మానుసారముగాఁ బరిపాలించుచు వచ్చిరి. కాలక్రమంబున యయాతి జరాభరాక్రాంతుండై, ధనుర్బాణంబులఁ బరిత్యజించి రాజ్యభారమును బుత్త్రియం దునిచి ప్రీతుండై భూసంచారము సేయఁ దొడంగెను. ఆతఁడు శస్త్రంబులఁ బరిత్యజించినను నపరాజితుండై యుండెను. ఇట్లాతఁడు రాజ్యంబును బుత్త్రులకుఁ బంచిపెట్టి యొకప్పుడు జ్యేష్ఠపుత్రుం డగు యదునిం గాంచి యిట్లనియెను. "కుమారా! నీవు నావృద్ధత్వముం గైకొని నీజవ్వనము నాకిమ్ము. అట్లుచేసినచో నేను యువకుఁడనై యొకకార్యముకొఱకీభూమండలమునఁ జరింతును." అని కోరుటయు యదుండు, "ఓమహారాజా! నే నొకబ్రాహ్మణునకు ననిర్దిష్టమైన భిక్ష నొసగుటకై యాచింపఁబడియుంటిని. యౌవనబలముచేతనే నే నాతనికార్యమును దీర్పవలసియున్నది. అకార్యమును నెఱవేర్చువఱకును నే నీవృద్ధత్వమును దాల్పనోపను. వార్ధకము బహుదోషసంకలితమైనది. పానభోజనాదివ్యాపారములు ముసలితనమునందు ప్రతికూలములై యుండును. కావుననో మహారాజా! నీముసలితనమును గ్రహించుటకు నాకిష్టము గలుగుటలేదు. తండ్రీ! నావంటిప్రియపుత్త్రులు నీకింకను జాలమంది యున్నారు. ధర్మజ్ఞా! వారిలో నెవ్వరినైన నిక్కార్యంబునకు నియోగింపుము."

యదుం డిట్లు పలుకుటయు యయాతి క్రుద్ధుండై తనయునిం దిరస్కరించుచు "ఓరీ! దుర్బుద్ధీ! నేను నీకు గురుండను. నాయెడల నీవజ్ఞుండ వైన, నీకు ధర్మ మన నేమి? మూఢా! నీవు నాయాజ్ఞ నతిక్రమించితివి గావున నీసంతతి కెన్నటికిని రాజ్యలాభంబు లేకుండుం గాక!" అనిశపించెను. పిమ్మట యయాతి క్రమముగా ద్రుహ్యుని, తుర్వసుని, అనువును నిట్లే యర్థించెను గాని వారెవ్వరును నాతనియాజ్ఞను మన్నింపరైరి. క్రోధాన్వితుం డైన యయాతియు వారికి నట్లే శాపంబిచ్చి పురునిచెంతకుం బోయి కుమారా! నీవిచ్చగింతువేని నా వృద్ధత్వమును నీయందుంచి నీయౌవనముం గైకొని తరుణుండనై సమస్తభూసంచారంబును గావింపఁదలంచితిని." అని తండ్రి సెప్పుటయు ప్రతాపవంతుం డగు పురుం డందుల కంగీకరించెను. అప్పుడయ్యయాతి తనయునితారుణ్యంబుం గ్రహించి కామోపభోగంబుల పరమావధిని బొందుటకై సమస్తపృథ్వీమండలంబును సంచరింప నారంభించెను. ఆతఁడు విశ్వాచీసహితుండై చిరకాలంబు చైత్రరథవనంబున విహరించి సమస్తభోగంబులు శేషంబు లేకుండున ట్లనుభవించి క్రమ్మఱఁ బూరునియొద్ద కరుదెంచి తనజరాభరము నెప్పటియట్ల పరిగ్రహించెను. కూర్మంబు తనసకలాంగకంబులం బోలి సకలకామభోగంబులును ప్రత్యాహృతంబులుగాఁ జేసికొన్న యయాతిమహారాజుచే నీక్రిందియర్థము గలగీతము మనోహరంబుగ గానము సేయంబడియెను.

"కామములు భోగములవలన శమింపవు. హవిరాహుతిచే నగ్నిజ్వాలలుంబోలె ననుభూతిచే నది యుత్తరోత్తరాభివృద్ధిం గాంచుచుండును. ఈపృథివియందున్న సమస్త వ్రీహి, యవ, హిరణ్యంబులును, సకలపశుస్త్రీజనంబులును గూడ నొక్కనికి లభించినను సంతతో నతనికి సంతృప్తి గలుగు ననుటయు సందేహము. [illegible],

మనస్సుచేఁగాని, వాక్కుచేఁగాని యెట్టిజీవులయెడలను బాపభావంబు లేకుండువాఁడు బ్రహ్మస్వరూపప్రాప్తుం డగును. ఇతరుల కెంతమాత్రంబును భయంకరుండు గాక యితరులవలన నించుకంతయు భీతిల్లక యిచ్ఛాద్వేషవిరహితుం డగునాతండు బ్రహ్మపదప్రాప్తి కర్హుండగును. దుర్మతులు దేనిని బరిత్యజింపఁజాలరో యాహారము జీర్ణించినను నేది జీర్ణింపదో మానవుల కేది ప్రాణాంతికరోగస్వరూపమై యుండునో యట్టి తృష్ణను ద్యజించువాఁడు నిత్యసుఖుం డగును. జరాభారగ్రస్తునకుఁ గేశములును దంతములును జీర్ణంబు లగును గాని ధనాశయు, జీవితాశయు నెంతటను జీర్ణంబులు గానేరవు. ఈజగంబునందలి సమస్తకామసుఖంబులును, సకలస్వర్గసుఖంబులును గూడఁ దృష్ణాక్షయసుఖంబున షోడశాంశమునైనను బోలఁజాలవు."

అని యిట్లు గానము చేయుచు రాజర్షి యగుయయాతి పత్నీసహితుఁడై వనంబునకుం బోయి బహుకాలంబు దపంబు గావించెను. అనంతరమాతఁడు భృగుతుంగంబున మహాతపంబు చేసి క్రమంబుగ ననశనవ్రతుండై దేహత్యాగం బొనరించి సస్త్రీకుఁడై స్వర్గారోహణముం గావించెను. ఆతనివంశధరు లగునైదుగురురాజర్షులవలనను నాతనివంశము సూర్యతేజముంబోలి జగమంతటను బరివ్యాప్తంబయ్యెను. మహామునులారా! ఇఁక వృష్ణికులధురంధరుం డగునారాయణుం డవతరించిన యదువంశముంగూర్చి చెప్పెద నాకర్ణింపుఁడు. ఈయయాతిచరిత్రము నిత్యము నాకర్ణించువారును, గీర్తించువారునుగూడఁ బరమాయుష్మంతులును, గీర్తిసంపన్నులు నగుదురు.

## —◆ పురువంశవర్ణనము. ◆—

సూతుం డిట్లనియెను. మునిశ్రేష్ఠులారా! మహాత్ముండగు పురునివంశమును సవిస్తరంబుగ వర్ణించెదను. పురునకు సువీరుండు త

నయుం డయ్యెను. సువీరునకు మనస్యుండును, ఆతని కభయదుండు ను, ఆతనికి సుధన్వుండును, ఆతనికి సుబాహుండును, ఆతనికి రౌద్రాశ్వుండును జనించిరి. ఆరౌద్రాశ్వునకు దశార్ణేయుఁడు, కృకణేయుఁడు కక్షేయుఁడు, స్థండిలేయుఁడు, సన్నతేయుఁడు, ఋచేయుఁడు, స్థలేయుఁడు, జలేయుఁడు, ధనేయుఁడు, వనేయుఁడు ననుపదుగురుపుత్త్రులును, భద్ర, శూద్ర, మద్ర, శలద, మలద, ఖలద, నలద, సురస, గోచపల, రత్నకూట యనుపదుగురుపుత్త్రికలును జనించిరి. అత్రివంశంబునఁ బుట్టినప్రభాకరుం డనుమహర్షి యీపదుగురుకన్యలను బెండ్లియాడెను.

అందు భద్ర యనుకన్యకు యశస్వియగుసోముండు సుతుండై యవతరించెను. పూర్వము రాహువుచే నాహతుండై దివాకరుండు స్వర్గపతితుం డైనప్పు డీప్రభాకరమహర్షి తేజముచేతనే జగమంతయుఁ బ్రభామయం బయ్యెను. ఈప్రభాకరుం డట్లుపతితుం డగుచున్నదివాకరునుద్దేశించి « నీకుశుభమగుఁగాక ” యని యాశ్వాసించెను. ఆమ్మునీంద్రుని యమోఘవచనానుసారంబుగా నప్పుడు సూర్యునకు భూపతనదుస్థితి తప్పిపోయెను. అత్రిశ్రేష్ఠుం బగునత్రివంశ మీప్రభాకరమహర్షిమూలముననే పరివర్ధితం బయ్యెను. ఆతనివలననే యత్రిమునీంద్రునకు యజ్ఞంబులయందు దేవతలచే గౌరవము ప్రతిష్ఠితం బయ్యెను. ఆ ప్రభాకరుండు పదుగురుభార్యలవలనను బదుగురుపుత్త్రులం బడసెను. వారందఱును మహాసత్త్వులును, మహాతపోనిరతులును, గోత్రధరులును, ఋషులును, వేదపారగులునై యాత్రేయులను నామంబునఁ బ్రసిద్ధులైరి.

కక్షేయునకు సభానరుఁడు, చాక్షుషుఁడు, పరమన్యుఁడు నను ముగ్గురుపుత్త్రులు పుట్టిరి. అందు సభానరునకుఁ గాలానలుండును,

ఆతనికి ధర్మజ్ఞుం డగుసృంజయుండును, ఆతనికిఁ బురంజయుండును, ఆతనికి జనమేజయుండును, ఆతనికి మహాశాలుండును బుట్టిరి. అమ్మహాశాలుండు సకలదేవతాపరిచితుండును, సుప్రసిద్ధుండు నై యుండెను. ఆతనికిఁ బితృతుల్యుండును, బరమధార్మికుండు నగుమహామనుండు పుత్త్రుం డయ్యెను. మహామనునకు ధర్మజ్ఞులగు ఉశీనరుఁడు, తితిక్షుఁడు నను నిరువురునందను లుదయించిరి. అందు రాజర్షియగునుశీనరునకు నృగ, కృమి, నవ, దర్వ, దృషద్వతి యనునైదుగురుభార్యలుండిరి. వార్ధకమునం దాతం డైదుగురుపత్నులవలనను సంతానముం బడసెను. అందు నృగకు నృగుండును, కృమికి కృమియు, నవకు నవుండును, దర్వకు సువ్రతుండును, దృషద్వతికి శిబియు జన్మించిరి.

అందుశిబికి వృషదర్భుండును, సువీరుండును, కైకేయుండును, మద్రకుండు ననునలువురుతనయులు గలిగిరి. వారు పరిపాలించినజనపదంబులు వారినామంబులచేఁ బ్రసిద్ధంబు లయ్యెను:—ఇఁక తితిక్షు వంశముంగూర్చి వక్కాణించెదను. తితిక్షుఁడు పూర్వదేశమును బరిపాలించెను. ఆతనికి మహావీర్యుం డగు ఉషద్రథుండును, ఆతనికి ఫేనుఁడును, ఆతనికి సుతపుండును, ఆతనికి బలియు జనించిరి. ఆబలి మానవయోనియందుదయించి మహాయోగియు మహారాజు నయ్యెను. ఆతనికి వంశోద్ధారకులగు, అంగుఁడు, వంగుఁడు, సుహ్ముఁడు, పుండ్రుఁడు, కళింగుఁడు ననునేవురుతనయులు గలిగిరి. వారైదుగురును బాలేయుల ను నామముచే విఖ్యాతులైరి. బాలేయనామకులగు బ్రాహ్మణులుగూడ బలివంశీయులుగనే కీర్తింపఁబడుచుండిరి. పూర్వకాలమునందు బ్రహ్మదేవుండు బలితోడలఁ బ్రీతుండై యోబలీ! నీవు మహాయోగి వయ్యెదవు. కల్పాంతపర్యంతమును జీవింపఁగలవు. అతిలోకధర్మతత్త్వజ్ఞానంబును, సంగ్రామవిజయంబును, ధర్మబుద్ధియు, త్రిలోకసంచారం

బును నీకు లభించును. చతుర్విధవర్ణాశ్రమధర్మంబులును నీచేఁ బ్రతిష్ఠితంబు లగును. అని వరంబిచ్చెను. రాజగు బలి యీవిధముగా శాంతిలాభముం గాంచి బహుకాలంబున కాతఁడు స్వర్గారోహణము గావించెను. ఆతనిపంచపుత్త్రులచేఁ బాలింపఁబడిన జనపదంబులు, అంగ, వంగ, సుహ్మ, కళింగ, పుండ్రనామంబులచేఁ బ్రఖ్యాతంబు లయ్యెను.

అంగరాజునకు దధివాహనుండు పుట్టి రాజేంద్రుం డయ్యెను. ఆతనికి దివిరథుండును, అతని కింద్రపరాక్రముం డగుధర్మరథుండును, ఆతనికి చిత్రరథుండును జనించిరి. అచిత్రరథుండు ధర్మానుష్ఠానతత్పరుండై కాలంజరగిరియం దొకమహాయజ్ఞముం గావించెను. అయజ్ఞమునందు మహేంద్రుండు స్వయముగా సోమపానముం గావించెను. చిత్రరథునకు దశరథుండు పుట్టి లోమపాదనామంబునఁ బ్రసిద్ధుం డయ్యెను. ఆతనికి శాంతయను నొకతనయయు, ఋష్యశృంగునను గ్రహంబుచేఁ జతురంగుఁడనుతనయుండును గలిగిరి. ఆచతురంగునకు పృథులాక్షుండును, ఆతనికి మహాయశుం డగుచంపుండును బుట్టెరి. ఆచంపుని పాలనమువలన మాలినీనగరము చంపాపురం బని విఖ్యాతిం గాంచెను. పూర్ణభద్రప్రసాదముచే నాతనికి హర్యంగుం డనుసూనుండు గలిగెను. ఆహర్యంగుండు మంత్రబలంబుచే నైరావతతుల్యం బగునై భాండకం బనునొకయేనుఁగును భూమిపై నవతరింపఁజేసి దానిని దనయుత్తమ వాహనముగాఁ జేసికొనియెను.

ఆహర్యంగునకు భద్రరథుండును, అతనికి బృహత్కర్మండును, ఆతనికి బృహద్దర్భుండును, అతనికి రాజాధిరాజగుబృహన్మనుండును, ఆతనికి జయద్రథుండును, ఆతనికి దృఢరథుండును, ఆతనికి విశ్వజిజ్జయుం డగుజనమేజయుండును, ఆతనికి వైకర్ణుండును, ఆతనికి వికర్ణుం

డును, ఆతనికి వంశోద్ధారకులగునూర్గురుపుత్త్రులును బుట్టిరి. ఇది యంగవంశవిస్తారంబు. ఈవంశమువా రందఱును సత్యవ్రతులును, మహాత్ములును, బుత్త్రవంతులును, మహారథులునై యుండిరి. ఇఁక రౌద్రాశ్వనందనుండగు ఋచేయునివంశముంగూర్చి చెప్పెద నాకర్ణింపుఁడు.

సంయమివరులారా! ఋచేయునకు మతినారుండు పుట్టెను. ఆతనికిఁ బరమధర్మనిరతు లగు వసురోధుఁడు, ప్రతిరథుఁడు, సుబాహుఁడు నను ముగ్గురుపుత్రులుదయించిరి. వీరుముగ్గురును సత్యవాదులు, ధర్మజ్ఞులు, వేదవిదులు, బ్రహ్మపరాయణులు నై యుండిరి. పూర్వము బ్రహ్మవాదిని యగునిలానన్యగూర్చి మీరు వినియుంటిరి. మహారాజసుతంసుఁడా మెను బెండ్లియాడెను. ఆతనికి బ్రహ్మజ్ఞుఁడును, బరాక్రమశాలియు నగుధర్మనేత్రుండుపుట్టెను. ఆతని సుపదాసవి యనుభార్యయందు దుష్మంతుఁడు, సుష్మంతుఁడు, ప్రవీరుఁడు, అనఘుఁడు నను నలుగురునందనులు గలిగిరి. అందు దుష్మంతునకు మహాపరాక్రమధనుండగుభరతుండు పుట్టెను. ఈతఁ డయుతనాగబలుండై సర్వదమనుండనునపరనామముచే విఖ్యాతుండై చక్రవర్తి యయ్యెను. ఈతనిజనని శకుంతల. భరతనామమువలననే భారతనామము ప్రసిద్ధ మయ్యెను. భరతపుత్త్రు లందఱును మాతృకోపముచే నిహతులై పోయిరి. అందుచే నాంగిరసుండగుభరద్వాజుం డాతనిచేఁ బుత్త్రకామేష్టిం జేయించెను. అమ్మఖఫలంబుగా భరతున కొకతనయుండు జనించెను. పూర్వమాతనిసంతానము వితథం బయ్యెనుగావున నిప్పుడకుమారునకు వితథుం డనునామకరణంబు గావించిరి. పుత్త్రోదయానంతరము నఁ గొంతకాలమునకు భరతుండు స్వర్గస్థుండయ్యెను. వితథుండు రాజ్యాభిషిక్తుం డైనవెనుక భరద్వాజుండు నగంబునకుం బోయెను.

ఆవితథునకు యథాక్రమంబుగ సుహోత్రుఁడు, సుహోత,

గయుండును, గర్గుండును, మహాత్ముండగు కపిలుండును ననునైదుగురుపుత్రులు గలిగిరి. వారిలో సుహోత్రునకు మహాసత్త్వులగు కౌశికుండును, గృత్సమతి యనునిద్దఱు నందను లుదయించిరి. అందు గృత్సమతికిం గలిగినపుత్త్రులలోఁ గొందఱు బ్రాహ్మణులును, గొందఱు క్షత్త్రియులును, గొందఱు వైశ్యులు నైరి. కౌశికునకు, కాశేయుండును, ఆతనికి విద్వాంసుఁడగు ధన్వంతరియు, ఆతనికిం బ్రసిద్ధుం డగు కేతుమంతుండును, ఆతనికి భీమరథుండును, ఆతనికి వారణాసీపతియు, సర్వక్షత్త్రవిజయుండు నగుదివోదాసుండును, ఆతనికిం బ్రతర్దనుండును బుట్టిరి. ప్రతర్దనునకు వత్సుండు భార్గవుండు ననునిరువురుసుతు లుదయించిరి. రాజపుత్త్రుం డగునలర్కుండు హైహయరాజ్యమునపహరించెను. భద్రశ్రేణ్యునితనయుం డగుదుర్మదుండు, పూర్వము దివోదాసహృతం బగునైతృకరాజ్యమును మరల సంపాదించెను. దివోదాసుండప్పు డాతని బాలునిగాఁదలంచి యుపేక్షించెను.

భీమరథున కష్టారథుఁ డనునింకొకతనయుండు గలండు. ఈతండు మరల నాదుర్మదునిజయించి తనపగదీర్చుకొనియెను. కాశిరాజగునలర్కుండు బ్రహ్మనిష్ఠుండును, సత్యప్రతిజ్ఞుండు నై యుండెను. అతఁ డఱువదియాఱువేలసంవత్సరములవఱకును యువకుండై కులధురంధరుఁ డయ్యెను. లోపాముద్రానుగ్రహముచే నాతనికి దీర్ఘాయుష్యము లభించెను. వార్ధకమునం దాతండు క్షేమకదానవునిసంహరించి కాశీనగరము నెప్పటియట్లస్థాపించెను. ఆతనికి క్షేమకుండును, ఆతనికి వర్షకేతుండును, ఆతనికి విభుండును, ఆతని కానర్తుండును, ఆతనికి సుకుమారుండును, ఆతనికి సత్యకేతుండును, ఆతనికి వత్సుండును జనించిరి. వత్సునివలన వత్సదేశమును, భార్గవునివలన భర్గదేశమును గలిగెను. పూర్వోక్తసంతానమంతయు నాంగిరసగోత్రసంభూతమైనది. వారందఱును బ్రా

హ్మణులును, క్షత్త్రియులును, వైశ్యులు నైరి.

ఇఁక నజమీఢవంశమును వర్ణించెదను. సుహోత్రునకు బృహత్తనువాఁడు పుట్టెను. ఆతనికి అజమీఢుఁడు, ద్విమీఢుఁడు, పురుమీఢుఁడు ననుముగ్గురుసుతులు జనించిరి. అం దజమీఢునకు నీలి, కేశిని, ధూమిని యనుముప్వురుభార్యలు గలరు. అందు కేశినికి జహ్నుండు పుట్టెను. ఆతఁడు సర్వమేధంబను నొకమహాయజ్ఞముం గావించెను. అప్పుడు గంగాదేవి యాతని బతిగాఁ గోరివచ్చెను. దాని కాతఁ డంగీకరింపకుండుటచే గంగాదేవి యాతనియజ్ఞభూమిని ముంచి వైచెను. అందుచే జహ్నుండు క్రుద్ధుండై గంగం గాంచి నీప్రవాహం బంతయును పానముచేసి వైచెద నని యదలించుచు జలపానము చేయందొడంగెను. మహర్షులందఱు నాతని వారించి గంగ నాతనికి దుహితం గావించిరి. ఆజహ్నుండు యువనాశ్వతనయ యగుకావేరిం బెండ్లియాడెను. ఆతని కజుండును, ఆతనికి బలాకాశ్వుండును, ఆతనికి కుశికుండును జనించిరి. కుశికుఁడు మృగయారతుఁడై వనంబులఁ బరిభ్రమించుచు పస్లానగణంబులతోఁ గూడి యుండెను. ఆతఁ డింద్రతుల్యుం డగుపుత్త్రుం గోరి మహాతపంబు గావించుటయు సంకల్పసిద్ధుండగు నాతని కింద్రుండు స్వయముగాఁ దనయుండై యవతరించెను. ఆతఁడే గాధిరాజు. ఆతనికి విశ్వామిత్త్రుండును, ఆతని కష్టకుండును, ఆతనికి లౌహియు జనించిరి. ఈజహ్నువంశముం గూర్చి యిదివఱకే వర్ణించితిని.

అజమీఢునకు నీలి యనుభార్యవలన సుశాంతియు, సుశాంతికి పురుజాతియు, పురుజాతికి బాహ్యాశ్వుండును జనించిరి. ఆతనికి దేవకుమారసదృశు లగు ముద్గలుఁడు, సృంజయుఁడు, బృహదిషుఁడు, యవీనరుఁడు, కృమిలాశ్వుఁడు నను నైదుగురునందను లుదయించిరి. ఈ

నైనమగురిచేతను బాలింపఁబడిన దేశము పాంచాలనామంబునఁ బ్రసిద్ధం బయ్యెను. ముద్గలునకు మహాయశుం డగుమౌద్గల్యుండు పుట్టెను. ఆతని కింద్రసేన యనుభార్యవలన బ్రిధ్నశ్వుండు జనించెను. మహాత్ముం డగుసృంజయునకుఁ బంచజనుండు పుట్టెను. ఆతనికి సోమదత్తుండును, ఆతనికిఁ గీర్తిమంతుఁ డగుసహదేవుండును, ఆతనికిఁ బ్రఖ్యాతుం డగుసోమకుండును జనించిరి. అజమీఢవంశము విలుప్తం బగుట కారంభించినసమయమునం దీసోమకుండు పుట్టెను. ఆతనికి జంతుం డుదయించెను. ఆజంతునకు నూర్గురుపుత్త్రులు గలిగిరి. అందు జ్యేష్ఠుండు పృషతుఁడు. ఆతఁడే ద్రుపదుని జనకుఁడు. అజమీఢవంశజు లగువారందఱును మహాత్ములై యుండిరి.

అజమీఢునిపత్నులలో ధూమిని యనునామె యనపత్యయై సంతానముకొఱకయుతవర్షంబులు కఠోరతపం బొనరించెను. సాధ్వియు, సౌభాగ్యవతియు, సత్కులసంభూతయు నగునామె పుత్త్రార్థమై యనేకవ్రతంబుల నాచరించెను. ఆమె యొకప్పుడు విధివిధానంబున నగ్నియందు హోమంబుసేసి యగ్నిహోత్రశాలయందు కుశశయ్యాశాయినియై యుండఁగా నజమీఢుం డామెం గలిసికొనియెను. ఆసంయోగఫలంబుగా ధూమ్రవర్ణుండును, సుందరుండు నగుబుుక్షుం డనుతనయుండు జన్మించెను. ఆబుుక్షునకు సంవరణుండును, ఆతనికి కురుండును బుట్టిరి. మహారాజగు కురునిచేఁ బ్రయాగనుమించిన పుణ్యస్థానము కురుక్షేత్ర మావిష్కృతం బయ్యెను. అది పరమపవిత్రంబును, బుణ్యాత్ములకు సేవ్యంబును, నతిరమణీయంబు నై యుండెను. కురునివిశాలవంశమువారందఱును, కౌరవులను నామంబుచే విఖ్యాతు లైరి. కురునకు సుధన్వుఁడు, సుధనుఁడు, పరీక్షితుఁడు, అరిమేజయుఁడు ననునలుగురుసుతు లుదయించిరి.

* అందు సుధన్వునకు మతిమంతుం డగు సుహోత్రుండును, ఆతనికి ధర్మకోవిదుం డగుచ్యవనుండును, ఆతనికి కృతయజ్ఞుండును, జన్మించిరి. కృతయజ్ఞుడు పుత్త్రికామేష్టి చేసి యుపరిచరవసుని దనయునిగాఁ బడసెను. అయ్యుపరిచరుండు గిరికవలన నేడ్గురు తనయులం గాంచెను. అందు జ్యేష్ఠుండు మహారథుఁ డగుబృహద్రథుండు. ఆతఁడు మగధాధిపతియై ప్రఖ్యాతుం డయ్యెను. ఆతఁడు జనించినతరువాతనే గిరికగర్భమునుండి ప్రత్యగ్రథుండు, క్రథుండు, శాకలుండు, యదుండు, మత్స్యుండు, కాలి యనునార్గురుతనయు లుదయించిరి. బృహద్రథునకు కుశాగ్రుండును, ఆతనికి ఋషభుండును బుట్టిరి... ... ...

పరీక్షితునకు జనమేజయుండు, శ్రుతసేనుండు, ఉగ్రసేనుండు, భీమసేనుండు ననువారు పుట్టిరి. వీరందఱును భాగ్యవంతులును, బలవంతులునై యుండిరి. జనమేజయునకు సురథుండును, మతిమంతుండును బుట్టిరి. అందు సురథునకు విదూరథుండును, ఆతనికి మహాబలుం డగు ఋక్షుండును జనించిరి. సోమవంశమునం దిరువురుఋక్షులు, నిరువురు పరీక్షితులు, మువ్వురు భీమసేనులు, నిరువురు జనమేజయులును రాజులై యుండిరి. భీమసేనునకుఁ బ్రతీపుఁడు జనించెను. ఆతనికి శంతనుండు, దేవాపి, బాహ్లికుండును గలిగిరి. వారిలో జ్యేష్ఠుఁ డగుశంతనునకుఁ బ్రసిద్ధుం డగుభీష్ముండు పుట్టెను. బాహ్లికునకు సోమదత్తుండు జనించెను. ఆతనికి భూరి, భూరిశ్రవుఁడు, శలుఁడు ననుముగ్గురుసుతు లుదయించిరి. దేవాపి యనువాఁడు దేవతల కుపాధ్యాయుఁడయ్యెను.

మహాత్ముం డగు చ్యవనునకు కృతకుండనుప్రియపుత్త్రుఁ డుదయించెను. కౌరవధురంధరుఁ డగుశంతనుండు మహారాజయ్యెను. లోకవిశ్రుతం బగునాతనివంశము నభివర్ణించెదను. గంగాగర్భంబున

* ఇది యధికపాఠము. కాని బహుగ్రంథసమ్మతమైనది గాదు.

శంతనునకు దేవవ్రతుండను నొకతనయుఁడు గలిగెను. అతఁడు పాండవులకుఁ బితామహుఁడై భీష్మనామమునఁ బ్రఖ్యాతుం డయ్యెను. శంతనునకు కాళి యనుభార్యయందు విచిత్రవీర్యుఁ డనునింకొకతనయుఁడు గలిగెను. అనఘుండును, ధర్మాత్ముఁడు నగువిచిత్రవీర్యుఁడు శంతనున కతిప్రియతముఁడై యుండెను. ఆవిచిత్రవీర్యునిక్షేత్రములందు మహర్షి యగు కృష్ణద్వైపాయనుఁడు ధృతరాష్ట్రుఁడు, పాండుఁడు, విదురుఁడు ననుముువ్వురు తనయులం బుట్టించెను. అందు ధృతరాష్ట్రునకు గాంధారియందు నూర్గురుపుత్రులు గలిగిరి. పాండునకు ధనంజయుండును, అతనికి సౌభద్రుండగు నభిమన్యుండును, అతనికిఁ బరీక్షితుండును జనించిరి. ఆపరీక్షితునకు కాశ్య యనుభార్యయందు చంద్రాపీడుఁడును, సూర్యాపీడుఁడును జనించిరి. అందు చంద్రాపీడునకు ధనుర్ధరులగు నూర్గురునందను లుదయించిరి. పరీక్షిన్నందనుం డగుజనమేజయునివంశము భువనప్రసిద్ధమైనది.

చంద్రాపీడునిశతపుత్రులలోనను జ్యేష్ఠుఁడగుసత్యకర్ణుఁడు హస్తినాపురంబున బహుదక్షిణాన్వితంబగు నొకమహాయజ్ఞముం గావించెను. అతనికిఁ బ్రతాపవంతుఁడగు శ్వేతకర్ణుఁడు పుట్టెను. అతఁడు ధర్మాత్ముఁ డగురాజయ్యెను. తాని పుత్త్రసంతానము లేకుండుటచే రాజ్యమును ద్యజించి యాతఁడు వనంబునకుం బోయెను. సుచారుసందినియు, మహాసాధ్వియు, సౌందర్యవతియు నగు మాలిని యనునామముగల యాతనిభార్య వనంబునకుం బోవు నమ్మహారాజు ననుగమించెను. మార్గమధ్యంబున నాసతీరత్నము గర్భమునుండి సుకుమారుం డగు కుమారుం డొకఁడు జనియించెను. పాంచాలనందన యగు ద్రౌపదివలెనే మహాభాగ్యవతియు, మహాపతివ్రతయు నగు నారాజమహిషి లేకలేక పుట్టిన యాసుత్తురుకందు నచ్చోటనే విడిచిపెట్టి, తనప్రాణే

శ్వేదుఁడెంటి నెఱఁబాయక చనియెను. సుకుమారాకారుఁడగు నక్కుమారుండును సర్వశరీరభాగంబెల్ల మాఱుమ్రోయనట్లు బిగ్గఱఁగ నేడు వందొడంగెను. మహారణ్యమధ్యంబున దిక్కుఁజెయున్న యక్కుమారకునియెడఁ గరుణగొనినవియుంబోలె నాసమయంబున మేఘబృందంబు లాకసంబున నలమికొనియెను. అంతఁ గొంతసేపటికి శ్రవిష్ఠానందనులగు పైప్పలాదియు, కౌశికుండును నచ్చోటికి వచ్చి ఱాళ్లరాయిడిచే విషతంబు లగు పార్శ్వభాగంబులచే శిలాతలంబెల్ల రుధిరమయంబు గావించుచు రోదనముసేయుచున్న యాపసిపాపను గాంచి కరుణార్ద్రహృదయులై సమీపజలంబులచేఁ బ్రక్షాళనంబు గావించిరి. శిలాసంఘర్షణముచే నాతనిపార్శ్వము లజశ్యామలములైపోయెను. ఆకారణముచే నాబాలుఁడు కజపార్శ్వుఁడను నామము గలిగెను. అతఁడు రోమశగృహంబున నిరువురు బ్రాహ్మణులచేఁ బెంపఁబడుచుండెను. రోమకపత్ని యాబాలుని దనపుత్త్రునిగాఁ జేసికొనఁగోరి పెంచుచుండెను. కుమారుండును నామెనే తల్లిగ భావించి యుండెను. కాలక్రమంబున నాతఁడు పెద్దవాఁడై తన్నుఁ బిన్నతనమునఁ బెంచిన బ్రాహ్మణులను దనమంత్రులుగాఁ జేసికొనియెను. అతనిపుత్త్రపౌత్త్రాదులచేఁ గురువంశము విస్తృతంబయ్యెను. సహానుసంధనుండును, ధీమంతుండు నగు యయాతి తనజరాభారమును వహించినపూరునియెడలఁ బ్రీతుండై చంద్రసూర్యగ్రహంబులును, భూమండలమును నిలిచియున్నంతవఱకుఁ గురువంశము సుస్థిరమై యుండుఁగాక యని యాశీర్వదించెను. మహామునులారా! ఇది పురువంశచరిత్రంబు. ఇక, యదు, తుర్వసుప్రభృతివంశంబులఁ దేర్చి యభివర్ణించెదను.

తుర్వసునకు వహ్నియు, అతనికి గోభానుండును, అతని కపరాజితుండగు త్రైశానుండును, అతనికిఁ గరంధముండును, అతనికి మరుత్తు

ను జనించిరి. మరుత్తున కవీక్షితుం డను నపరనామము గలదు. ఆత
నికిఁ బుత్త్రసంతానము లేదు. విపులదక్షిణలతో నాతఁ డనేకయజ్ఞ
ములం గావించెను. అతనికి సంయత యనునొకతనయ యుండెను.
మరుత్తుఁడు యజ్ఞదక్షిణగా నామెను సంవర్తునకు దానము చేసెను.
మరుత్తుఁడు పౌరవుండగు దుష్మంతుని బుత్త్రునిగాఁ గైకొనియెను. ఆ
దుష్మంతునకు కరురోముండును, అతనికాక్రీడుండును, అతనికి పాం
డ్యుఁడు, కేరళుఁడు, కోలుఁడు, చోళుఁడు నను నలువురుతనయులును
బుట్టిరి. మునివరులారా! ద్రుహ్యునకు బభ్రుండును, సేతుండును జనిం
చిరి. సేతున కంగారసేతుఁడు సుతుండై పుట్టి మరుత్పతినామంబునఁ
బ్రసిద్ధుం డయ్యెను. మహారాజగు యువనాశ్వుఁడు పదునాలుగువర్షం
బులును, బదునాలుగుమాసంబులు నాతనితో మహారణంబుగావించి
తుదకాతని నిహతుం గావించెను. అయ్యంగారసేతునకు గాంధారుఁ
డను తనయుఁడు గలఁడు. అతనివలననే గాంధారదేశనామము గలిగె
ను. గాంధారదేశజంబులగు నశ్వంబు లత్యుత్తమంబులు.

అనునకు ధర్ముండును, అతనికి ద్యుతుండును, అతని కనదు
హుండును, అతనికిఁ బ్రచేతుండును, అతనికి సుచేతుండును, గలిగిరి.
యదునకు సహస్రదుఁడు, పయోధుఁడు, క్రోష్ఠు, అనిలుఁడు, అంజి
కుఁడు నను నైదుగురు జనించిరి. అందు సహస్రదునకు హైహయుఁడు,
హయుఁడు, వేణుహయుఁడు నను పరమధార్మికులగుముగ్వురుతనయులు
గలిగిరి. అందు హైహయునకు విఖ్యాతుం డగు ధర్మనేత్రుండును,
అతనికిఁ గర్తయు, అతనికి సాహంజుఁడును జనించిరి. ఆసాహంజునిచే
తనే సాహంజనీపురంబు ప్రతిష్ఠింపఁబడియెను. మాహిష్మంతునితన
యుం డగు భద్రశ్రేణ్యునిం గూర్చి పూర్వము చెప్పియుంటిని. అతనికి
దుర్దముండును, అతనికి ధీమంతుం డగుకనకుండును, అతనికిఁ గృతవీ

ర్యుండు, కృతతేజుఁడు, కృతకర్ముఁడు, కృతాగ్ని యనునలువురుపుత్త్రులును జనించిరి.

## కార్తవీర్యార్జునచరిత్రము.

అందు కృతవీర్యునకు సహస్రబాహుండు సుతుండై యర్జుననామంబునఁ బ్రఖ్యాతుండయ్యెను. ఆతఁడు సప్తద్వీపములందును దనయధికారమును బ్రతిష్ఠించెను. ఆతఁ డేకవీరుఁడై సూర్యకిరణతేజోమయం బగురథమునధిరోహించి పోయి సప్తద్వీపములను జయించెను. ఆకార్తవీర్యార్జునుం డయుతవర్షంబులవఱకును దపంబు చేసి దత్తాత్రేయు నారాధించి యాతనియనుగ్రహంబుచేఁ దనరాజ్యంబున నెవ్వరికి నధర్మచింత లేకుండునట్లును, కలిగినను దననామశ్రవణమాత్రంబున నివృత్తి యగునట్లొకవరంబును, తాను ధర్మబలంబుచే సకలభూమండలమును జయించి ప్రజారంజకముగాఁ బరిపాలించునట్లొకవరంబును, సంగ్రామరంగమునఁ దనచే నెన్నివేలమందిశత్రువులైనను నిహతు లగునట్లొకవరంబును, యుద్ధసన్నద్ధుం డైనంతనే తనకు సహస్రబాహువులు లభించునట్లొకవరంబునుగా నాల్గువరంబులను బడసి సప్తద్వీపములను జయించెను. సరిత్సముద్రశైలనగరంబులలో నాతనికజేయంబగునది యొక్కటియును లేకుండెను. దండప్రభావముచే నాతఁ డీసమస్తమును జయించెను. ఆతఁడు సప్తద్వీపములందును సహస్రాధికదక్షిణలతో నూఱుయజ్ఞములం గావించెను. అందు వేదియూపాదులు కాంచనమయంబులై యుండెను. విమానస్థులగుదేవగంధర్వాప్సరోగణములచే నీసకలయజ్ఞవేదికలు నలంకృతములయ్యెను. ఆతనిమహత్త్వముం గూర్చి విస్మయాపన్నుఁడై విద్వాంసుం డగునారదుం డాతనియజ్ఞశాలయం దీక్రిందిరీతి గానము చేసెను.

"యజ్ఞాచరణమునందును, దానమునందును, తపంబునందును, విక్రమమునందు, శాస్త్రజ్ఞానమునందును కార్తవీర్యార్జునునితో సమానుఁడగు మహారాజెవ్వఁడును లేఁడు. వాగ్మియు, ఖడ్గధారియు, ధనుర్ధరుండును, రథికుండు నగునీతని సప్తద్వీపములందలి ప్రజలును బహుమా సందముతోఁ గాంచుచుందురు. మహామహిముఁడగు నీతనిప్రభావముచే రాజ్యమునం దెవ్వరికిని ధననష్టముగాని, శోకవిభ్రమంబులు గాని లేకుండెను. ఈతఁడు ధర్మానుసారముగాఁ బ్రజలను బాలించుచుండెను. ధనమునకుఁ గాని రత్నాదులకుఁ గాని యాతని కెట్టియభావమును లేదు. ఈచక్రవర్తి సకలసుఖభోగంబుల ననుభవించుచుండెను. మహాయోగి యగునీతఁడు స్వయముగాఁ బశుపాలకుఁడును, క్షేత్రపాలకుఁడును, వర్షంబు గురియించుటను బర్జన్యుండు నై యుండెను. ఈతనిసహస్రబాహులును, జ్యాకిణాంకితములై యుండెను. ఈతఁడు సహస్రబాహుసమన్వితుఁడై సహస్రకిరణుండగు శరత్కాలభాస్కరునిం బోలి విరాజిల్లుచుండెను. మహాప్రభావసంపన్నుం డగునిమ్మహీపతి కర్కోటకనందనాది మహానాగులను జయించి మాహిష్మతీపురంబునఁ బ్రవేశించెను. ఈతఁడు తన బాహుసహస్రముచే సముద్రప్రవాహమును సవిలాసముగ బంధించి విహరించుచుండును. మహారాజగు కార్తవీర్యుఁడు నర్మదానదియందుఁ బ్రవేశించి జలకేళిం గావించుచున్న డవ్వాహిని సహస్రచంచలోర్మిశాలినియై వివిధకుసుమమాలికాభూషితయై శంకితయుం బోలి ప్రవహించుచుండును. అతనిబాహుసహస్రాఘాతంబులచే మహోదధి సంక్షుభితం బగుటయుఁ బాతాళవాసు లగుదానవులు నిశ్చేష్టులై డాఁగుచుందురు. మఱియు సంక్షుభితంబగు సముద్రమునందలి తిమింగిలాదిజలచరంబు లాకులీభూతము లై పోవుచుండును. వాతాఘాతములచే ఫేనరాశి పుంజీభూత మగుచుండును. తరంగ

సంక్షోభముచే జలరాశి యుప్పొంగిపోవుచుండును. అట్లాతఁడు క్షీర సాగరంబునందలి మందరముంబోలి సముద్రజలంబుల విహరించుచుం డును. మరల సముద్రమథనం బగుచున్న దనుశంకచే మహోరగం బులు భయభ్రాంతములై వెడలివచ్చి యమ్మహారాజుం గాంచి తలలు వంచి సాయంసమయమున వాయుభరముచేఁ గంపించు కదళీఖండము లంబోలి యుండును. అతఁడు ధనుర్ధారణంబు గావించి పంచశతంబులు ప్రయోగించినంతమాత్రమున లంకేశ్వరుఁ డగురావణుఁడు విజితుఁడై యాతనిచే బందీకృతుఁ డయ్యెను. మహర్షి యగుపులస్త్యుం డీవృత్తాంత ము నాలకించి యర్జునుని సందర్శించి యాతనిచే రావణుని బంధవిము క్తుం గావించెను. ఆవీరశేఖరునిజ్యాఘోషము కల్పాంతజలదగర్జనము వలెను, భీకరాశనిఘోషమువలెను, నతిభీకరమై యుండును. కాని యెంతవింత! భార్గవమహర్షిపరాక్రమ మెట్టిదియో కాని యమ్మహా రాజుబాహుసహస్రమును గనకతాళవనంబునుంబోలి ఖండించివైచెను. తృషితుం డగునగ్నిదేవుం డొకప్పుడు కార్తవీర్యార్జునునిచెంతకుం బో యి యర్థించుటయు నాతఁడు సప్తద్వీపవిలసితం బగుభూమండలముం తను వైశ్వానరునకు భిక్షారూపమున దానము చేసివైచెను. అప్పు డగ్ని దేవుండు సకలనగరగ్రామంబులను సకలరాజ్యంబులను దహించుటకుఁ బ్రవృత్తుం డయ్యెను. అయ్యగ్నిప్రభావముచే నర్జునునిసమస్తరాజ్యము ను బ్రజ్వలింపఁదొడంగెను. ఆభూపాలునికీర్తిశైలమును, కీర్తిపావన మునుగూడ దగ్ధములై పోయెను. మఱియు వరుణనందనుని రమణీయం బగు శూన్యాశ్రమమునుగూడ నగ్నిదేవుండు భయపడుచునే దగ్ధము గావించెను. మహాప్రభావసంపన్నుఁ డగునమ్మునీంద్రుని వరుణుండు పూర్వకాలంబునఁ బుత్త్రునిగాఁ బడసెను. ఆతనికి వసిష్ఠుఁడు, ఆపవుఁ డునని నామద్వయంబు గలదు. అయ్యాశ్రమంబు దగ్ధం బగుటయు

నాపవుండు క్రుద్ధుండై యర్జును నుద్దేశించి నీవు నాయాశ్రమంబు నగ్నిచే దహింపఁజేసితివి గావున నీదుష్కార్యమునకు ఫలంబుగా నీవు జమదగ్నినందనుం డగు పరశురామునిచే నిహతుండ వయ్యెదవు గాక యని శపించెను."

అరిందముఁడును, ధర్మపరిపాలకుండు నగునాతనికాలమున నెవ్వరికి నెట్టికష్టంబును లేదు. ఆతనిప్రతాపముచే దుర్మార్గుల దుర్వృత్తములు శాంతించుచుండెను. అట్టిమహారాజుగూడ మునిశాపముచే మృత్యుముఖపతితుం డయ్యెను. వరప్రభావముచే నాతనికి నూర్గురుతనయు లుదయించిరి. అందు శూరుఁడు, శూరసేనుఁడు, వృషణుఁడు, మధుపధ్వజుఁడు, జయధ్వజుఁడు నను నైదుగురుమాత్రము జీవించిరి. వారందఱును కృతాస్త్రులును, బలవంతులును, యశస్వులు నై యుండిరి. అందు జయధ్వజుఁ డవంతిదేశమునకు రాజయ్యెను. ఆతనికిఁ దాళధ్వజుఁడను నొకపుత్త్రుఁ డుదయించెను, ఆతనికిఁ దాళజంఘులను నూర్వురుపుత్త్రులు గలిగిరి. మహాత్ములగు హైహయులవంశము వీతిహోత్రులు, సువ్రతులు, భోజులు, అవంతికులు, తౌండికేరులు, తాళజంఘులు, భారతులు, సుజాతులు నను నామంబులచే బహువంశములుగా విభక్తం బయ్యెను. బహుత్వం బగుటచే నావంశచరిత్రము ప్రత్యేకముగ వర్ణింపఁబడలేదు.

వృషప్రభృతు లగు యదువంశీయరాజు లెల్లరును బుణ్యాత్ములై యుండిరి. వృష్ణుఁడు వంశకర్త యయ్యెను. ఆతనికి మధుండు పుట్టెను. మధునకు నూర్గురుపుత్త్రులు గలిగిరి. అందు వృషణుఁడు వంశకర్త యయ్యెను. వృషణునివలన వృష్ణివంశమును, మధునివలన మాధవవంశమును, యదువువలన యాదవవంశమును బ్రసిద్ధం బయ్యెను. వీరందఱును హైహయవంశశాఖలోనివారే.

మహాత్ముండగు కార్తవీర్యుని దివ్యచరిత్రము నిత్యము నెఱిఁ చువారికి ధననాశంబులేకుంటయే గాక నష్టద్రవ్యలాభంబుగలుగును. త్రిలోకవిఖ్యాతపరాక్రములును, స్థావరజంగమాత్మకవిశ్వపరిపాలకులును నగుయయాతిపంచపుత్త్రులవంశమును వర్ణించితిని. వీరిచరిత్రంబుల నాకర్ణించుభూపాలురకు ధర్మార్థసిద్ధి చేకూరును. ఈచరిత్రములను ధారణ గావించువారికీశ్వరుండు ప్రసన్నుండై యాయువు, కీర్తి, సంతానము, ధనము, ఐశ్వర్యమును బ్రసాదించును. ఇఁక యదువంశోద్ధరుండును, యజ్ఞకర్తయు నగుక్రోష్టునివంశము నభివర్ణించెదను. దీని నాకర్ణించుటచే సర్వపాపవినాశం బగును. ఈవంశమునందే వృష్ణికులధురంధరుఁడగువిష్ణుదేవుం డవతరించెను.

## —◆ శ్రీకృష్ణజన్మసంకీర్తనము. ◆—

క్రోష్టునకు గాంధారి, మాద్రి యనునిద్దఱుభార్యలుండిరి. అందు గాంధారికి మహాబలుండగుననమిత్రుండును, మాద్రికి యుధాజిత్తు, దేవమీఢుండు ననునిర్వురుపుత్రులును బుట్టిరి. ఈముప్పురివలననే వృష్ణికులము విస్తరిల్లెను. మాద్రికి మఱియు నులక్షణులగువృష్ణి, అంధకుండు ననువారు పుట్టిరి. అందు వృష్ణికి శ్వఫల్కుండు, చిత్రకుండు ననువారు జనించిరి. ఆశ్వఫల్కుండు నివసించుతావున వ్యాధులుగాని యనావృష్టిభయంబుగాని లేకుండెను. ఒకప్పుడు కాశీరాజ్యంబున మూఁడువర్షము లనావృష్టి వాటిల్లినప్పుడు కాశీరాజు సగౌరవంబుగ నాతని దనరాజ్యమునకుఁ దీసికొనిపోయెను. ఆరాజ్యమున శ్వఫల్కుండు వసించుటచే సువృష్టిలాభంబు గలిగెను. కాశీరాజు శ్వఫల్కునకుఁ దనదుహిత యగుగాందిని నిచ్చి పెండ్లిచేసెను. ఆమె నిత్యము నొక బ్రాహ్మణునకు గోదానము గావించుచుండెను. ఆమెగర్భమునం

దక్రూరుం డుదయించెను. ఆతఁడు దాతయు, యజ్వయు, వీరుండును, శ్రుతవంతుఁడును, అతిథిప్రియుఁడు నై యుండెను.

అంధకున కుపమద్గుఁడు, మద్గుఁడు, మేమదుఁడు, అరిమేజయుఁడు, అవిక్షితుఁడు, ఆక్షేపుఁడు, శత్రుఘ్నుఁడు, అరిమర్దనుఁడు, ధర్మధృక్కు, యతిధర్ముఁడు, ధర్మోక్షుఁడు, అంధకరుఁడు, ఆవహుఁడు, ప్రతివాహుఁడు మొదలగుపుత్త్రులును, సుందరి యనుపుత్త్రికయుఁ గలిగిరి. అక్రూరున కుగ్రసేనయనుభార్యయందు ప్రసేనుఁడు, ఉపదేవుఁడు ననువారు జనించిరి. చిత్రకునకు పృథుఁడు, విపృథుఁడు, అశ్వగ్రీవుఁడు, అశ్వబాహుఁడు, స్వపార్శ్వకుఁడు, గవేషణుఁడు, అరిష్టనేమి, అశ్వుఁడు, సుధర్ముఁడు, ధర్మభృత్తు, సుబాహుఁడు, బహుబాహుఁడు ననుపుత్త్రులును, శ్రవిష్ఠ, శ్రవణ యనుపుత్త్రికలును జనించిరి. దేవమీఢున కసిక్ని యనుభార్యగర్భమున శూరుండుపుట్టెను. ఆతనికి భోజనందినియందు పదుగురునందను లుదయించిరి. అందుమహాభాగుం డగువసుదేవుఁడు జ్యేష్ఠుఁడు. ఆతని కానకదుందుభి యను నింకొకపేరు గలదు. ఆతఁడు జనించునప్పుడు సకలదేవదుందుభులును మ్రోసెను. ఆనకాదివివిధవాద్యంబులచే స్వర్గమునుండి దివ్యమంగళధ్వనులు చెలరేఁగెను. శూరభవనంబున సహస్రపుష్పవర్షంబు గురిసెను. మానవలోకమునందు వసుదేవసమానసుందరుఁడు లేకుండెను. ఆతఁడు చంద్రునివలెఁ గాంతిమంతుఁడై యాహ్లాదకరుఁడై యుండెను. ఆతనితరువాత దేవభాగుఁడు, దేవశ్రవుఁడు, అనాధృష్టి, కనవకుఁడు, వత్సవంతుఁడు, గృంజముఁడు, శ్యాముఁడు, శమీకుఁడు, గండూషుఁడు ననువారొమ్మండుగురు పుట్టిరి. మఱియు పృథుకీర్తి, పృథ, శ్రుతదేవ, శ్రుతశ్రవ, రాజాధిదేవి యను నైదుగురువీరమాతలుదయించిరి. అందు శ్రుతశ్రవకు చేదిరాజగు శిశుపాలుండు పుట్టెను. ఈతఁడే పూర్వజన్మమున హిరణ్యకశిపుఁడు. పృథుకీర్తికి వృద్ధశర్మవలనఁ గరూశాధిపతి యగుదంతవక్త్రుఁడు పుట్టెను.

అతఁడు పృథను దనయగాఁ జేసికొనియెను. ఆమెకు పృథయనియు, కుంతి యనియు ద్వినామములు గలవు.

ఆకుంతిని పాండురాజు పెండ్లియాడెను. ఆకుంతిగర్భమున ధర్మునివలన ధర్మజ్ఞుం డగు యుధిష్ఠిరుండును, వాయుదేవునివలన భీమసేనుండును, మహేంద్రునివలన ధనంజయుండును జనించిరి. ఈజగంబున ధనంజయునివంటి వీరుం డెవ్వఁడును లేకుండెను. అతఁ డింద్రతుల్యపరాక్రముఁడై యుండెను. కనిష్ఠవృష్ణినందనుఁ డగుననమిత్రునకు శినియు, నాతనికి సాత్యకియు, యుయుధానుఁడును జనించిరి. దేవభాగునకు మహాభాగ్యశాలియగునుద్ధవుండు పుట్టెను. ఈతఁడు పరమపండితుఁ డని విఖ్యాతుం డయ్యెను. అనాధృష్టి కశ్మక్యుండు పుట్టెను. శ్రుతదేవునకు శత్రుఘ్నుఁడు పుట్టెను. ఈతఁడే యేకలవ్యుఁడను పేరితో నిషాదులచేఁ బెంపఁబడి వర్ధిల్లెను. ప్రతాపవంతుఁ డగువసుదేవుఁ డపుత్రకుఁ డగువత్సవంతునకుఁ దనతనయుఁ డగుకౌశికుని దత్తునిగాఁ జేసెను. విష్వక్సేనుఁడు గండూషునకుఁ దనసుతులగు చారుదేష్ణుఁడు, సుదేష్ణుఁడు, పాంచాలుఁడు మొదలగువారిని దత్తులుగాఁ జేసెను. అందు కనిష్ఠుఁడు కార్ష్ణేయుఁడు. మహాబాహుఁ డగునాతనివెంట సహస్రవాయసము లనుగమించుచుండును. యుద్ధము సేయుచుండ నాతఁడు రణరంగమును విడుచువాఁడు గాఁడు. కనవకునకు తంత్రిజిత్తు, తంత్రిపాలుఁడు ననునిర్వురుసుతులుదయించిరి. శ్యామునకు శమీకుండు పుట్టి రాజయ్యెను. భోజవంశీయుఁ డను నింద తొలఁగించుకొనుటకై యాతఁడు రాజసూయము గావించెను. అతనికి శత్రుసూదనుం డగు నజాతశత్రుం డుదయించెను.

ఇఁక వసుదేవవంశముం గూర్చి చెప్పెదను. వృష్ణిసంబంధమగు వంశత్రయమును, శాఖాప్రశాఖలచే విస్తరిల్లెను. ఈమహావంశమ్ము

లును బరాక్రమవంతములైనవియే. అందెన్నఁడు ననర్థంబు లేకుండెను. వసుదేవునకు పౌరవి, రోహిణి, మదిర వైశాఖి, భద్ర, సహదేవ, శాంతిదేవ, శ్రీదేవి, దేవరక్షిత, వృకదేవి, ఉపదేవి, దేవకి మొదలుగాగల చతుర్దశప్రధానపత్నులు గలరు. వీరికి సుతనువు బడబ యను నిద్దఱుపరిచారిక లుండిరి. వసుదేవునకు దేవకి యేడవభార్య; బాహ్లీకనందన యగురోహిణి జ్యేష్ఠపత్ని. వసుదేవునకు రోహిణియందు రాముఁడు, శరణ్యుఁడు, శఠుఁడు, దుర్దముఁడు, దమనుఁడు, శుభ్రుఁడు, పిండారకుఁడు, ఉశీకరుఁడు మొదలగుపుత్త్రులును, చిత్ర యనుపుత్త్రికయుఁ గలిగిరి. ఈచిత్రయే తరువాత సుభద్రానామముచే విఖ్యాత యయ్యెను. మఱియు వసుదేవునకు దేవకియందు మహాయశుం డగుశౌరి యుదయించెను., రామునకు రేవతియందు నిశఠుఁ డనుకుమారుఁడు గలిగెను. పార్థునకు సుభద్రయం దభిమన్యుఁ డుద్భవించెను. అక్రూరునకు కాశికన్యయందు సత్యకేతుఁడుపుట్టెను. వసుదేవునిభార్యలలో నేడ్గురు మహాభాగ్యవతులై యుండిరి. అందు శాంతిదేవకు భోజుఁడు, విజయుఁడు నను నిద్దఱుసుతులును, సునామకు వృకదేవుఁడు గదుఁడు ననునిర్వురు తనయులును, వృకదేవి కవగాహుండును జనించిరి.

త్రిగర్తరాజనందన యగుజిజ్ఞాస శిశిరాయణికి భార్య యయ్యెను. ఆరాజునకుఁ బుత్త్రసంతానములేక తనభార్యయందు సంతానము నుత్పాదింపఁజేయుటకై గార్గ్యమునీంద్రుని నియోగించెను. కృష్ణాయసప్రతిముం డగునమ్మునీంద్రుండును బండ్రెండు వత్సరములు దనపౌరుషమును వినియోగించి విఫలుండై కోపాతిరేకంబున నొకగోపకన్యను బరిగ్రహించి ప్రవర్తింప నారంభించెను. ఆమె శూలపాణినియోగంబున గోపభామినియైయున్న యొక యప్సరస్సుందరి. ఆమె గార్గ్యమునికి భార్యయై కాలయవనుండనుపుత్త్రుం గాంచెను. ఆకాలయవనుని

పూర్వాగ్రశరీరము సువృత్తమై యుండెను. సింహపరాక్రముఁ డగునక్ష మారుఁడు జన్మించినదిమొదలుగ నయ్యపుత్రకుండగురాజుచేఁ బెంపఁ బడుచుండెను. క్రమముగా నాతఁడు రాజయ్యెను. ఒకప్పు డాతఁడు నారదుం గాంచి పరాక్రమవంతులగుయోధులంగూర్చి తెలుపవలయు నని ప్రార్థించుటయు నారదుం డాతని కంధకవృష్ణివంశములరాజులం గూర్చి చెప్పెను. అప్పుడు కాలయవనుం డక్షౌహిణీసేనాపరివృతుం డై మథురాభిముఖంబుగ యాత్ర గావించి కృష్ణాంధకవీరులకడకు దూతం బంపించెను.

అప్పు డావీరులందఱును గాలయవనభయంబునఁ గృష్ణునితోఁ గలిసికొని మంత్రాలోచనంబు గావించి యిట్టిసమయమున నగరమును విడిచిపోవుటయే యుత్తమమని నిశ్చయించుకొనిరి. తుద కట్లే జరిగెను. వారందఱును మథురానగరమును విడిచి మహాదేవు నర్చించి ద్వారావతీనగరమునఁ బ్రవేశించి యందు సుఖనివాసముం గావించిరి.— జితేంద్రియుండును, నిశ్చలచిత్తుండునై యీపవిత్రచరిత్రమును బ్రతిపర్వమునందును వినువాఁడును, వినిపించువాఁడును విద్వాంసుఁడై సుఖియై యుండఁగలఁడు.

## వృష్ణివంశనిరూపణము.

క్రోష్టునకు వృజినీవంతుఁ డను నింకొకతనయుఁడు గలఁడు. ఆతనికి స్వాహియు, ఆతనికి ఉషద్గుండును జనించిరి. అయ్యుషద్గుండు పుత్రార్థియై బహుదక్షిణాన్వితంబు లగు ననేకయజ్ఞముల నాచరించి చిత్రరథుం డనునొకతనయుం గాంచెను. సత్కర్మనిరతుం డగునాచిత్రరథునకు శశిబిందుఁడు పుట్టి రాజర్షియై యనేకయజ్ఞములఁ గావించెను. ఆతనికి పృథుశ్రవుండును, ఆతని కంతరుండును, ఆతనికి సుయజ్ఞుండును;

ఆతని కుమారుండును, ఆతని కరిందముం డగు శినేయుండును, ఆతనికి రాజర్షియగుమరుత్తుండును, ఆతనికి కంబళబర్హియు జనించిరి. కంబళబర్హి పుత్త్రకామేష్టి చేసి రుక్మకవచుం డనుతనయుం గాంచెను. ఆతండు రణరంగముల నిశితశరంబులచే శతసహస్రాధికవీరయోధులనిర్జించి విజయలక్ష్మీలాభముం గాంచెను. ఆతనికి పరిజిత్తుండు పుట్టెను. ఆతనికి రుక్మేషుండు, పృథురుక్ముండు, జ్యామఘుండు, పాలితుండు, హరియనునైదుగురుసుతు లుదయించిరి. వీరందఱును మహాపరాక్రమవంతులై యుండిరి. అందు పాలితునకును, హరికిని దండ్రి విదేశరాజ్యముల నొసంగెను. రుక్మేషుండు తనభ్రాతయగుపృథురుక్మునితోఁ గలసి స్వరాజ్యమునం దధికారమును స్థాపించుకొనెను. ఆయన్నదమ్ములిద్దరు నేకమై సోదరుఁడగు జ్యామఘుని రాజ్యమునుండి వెడలఁ గొట్టిరి.

ప్రశాంతచిత్తుఁ డగుజ్యామఘుండు పోయి యొకతపోవనమున నివసించి యుండెను. అచ్చట నాతండు బ్రాహ్మణులచే బోధితుండై శరశరాసనంబులఁ దాల్చి ధ్వజోపేతం బగురథము నధిరోహించి యేకాకియై పోయి నర్మదానదీతీరంబునఁ గల మేకలానగరమును, మృత్తికావతీపురమును వశపఱచుకొని ఋక్షవంతంబను పర్వతమును జయించి శుక్తిమతీనగరమును రాజధానిగాఁ జేసికొని సుఖముగా రాజ్యము చేయుచుండెను. ఆతనిభార్య యగుశైబ్య మహాపతివ్రతయై యుండెను. ఆమె కెట్టిసంతానమును లేకుండెను. జ్యామఘుఁ డొకప్పు డొక యుద్ధమునందు సంపూర్ణవిజయము నంది యొకకన్యకను సంపాదించి భార్యచెంతకు వెంటఁబెట్టుకొనిపోయి సంతృప్తుండై యీబాలిక నీకోడలు గాఁగలదని చెప్పెను. ఆమాట విని రాజమహిషియగు శైబ్య, “నాథా! ఎవరికోడలు?” అని ప్రశ్నించెను. నీకుఁ గుమారుండు

కలిగినచో నీమె యాతనిభార్య యగునని జ్యామఘుఁడు చెప్పెను. ఆకన్య యప్పటినుండి మహాతపంబు గావించుచుండెను. ఇట్లుండ వార్ధకంబున శైబ్య యొకకుమారుం గనియెను. ఆతఁడు విదర్భుం డను నామముచే విఖ్యాతుం డయ్యెను. ఆతఁడు తనతండ్రిచేఁ గొనితేఁబడిన యాకన్యకను పెండ్లియాడి యామెవలన క్రథుఁడు, కౌశికుఁడు నను నిరువురుపుత్త్రులం గాంచెను. వారిరువురును విద్వాంసులును, శూరులును, రణకోవిదులు నై యుండిరి.

విదర్భునకు భీముం డను నింకొకసుతుండు గలఁడు. ఆతనికి కుంతియు, ఆతనికి ధృష్టుఁడు, ఆతనికి ఆవంతుఁడు, దశార్హుఁడు, విహారుఁడు నను ముగ్గురుతనయులును గలిగిరి. అందు దశార్హునకు వ్యోముఁడు, ఆతనికి జీమూతుఁడు, ఆతనికి వికృతి, ఆతనికి భీమరథుఁడు, ఆతనికి నవరథుఁడు, ఆతనికి దశరథుఁడు, ఆతనికి శకుని, ఆతనికి కరంభుఁడు, ఆతనికి దేవరాతుఁడు, ఆతనికి దేవక్షత్రుఁడు, ఆతనికి వృద్ధక్షత్రుఁడు, ఆతనికి దేవకుమారపవిత్రుం డగుమధుండును జనించిరి. ఆమధుండు మధుభాప్తిస్త్రై మధువంశమునకుఁ గర్త యయ్యెను. ఆతనికి వైదర్భి యను భార్యవలన పురుద్వంతుం డను తనయుండును, ఐక్ష్వాకి యనుపత్నివలన సర్వగుణసంపన్నుం డగు సత్వానుండు జనించిరి. ఆతనినుండియే కీర్తిమ్మను లగుసాత్వతు లావిర్భవించిరి. ఇది జ్యామఘవంశవృత్తాంతంబు. దీని నాలించువారు సంతానవంతులును, సుఖవంతులు నగుదురు.

మధుసంభవుం డగుసత్వానునకు కౌసల్య యనుభార్యయందు మహాబలసంపన్నులగు కొందఱుతనయులు గలిగిరి. అందు భాగినుఁడు, భజమానుఁడు, దివ్యుఁడు, దేవావృధుఁడు, అంధకుఁడు, వృష్ణి యనువారు ప్రధానులు. వీరిలో నలుగురివంశము లీపురాణమున వర్ణింపఁ

బడినవి. భజయానునకు బాహ్యక, ఉపబాహ్యక యనునిద్దఱు భార్య గలరు. అందు బాహ్యకకు క్రిమి, క్రమణుఁడు, ధృష్టుఁడు, శూరుఁడు, పురంజయుఁడు ననువారును, ఉపబాహ్యకు అయుతాజిత్తు, సహస్రజిత్తు, శతాజిత్తు, దాసకుఁడు ననువారును జనించిరి. రాజగు దేవావృధుండు సర్వగుణసంపన్నుం డగుపుత్త్రుం గోరి యనేకయజ్ఞములను దపంబులను గావించెను. ఆతఁడు పర్ణాశుండై నదీజలంబులను స్పృశించుచుఁ గొంతకాలము తపంబు చేసెను. నిరంతరసంస్పర్శవశంబున నానదీమతల్లి యాతనియెడల నతిప్రీతయై యాతనికి శుభసంపాదనంబు గావించుటకై యనేకవిధంబుల నాలోచించి యేయుపాయమును నిశ్చయించుకొనఁజాలక పోయెను. ఆతనికి భార్యయై యాతని వలన సత్పుత్త్రునిం బడయఁగలుగునంతటి భాగ్యవతి యగుకన్యక యెవ్వతెయు నవ్వాహినీదేవికి గోచరింపలేదు. అప్పు డాదేవి నేనే యీతనికి భార్య నయ్యెద నని నిశ్చయించుకొని పరమసుందరకుమారీరూపముం దాల్చి యానరనాథునిం జేరి యాతనిఁ బతిగా వరించెను. ఉదారహృదయుం డగు దేవావృధుం డామెను భార్యగాఁ బరిగ్రహించెను. పదిమాసములనాఁటి కామె మహాతేజస్సంపన్నుఁ డగుబభ్రుం డను నొక తనయుం గాంచెను.

పురాణజ్ఞులగువా రీబభ్రువంశముల గూర్చియు, దేవావృధుని గుణములం గూర్చియుఁ బ్రశంసించియుండిరి. "నరశ్రేష్ఠుం డగు దేవావృధునియు, మహాత్ముం డగుబభ్రునియు గుణకీర్తులను దూరము నుండి మేమెట్లు వినియుంటిమో సమీపమునకు వచ్చి యట్లే కనియుంటిమి. వీరివంశమునందు షట్సప్తషష్టిసహస్రపురుషపర్యంతమును అమరత్వప్రాప్తి యయ్యెను. ఈవంశీయులగురాజు లందఱును బుద్ధియందును, ధనుర్విద్యయందును, దానమునందును, యజ్ఞాచరణమునందును,

బ్రహ్మనిష్ఠయనుమను బ్రధానులై యుండిరి—" అంధకునివలన కాశ్య దుహిత కుమారుండు, భజమానుండు శశకుండు, బలబర్హి యను నలుగురుతనయులం గాంచెను. అందు కుకురునకు వృష్టియు, ఆతనికి కపోతముండు, ఆతనికి తివిరి, ఆతనికి పునర్వసుండు, ఆతనికి అభిజిత్తు, ఆతనికి ఆహుకుండు, ఆహుకుండు ననుకవలును జనించిరి. అయ్యాహుకుం డశీతికవచధారియై యుద్ధమునకుఁ బోవుచుండె ననియు, నీతనివంశమున భూరిదాతలు, శతసహస్రపరమాయుష్కులు, విశుద్ధకర్ములు, యజ్వలు గానివారు లేనేలేరనియు, నందఱును బూర్వదిగ్విలసితంబగుభోజరాజ్యము నాక్రమించుటకుఁ బ్రయత్నించువారేయనియు, నందఱును రథగజతురగపదాతిసేనాపరివృతులై యుద్ధయాత్రలంగావించి విజయలక్ష్మీసనాథులైనవారేయనియు, నీవంశమువారిచేతనే భోజరాజులు సింహాసనచ్యుతు లగుచుండి రనియు నభిజ్ఞులు కీర్తించియున్నారు.

అంధకగణంబులు తమసోదరి నవంతీశ్వరునకు సమర్పించి యుండిరి. ఆహుకునకు కాశ్యయనుభార్యయందు దేవకుండు, ఉగ్రసేనుండు ననునిరువురుపుత్త్రులు గలిగిరి. అందు దేవకునకు దేవవానుండు, ఉపదేవుండు, సందేవుండు, దేవరక్షితుండు ననుపుత్త్రులును, దేవకి, శాంతిదేవ, సుదేవ, దేవరక్షిత, వృకదేవి, ఉపదేవి, సునామ యనునేడ్వురుపుత్త్రికలును గలిగిరి. ఆతఁడాపుత్త్రికలను వసుదేవున కిచ్చి పెండ్లిచేసెను. ఉగ్రసేనునకు కంసుండు, న్యగ్రోధుండు, సునాముండు, కంకుండు సుభూమణుండు, రాష్ట్రపాలుండు, సుతనుండు, అనాధృష్టి, పుష్టిమంతుఁడు నను తొమ్మండ్రుపుత్త్రులును, కంస, కంసవతి, సుతను, రాష్ట్రపాలి, వరాంగనయనుకంక యను నైదుగురుతనయలును గలిగిరి. అందఱికంటెను కంసుఁడే జ్యేష్ఠుఁడు. ఉగ్రసేనుఁడు తనసంతతితోఁగూడ కుకురవంశీయుఁ డయ్యెను. ఈకుకురవంశచరిత్రమును స్మరించువాఁడు ప్రజావంతుఁడై వంశవర్ధనుఁ డగును.

## స్యమంతకచరిత్రము.

మునివరులారా! భజమానునకు రథికశ్రేష్ఠుండగు విదూరథుండును, ఆతనికి మహాబలుం డగు రాజాధిదేవ్రుండును జనించిరి. ఆ రాజాధిదేవ్రునకు వీర్యవంతులగు దత్తుండు, అతిదత్తుండు, శోణాశ్వుండు, శ్వేతవాహనుండు, శమి, దండశర్మ, దంతశత్రుండు, శత్రుజిత్తు ననుతనయులును, శ్రవణ, శ్రవిష్ఠయను తనయులును బుట్టిరి. అందు శమికి ప్రతిక్షత్త్రుండును, ఆతనికి స్వయంభోజుండును, ఆతనికి హృదికుండును జనించిరి. హృదికునకు మహాబలపరాక్రమసంపన్నులగు కృతవర్మ, శతధన్వుండు, దేవాంతుండు, నరాంతుండు, భిషక్కు, వైతరణుండు, సుదాంతుండు, అతిదాంతుండు, నికాశ్యుండు, కామదంభుండు ననుబహుపుత్త్రులు గలిగిరి. అందు దేవాంతునకు విద్వాంసుం డగు కంబళబర్హి పుట్టెను. ఆతనికి, అసమౌజుండు, తామసౌజుండు ననువారు జనించిరి. అసమౌజుండు పుత్త్రకుండై సుదంష్ట్రుండు, సుచారుండు, కృష్ణుండు ననుమువ్వురిని దత్తులుగాఁ జేసికొనియెను. వీరందఱు నంధకవంశీయులైరి.

క్రోష్టునకు గాంధారి, మాద్రి యను నిరువురుపత్నులుండిరని యిదివఱకే చెప్పియుంటిని. అందు గాంధారికి మహాబలుం డగు ననమిత్రుం డను నేకపుత్త్రుం డుదయించెను. మాద్రికి యుధాజిత్తుపుట్టెను. ఆతనికి దేవమీఢుం డుదయించెను. అమిత్రవిజయుం డగు ననమిత్రునకు నిఘ్నుండును, ఆతనికి ప్రసేనుండు, సత్రాజిత్తు ననునిద్దఱుతనయులును గలిగిరి. ప్రసేనుండు ద్వారకాపురంబున నివసించియుండెను. రథికశేఖరుం డగు సత్రాజితుం డొకనాఁడు నిశావసానంబున సూర్యోపస్థానంబు గావించుటకై రథారూఢుండై నదీతీరంబునకుం బోయి జలస్పర్శనంబు సేయుచు సూర్యోపాసనంబు నిర్వర్తించుచుండెను. ఆసమయంబున భగవానుండును, దేజోమయుండు నగువివస్వంతుండు నిజ

స్వస్వరూపమును దాల్చి యాతనిసమ్ముఖమున సాక్షాత్కరించెను.

అప్పుడు సత్రాజిత్తు సమీపస్థితుండగుసూర్యదేవు నుద్దేశించి మహాజ్యోతిష్పతీ ! గగనభాగంబున జ్యోతిర్మండలమధ్యవర్తి వగుచున్న నేను నిత్యమును సందర్శించుచునే యుంటిని, నాయందు మిత్రభావంబుతో వచ్చి దర్శనంబిచ్చినయిప్పటినీమూర్తియందు నీసఖుండనగునా కెట్టి భేదంబును గానవచ్చుట లేదు. అనుటయు నప్పుడు సూర్యభగవానుండు తనకంఠమునందలి స్యమంతకరత్నమును దీసి దాచివైచెను. అప్పుడు సౌమ్యమూర్తియై యున్నప్రభాకరునిదివ్యదేహాకృతిం గాంచి సత్రాజిత్తు ప్రీతుండై ముహూర్తమాత్రము తెప్ప వాల్పకుండ నట్లే చూచుచుండెను. అనంతరము సూర్యదేవుండు గమనోద్యుక్తుం డగుటయు సత్రాజిత్తు వినీతుండై మహాత్మా ! దేనిప్రభావముచే నీవీ లోకము నంతను బ్రకాశింపఁజేయఁగలుగుచుంటివో యట్టిదివ్యరత్నమును నీమిత్రుండ నగునాకుఁ బ్రసాదింపవలయు నని ప్రార్థించెను. భాస్కరుండును బ్రీతుండై యాతనికి స్యమంతకరత్నము నొసంగుటయు దానిం గైకొని పరమానందములో సత్రాజిత్తు నిజనగరంబునకుఁ బ్రవేశించెను.

ఆతనిపురప్రవేశసమయంబునఁ బౌరులందఱును "ఇదిగో ! సూర్యుఁడు వచ్చుచున్నాఁడు" అనిపల్కుచు వెంబడింప నారంభించిరి. ఆమణిప్రభావముచే సత్రాజిత్తు తనపురంబునను, నంతఃపురంబునను ననేకచిత్రక్రియలం గావించుచుండెను. కొంతకాలమునకుఁ బిమ్మట సత్రాజిత్తు తనసోదరుఁ డగుప్రసేనునందలిప్రీతిచే నాదివ్యరత్నము నాతని కొసంగెను. క్రమముగా నమ్మణి వృష్ణ్యంధకనివాసంబులయందును తనకవ్వకుము గుర్తించుచుండెను. ఆరత్నప్రభావముచే నాదేశంబునఁ బర్జన్యుండు యథాసమయంబున వర్షించుచుండెను; వ్యాధులో

ష్టివ్యాధిబాధలును లేకుండెను. ఎల్లయెడల శాంతిసుఖంబులు వర్ధిల్లుచుండెను. అందుచే గోవిందుం డగుకృష్ణునకు దానిని గ్రహింపవలయు ననుకోరిక గలిగెనుగాని లాభము లేకపోయెను. బలవంతముగఁ గైకొనుటకు సమర్థుం డయ్యును నాతఁ డట్లు గావించుట కిష్టపడఁడయ్యెను.

ఇట్లుండ నొకప్పుడు ప్రసేనుం డమ్మణిచే నలంకృతుండై వేఁటకై వనంబునకుం బోవుటయు మణిలోభముచే నొకసింహ మాతని వధించి రత్నముం గైకొనిపోవుచుండఁగా ఋక్షరా జాపంచాననమును సంహరించి యమ్మణిని గ్రహించి గిరిగుహామధ్యంబునఁ బ్రవేశించెను. అనంతరము ప్రసేనుండు వనంబున మరణించినవృత్తాంత మెల్లరికిని దెలియవచ్చెను. పూర్వము కృష్ణుం డమ్మణిని గోరినవాఁ డగుటచే మణిలోభంబున నాతఁడే ప్రసేనుని రహస్యముగ వధించి మణినపహరించి యుండు నని వృష్ణ్యంధకగణంబులందఱును సందేహపడఁ దొడంగిరి. ధర్మాత్ముం డగుశ్రీకృష్ణదేవున కీవిషయమునం దెట్టిసంబంధమును నిజముగా లేకపోయినను ప్రజలందఱు నకారణముగ నాతని ననుమానింప నారంభించిరి.

ఈయపయశంబును సహింపఁజాలక శ్రీకృష్ణుండు చింతితుండై యెట్లయిన నారత్నమును మరల సంపాదింతునని ప్రతిజ్ఞగావించి ప్రసేనుండు వేఁటకుఁ బోయినవనంబునుగూర్చి విశ్వస్తులగు ననుచరులతోఁ గూడి పోయెను. అట్లు పోయి శ్రీకృష్ణుండు ఋక్షవంతమునందును, వింధ్యాచలమునందును బలుతావుల వెదకి వెదకి పరిశ్రాంతుండై తుదకశ్వసహితంబుగఁ జచ్చిపడియున్న ప్రసేనుం గాంచి యాతనిచెంత నమ్మణిం గానక యాతనికించుకదూరంబునఁ బడియున్న సింహకళేబరముం గనుఁగొని యదియొకఋక్షంబుచే నిహతంబైనట్లు గ్రహించి పదచిహ్నంబులం బట్టి యాఋక్షరాజంబున్నగుహాద్వారముకడకుఁ బోవు

ను. అప్పు డాగుహామధ్యమునుండి యొకయువతికంఠస్వరము వినవచ్చు
టయు నాతం డాశ్చర్యపడియెను. ఆగుహాలో నొకదాది జాంబవంతుని
పుత్త్రి నెత్తికొని స్యమంతకమణి యాతనిచేతి కిచ్చి యాడించుచు
వత్సా! ఏడువవలదు. ఓసుకుమారా! ఒకసింహము ప్రసేనుని వధిం
చినది. నీతండ్రి యగుజాంబవంతుం డామృగేంద్రమును సంహరించి
యీరత్నమును గ్రహించి తెచ్చియున్నాఁడు. ఏడువకుము. ఈమణి
రాజము నీదియే" అని చెప్పి యుపలాలించుచుండెను.

భగవానుం డగుశ్రీకృష్ణుం డీవాక్యముల నాలకించి యాగుహా
ద్వారంబున బలరామసహితంబుగ యాదవులను నిలువనియోగించి
తానాగహ్వరమధ్యంబునఁ బ్రవేశించెను. జాంబవంతుం డాతనిం గాం
చి క్రుద్ధుండై యుద్ధమునకుఁ దలపడియెను. క్రమముగా నయ్యిరువుర
కు నతిఘోరం బగుబాహుయుద్ధ మారంభ మయ్యెను. అట్లిరువదియొ
క్కదినంబులవఱకును మహారణము జరుగుచునే యుండెను. బలదేవుండు
యాదవవీరులతోఁగూడ బిలద్వారంబునఁ గొంతకాల ముండి శ్రీకృ
ష్ణుం డెంతకును రాకుండుటచే నాతండు మడిసియుండు నని యెంచి
యటఁగొందఱుయదుకుమారుల నుంచి మగిడి ద్వారకాపురంబునకు
వచ్చి శ్రీకృష్ణమరణవార్త విచారముతో నెల్లవారికిని దెలియఁజేసెను.

కృష్ణుండును గొన్నాళ్ళకు జాంబవంతుని విజితుం గావించి
యాతనిపుత్త్రికామణితోఁగూడ నాత్మవిశుద్ధికొఱకు స్యమంతకమణిని
బరిగ్రహించి జాంబవంతు ననునయించి బిలద్వారంబు వెలువడి వినీ
తు లగుసహచరులతోఁగూడ మరల ద్వారకాపురంబునఁ బ్రవేశించె
ను. ఇట్లచ్యుతుండు స్యమంతకమణిని మరల సంపాదించి తెచ్చి యా
త్మకళంకమును బాపుకొని సకలసాత్వతగణంబుల సమ్ముఖంబునను
సత్రాజిత్తున కారత్నమును సమర్పించెను. శ్రీకృష్ణుం డీవిధముగా లో

## స్యమంతకప్రసంగ్రహము.

సత్రాజిన్నందన యగుసత్యభామను జాలకాలమునుండియు నక్రూరుఁ డర్థించి యుండెను. కాని యాతనికోరిక నెఱవేఱలేదు. స్యమంతకమణిసహితముగ నామెను సత్రాజిత్తు శ్రీకృష్ణున కర్పించెను. అక్రూరుం డెట్లయిన నాతనిస్యమంతకము నపహరింపవలయు నని యవకాశమునకు వేచి యుండెను. ఒకప్పుడు రాత్రివేళ శతధన్వుండు సత్రాజిత్తుం జంపి యామణి నెత్తికొని వచ్చి యక్రూరుని కర్పించెను. ఈసంగతి యితరులెవ్వరితోడను జెప్పనని శతధన్వునిచే శపథము చేయించుకొని యక్రూరుం డారత్నమును గైకొనియెను. మఱియు నీమణిప్రభావముచే నింతటినుండి ద్వారకాపురమే మనవశమగుననియు, శ్రీకృష్ణుం డెట్లైన నిన్ను నిగ్రహింపఁ బ్రయత్నించినచో నేను నీపక్షమునం దుండెద ననియు నక్రూరుండు శతధన్వునకు ధైర్యము చెప్పెను. మనస్విని యగుసత్యభామ పితృమరణంబున కతి దుఃఖితయై రథారోహణము గావించి వారణావతంబునకుం బోయెను. అప్పుడు శ్రీకృష్ణుం డచ్చట నుండెను. సత్యభామ తొలుతఁ దనతండ్రిని శతధన్వుఁడు వధించినవృత్తాంత మంతయును శ్రీకృష్ణునకు నివేదించెను.

ఆవార్త నాలకించి శ్రీమంతుం డగుగోవిందుం డతిత్వరితగమనంబుల ద్వారకానగరంబున కరుదెంచి యగ్రజుం డగుహలాయుధుం గాంచి "ప్రభూ! సింహము ప్రసేనుని, సత్రాజిత్తును శతధన్వుఁడును నిహతులం గావించిరి. స్యమంతకము నాకుఁ బ్రాప్తించినదగుటచే నేను దానికిఁ బ్రభుండ నైతిని. కావున నీవిప్పుడు వేగమ రథారోహణంబు గావింపుము. మహారథుం డగుభోజనందనుని వధించి యమ్మణిం గైకొని దానికధికారుల మగుదము." అని చెప్పి యాతనితోఁగలసి శ్రీకృష్ణుండు శతధన్వునిపై కెత్తిపోయెను. శతధన్వుండును దనక్రూరుండు

సహాయుఁడై వచ్చునని యెదురుచూచెను గాని యేమియు లాభము లేకపోయెను. శ్రీకృష్ణునిమహాసంరంభముం జూచి యక్రూరుండు భయపడి సమర్థుం డయ్యును శతధన్వునిపక్షమునఁ జేరఁజాలకపోయెను. అందుచే శతధన్వుండు భయభ్రాంతుఁడై యాత్మరక్షణంబున కొకయుపాయము నాలోచించుకొనియెను. ఆతనికి శతయోజనగామియగు హృదయ యనునొకయాఁడుగుఱ్ఱము గలదు. దానినధిరోహించిపోయి యాతఁడు శ్రీకృష్ణునితో యుద్ధము చేయ నారంభించెను. ఆగుఱ్ఱము చాలదూరము నడచి యలసియుండుటయుఁ, దనరథము సుదృఢంబై యుండుటయుఁ గనిపెట్టి కృష్ణుండు విజయోత్సాహుఁడై శతధన్వుని మర్దింప నారంభించెను. కృష్ణుని విక్రమంబును సహింపఁజాలక శతధన్వుండప్పుడు హయసహితముగఁ బలాయితుం డగుటయుఁ గృష్ణుం డాతనిఁ దఱుముకొనిపోవఁదొడంగెను. క్రమముగా నతిశ్రమం బగుటయు నాగుఱ్ఱము పథిమధ్యమునందే మృత్యుముఖంబునఁ బడిపోయెను.

ఆయవకాశముం గాంచి శ్రీకృష్ణుండు బలరాముం గాంచి "అగ్రజా! నీవిచ్చట నుండుము. మనగుఱ్ఱంబులుగూడఁ జాల నలసియున్నట్లగపడుచున్నవి. నేను పాదచారినై పోయి శతధన్వుని వధించి యమ్మణిని సంగ్రహించికొని వచ్చెదను" అని చెప్పి దివ్యాస్త్రవేది యగు నచ్యుతుండు పదగమనంబున మిథిలాభిముఖుండై పోయి శతధన్వు నాక్రమించి నిహతుం గావించెను. కాని స్యమంతకమణి యాతనియొద్ద నగపడకుండుటచేఁ గృష్ణుండు విఫలప్రయత్నుండై మరలి వచ్చెను. బలరాముం డాతనిం గాంచి మణినింగూర్చి యడిగెను. కృష్ణుండు మణి యాతనికడ లేదని చెప్పుటయు హలాయుధుండు క్రుద్ధుండై నీవునాసోదరుండవుగాన నిన్ను క్షమించితిని. నీస్వభావము తెలిసినది. పోనిమ్ము! నీవే యనుభవింపుము. నీకు శుభమగుఁగాక! నేనిఁకఁ బోయెదను.

నొకు నీతోఁగాని, వృష్ణిగణంబుతోఁగాని ద్వారకానగరముతోఁగాని యెట్టిప్రయోజనంబును లేదు. అని యుగ్గడించి యరిందముం డగుబలరాముండు మిథిలానగరంబునకుం బోయెను. మిథిలేశ్వరుండును వివిధోపహారంబులచే బలరాము నభ్యర్థించి తనయొద్దనుంచుకొనియెను.

ఇట యక్రూరుండు నిరంతరయజ్ఞదీక్షితుండై బహువిధయజ్ఞంబులఁ గావింప నారంభించెను. యశస్వియు, విజ్ఞుండు నగు నాతఁడు స్యమంతకమణిమూలంబునఁ బ్రాణంబుల విడువవలసివచ్చునేమో యనుభయంబుచే నాత్మరక్షార్థము దీక్షామయదివ్యకవచముం దాల్చి యజ్ఞభూమిం బ్రవేశించెను. స్యమంతకరత్నమువలననుత్పన్నంబగుభూరిధనంబుతో ధర్మాత్ముం డగునాతఁడు షష్టివర్షపర్యంతము ననేకయజ్ఞములం గావించెను. ఆయజ్ఞములం దన్నదానంబువలనను, ధనకనకాది భూరిదానంబులవలనను నర్థులకుఁ దీఱనికోరికలు లేకుండెను. సర్వోత్తమంబులగునయ్యజ్ఞంబులకు "అక్రూరయజ్ఞము" లను నామముప్రసిద్ధంబయ్యెను. మహారాజగుదుర్యోధనుండాసమయమునందే మిథిలానగరమున బలరామునియొద్ద గదాయుద్ధవిద్య నభ్యసించెను.

అనంతరము మహాత్ముండగుశ్రీకృష్ణుండు బంధులగు యదువృష్ణిభోజాంధకులతోఁగలసిపోయి బలరామునిఁ బ్రసన్నుం జేసికొని మరల నాతని ద్వారకానగరమునకుఁ దోడ్తెచ్చెను. నిద్రించుచున్న సత్రాజిత్తును జంపించుటకుఁ గారణుండైన మహాబలుం డగునక్రూరుండు కృష్ణభయంబుచే నంధకగణసహితుండై ద్వారకానగరమును బరిత్యజించిపోయెను. కృష్ణుం డిది యంతయు నెఱింగియుండియు, జ్ఞాతిభేదం బగునను సంశయముచే నాతని నుపేక్షించి యుండెను. అక్రూరుండు ద్వారకను విడిచినప్పటినుండియు నట యనావృష్టిసంభవించెను. దేశమునందును, రాజ్యమునందును ననేకవిధములగునష్టకష్టములు సంప్రాప్త

ము లయ్యెను. అప్పుడు కుకురాంధకగణంబు లక్రూరుని బ్రసన్నుం జేసికొని క్రమ్మఱ నాతని ద్వారకానగరంబునకుఁ దీసికొని వచ్చిరి. అది మొదలుగ ద్వారకానగరము పూర్వసమృద్ధిం గాంచి యుండెను. సువృష్టి లభించెను.

ఇట్లు కొంతకాల మైనతరువాత నక్రూరుండు వాసుదేవునకుఁ దనయందుఁ బ్రీతి గలుగుటకై తనమేనగోడలి నాతని కొసఁగెను. శ్రీకృష్ణుండును స్యమంతకమణి యక్రూరుని హస్తగతం బయ్యె నని యోగబలంబున గ్రహించి యొకనాఁడు సభామధ్యంబున నక్రూరుం గాంచి "ఓప్రభూ! స్యమంతకరత్నరాజము నీయొద్ద నున్నదని నాకుఁ దెలియవచ్చినది. నీకు నాయెడల నిష్ప్రియసవ్యవహారంబు దగదు. ఆమణిని మరల నాకిచ్చివేయుము. ఓయనఘా! ఆమణినిగూర్చి యిరువదివత్సరంబులనుండి రాఁజుచున్న నాక్రోధానల మిప్పు డొక్కసారిగా మండుచున్నది. ఇంతకాల మైనతరువాత నీకు సైరించి యుండఁజాలను. సహింపఁగలయంతకాలము సహించి యుంటిని" అని పలుకుచుయు మహామతి యగునక్రూరుం డాక్షణంబుననే పోయి యమ్మణిం దెచ్చి సకలబంధుసమక్షంబున నాసభామధ్యమునందు శ్రీకృష్ణునకు సమర్పించెను. తోడనే బలరామునిహృదయమునందలి సంశయలేశముకూడఁ దొలఁగిపోయెను. శ్రీకృష్ణుని కీవిధముగా స్యమంతకమణి మరల లభించెను. శ్రీకృష్ణుండును మహాత్ముండగునక్రూరునిసత్స్వభావమునకు సంతోషించి యారత్నరాజమును మరల నాతనికే యిచ్చివైచెను. అక్రూరుండును సద్భావంబుతో దానిం బరిగ్రహించి యలంకరించుకొని తత్ప్రభావముచే నంశుమంతుండునుంబోలి విరాజిల్లుచుండెను.

## సప్తద్వీపవర్ణనము.

మును లిట్లనిరి. సూతమునీంద్రా! మహాత్ముండవగు నీవలన ననేకదివ్యచరిత్రములను విని యుంటిమి. పురాణకథాసుధారసము నెంతగ్రోలినను మాకుఁ దనివి తీఱకున్నది. సర్వజ్ఞా! ఇఁక మాకీభూమండలముంగూర్చి సవిస్తరముగ వినిపింపు మని ప్రార్థించిరి. సూతుం డిట్లనియెను. మునిశ్రేష్ఠులారా! మీకావిషయమును సంక్షేపముగవర్ణించెదను. ఇదియంతయును సవిస్తరముగఁ గీర్తించుటకు శతవత్సరంబులైనను జాలవు. ఈభూమండలంబున జంబూద్వీపము, ప్లక్షద్వీపము, శాల్మలద్వీపము, కుశద్వీపము, క్రౌంచద్వీపము, శకద్వీపము, పుష్కరద్వీపము, నను సప్తద్వీపములును, లవణసముద్రము, ఇక్షుసముద్రము, సురాసముద్రము, సర్పిసముద్రము, దధిసముద్రము, క్షీరసముద్రము, జలసముద్రము, నను సప్తసాగరంబులచేఁ బరివేష్టితములై యున్నవి. సమస్తద్వీపములకును జంబూద్వీపము మధ్యభాగమునందున్నది. ఆజంబూద్వీపమధ్యమునఁ గనకాచలము విరాజిల్లుచుండును. అది భూపద్మమునకుఁ గర్ణికవలె నొప్పమీఱుచుండును. దానికి దక్షిణంబున హిమవంతము, హేమకూటమును, నిషధంబును, ఉత్తరంబున, నీలము, శ్వేతము, శృంగి యను వర్షపర్వతంబులును గలవు.

జంబూద్వీపమునందు భరతవర్షము, కింపురుషవర్షము, హరివర్షము, రమ్యకవర్షము, హిరణ్మయవర్షము నొకదానివెనుక నొకటిగా నున్నవి. హిరణ్మయవర్షంబునకుత్తరమున నుత్తరకురుభూములు గలవు. ఇలావృతవర్షంబున నాలుగుపర్వతంబులు గలవు. దానికిఁ బూర్వంబున మందరంబును, దక్షిణంబున గంధమాదనంబును, పశ్చిమంబున విపులంబును, ఉత్తరంబున సుపార్శ్వపర్వతంబును గలవు. అవియన్నియు బహువిధతరులతాసమాకీర్ణములై యుండును. జంబూవృక్షంబులచేత

నే జంబూద్వీపమునకుఁ బేరు గలిగెను. అందలిజంబూఫలములు మహా గజప్రమాణములై యుండును. ఆఫలరసంబుచేతనే జంబూనది యు త్పన్నం బయ్యెను. అందలిప్రజలాజలపానంబు గావించి ఖేద దౌర్గంధ్య జరావైకల్యాదులులేక సుఖంబుగా నుందురు. ఆనదియం దుదయించు టచేతనె స్వర్ణమునకు జాంబూనద మనుపేరుగల్గెను. మేరువునకుఁ దూ ర్పున భద్రాశ్వంబును, బశ్చిమంబునఁ గేతుమంతంబు ననువర్షంబులు గలవు. ఈరెంటికి నడుమనే యిలావృతవర్షం బున్నది. అరుణోదము, మహాభద్రము, అసితోదము, మానసము ననుచతుస్సరోవరంబులు ప్రసిద్ధంబులై దేవసేవ్యంబులై యుండెను. శాంతవంతము, చక్రకుం జము, కురరి, మాల్యవంతము వైకంకము మొదలగునగంబులు మేరు వునకుఁ బూర్వంబునను, త్రికూట, శిశిర, పతంగ రుచక, నిషధాదిపర్వ తంబులు దక్షిణంబునను, శిఖివాస, వైదూర్య, కపిల, గంధమాదన ప్రముఖశైలంబులు పశ్చిమంబునను, శంఖకూట, ఋషభ, హంస, నాగ, కాలంజరాదిభూధరంబు లుత్తరంబునను గలవు. మేరూపరిభా గంబున స్వర్గభూమియందు బ్రహ్మపురంబు విరాజిల్లుచుండును. దానికిఁ జుట్టును దిక్పాలకనగరంబులు గలవు. విష్ణుపదంబునుండి వెలువడి గం గాదేవి యీబ్రహ్మపురినలువంకలను బ్రవహించి స్వర్గభూమిని జేరు చుండును. అచ్చట గంగానది సిత, అలకనంద, చక్షు, భద్ర యను నామంబులచే నాల్గుపాయలై యుండును. అందు మొదటిపాయ పర్వ తంబులనుండి క్రిందికిఁ బ్రవహించిపోయి భద్రాశ్వవర్షమధ్యంబున సాగర ముం జేరుచుండును. రెండవపాయ దక్షిణముగఁ బోయి భారతవర్ష మును జేరి యేకభాగములై సముద్రమునఁ గలియుచుండును. మూఁ డవది పశ్చిమముగఁ బోయి కేతుమాలవర్షంబున సాగరసంగతం బగు చుండును. నాలవది యుత్తరాభిముఖంబుగ నుత్తరకురుభూముల నతిక్ర

మించి పోయి సముద్రమునం జేరుచుండును.

మాల్యవంతంబును, గంధమాదనంబును, నీలనిషధపర్వతంబు-
లం బోలి విశాలములై యుండును. వానినడుమ గర్ణికవలె మేరుశైల
ము విరాజిల్లుచుండును. లోకశైలంబులను పర్వతంబులవెనుక భారత
కేతుమాలభద్రాశ్వకురువర్షంబులు పత్త్రాకృతిని విలసిల్లుచుండును.
గంధమాదన, కైలాసనగంబులు మేరువునకు బూర్వపశ్చిమంబుల జె
లువందుచుండును. నిషధపారియాత్రంబులు మర్యాదాశైలములు.
నీలనిషధంబులు తుల్యపరిమాణంబులై పశ్చిమంబున విలసిల్లుచుండు
ను. త్రిశృంగజారుధిపర్వతంబు లుత్తరవర్షపర్వతంబులు. ఇవి మేరువు
నకు నలువంకలను వ్యాపించి యుండును. దారచుట్టునున్న కేసరాచలం
బులు సిద్ధచారణసంసేవితములై యతిమనోహరములై యుండును. ఆ
పర్వతద్రోణులయందు లక్ష్మి, విష్ణువు, అగ్ని, సూర్యుఁడు, ఇంద్రుఁడు
మొదలగుదేవతల రమ్యనగరంబులు విరాజిల్లుచుండును. అందలిరమ
ణీయగృహంబులయందు యక్షకిన్నరగంధర్వాదులు నివసించి యుండు
రు. అవి యన్నియుఁ బుణ్యాత్ములకు గమ్యంబులు. పాపాత్ములెన్ని
జన్మములకైనను వానిని దర్శింపఁజాలరు.

శ్రీమహావిష్ణుండు భద్రాశ్వవర్షంబున హయగ్రీవాకృతిని, కేతు
మాలావర్షంబున వరాహరూపమునను, భారతవర్షంబునఁ గూర్మాకార
మునను, కురువర్షంబున మత్స్యమూర్తిని, తదితరస్థానంబులయందు వి
శ్వరూపమును దాల్చి విరాజిల్లుచుండును. సనాతనుం డగుగోవిందుండు
సకలేశ్వరుఁడై సకలాధారుఁడై సర్వత్ర వివిధరూపంబులతో విలసిల్లు
చుండును. కింపురుషాద్యష్టవర్షంబులును శోకక్లేశభయోద్వేగక్షుద్విర
హితంబులై యొప్పుచుండును. అందలిప్రజలందఱును సర్వదుఃఖవిము
క్తులై నిరాతంకముగ జీవించుచుందురు. వారు పదిపండ్రెండువేల

వత్సరములు పరమాయువుగలవారై యుందురు. వారికి క్షుత్పిపాసాది బాధలు లేవు. అందు కృతత్రేతాదియుగభేదంబును లేదు. పూర్వోక్తంబులగుసప్తవర్షంబులయందును సప్తకులపర్వతంబులు గలవు. అందు నదీశతంబు లుత్పన్నంబులై ప్రవహించుచుండును.

## భారతవర్షవివరణము.

సముద్రమున కుత్తరంబునను, హిమాచలమునకు దక్షిణంబునను భారతవర్షము తేజరిల్లుచుండును. ఇదియే భారతీయప్రజలకు నివాసభూమి. ఇది నవసహస్రయోజనపరిమితమైనది. స్వర్గాపవర్గకాములగువారి కందఱకును భారతవర్షమే కర్మభూమి. ఇందు మహేంద్రము మలయము, సహ్యము, శుక్తిమంతము, ఋక్షము, వింధ్యము, పారియాత్రము నను సప్తకులాచలంబులు గలవు. ఇందలిమానవులు కర్మానుసారంబుగ జన్మించుచు స్వర్గనరకభోగంబుల ననుభవించుచుందురు. స్వర్గమోక్షంబులును, మధ్యమాంత్యగతులును నీభారతవర్షమునందే గాని మఱి యేకర్మక్షేత్రమునందును లేవు. ఈభారతవర్షము తొమ్మిదిద్వీపములుగా విభజింపఁబడినది. అందు ఇంద్రద్వీపము, కసేరుమంతము, తామ్రపర్ణము, గభస్తిమంతము, నాగద్వీపము, సౌమ్యము, గంధర్వద్వీపము, వారుణము ననునెనిమిదియుఁ గాక తొమ్మిదవద్వీపము సాగరసంవృతమై యుండును. భారతవర్షమునకుఁ బూర్వునఁ గిరాతులును, పశ్చిమంబున యవనులును, మధ్యదేశమున బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రగణంబులును యథావిభాగక్రమంబున నివసించి యుందురు. వారు యజ్ఞయుద్ధవాణిజ్యాదివృత్తులు గలవారై యుందురు.

శతద్రు, చంద్రభాగాదినదులు హిమాచలంబునుండియు, వేదస్మృతిప్రభృతివాహినులు పారియాత్రశైలంబునుండియు, నర్మదాది

వాహినులు వింధ్యభూధరమునుండియు, పయోష్ణీ, కావేర్యాదిస్రోతస్వినులు ఋక్ష నగంబునుండియు నుత్పన్నములై ప్రవహించుచుండును. ఈసకలనదీనామమాత్రశ్రవణంబునఁ బాపభయనివారణం బగును. ఇదిగాక యింకను గోదావరి, భీమరథి, కృష్ణవేణి మొదలగునదులు సహ్యపర్వతమునుండి ప్రవహించుచుండును. మాలయపర్వతమునుండి కృతమాల, తామ్రపర్ణి మొదలగునదులును, మహేంద్రాచలమునుండి ఋషికుల్యాదినదులును, త్రిసంధ్యయనునదంబును, శుక్తిమంతమునుండి కుమారాదినానానదీనదంబులును వినిర్గతంబులగుచుండును. ఇవిగాక భారతవర్షమునందనేకనదులును, ఉపనదులును గలవు. ఆనదీతీరంబులయందు కురుపాంచాలమధ్యదేశాదిజనపదంబులు శోభిల్లుచుండును. మఱియుఁ గామరూపవాసులు. పూర్వదేశీయులు, పౌండ్రులు, కళింగులు, మగధులు, దాక్షిణాత్యులు, అపరాంత్యులు, సౌరాష్ట్రులు, శూద్రులు, ఆభీరులు, అర్బుదులు, మాళవులు, సౌవీరులు, సైంధవులు, సాళ్వులు మొదలుగాఁగలనానాజాతులవారాయానదీతీరంబుల నివసించి యుందురు.

భారతవర్షవాసు లందఱును శాంతిప్రియులై యుందురు. అందలిజనపదంబు లన్నియును సర్వసమృద్ధంబులై యుండును. ఇందు కృతత్రేతాదియుగభేదంబులు గలవు. తపస్వు లిందు తపంబుగావించుచు యజ్ఞాదిక్రియల నిర్వర్తించుచుందురు. పరలోకశుభంబుకొఱ కిందలి ప్రజలు భూరిదానంబులు సేయుచుందురు. ఈభారతవర్షమునందు యజ్ఞపురుషుం డగువిష్ణుండు నిరంతరము నభ్యర్చితుం డగుచుండును. జంబూద్వీపమునందు భారతవర్షమే శ్రేష్ఠమైనది. ఇదియే కర్మక్షేత్రము. తక్కినవర్షంబు లన్నియును భోగక్షేత్రములు. జీవులు బహుజన్మసుకృతఫలంబుచే భారతవర్షంబున మానవులై జన్మించుచుందురు. స్వ

ర్గాపవర్గసంధాయకంబగుభారతభూమియందు జన్మించినమానవులే ధన్యతములని దేవతలు ప్రశంసించుచుందురు. సత్కర్మఫలసమూహంబుల నీశ్వరార్పణంబు గావించుమహాత్ము లగువారిభారతభూమిని జనించి యుండే విలీను లగుచుందురు.

—♦ ప్లక్షద్వీపవర్ణనము. ♦—

లవణసముద్రము జంబూద్వీపమును జుట్టియున్నట్లే ప్లక్షద్వీపము లవణాబ్ధిచుట్టును వ్యాపించి యున్నది. అది జంబూద్వీపముకంటె రెట్టింపుపెద్దది. దానికి మేధాతిథి యనునాతఁడు ప్రభుండై యుండును. ఆతనికి శాంతిభయుఁడు, శిశిరుఁడు, సుఖోదయుఁడు, ఆనందుఁడు, శివుఁడు, క్షేమకుఁడు, ధ్రువుఁడు నను నేడ్వురుతనయులు గలరు. వారినామంబులచేఁ బ్లక్షద్వీపమునందు సప్తవర్షంబులు విలసిల్లుచుండును. ఆవర్షంబులకు సీమలుగా గోమేదము, చంద్రము, నారదము, దుందుభి, సోమకము, సుమనము, శైలము, వైభ్రాజము నను సప్తపర్వతంబులు గలవు. అందు దేవగంధర్వాదులు నివసించి యుందురు. పుణ్యాత్ములగు వీరపురుషుల కవి యాశ్రయము లైనవి. అందలిప్రజలకు మృత్యువ్యాధిభయాదులు లేవు. ఆసప్తవర్షంబులును సముద్రగాములను లగునేడునదులచే విరాజిల్లుచుండును. అనుతప్త, శిఖ, విపాశ, త్రిదివ, క్రిము, నృత, సకృత, యని వాని నామములు. అం దింకను ననేకపర్వతపంక్తులును, నదీనదసమూహంబునుగూడ నలరారుచుండును. అందలినదు లన్నియు సంతతప్రవాహినులై యుండును. ఆవర్షసప్తకంబునందును యుగభేదంబు లేదు. ప్లక్షశాకద్వీపములందలి ప్రజలందఱును బంచసహస్రవర్షములు నిరామయజీవనులై యుందురు. అందును జతుర్విధవర్ణాశ్రమభేదంబులు గలవు. చతుర్వర్ణంబులవారు నందు నివసించుచుందురు.

అందు బ్రాహ్మక్షత్రియవైశ్యశూద్రులు క్రమంబుగా, ఆర్యకకురువివిశ్వభావినామంబులచే వ్యవహరింపఁబడుచుందురు. జంబూద్వీపమధ్యమున జంబూవృక్షమువలెనే ప్లక్షద్వీపమునందును ప్లక్షవృక్షముగలదు. ఆభూరుహమువలననే యాద్వీపమున కాపేరు గల్గెను. సోమరూపి యగు పరమేశ్వరుఁ డందలిప్రజలచే నారాధింపఁబడుచుండును. ఆద్వీప మంతయు నిక్షుసముద్రజలంబులచేఁ బరివేష్టితమై యుండును.

## శాల్మలద్వీపవర్ణనము.

శాల్మలద్వీపమును వపుష్మంతుండను రాజు పరిపాలించుచుండును. ఆతనికి శ్వేతుఁడు, హరితుఁడు, జీమూతుఁడు, రోహితుఁడు, వైద్యుతుఁడు, మానసుఁడు, సుప్రభుఁడు ననునేడ్గురుతనయులుగలరు. వారినామంబులచే నాద్వీపము సప్తవర్షంబులుగా విభక్తంబై యుండును. ఆద్వీపమంతయు నిక్షుసముద్రము నావరించి యున్నది. అందును రత్నాకరంబులగు కుము, ద్రోన్నత, వలాహక, ద్రోణ, కంక, మహిష, కకుద్మంతంబులను సప్తవర్షపర్వతంబులును, శ్రోణి, తోయ, వితృష్ణ, చంద్ర, శుక్ర, విమోచని, నివృత్తి యనుసప్తనదులును జెలువందుచుండును. ఆనదీశైలస్మరణమాత్రంబునఁ బాపక్షయంబు గాఁగలదు. అందు కపిలారుణపీతకృష్ణవర్ణంబులచే జతుర్విధవర్ణంబులప్రజలును నివసించి యుందురు. వారందఱును సర్వేశ్వరుండును, సర్వాత్మకుండును వాయుభూతుండును, యజ్ఞపతియు, భగవానుండు నగువిష్ణుదేవుని మహాయజ్ఞంబులచే నర్చించుచుందురు. ఆ మనోహరద్వీపము నిరంతరదేవగణనివాసంబై శోభిల్లుచుండును. శాల్మలివృక్షముచేతనే యాద్వీపమున కానామము గలిగినది. ఆద్వీపముచుట్టును సురాసాగరము పరివేష్టించి యుండును.

## కుశద్వీపవర్ణనము.

కుశద్వీపము జ్యోతిష్మంతుఁడను భూపాలునిచే బరిపాలింపఁబడుచుండును. ఆతనికి, ఉద్భిదుఁడు, వేణుమంతుఁడు, స్వైరథుఁడు, లంధనుఁడు, ధృతి, ప్రభాకరుఁడు, కపిలుఁడు ననునేడుగురుపుత్త్రులు గలరు. వారినామంబుల ననుసరించియే యందలి సప్తవర్షంబులును బ్రసిద్ధములై యుండును. అందు దైత్యమానవదానవగణంబులును, యక్షగంధర్వాదిదేవతాగణంబులును నివసించియుందురు. అందు చతుర్వర్ణంబులవారును స్వస్వకర్మానుష్ఠాననిరతులై యుందురు. బ్రహ్మక్షత్త్రియవైశ్యశూద్రు లందు గ్రమంబుగ దమిశుష్మిస్నేహమందేహనామంబులచే వ్యవహరింపఁబడుచుందురు. వారు స్వధర్మానుసారంబుగా స్వాధికారఫలదాతయు, బ్రహ్మస్వరూపియు నగు జనార్దను నారాధించుచుందురు. కుశద్వీపమునందు విద్రుమము, హేమము, ద్యుతిమంతము పుష్టిమంతము, కుశేశయము, హరి, మందరము ననుసప్తప్రధానపర్వతంబులును, ధూతపాప, శివ, పవిత్ర, సమ్మతి, విద్యుత్తు, అంభస్సు, మహి యనుసప్తనదులును విరాజిల్లుచుండును. ఇంకను ననేకనదీనదంబులును, పర్వతంబులునుగూడ నందున్నవి. ఆద్వీపమునఁగుశస్తంబం బుండుటచే దానికానామము గలిగినది. అది ఘృతసముద్రముచేఁ బరివేష్టితమై యుండును.

## క్రౌంచద్వీపవర్ణనము.

ఆఘృతసాగరమును గ్రౌంచద్వీపము పరివేష్టించి యుండును. అది కుశద్వీపముకంటె ద్విగుణాధికపరిమితంబై ద్యుతిమంతుఁ డనురాజుచేఁ బరిపాలిత మగుచుండును. ఆద్యుతిమంతునకు కుశలుఁడు, మందగుఁడు, ఉష్ణుఁడు, పీవరుఁడు, అంధకారకుఁడు, ముని, దుందుభి

యను నేడుగురు తనయులు గలరు. ఆద్వీపమునందు క్రౌంచము, వామనము, అంధకారకము, దేవవ్రతము, ధర్మము, పుండరీకము, దుందుభి యనుసప్తవర్షపర్వతంబు లొకదానికంటె నొకటి ద్విగుణపరిమితంబులై యుండును. రాజపుత్రనామంబులచే విలసిల్లు నందలివర్షంబులనుండియు, వర్షపర్వతంబులనుండియు నతిరమణీయంబులగు ద్వీపంబులును, ద్వీపాంతరంబులును, పర్వతపంక్తులు నున్నతంబులై శోభిల్లుచుండును. ఆద్వీపము దేవదానవమానవగణసమృద్ధంబై యుండును. అందలిప్రజలందఱును నిత్యతుష్టులును, ధన్యులు నై యుందురు. వర్ణచతుష్టయవిభేదం బందునుగలదు. గౌరి, కుముద్వతి, సంధ్య, రాత్రి, మనోజవ, ఖ్యాతి, పుండరీక యనునేడునదు లందుఁ బ్రధానములైనవి. అవి యందలిసప్తవర్షంబులందును బ్రవహించుచుండును. ఇంకను జిన్నచిన్ననదు లెన్నియో యందుఁగలవు. అచ్చటిప్రజలు స్వధర్మానుసారంబుగ ధ్యానయోగంబుచే రుద్రస్వరూపుఁ డగుజనార్దను నారాధించుచుందురు. ఈక్రౌంచద్వీపము తనతో సమపరిమాణంబగు దధిసాగరముచేఁ బరివేష్టితమై యుండును.

## శాకద్వీపవర్ణనము.

దధిసముద్రమును జుట్టియున్నశాకద్వీపము క్రౌంచద్వీపమునకు ద్విగుణితంబై భవ్యుండను రాజుచేఁ బాలింపఁబడుచుండును. ఆరాజునకు జలదుఁడు, కుమారుఁడు, సుకుమారుఁడు, మనీరకుఁడు, కుశమోదుఁడు, మోదాకి, మహాద్రుముఁడు ననునేడుగురు పుత్రులై స్వనామాంకితంబు లగునందలిసప్తవర్షములను బాలించుచుందురు. ఆవర్షంబుల కెల్లలుగా, ఉదయాచలము, జలధరము, రైవతకము, [illegible] అంభోగిరి, అస్తికేయము, కేసరి యనుసప్తపర్వతంబులు గలవు. శా

ద్వీపము దేవగంధర్వాదిసేవితమై, రమణీయారామములచేఁ బ్రశోభితమై యుండును. అందు చతుర్వర్ణవిశిష్టంబు లగుపుణ్యజనపదంబు లెన్నియేని గలవు. అందలిప్రజలు సద్భావసంపన్నులును, నిరాతంకులు నిరామయులు నై యుందురు. అందు సుకుమారి, కుమారి, నలిని, రేణుక, ఇక్షు, ధేనుక, గభస్తి యనుపాపభయవిదారకంబు లగుపుణ్యనదులు ప్రవహించుచుండును. ఇవిగాక యింకను ననేకనదీపర్వతంబులు గలవు. ఇందలినదు లన్నియును బుణ్యఫలప్రదంబులు. అవి యన్నియు స్వర్గమునుండి భూతలమున నవతరించి యున్నవి. శాకద్వీపవాస్తవ్యులకు భయశోకాధర్మాదులు లేవు. వారు పరస్పరనియమంబుల నతిక్రమింపక ఋజుమార్గమునఁ జరించుచుందురు. అందు మగ, మాగధ, మానస, మందగనామంబులచేఁ గ్రమముగా బ్రాహ్మక్షత్రియవైశ్యశూద్రులు విలసిల్లుచుందురు. భగవానుం డగువిష్ణుదేవుం డందు సూర్యనారాయణరూపంబున విరాజిల్లుచుండును. అందలిప్రజలందఱు నమ్మహాదేవు నర్చించుచుందురు. ఆద్వీపమంతయును క్షీరసాగరవలయితమై యుండును.

## పుష్కరద్వీపవర్ణనము.

ఆక్షీరసాగరముచుట్టును బుష్కరద్వీపము గలదు. అది శాకద్వీపమునకు ద్విగుణితమై యుండును. దానిని సవనుం డనురాజు పాలించుచుండును. ఆతనికి మహావీతుండు, ధాతకి యనునిరువురుపుత్త్రులు గలరు. వారినామంబులచే నొప్పు రెండువర్షంబులు గలవు. వాని నడుమ మానసోత్తరం బను నొకవర్షపర్వతంబు విరాజిల్లుచుండును. అది పుష్కరద్వీపమునకంతకును మధ్యభాగమునందున్నది. ఆద్వీపమునందలిప్రజలు దశసహస్రవర్షజీవులును, నిరామయులును, రాగద్వేష

శోకభయశూన్యులు నై యుందురు. వారిలో నుత్తమాధమభేదంబులు
లేవు. అందఱును సములై యుందురు. వారిలో వర్ణవిభేదంబును
లేదు. ఆద్వీపమునందెచ్చటను నసత్యంబు లేదు. ఆద్వీపవర్షంబులలో
నెందు నొక్కనదిగాని, శైలంబుగాని లేకుండును. అవి దేవమానవుల
కుఁ దుల్యనివాసంబై యలరారుచుండును. అందు వర్ణాశ్రమాచారం
బులుగాని, ధర్మానుష్ఠానంబులు గాని, త్రయీవార్తాదండనీత్యాదులు
గాని లేవు. అయినను బుష్కరద్వీపము భౌమస్వర్గనామంబునఁ బ్ర
ఖ్యాతంబై యుండును. అచ్చటఁ గాలము నిత్యసుఖప్రదంబును జరా
వర్జితంబు నై యుండును. వర్షద్వయవిలసితం బగునాద్వీపమధ్యంబునం
దొకన్యగ్రోధవృక్షంబు గలదు. అది బ్రహ్మదేవునకు నివాసస్థానమై
యుండును. సురాసురగణపూజితుండగుబ్రహ్మదేవుం డావృక్షంబున
వసించియుండును. ఆద్వీపమంతయు శుద్ధోదకసాగరపరివృతమై యుం
డును.

ఈవిధముగా సప్తద్వీపములును సప్తసాగరంబులచే వేష్టితములై
యున్నవి. ఆద్వీపంబులును, సముద్రములును గూడఁ బరిమాణంబునఁ
బరస్పరద్విగుణితంబులై యుండును. ఆసాగరంబులన్నియు నిరంతరం
బు పూర్ణంబులై యుండును. ఆజలంబుల కెన్నటికిని న్యూనాధికత్వం
బులు లేవు. సకలసాగరజలంబులును జంద్రకళలచేఁ బొంగిపొరలు
చుండుట గలదుగాని యంతమాత్రముచే నాజలంబులకు హానివృద్ధు
లు లేవు. శుక్లకృష్ణపక్షంబులయందుఁ గ్రమంబుగ సముద్రజలంబుల
కు నూటపదునేనంగుళములపరిమాణమువృద్ధియు, నంతియక్షయంబును
గానంబడుచుండును. ఆద్వీపంబులయందలిప్రజలందఱును షడ్రసమ
యంబు లగుపానభోజనద్రవ్యంబులచేఁ బరితృప్తు లగుచుందురు.
శుద్ధోదకసాగరంబున కవ్వలఁగూడఁ గొన్నిలోకంబులు గానవచ్చుచు

న్నవి. కాంచనమయం బగునాభూప్రదేశము పుష్కరద్వీపమునకు ప్రకాశితమై యుండును గాని యందెట్టిజీవజంతువులును నివసించుట లేదు. ఆవెనుక నయుతయోజనవిస్తృతంబులగులోకాలోకపర్వతపంక్తులు గలవు. అవి యన్నియు ఘోరతమోవృతంబులై యుండును. ఆతమఃపుంజమంతయు బ్రహ్మాండకటాహావరివృతమై యుండును. ఇట్లు ద్వీపమహీధరాభిశోభితం బగుపృథ్వియంతయుఁ బంచాశత్కోటియోజనవిస్తృతమై యుండును. ఈభూదేవియే ధాత్రియు, విధాత్రియు, సర్వభూతగుణాధికయు, సర్వజగదాధారభూతయునై విరాజిల్లుచున్నది.

## పాతాళలోకవర్ణనము.

మునివరులారా! అతలము, వితలము, నితలము, సుతలము, తలాతలము, రసాతలము, పాతాళము నని సప్తపాతాళలోకంబులు గలవు. అవి కృష్ణ, శుక్లారుణపీతశర్కరాశైలకాంచనభూములచే విరాజిల్లుచుండును. సమున్నతరమణీయప్రాసాదశోభితంబులగు నాలోకములన్నియు దైత్యదానవనాగగణంబులకు నివాసంబులై యుండును. ఒకప్పుడు నారదమునీంద్రుండు పాతాళం బంతయును దిరిగివచ్చి స్వర్గసభామధ్యంబున నీవిధముగా నభివర్ణించెను:—నేను పాతాళమును జూచి వచ్చితిని. అది స్వర్గలోకముకంటెను రమణీయమైనది. అచ్చట హృదయానందదాయకంబులును, శుభ్రంబులును, ప్రభాసమయంబులు నగుననేకామూల్యరత్నంబులు గలవు. ఆమణు లన్నియు నాగగణంబులకు భూషణంబులై యుండును. దానితోఁ దుల్యమగులోక మెందున్నది? దైత్యదానవకన్యాగణంబులకు విహారప్రదేశం బగునాలోకముం గాంచినచో నెట్టిముక్తపురుషునకైనను బ్రియంబు జనింపక మానదు. ప్రతిదినమునందు సూర్యకిరణములు ప్రకాశించుచుండును గాని

యాతపతాపముమాత్రము వానియందు లేకుండును. ఆలోకరామణీయకమును వర్ధిల్లఁజేయుటకుమాత్రమే యటఁ జంద్రుండు ప్రకాశించుచుండును. కాని శైత్యాధిక్యముమాత్ర మాతనియందు గానవచ్చుట లేదు.

అందలి దానవగణంబులు రుచ్యంబులగు నుత్తమభక్ష్యభోజ్యంబుల నారగించుచు మహోన్మత్తులై కాలగమనమునుగూడ లక్ష్యము సేయకుందురు. అందు సుందరోద్యానంబులును, నదులును, కమలేందీవరవిరాజితంబులగు సరోవరంబులును గన్నులపండువగా నుండును. అందలి సుందరారామములు కోకిలాదికలవిహంగమకలకూజితంబులచేతను, సురభికుసుమగంధంబులచేతను మనోజ్ఞంబులై, యంబరతలము నిరంతరనిర్మలమై, భూషణములు రమణీయములై, యనులేపనములు సౌరభకలితములై, వేణువీణామృదంగాది మంగళవాద్యధ్వనులు శ్రవణానందదాయకములై యుండును. ఆపాతాళమునందలి దైత్యదానవపన్నగగణంబులు సర్వభాగ్యభోగంబుల ననుభవించుచుందురు. ఆలోకమున కధోదేశంబున విష్ణుదేవుని తామసతనుస్వరూపుండగు శేషుఁడు వసించియుండును. ఆతని గుణగణంబుల నభివర్ణించుట కెవ్వరును సమర్థులు గాఁజాలరు. అనంతనామమునుచే నాతఁడు వ్యవహరింపఁబడుచుండును. సిద్ధులును, దేవఋషులును, దేవర్షులునుగూడ నాతని బూజించుచుందురు. వ్యక్తమూర్తియు, సహస్రశీర్షుండును, మంగళాలంకారభూషితాంగుండును నగునాతఁడు, తనసహస్రఫణామణులచే దిఙ్మండలంబుల వెలింగించుచు, జగద్ధితంబునకై యసురాదుల వీర్యవిజయంబుం గావించుచుండును. మదావేశఘూర్ణితనయనుండును, నిరతైకకుండలియు, పుష్పమాలికాధరుండును, కిరీటియు నగు నాతఁడు వహ్నిసహితం బగు శ్వేతాచలంబుంబోలి విరాజిల్లుచుండును. మద

గర్వితుండును, శ్వేతమాలికాధారియు నగు నయ్యనంతుఁడు సురనదీప్రవాహయుతం బగు కైలాసంబుంబోలె శోభిల్లుచుండును. లాంగలముసలధారి యగు నాతని వారుణియు, కాంతియు నుపాసించుచుండును. కల్పావసానంబున నాతనివక్త్రంబులనుండి విషానలశిఖోజ్జ్వలుండును, సంకర్షణాత్మకుండు నగురుద్రదేవుండు వెలువడి త్రిజగంబులను గ్రసించుచుండును. సకలసురపూజితుం డగు నాశేషదేవుఁడే యశేషభూమండలంబు నుద్ధరించి పాతాళమూలంబున నివసించుచుండును. ఆతనిరూపవీర్యప్రభావంబులు సువిదితంబు లయ్యును దేవతలకుఁగూడ నవర్ణనీయంబులై యుండును. ఈభూమండలమంతయు నాతనిఫణామణిశిఖలచే నరుణితమై కుసుమమాలికంబోలె విరాజిల్లుచుండును. అంతటివీర్యవంతుం డగు నాతని నెవ్వరు వర్ణింపఁగలరు? ఆతనివిజృంభణంబులచే సరిత్సముద్రశైలకాననసహితంబుగ నీభూమండలంబంతయు నప్పుడప్పుడు చలించిపోవుచుండును. అజేయపురుషుం డగు నయ్యనంతునిగుణగణంబులను సిద్ధగంధర్వకిన్నరోరగాప్సరోగణంబులలో నెవ్వరును వర్ణింపఁజాలరు. నాగకాంతలచే నాతనిగాత్రంబున నలందఁబడిన చందనాదిలేపనంబులు శ్వాసానిలంబులచే మాటిమాటికి నుత్క్షిప్తంబులై దిగంగనాముఖులకు సురభిపటవాసత్వంబుం గల్పించుచుండును. పురాణఋషియగు గర్గుం డాతని నారాధించి జ్యోతిశ్శాస్త్ర మంతయును గ్రహింపఁగలిగెను. ఈపృథ్వీమండలంబును దనమస్తకంబులపైఁ దాల్చియున్న యయ్యనంతమూర్తి సురాసురనరపరివృతం బగు నాపాతాళలోకంబును బరిపాలించుచుండును.

## —♦ నరకవర్ణనము. ♦—

ద్విజవరులారా! పాపాత్ములకు నివాసంబు లగు నరకంబులనుగూర్చి చెప్పెదను వినుండు. రౌరవ, సూకర, రోధక, తాల, విశసన,

మహాజ్వాల, తప్తకుడ్య, మహాలోభ, విమోహన, రుధిరాంధ, వసాతప్త, క్రిమీశ, క్రిమిభోజన, అసిపత్త్రవన, కృష్ణ, లాలాభక్షణ, దారుణ, యూపవహ, పాప, వహ్నిజ్వాల, అధశ్శిర, సందంశ, కృష్ణసూత్ర, తమ, అవీచి, శ్వభోజన, అప్రతిష్ఠ, మరీచిప్రభృతి దారుణనరకంబులు యమునిచేఁ బరిపాలింపఁబడుచుండును. ఈఘోరనరకములన్నియు, శస్త్రాగ్నివిషమయాకారంబులచే లక్షితంబు లగుచుండును. పాపరతు లగుపురుషు లెల్లరు నీనరకంబులఁ బతితు లగుచుందురు.

కూటసాక్షులును, పక్షపాతులును, అసత్యవాదులును, కేవలమిథ్యావాదులును, భ్రూణహంతకులును, పురధ్వంసకులును, గోహంతకులును, ఘోరమగు రౌరవంబునఁ బడిపోవుచుందురు. పంచమహాపాతకులు సూకరనరకము ననుభవించుచుందురు. రాజస్వాపహారులును, వైశ్యహంతకులును, శ్వశ్రూగమనులును, తప్తకుంభనరకంబునను, మధువిక్రయులు, వధ్యపశుపాలకులు, భక్తజనపరిత్యాగులును తప్తలోహనరకంబునను, సుతాగమనులును, సుతవధూగమనులును మహాజ్వాలానరకంబునను, గురుజనదూషకులు, ఆక్రోశకారులు, వేదనిందకులు, వేదవిక్రయులు, అగమ్యాగమనులు నగువారు వివిధంబులగు మిశ్రమనరకంబులను, చోరులు, మర్యాదాలంఘనులు విమోహనరకంబునను, దేవర్షిపితృద్వేషులును, రత్నదూషకులును క్రిమిభక్షనరకంబునను, కుయజ్ఞకారులు క్రిమీశనరకంబునను, పితృదేవాతిథిపరిభావకులు లాలాభక్షణనరకంబునను, శరనిర్మాతలు రోధకనరకంబునను, ఖడ్గాద్యస్త్రకర్తలు విశసనంబునను, అసత్ప్రతిగ్రహీత లధోముఖనరకంబునను, అయాజ్యయాజకులు నక్షత్రవక్తలు మొదలగువారు క్రిమిపూయనరకంబునను, లాక్షా మాంస రస తైల లవణవిక్రేతలును, మార్జాల, కుక్కుట, ఛాగ, కుకుర, వరాహ, విహంగపోషకు లగు

బ్రాహ్మణులు పూర్వోక్తనరకంబునను, రంగోపజీవులు, వైద్యులు, కుండాశనులు, విప్రప్రయోక్తలు, సూచకులు, మాహిషకులు, పర్వసతీగమనులు, గృహదాహకులు, మిత్రఘాతుకులు, గ్రామయాజకులు, సోమవిక్రయులు నగు బ్రాహ్మణులు రుధిరాంధనరకంబునను, మద్యాపహారకులు, గ్రామహంతకులు నగువారు వైతరణీనరకంబునను, రేతఃపానకర్తలు, మర్యాదాభేదకులు, కూహకులు నగువారు కృచ్ఛ్రనరకంబునను వృథావనచ్ఛేదకు లసిపత్త్రవనంబునను మృగవ్యాధాదులును, అపాకహోత లగు బ్రాహ్మణులును వహ్నిజ్వాలానరకంబునను, ఆశ్రమభ్రష్టులు సందంశనరకంబునను దివాస్వప్నరేతఃపతను లగు బ్రహ్మచారులును, పుత్త్రసన్నిధి నధ్యయనంబు సేయు తండ్రులును శ్వభోజననరకంబునను నిపతితు లగుచుందురు. ఇంకను ననేకదుష్కృతంబులం గావించువా రనేకదారుణనరకంబులం బడి వివిధయాతనల ననుభవించుచుందురు. పూర్వోక్తంబు లగుపాపంబులే కాక యింకను ననేకవిధంబు లగు కిల్బిషంబులు గలవు. అట్టిపాపంబులం గావించు స్త్రీపురుషులు నరకంబులం బడి తత్కర్మఫలంబుల ననుభవించుచుందురు. మనోవాక్కర్మంబులచే వర్ణాశ్రమధర్మవిరుద్ధానుష్ఠానంబులం గావించువా రందఱును నిరయనిమగ్ను లయ్యెదరు.

ఓ మహాభాగులారా! స్థావర, జంగమ, కృమి, జలజ, స్థలజ, పశు, పక్షి, మనుష్యాదు లెల్లరును కర్మానుసారంబుననే ధార్మికులు గాఁగలరు. వారికి దేవత్వమును, ముక్తియుఁగూడఁ గర్మయుక్తమై యుండును. స్వర్గమున నెందఱు జీవు లుందురో నరకమునందును నందఱు గానవచ్చుచుందురు. ప్రాయశ్చిత్తకర్మానుష్ఠానపరాఙ్ముఖు లగు పాపాత్ములకు నరకభోగం బగును. మహర్షు లెంతయో చింతించి పాపంబులకుఁ దగినప్రాయశ్చిత్తవిధులను విధించియున్నారు. పాపంబులన్ని

సాధిక్యంబులంబట్టి ప్రాయశ్చిత్తంబులు తపస్వులును, కర్మాత్మకులును నగుస్వాయంభువప్రభృతులచే విహితంబు లయ్యెను. కానియీప్రాయశ్చిత్తము లన్నిటియందును కృష్ణస్మరణమే ప్రధానంబై యున్నది.

పరితాపము జనించిన పాపాత్మునకునుమాత్రమే ప్రాయశ్చిత్తము విహితమైనది. పాపి యగువాఁడు త్రికాలములయందును రాత్రులయందును నారాయణస్మరణము సేయుచు సర్వపాపవిముక్తుండును క్లేశరహితుండునై భగవన్నామకీర్తనంబున ముక్తినిసైతము పొందఁగలఁడు. జపహోమార్చనాదులయందు వాసుదేవునియెడల నిశ్చలచిత్తుండై యుండువానికి దేవేంద్రత్వాదిఫలలాభంబులుగూడ విఘ్నస్వరూపములుగానే యుండును. పునరావృత్తిహేతువు లగు స్వర్గాదిగమనంబు లెక్కడ? ఉత్తమముక్తిబీజం బగు వాసుదేవనామజపం బెక్కడ? కావున దివారాత్రములు విష్ణునామస్మరణంబు గావింపవలయును. అట్టివాఁడు విశుద్ధుండును, నిష్పాపుండు నగుటయేకాక యెన్నఁటికి నరకపతితుండు గాఁడు. స్వర్గము మనఃప్రీతికరంబును నరకము తద్విపరీతంబు నై యుండును. కావుననే పుణ్యపాపములకు స్వర్గనరకనామంబు లన్వర్థంబులై యున్నవి. ప్రతివస్తువును సుఖదుఃఖాత్మకమై యుండును. కేవల సుఖాత్మకముగాఁగాని, కేవల దుఃఖాత్మకముగాఁగాని యేవస్తువును లేదు. సుఖదుఃఖములు మనఃపరిణామమాత్రములు. జ్ఞానమే పరబ్రహ్మము. అజ్ఞానము బంధకారణము. ఈవిశ్వమంతయు జ్ఞానాత్మకమైనది. జ్ఞానముకంటెఁ బరమబంధు వెద్దియును లేదు. విద్యావిద్యలు రెండును జ్ఞానస్వరూపములే.

ఓవిప్రవరులారా! నే నిప్పుడు సకలపాతాళములు సమస్తభూమండలము, సకలనరకములు, సాగర, శైల, ద్వీప, వర్షములు మొదలగువానింగూర్చి సంక్షేపముగ వర్ణించితిని.

## ఖగోళవర్ణనము.

ఇఁక ఖగోళంబునుగూర్చి వక్కాణించెదను వినుండు. సూర్య చంద్రుల కాంతి యెంతవఱకు వ్యాపించునో అంతవఱకునుగల ప్రదేశ మంతయు పృథ్వీమండల మని చెప్పంబడును. ఆకాశమండలము భూమండలముతో సమానమైన పరిమాణముగలది. పృథ్వికి లక్షయోజనములపైని సూర్యమండలంబును, దానికి లక్షయోజనములపైని చంద్రమండలంబును దానికి లక్షయోజనములదూరమున నక్షత్రమండలంబును విరాజిల్లుచుండును. నక్షత్రమండలమునకు లక్షయోజనములమీఁద బుధగ్రహమును, దాని కంతియదూరంబున శుక్రగ్రహంబును, దానిపై నంతదూరంబుననే మంగళగ్రహంబును, దాని కూర్ధ్వంబున నంతియదూరంబుగ బృహస్పతిగ్రహంబును దానికి ద్విలక్షయోజన దూరంబున శనిగ్రహంబును గలవు. శనైశ్చరునకు లక్షయోజనముల దూరమున సప్తర్షిమండలం బున్నది. దానికి లక్షయోజనములదూరమున జ్యోతిశ్చక్రంబున కంతకును కేంద్రీభూతం బగుధ్రువమండలంబు గలదు. ధ్రువస్థానంబున కూర్ధ్వంబున కల్పవాసులకు నివాసంబగు మహర్లోకంబు గలదు. జనలోకమున సనందనాది బ్రహ్మనందనులు నివసించియుందురు. తపోలోకంబున దేహవిహీనులును, వైరాజనాము లగు దేవగణంబులు విరాజిల్లుచుందురు. సత్యలోకంబున సిద్ధముని గణంబులు నివసించియుందురు. అందు చేరువారికి మృత్యుభోగంబు లేదు. పాదగమ్య మగుస్థాన మంతయును పృథ్వీమండలం బని చెప్పఁ బడును. భూమికిని, సూర్యునికిని నడుమ సిద్ధమునిసేవితం బగుస్థానము భువర్లోకము. ధ్రువసూర్యమండలంబుల కంతరాళంబున చతుర్దశ నియుతయోజనపరిమిత మగు ప్రదేశము స్వర్లోకము. విప్రవరులారా, ఈలోకత్రితయము కృతకం బనియును జనతపస్సత్యలోకత్రితయం

బకృతకం బనియుఁ జెప్పుదురు. ఈరెంటికిని నడుమ కృతకాకృతకం బగు మహర్లోకంబు గలదు. ఇది శూన్యప్రాయయ మైనది. కల్పాంతంబునం దైనను దీనికి నాశంబు లేదు. సప్తమహాలోకంబులును, సప్తపాతాళలోకంబులును గల యీబ్రహ్మాండము తిర్యగధోభావంబున కపిత్థబీజంబుంబోలె నండకటాహముచే సమావృతమైనది. ఆకటాహము దశగుణాధికజలంబులచేతను, ఆజలము దశగుణాధికానలంబుచేతను, అయ్యనలంబు దశగుణాధికానిలంబుచేతను, అయ్యనిలంబు దశగుణాధికాకాశంబుచేతను, అయ్యాకాశము దశగుణాధికమహత్తత్త్వముచేతను బరివేష్టితంబులై యుండును.

అమ్మహత్తత్త్వమునంతను బ్రధానము (ప్రకృతి) నిండుకొని యుండును. ఈప్రకృతి యనంతమైనది. దీని కంతముగాని, సంఖ్యగాని లేదు. ఈప్రకృతియే సమస్తబ్రహ్మాండములకును హేతుభూతమైనది. సహస్రసహస్రబ్రహ్మాండంబు లీప్రకృతియందే అధిష్ఠితంబులై యున్నవి. చైతన్యాత్మకుండును సర్వవ్యాపియు నగుపురుషుండు ఈప్రకృతియందు దారువునందలియగ్నివలెను, తిలబీజమునందలి తైలమువలెను, సమ్మిళితుండై యుండును. ఈవిధముగాఁ బరస్పరాశ్రయధర్మము గల ప్రధానపురుషు లిరువురును సర్వభూతానుభూతం బగు విష్ణుశక్తిచే నాబద్ధులై యుందురు. వీరిలోఁ బ్రకృతి పురుషునికంటె భిన్నమై సర్వకారణం బగుచున్నది. ఈప్రకృతియే సర్గకాలంబున క్షోభకారణభూతమైనది. జలకణంబులయందలి శైత్యమును వాయువు ధరించినట్లు విష్ణుశక్తి ప్రకృతిపురుషాత్మకం బగునీజగంబును ధరించుచున్నది.

బీజమునుండి మూల, స్కంధ, శాఖాసమన్వితంబైన పాదపము వృద్ధిఁ బొందుచున్నది. దానినుండి యనేకబీజంబు లుత్పన్నంబు లగు

చున్నవి. ఆబీజంబులనుండి మరల ననేకవృక్షంబులు ప్రభవించుచు న్నవి. అవి యన్నియుఁ దమకుఁ గారణంబు లగు లక్షణంబులచేతనే కానవచ్చుచున్నవి. ఈవిధముగనే అవికృతం బగు మూలప్రకృతినుండి మహదాదివిశేషాంతపర్యంతంబును గలసకలంబును బ్రాదుర్భూతంబై, దానినుండి సురాసురాదులు జనియించిరి. వారినుండి వారిపుత్త్రపౌత్త్రాదులు పొడమిరి. బీజమునుండి మొలక యుదయించుటవలన బీజకారణం బగు వృక్షమున కెట్లు నష్టము లేదో, అట్లే భూతములనుండి భూతసృష్టియగుటవలనఁ దద్భూతంబుల కెట్టియపాయము నుండదు. సన్నిధానవశంబున నాకాశంబును గాలంబును వృక్షంబునకుఁ గారణంబు లైనట్లే, దృశ్యప్రపంచమునకంతకును అపరిణామక్రమంబున భగవానుండు కారణుండగుచున్నాఁడు. ఏకమాత్రవ్రీహిబీజమునుండి మూలము, నాళము, పత్త్రము, అంకురము, కాండము, కోశము. పుష్పము, క్షీరము, తండులము, తుష, కణము మొదలగునవి జనించునట్లే ఆత్మనుండి పరిదృశ్యమానం బగు నీవిశ్వ మంతయు నావిర్భూతం బయ్యెను. ప్రరోహహేతుసామగ్రిం గాంచి యనేకకర్మంబులయం దనేకతనువులు విరాజిల్లుచున్నవి. విష్ణుశక్తి ప్రాపించినంతమాత్రంబుననే వానికిఁ బ్రరోహప్రాప్తి యగుచుండును.

ఆవిష్ణుదేవుఁడే పరబ్రహ్మము. అతనినుండియే సకలజగంబులును సముద్భూతంబు లైనవి. ఆతఁడు జగన్మయుఁడు. ఆతనియందే జగంబునకు స్థితియును లయంబును బ్రాపించుచున్నవి. ఆబ్రహ్మమే సదసత్స్వరూపం బగు పరమవస్తువు. చరాచరం బగునీవిశ్వం బంతయు దాని కభిన్నరూపంబునఁ బ్రకాశించుచుండును. అదియే మూలప్రకృతి. ఈజగం బంతయు దాని వ్యక్తస్వరూపమే. దానియందే సమస్తంబును లయించును. దానియందే సకలంబును వసించును.

అదియే సర్వక్రియలకును కర్త. విష్ణుస్వరూపం బగు నాపరబ్రహ్మము నుండియే సకలము నావిర్భవించుచుండును. దానికి వ్యతిరిక్తంబైన దేదియును లేదు.

## —◆ ధ్రువమండలనిరూపణము. ◆—

ఆకాశమండలంబున భగవానుండైన విష్ణుదేవుని తారామయం బగు శింశుమారాకారము విరాజిల్లుచుండును. దానిపుచ్ఛభాగంబున ధ్రువమండలం బొప్పారుచున్నది. ధ్రువమండలభ్రమణము ననుసరించియే సూర్యచంద్రాదిగ్రహంబులును నక్షత్రపుంజంబులును జక్రాకృతిం దిరుగుచుండును. వాతానీకమయంబు లగు పాశంబులచే బంధింపఁబడినవో యనునట్లు సూర్య, చంద్ర, గ్రహ, నక్షత్రాదు లెల్ల ధ్రువమండలంబుతోఁ బరిభ్రమించుచుండును. గగనగోళంబున శింశుమారాకృతి నున్న పరంధాముండైన నారాయణుండే వాని కన్నిటికి నాధారభూతుండై యున్నాఁడు. ఉత్తానపాదతనయుం డగు ధ్రువుండావిష్ణుని నారాధించియే, తత్ఫలంబుగా, నా దేవదేవుని తారామయ శింశుమారాకారమునం గల పుచ్ఛదేశంబున శాశ్వతస్థానమును బొందియున్నాఁడు. సూర్యునకు ధ్రువుండును, ధ్రువునకు శింశుమారచక్రంబును నాధారభూతంబులు. సర్వాధిష్ఠానం డగుజనార్దనుం డాశింశుమారచక్రంబున కాధారుండై యున్నవాఁడు.

ద్విజోత్తములారా! సురాసురనరపరివృతం బగు నీజగం బంతయు సూర్యునిచే నేవిధంబుగ విరాజమానం బగుచున్నదో వక్కాణించెద నాకర్ణింపుఁడు. వివస్వంతుం డెనిమిదిమాసము లీజగంబునుండి క్రమక్రమముగా రసాత్మకంబు లగు జలంబులం గ్రహించి పిమ్మట వర్షరూపంబున నాజలంబులనే పునమ్మిచ్చి ననుగ్రహించుచున్నాఁడు.

ఆజలంబులవలన నన్నంబు గలుగుచున్నది. ఆయన్నంబువలన నిఖిల జగంబును జీవించుచున్నది. భానుదేవుండు తనతీక్ష్ణకిరణజాలంబులచే జగంబునుండి జలంబులను సంగ్రహించి వానిని జంద్రమునియం దునిచి యాతనికిం బరిపుష్టిని గలిగించుచున్నాండు. ఆసోముండును వాయునా డీమయంబు లగుచయ్యుదకంబులనెల్ల ధూమాగ్న్యనిలమయంబులగు నభ్రబృందంబులయందు నిక్షేపించుచుండును. ఆయభ్రంబులనుండి యుదకంబులు భ్రంశంబులు గావు గనుకనే వానియభ్రనామంబు సార్థక మగుచున్నది. పైరీతి నభ్రసమూహములయందు గలిగిన జలరాసులు వాయువశంబున భూపతితంబులై కాలసంస్కారంబుచే నిర్మలంబు లగుచున్నవి. విప్రవరులారా! జలంబులు సరిత్సంస్థితంబులు, సాముద్రికంబులు, భౌమంబులు, ప్రాశసంభవంబులు నని నాలుగువిధంబులు గలవి. భగవానుండైన సూర్యదేవుం డీనాలుగువిధంబులగు సలిలంబులను గ్రహించుచున్నాండు. ఇంతియేకాక, యాభానుదేవుండు, తనసహస్రకిరణంబులచే నాకాశగంగను దివంబునుండి యాహరించి యప్పుడప్పుడు వృష్టిజలంబుల గొనుచున్నాండు. ద్విజోత్తములారా! ఆ గంగాజలసంస్పర్శముచేతనే యాయామానవకోటి పాపఫలంబులు భస్మీభూతంబు లగుచున్నవి. దానంజేసియే యామానవు లెన్నండును నరకనిమగ్నులుగాక స్వర్గస్థానసంపన్నులు గాంగలుగుచున్నారు. ఆకాశగంగాజలంబు లోకోత్కృష్టమగు సూర్యునిచే స్పృశింపంబడకుండంగనే మేఘంబులనుండి పతితంబు లగుచున్నవి. ఎట్లయినను, సౌరకరసాహాయ్యంబుననే యవి భూతలనిపతితంబు లగుచుండును. కృత్తికాదివిషమనక్షత్రంబులనుండి పతితంబగు జలము దిగ్గజోత్క్షిప్తంబును, సూర్యస్పృష్టంబు నగు స్వర్గంగాజలంబని చెప్పంబడును. యుగ్మనక్షత్రంబులనుండి సూర్యోద్ధృతంబై పతితంబగు సలిలంబు సూర్యరశ్మిదీప్తం

బగు నుదకం బని యెఱుంగవలయును. ఈయిరుదెఱంగులతోయంబును నతిపవిత్రంబును పాపహారంబును, దివ్యస్నానఫలదంబు నైనది. ఇదిగాక మేఘపతితం బగుజలంబు సకలౌషధులకుఁ బరిపుష్టికరంబును సకలజీవులకు నాధారంబును నగుటచే నమృతస్వరూపమై యుండును. ఓషధులన్నియును దానివలననే వర్ధిల్లును. ఫలపరిపాకంబును నోషధులవసన్నంబు లగును. ఓషధీసమూహామే ప్రజలజీవధారణంబునకుఁ బ్రధానకారణం బగుచున్నది. శాస్త్రజ్ఞు లగుమానవులు ఓషధులచేతనే యథావిధిగ యజ్ఞనిర్వహణంబు గావింతురు. మఱియు దినదినము దేవగణంబులకుఁ బరితృప్తిం గూర్చెదరు. ఇట్లే యజ్ఞంబులును, వేదంబులు, ద్విజాదివర్ణచతుష్టయంబు, దేవగణంబులు, పశువులు, సకలభూతంబులునుగూడ నోషధులమూలముననే తృప్తిం గాంచుచున్నవి. కావున, సచరాచరం బగు నీజగం బంతయుఁ గేవలవృష్టిమూలముననే ధృతంబై యున్నది. ఆవృష్టి సూర్యునినుండి కలుగుచున్నది. ఆ సూర్యుఁడు ధ్రువమండల మాధారముగా నిలిచి యున్నాఁడు. ధ్రువునకాధారము శింశుమారము. దానికి నారాయణుఁ డాధారస్వరూపుఁడు. సర్వభూతవిధాతయు, ఆదిభూతుండును, సనాతనుండును నగు నద్దేవుండు శింశుమారహృదయంబున సుస్థిరుండై యుండును.

## తీర్థమాహాత్మ్యవర్ణనము.

మునిశ్రేష్ఠులారా! విద్యయు, కీర్తియు, తపశ్చర్యయుఁ గలవారును, హస్తపాదమనంబులను సంయుతంబులుగఁ జేసికొన్నవారును తీర్థఫలంబును బడయఁగలరు. విశుద్ధహృదయము, సంయుతవచనము, ఇంద్రియనిగ్రహము, ననునివియే పురుషశరీరధర్మములు. ఇవియు స్వర్గమార్గమును నిర్దేశించుచున్నవి. అపరిశుద్ధంబును దుష్టంబు

సగుచిత్తంబు గలవారు జలంబులచేనూఱుసారులు కడుగఁ బడినను శుద్ధంబుగాని సురాభాండముంబోలెఁ దీర్థస్నానంబులచే నెన్నఁటికిని బరిశుద్ధులు గాఁజాలరు. ఇంద్రియాసక్తుండగు వాంఛితునకుఁ దీర్థ, దాన, వ్రతాశ్రమాదు లెవ్వియును శుద్ధిం గూర్పఁజాలవు. ఇంద్రియంబులను వశీభూతంబులను గావించుకొన్న పుణ్యపురుషుం డెందున్న నేమి? ఆతనికా స్థానంబులు కురుక్షేత్ర ప్రయాగ పుష్కరతీర్థస్వరూపంబులు గాఁగలవు. ఋషివరులారా! ఈపృథ్వీమండలంబునం గల సకలతీర్థంబులం గూర్చియు, పుణ్యక్షేత్రంబులంగూర్చియు సవిస్తరంబుగఁ జెప్పుట శతవర్షంబులకైనను సాధ్యంబుగాదు గావున సంక్షేపించి ప్రశంసించెదవినుండు. పుష్కరతీర్థము, నైమిశారణ్యము, ప్రయాగ, ధర్మారణ్యము, ధేనుకాతీర్థము, చంపకారణ్యము, సైంధవారణ్యము, మగధారణ్యము, దండకారణ్యము, గయ, ప్రభాసము, శ్రీతీర్థము, కనఖలము, భృగుతుంగము, హిరణ్యాక్షము, భీమారణ్యము, కుశస్థలి, లోహాకులము, కేదారము, మందరారణ్యము, మహాబిలము, సర్వపాపహరము, కోటితీర్థము, రూపతీర్థము, శూకరవము, చక్రతీర్థము, యోగతీర్థము, సోమతీర్థము, సహోటకము, కోకాముఖము, బదరీశైలము, సోమతీర్థము, తుంగకూటము, స్కందాశ్రమము, అగ్నిపదము, పంచశిఖము, ధర్మోద్భవము, బాధాప్రమోచనము, గంగాద్వారము, పంచకూటము, మధ్యకేసరము, చక్రప్రభ, మతంగతీర్థము, క్రౌశదండము, దంష్ట్రాకుండము, సర్వకామప్రదము, విష్ణుతీర్థము, మత్స్యతిలతీర్థము, సుప్రభ, బ్రహ్మకుండము, వహ్నికుండము, సత్యపదము, చతుస్స్రోతము, చతుశ్శృంగము, ద్వాదశధారాకతీర్థము, మానసము, స్థూలశృంగము, స్థూలదండము, ఉర్వశీతీర్థము, లోకపాలతీర్థము, మనువరతీర్థము, శైలతీర్థము, సదాప్రభ, మేరుకుండము, సోమాభిషేకము,

మహాస్రోతము, కోవిరకము, పంచధార, త్రిధార, సప్తధార, ఏకధార, అమరకంటకము, సాలగ్రామచక్రతీర్థము, కోటిద్రుమము, బిల్వప్రభ, దేవహ్రదము, విష్ణుహ్రదము, శంఖప్రభ, దేవకుండము, వజ్రాయుధము, అగ్నిప్రభ, పున్నాగము, దేవప్రభ, విద్యాధరము, గాంధర్వము, బ్రహ్మహ్రదము, లోకపాలతీర్థము, మణిపూరగిరి, పంచహ్రదము, పిండారకము, మాళవ్యము, గోప్రభావము, గోవరము, వటమూలకము, స్నానదండము, విష్ణుపదము, కన్యాశ్రమము, వాయుకుండము, జంబూమార్గము, గభస్తితీర్థము, యయాతిపతనము, భద్రవటము, మహాకాలవనము, నర్మదాతీర్థము, వజ్రతీర్థము, అర్బుదము, పింగుప్ప, వాసిష్ఠము, పృథుసంగమము, దౌర్వాసికము, పింజరకము, ఋషితీర్థము, బ్రహ్మతుంగము, వసుతీర్థము, కుమారికతీర్థము, శక్రతీర్థము, పంచనదము, రేణుక, పైతామహము, రుద్రపాదము, మణిమంతము, కామకృష్ణతీర్థము, కుశావిలము, యజనము, యాజనము, బ్రహ్మవాలుక, పుష్పన్యాసము, పుండరీకము, మణిపురము, దీర్ఘసత్త్రము, హయపదము, అనశనము, గంగోద్భవము, శిరోద్భేదము, నర్మదోద్భేదము, వస్త్రాపదము, దారుబలము, ఛాయారోహణము, సిద్ధేశ్వరము, మిత్రబలము, కాళికాశ్రమము, వటావటము, కౌశాంబి, దివాకరము, సారస్వతద్వీపము, విజయము, కామదము, సుమనము, సదాశివనామితము, స్యమంతపంచకము, బ్రహ్మతీర్థము, సుదర్శనము, పృథ్వీసన్గము, పారిప్లవము, పృథూదకము, దశాశ్వమేధికము, సర్పిజము, విషయాంతికము, వరాహము, యాక్షిణీహ్రదము, ముంజవటము, బదరీవనము, రత్నమూలకము, లోకద్వారము, కపిలతీర్థము, సూర్యతీర్థము, పంచతీర్థము, శంఖినీతీర్థము, గోభవనము, యమరాజతీర్థము, సతీర్థము, బ్రహ్మావర్తము, కామేశ్వరము, మాతృతీర్థము, శీతవనము, స్నానలోమాపహము,

మానససంసరకము, బ్రహ్మోదుంబరము, సప్తర్షికుండము, దేవీతీర్థము,
సుజంబుకము, ఈహాస్పదము, కోటికూటము, కిందానము, కింజపము,
కారండవము, అవేధ్యము, త్రివిష్టపము, పాణిఖాతము, మిశ్రకము,
మధువటము, మనోజవము, కౌశికి, దేవతీర్థము, ఋణమోచనము,
మృగధూమము, అమరహ్రదము, శ్రీపుంజము, శాలితీర్థము, నైమి
షేయము, బ్రహ్మస్థానము, మనస్తీర్థము, కురుపావనము, సౌగంధిక
వనము, మణితీర్థము, సరస్వతీతీర్థము, ఈశానతీర్థము, పాంచయజ్ఞిక
ము, త్రిశూలధార, మాహేంద్రము, దేవస్థానము, కృతాలయము,
శాకంభరి, సువర్ణతీర్థము, కాళీహ్రదము, క్షీరస్రవము, విరూపాక్షము,
భృగుతీర్థము, కుశోద్భవము, బ్రహ్మతీర్థము, బ్రహ్మయోని, నీలాచ
లము, కుంజామ్రకము, భద్రవటము, వాసిష్ఠపదము, స్వర్గద్వారము,
కాళికాశ్రమము, రుద్రావర్తము, సుగంధాశ్వము, కపిలావనము, భ
ద్రకర్ణహ్రదము, శంకుకర్ణహ్రదము, సప్తసారస్వతము, ఔశనసము,
కపాలమోచనము, అవకీర్ణము, కామ్యకము, చతుస్సాముద్రికము,
శతికము, సహస్రికము, రేణుకము, పంచవటకము, విమోచనము,
ఓజసము, స్థాణుతీర్థము, కురుతీర్థము, కుశధ్వజము, విశ్వేశ్వరము,
మానవకకూపము, నారాయణాశ్రమము, గంగాహ్రదము, వటము, బద
రీపాటనము, ఇంద్రమార్గము, ఏకరాత్రము, క్షీరకావాసము, సోమతీ
ర్థము, దధీచతీర్థము, శ్రుతతీర్థము, కోటితీర్థస్థలి, భద్రకాళీహ్రదము,
అరుంధతీవనము, బ్రహ్మావర్తము, అశ్వవేది, కుంజావనము, యమునా
ప్రభవము, వీరప్రమోక్షము, సింధూత్థము, ఋషికుల్య, కృత్తిక,
ఉర్వసంక్రమణము, మాయావిద్యోద్భవము, మహాశ్రమము, నైతసి
కారూపము, సుందరికాశ్రమము, బాహుతీర్థము, చారునది, విమలా
శోకము, పంచనదము, మార్కండేయసోమతీర్థము, అశోకవనతీర్థము,

అరుణాస్పదము, కామవనము, శుక్రతీర్థము, వాలుకము, పిశాచమోచనము, సుభద్రాహ్రదము, విమాలదండకుండము, చండేశ్వరతీర్థము, జ్యేష్ఠస్థానహ్రదము, బ్రహ్మసరము, జైగీషవ్యగుహ, హరికేశవనము, అజాముఖసరము, ఘంటాకర్ణహ్రదము, పుండరీకహ్రదము, కర్కోటకవాపి, సువర్ణోదపానము, శ్వేతతీర్థహ్రదము, ఘర్ఘరికాకుండము, శ్యామకూపము, చంద్రికాతీర్థము, శ్మశానస్తంభకూపము, వినాయకహ్రదము, సింధూద్భవకూపము, రుద్రవాసము, నాగతీర్థము, పులోమకము, భక్తహ్రదము, క్షీరసరము, ప్రేతధార, కుమారకతీర్థము, బ్రహ్మావర్తము, కుశావర్తము, దధికర్ణోదపానకము, శృంగతీర్థము, మహాతీర్థము, మహానది, బ్రహ్మసరము, గయాశీర్షము, అక్షయవటము, దక్షిణగోమయము, ఉత్తరగోమయము, రూపశీతికము, కపిలాహ్రదగృధ్రవటము, సావిత్రీహ్రదము, ప్రభాసనము, శీతవనము, యోనిద్వారము, ధేనుకము, ధన్యకము, కోకిల, మతంగహ్రదము, పితృకూపము, రుద్రతీర్థము, శక్రతీర్థము, సుమాలి, బ్రహ్మస్థానము, సప్తకుండము, మణిరత్నహ్రదము, కౌశిక్యము, భరతతీర్థము, జ్యేష్ఠాలిక, విశ్వేశ్వరము, కల్పసరము, కన్యాసంవేద్యము, నిశ్చివాప్రభవము, వాసిష్ఠాశ్రమము, దేవకూటము, వాసిష్ఠాశ్రమకూపము, వీరాశ్రమము, బ్రహ్మవీరము, అవకాపిలీతీర్థము, కుమారధార, శ్రీధార, గౌరీశిఖరము, శ్వకుండము, నందితీర్థము, కుమారవాసము, శ్రీవాసము, కుంభకర్ణహ్రదము, కౌశికీహ్రదము, ధర్మతీర్థము, కామతీర్థము, ఉద్దాలకతీర్థము, సంధ్యాతీర్థము, కరతోయ, కపిల, లోహితార్ణవ, శోణోద్భవ, వంశగుల్మము, ఋషభ, ఫలతీర్థము, పుణ్యావతీహ్రదము, రామతీర్థము, పితృవనము, విరజాతీర్థము, మార్కండేయవనము, కృష్ణతీర్థము, రోహిణీకూపము, ప్రవరతీర్థము, ఇంద్రద్యుమ్నసరము, సానుగర్తము, సూ

హేంద్రము, శ్రీనదము, ఇషుతీర్థము, కావేరీహ్రదము, గోకర్ణము, గాయత్రీస్థానము, బదరీహ్రదము, మత్స్యస్థానము, విశ్వతీర్థము, జాతిస్మరహ్రదము, దేవకూపము, కుశప్రవనము, సర్వదేవవ్రతము, కన్యాశ్రమహ్రదము, వాలఖిల్యహ్రదము, మహర్షిహ్రదము, అఖండితహ్రదము మొదలుగాఁగల యీసకలతీర్థంబులయందును మాసమాసము జితేంద్రియుండై యుపవసించి, స్నానముచేసి, క్రమంబున దేవర్షిపితృతర్పణంబులఁ గావించి దేవతాదుల నర్చించి ప్రతితీర్థంబునందును త్రిరాత్రంబులు గడపవలయును. అట్టితీర్థసేవనులగు పుణ్యాత్ములకుఁ బ్రతితీర్థమునను బ్రత్యేకముగ నశ్వమేధఫలలాభంబు సిద్ధించును. ఈయుత్తమతీర్థమాహాత్మ్యంబును వినువారును జదువువారును వినుపించువారును సకలపాపవిముక్తు లగుదురు.

## —◆ బ్రహ్మర్షిసంవాదము. ◆—

అనుటయు మునివరు లిట్లనిరి. ఓ వాగ్మివరా! ఈభూమండలంబున ధర్మార్థకామమోక్షప్రదంబును సకలతీర్థస్థానంబులయం దుత్తమంబును నగు పవిత్రస్థానమొకదానిఁ దెలుపఁగోరెదము. అని వేఁడుటయు లోమహర్షణుం డిట్లనియెను. ద్విజశ్రేష్ఠులారా! పూర్వపురాణకాలమున నొకప్పుడు మహర్షి యగు వేదవ్యాసుండు కురుక్షేత్రంబునఁ బుణ్యజనకంబును, నానాతరులతాకీర్ణంబును, నానావిధకుసుమసమన్వితంబును, నానామృగసంకులంబును నగుపవిత్రస్థలంబున సుఖాసీనుండై యుండెను. అయ్యెడ నతని గని సంశితవ్రతులును, మతిమచ్ఛ్రేష్ఠులును, మహాభాగవతులును, సర్వశాస్త్రవిశారదులును, అధ్యాత్మజ్ఞానతత్పరులును, సమస్తవిషయాభిజ్ఞులును, సర్వభూతహితరతులును, పురాణాగమప్రవక్తయు, వేదవేదాంగవేత్తయు నై యుం

డెను. పద్మపలాశలోచనుండును, సమగుణావలంబియు నగునప్పారా శర్యుని సందర్శించుటకై ప్రీతిపూర్వకంబుగఁ బ్రశంసితవ్రతులగు కశ్యపుఁడు, జమదగ్ని, భరద్వాజుఁడు, గౌతముఁడు, వసిష్ఠుఁడు, జైమిని, ధౌమ్యుఁడు, మార్కండేయుఁడు, వాల్మీకి, విశ్వామిత్రుఁడు, శతానందుఁడు, వాత్స్యుఁడు, గార్గ్యుఁడు, ఆసురి, సుమంతుఁడు, భార్గవుఁడు, కణ్వుఁడు, మేధాతిథి, మాండవ్యుఁడు, చ్యవనుఁడు, ధూమ్రుఁడు, (అసితుఁడు) దేవలుండు, మౌద్గల్యుఁడు, తృణయజ్ఞుఁడు, పిప్పలాదుఁడు, అకృతవ్రణుఁడు, సంవర్తుఁడు, కౌశికుఁడు, రైభ్యుఁడు, మైత్రేయుఁడు, హారితుఁడు, శాండిల్యుఁడు, విభాండుఁడు, దుర్వాసుఁడు, లోమశుఁడు, నారదుఁడు, పర్వతుఁడు, వైశంపాయనుఁడు, గాలవుఁడు, భాస్కరి, పూరణుఁడు, సూతుఁడు, పులస్త్యుఁడు, కపిలుఁడు, ఉలూకుఁడు, పులహుఁడు, వాయువు, దేవస్థానుఁడు, చతుర్భుజుఁడు, సనత్కుమారుఁడు, పైలుఁడు, కృష్ణుఁడు మొదలగువారందఱును వచ్చి చంద్రునిఁ బరివేష్టించిననక్షత్రములంబోలి యావ్యాసదేవునిఁ బరివేష్టించియుండిరి.

వేదజ్ఞుండగు వ్యాసదేవుండును సమాగతులగు నమ్మునివరులకు యథాయోగ్యసత్కారంబు లాచరించి వారలచేఁ బ్రతిపూజితుండై యున్నసమయంబునఁ బ్రసంగవశంబున మునివరు లందఱును దమసంశయముం గూర్చి కృష్ణద్వైపాయను నిట్లు ప్రశ్నించిరి. పరమయోగీంద్రా! నీవు నిఖిలవేదశాస్త్రపురాణాగమజ్ఞుండవు. భూతభవిష్యద్వర్తమానవిషయాభిజ్ఞుండవు. ఈసంసారము దుఃఖమయమైనది. ఈభవసాగరంబున సార మేమియునులేదు. ఇందు విషయసలిలంబులును, రాగగ్రాహగణంబును, ఇంద్రియావర్తసమూహంబును, ప్రపంచతరంగమాలికాపుంజమును, మోహపంకమును నిండియున్నవి. కలుషలోభగాంభీర్యవశంబున నది సురవగాహం బైనది. మేము, ఈయపారభీకర

భవసాగరంబున నిరాశ్రయం బగు జడజగం బంతయు నిమగ్నం బగు చుండుటం గాంచి, మహాపురుషుండ వగు నిన్నుఁ బ్రశ్నించుచున్నాము. లోమహర్షణం బగు సిద్ధాం[illegible] బ్రత్యక్షమంగళక రం బగునది యేదియో మా కుపదేశించి లోకోద్ధరణంబుం గావింపుము. ఈమండలంబున మోక్షప్రదంబును దుర్లభంబును నగుకర్మక్షేత్ర మేదియో వినఁ గుతూహలపడుచున్నాము. ఓమహాప్రాజ్ఞ! మానవులందఱు నేక్షేత్రంబున విహితకర్మానుష్ఠానంబులం గావించి పరమసిద్ధిం గాంతురో అట్లు గావింపకున్న నరకప్రాప్తు లగుదురో సుధీజను లేమోక్షక్షేత్రంబున మోక్షలాభంబును గాంచియుండిరో అట్టిదివ్యక్షేత్రముంగూర్చి మా కెఱుంగింపవలయును. ఇదియే మాప్రార్థనము. అనుటయు భూతభవ్యభవిష్యద్విదుండును, భగవానుండును నగువేదవ్యాసుండు భావితాత్ము లగు నమ్మునివరులం గాంచి యిట్లనియెను.

తపోధనులారా! ఈవిషయంబున పూర్వము బ్రహ్మకును మహర్షులకును సంవాదము జరిగినది. దానిని మీ కెఱింగించెదను వినుండు. నానారత్నవిభూషితంబును, నానాద్రుమలతాకీర్ణంబును, నానాపుష్పోపశోభితంబును, నానావిహంగానునాదితంబును, నానాప్రస్రవణసమన్వితంబును, నానావిచిత్రక్రీడాపరిపూర్ణంబును, నానాశిలాఖండాలంకృతంబును, నానామునిసమేతంబును, నానాశ్రమపరివృతంబును, విస్తీర్ణంబును, రమణీయంబును నగుమేరుపృష్ఠంబున జగన్నాథుండును, జగద్యోనియు, చతుర్వక్త్రుండు నగుబ్రహ్మదేవుం డాసీనుండై యుండ, దేవ, దానవ, గంధర్వ, యక్ష, విద్యాధర, ఉరగ, ముని, సిద్ధ, సాధ్యప్రభృతులును, దేవర్షిగణంబులును, అప్సరోనివహంబులును, తదితరస్వర్గవాసులును జగద్వంద్యుం డగు నాజగత్ప్రభుని పరివేష్టించి స్తవంబులును, గుణకీర్తనంబులును, వివిధవాద్యవాదనంబులును, నృత్యంబులును, గా

గంజులును గావించుచు సేవించుచుండిరి. అట్టిరమణీయసుఖసమయం బున సర్వజీవసమాగమసమయంబున వివిధకుసుమగంధంబులతో దక్షి ణానిలంబు ప్రవహించుచున్నసమయంబున భృగుప్రభృతిమహర్షులెల్ల రును భగవానుం డగు పితామహునకుఁ బ్రణమిల్లి ఓదేవదేవా! మ హీతలంబున సర్గభవమోక్షక్షేత్రం బగు కర్మభూమి యెద్దియో మా కెఱుంగింపవలయు నని ప్రార్థించిరి. బ్రహ్మదేవుండును వారివిన్నపం బును మన్నించి యిట్లనియెను.

మునివరులారా! నే నిప్పుడు భుక్తిముక్తిప్రదంబును వేదమతా నుగతంబును శుభావహంబును పురాతనంబు నగు నొకవిషయంబును బ్రసంగించుచున్నాను. ఈభూమండలంబున భారతవర్షం బొక్కటియే కర్మభూమిగాఁ బ్రఖ్యాతం బైనది. అందు గర్మానుసారంబుగ స్వర్గ నరకాదిఫలంబులు ప్రాప్తించుచుండుటచే దానికిఁ గర్మభూమి యని కూడ నామంబు గలదు. అందుగల జనులు తమతమపుణ్యపాపంబు లకు శుభాశుభఫలంబుల నవశ్యముగ ననుభవించుచుందురు. భారత వర్షంబున బ్రాహ్మణులు నియతులై తమతమవిహితకర్మంబుల నాచరిం చి పరమసిద్ధిం గాంచుచుందురు. అందు నియమవంతు లగుపురుషులు ధర్మార్థకామమోక్షపురుషార్థఫలలాభంబులం గాంతురు. వేయేల? మ హేంద్రప్రముఖు లగుదేవత లెల్లరును భారతవర్షంబున శుభకర్మంబు లం గావించియే దేవత్వముం గాంచియుండిరి. మఱియు జితేంద్రియులు ను, శాంతులును, వీతరాగులును, విమత్సరులు నై మోక్షంబుం గాం చినవారిసంఖ్యకు నిర్దేశము లేదు. స్వర్గమున విగతజ్వరులై విమానచా రులై విహరించువా రెల్లరును భారతవర్షంబున శుభకర్మముల నాచ రించినవారలే. స్వర్గాపవర్గఫలదాయకం బగు భారతవర్షమును జూచు టకును, అందు విహరించుటకును దేవత లెల్లప్పుడును గుతూహలపడు

చుందురు. అని చెప్పుటయు, మునివరులు ఓసురశ్రేష్ఠా! నీవు వచించిన ట్లు భారతవర్షంబుకంటె మఱియెందును పాపపుణ్యకర్మానుష్ఠానంబు లేదు; స్వర్గమోక్షమధ్యగతిప్రాప్తియును లేదు. శుభాశుభకర్మవిధానంబును లేదు. కావున నో దేవా! మా కిప్పుడు భారతవర్షవృత్తాంతము సవిస్తరముగ నెఱింగింపు మని వేఁడుటయు బ్రహ్మదేవుండు వారల కిట్లనియెను.

—◆ భారతవర్షానుకీర్తనము. ◆—

మునిసత్తములారా! ఇంద్రద్వీపము, కశేరుద్వీపము, తామ్రవర్ణము, గభస్తిమంతము, నాగద్వీపము, సౌమ్యద్వీపము, గాంధర్వము, వారుణము సాగరసంవృతము అను నవద్వీపములచే భారతవర్షము తొమ్మిదిభాగములుగా విభక్తంబై యున్నది. అందు సాగరసంవృతద్వీపము దక్షిణోత్తరంబుల సహస్రయోజనవిస్తృతమై యున్నది. భారతవర్షంబునకుఁ బూర్వంబున కిరాతులును, పశ్చిమంబున యవనులును వసియింతురు. మధ్యభాగము బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులకు నివాసంబై యుండును. ఇజ్యాయుద్ధవాణిజ్యాదికర్మంబులచేఁ బవిత్రు లగువారికిఁ బ్రత్యేకకర్మంబులు విహితంబులై యుండును. భారతవర్షము స్వర్గాపవర్గహేతువును, పుణ్యపాపఫలోత్పత్తిస్థానంబును నై యున్నది. మహేంద్రము, మలయము, సహ్యము, శుక్తిమంతము, ఋక్షము, వింధ్యము, పారియాత్రము—అను నివి యందలి కులపర్వతములు. ఇంకను వానిసమీపమున ననేకసహస్రభూధరములు గలవు. అవి యున్నయు నున్నతములును, విస్తృతములును, రమ్యములును, విపులములును, విచిత్రములును నగుసానువులతో విరాజిల్లుచుండును. మందరము, కోలాహలము, మందరము, దర్దురము, వాతంధయము, వైద్యుతము, మై

సాంకము, సురసము, తుంగప్రస్థము; నాగగిరి, గోవర్ధనము, పాండుర ము, పుష్పగిరి, వైజయంతము, రైవతము, అర్బుదము, ఋశ్యమూక ము, గోమంథము, కృతశైలము, కృతాచలము, శ్రీశైలము, చకోర ము మొదలుగాఁగల యనేకపర్వతంబులు గలవు. వానిపార్శ్వంబులను అంతంబులను మధ్యసీమలను అసంఖ్యాజనపదంబులుగలవు. వానియందు భిన్నభిన్నమూర్తు లగు మ్లేచ్ఛాదిజాతులవారు నివసించి యుందురు. గంగ, సరస్వతి, సింధు, చంద్రభాగ, యమున, శతద్రు, విపాశ, వితస్త, ఇరావతి, కుహువు, గోమతి, ధూతపాప, బాహుద, దృషద్వతి, దేవిక, చక్షు, నిష్ఠీవ, గండకి, కౌశికి యనునదులు హిమాలయపాదమునుండి ప్రవహించుచుండును. వేదస్మృతి, వేత్రఘ్ని, సింధువేణ్య, చందన, సదానీర, మహి, చర్మణ్వతి, వృషి, విదిశ, వేదవతి, శిప్ర, అవంతి మొదలగునదులు పారియాత్రపర్వతమునుండి యుత్పన్నము లగుచున్నవి. శోణ, మహానది, నర్మద, సురథ, క్రియ, మందాకిని, దశార్ణ, చిత్రోపల, వేత్రవతి, కరమోద, పిశాచిక, అతిలఘుశ్రోణి, విపాప్మ, శైవల, సధేరుజ, శుక్తిమతి, శకుని, త్రిదివ, క్రము, వేగవాహిని మొదలగునదులు ఋక్షశైలసముద్భూతము లైనవి. శిప్ర, పయోష్ణి, నిర్వింధ్య, తాపి, వేణ, వైతరణి, సినీవాలి, కుముద్వతి, తోయ, మహాగౌరి, దుర్గ, అంతశ్శిల మొదలగునదులు వింధ్యపాదమునుండి వినిస్రుతంబు లగుచున్నవి. ఈసకలనదీజలంబులు హితంబులును, పుణ్యప్రదంబులు నైనవి. గోదావరి, భీమరథి, కృష్ణవేణ, తుంగభద్ర, సుప్రయోగ, పాపనాశిని మొదలగు శ్రేష్ఠవాహినులు సహ్యపర్వతపాదప్రదేశమునుండి బయలువెడలుచున్నవి. కృతమాల, తామ్రపర్ణి, పుష్పజ, ప్రత్యలావతి మొదలగు పవిత్రశీతలజలపూరితంబు లగునదులు మలయాచలమునుండి వెలువడుచున్నవి. పితృకుల్య, ఇ

ముకుల్య, ఋషికుల్య, వంజుల, త్రిదివ, లాంగలి, వంశకల మొదలగు నదులు మహేంద్రాచలంబునుండి వినిర్గతంబు లగుచున్నవి. సువికాల, కుమారి, మనుగ, మందగామిని, క్షయాపలాశిని మొదలగుతరంగిణులు శుక్తిమంతమునుండి పోడముచున్నవి. ఈచెప్పంబడిన సమస్తనదులును పుణ్యజలకములును గంగాసరస్వతీసమంబులు నై సముద్రాభిముఖంబుగఁ బ్రవహించుచున్నవి. ఈనాహిను లన్నియు జగన్మాతృస్వరూపిణులును, పాపహారిణులు నై విరాజిల్లుచున్నవి. ఇవిగాక భారతవర్షమునం దింకను చిన్నచిన్ననదు లెన్నియేని గలవు. వానిలోఁ గొన్ని వర్షాకాలంబునమాత్రమే ప్రవహించుచుండును. కొన్ని నిరంతరప్రవాహంములై విరాజిల్లుచుండును. మత్స్య, ముకుటకుల్య, కుంతల, కాశి, కోసల, అంధక, కళింగ, శమక, వృక ప్రభృతిజనపదంబులు భారత మధ్యస్థితంబులు. సహ్యాచలంబున కుత్తరంబున గోదావరీనదీప్రవాహితమగు ప్రదేశం బంతయును భూమండలంబున నతిమనోహర మైనది. ఆప్రదేశమునందు మహాత్మ్యం డగు భార్గవుని రమణీయంబగు గోవర్ధనపురము విలసిల్లుచుండును. వాహ్లీకత, వాటధాన, సుతీర, కాలతోయద, అపరాంత, శూద్ర, బాహ్లీక, కేరళ, గాంధార, యవన, సింధు, సౌవీర, మద్రిక, శతద్రుహ, కళింగ, పారమూషిక, మాఠర, కనక, కైకేయ, దండమాలిక, క్షత్త్రియోపమదేశ, వైశ్యకుల, శూద్రకుల, కాంభోజ, బర్బర, లౌకిక, వీర, తుషార, పహ్లావ, ఆత్రేయ, భరద్వాజ, పుష్కల, దశేరక, లంపక, శునశ్శేష, కులిక, జాంగల, ఔషధ్య, చలచంద్ర, కిరాతజాతి, తోమర, హంసమార్గ, కాశ్మీర, కరూశ, శూలిక, కుహూక, మాగధ ప్రభృతిజనపదంబు లుత్తరదేశంబులు. అంధ, వామాంకురక, వల్లక, మఖాంతక, అంగ, వంగ, మలద, మాళవర్తిక, భద్రతుంగ, ప్రతిజయ, భార్యాంగ, జాకమల్లక,

ప్రాగ్జ్యోతిష, మద్ర, విదేహ, తామ్రలిప్తక, మల్ల, మాగధక, నంద ప్రభృతిదేశంబులు ప్రాచ్యజనపదంబులు. పూర్ణ, కేరళ, గోలాంగూల, ఋషిక, మూషిక, కుమార, రామఠ, శక, మహారాష్ట్ర, మాహిషక, కళింగ, ఆభీర, వైసిక్య, అటవ్య, శబర, పుళింద, మాలేయ, వైదర్భ, దండక, పౌలిక, మౌలిక, అశ్మక, భోజవర్ధన, కౌలికకుండల, దంతక, నీలకాలకప్రభృతిజనపదంబులు దాక్షిణాత్యదేశంబులు. శూర్పారక, కాలిధన, లోల, తాలకటప్రభృతులు అపరాంతదేశంబులు. వింధ్యాచలంబున మలజ, కర్కశ, మేలక, చోళక, ఉత్తమార్ణ, దశార్ణ, భోజ, కిష్కింధ్య, తోషల, కోసల, త్రైపుర, వైదిశ, తుంబుర, చర, యవన, పవన, అభయ, రుండకేర, చర్చర, హోత్రధర్తిప్రభృతిజనపదంబులు గలవు. నీహార, తుషమార్గ, కురవ, తంగణ, కస, కర్ణప్రావరణ, ఊర్ణ, దర్భకుంతక, చిత్రమార్గ, మాలవ, కిరాత, తోమరప్రభృతిజనపదంబులు పర్వతాశ్రితంబులై యుండును. భారతవర్షంబున కృత, త్రేతా, ద్వాపర, కలినామంబులచే చతుర్యుగంబులు వ్యవహరింపఁబడుచుండును. దీనికిఁ బూర్వదక్షిణంబుల మహోదధియు, ఉత్తరదిగ్భాగంబున ధనుర్గుణాకారంబుతో హిమవంతంబును విరాజిల్లు. సర్వోచ్చపదంబునకు నిదానంబగు నిదియే భారతవర్షము. బ్రహ్మత్వము, ఇంద్రత్వము, దేవత్వము మొదలగునవి దీనియందే ఘటిల్లుచున్నవి. ఇందు శుభాశుభకర్మానుసారంబుగా జీవులు దేవమానవాది జన్మంబులను పశుపక్షిసరీసృపాదిజన్మంబులను గాంచుచుందురు. దీనికంటె నితరం బగు కర్మభూమి యేదియును లేదు. స్వర్గచ్యుతి యైనంతనే భారతభూమిని మానవులై పుట్టవలయు నని దేవతలుగూడ నభిలషించుచుందురు. కర్మశృంఖలాబద్ధులును గర్మక్షయంబునఁ బతనోన్ముఖులును నగు సురాసురగణంబులకు భారతీయమానవులతో సమంబగు

సామర్థ్యంబు లేదు. ఈభూమండలంబున భారతవర్షముతో సమానమగు వర్షం బెద్దియును లేదు. భారతవర్షమునందే బ్రాహ్మణాదివర్ణగణంబు అభీష్టఫలసిద్ధులం గాంచుచుందురు. భారతవర్షంబున జనించిన మానవశ్రేష్ఠులే ధన్యులు. వారే ధర్మార్థకామమోక్షంబుల చరమోత్కర్షలాభంబును బడయఁగలుగుదురు. భారతవర్షమునందే పరమదుర్లభం బగుతపము, సర్వదానములు, సర్వయజ్ఞములు, తీర్థయాత్రలు, గురుసేవ, దేవారాధనము, స్వాధ్యాయము మొదలగువానికి ఫలప్రాప్తి యగుచుండుటచే దేవతలుగూడ సంతుష్టులై భారతవర్షంబున జన్మింపవలయుననియే సర్వదా కోరుకొనుచుందురు. వివిధవ్రతంబులు, నానాశాస్త్రాధ్యయనములు, అహింస, బ్రహ్మచర్యము, గార్హస్థ్యసేవ, వనవాసము, సన్న్యాసము, ఇష్టాపూర్తము మొదలగువివిధశుభకర్మంబులకన్నిటికిని భారతవర్షమునందే ఫలసిద్ధి యగుచున్నది. ఇందుఁగాక మఱియేవర్షంబునందును సకలఫలప్రాప్తి లేదు. భారతవర్షగుణగణంబులను సంపూర్ణముగ వర్ణించుటకు నాకు సామర్థ్యము లేదు గావున నిట్లు సంక్షేపించి చెప్పితిని. పవిత్రం బగు నీభారతాఖ్యానము సర్వపాపహరంబును ధన్యమును బుద్ధివర్ధనము నై నది. నియతుండై దీనిని నిత్యమును వినువాఁడు సర్వపాపవిముక్తుండును విష్ణులోకప్రాప్తుండును నగును.

## కోణాదిత్యమాహాత్మ్యము.

మునివరులారా! భారతవర్షంబున దక్షిణసముద్రతీరమున స్వర్గమోక్షప్రదంబును, ప్రసిద్ధం బగు ఓఢ్రదేశంబు గలదు. సముద్రమునకుత్తరమున విరజమండలపర్యంతమును గల విస్తృతభూభాగము పుణ్యపురుషసమన్వితమై సర్వగుణాలంకృతమై యుండును. ఆదేశమున

జితేంద్రియులును తపస్స్వాధ్యాయనిరతులును నగు బ్రాహ్మణులు జన్మిం
చుచుందురు. వారెల్లప్పుడును సకలజనులకు వంద్యులును పూజ్యులు
నై శ్రాద్ధదానవివాహయజ్ఞాదికర్మంబులయం దాచార్యులై యుందు
రు. షట్కర్మనిరతులును, వేదపురాణేతిహాసవిదులును, సర్వశాస్త్రార్థ
పారదర్శులును, యోగశీలురును, మాత్సర్యహీనులును నగునా బ్రా
హ్మణులలో ననేకు లగ్నిహోత్రనిరతులును, అనేకులు స్మార్తాగ్నితత్ప
రులును నై యుందురు. ఆయుత్కలదేశమున నివసించు బ్రాహ్మణులు
దాతలును, సత్యవాదులు, పుత్త్రదారధనసంపన్నులును నై యుందురు.
బ్రాహ్మణులే కాక తక్కినజాతులవారును స్వధర్మనిరతులై యుండి నివ
సించుచుందురు. ఆదేశంబున కోణాదిత్యనామంబున నొకభాస్కర
మూర్తి ప్రతిష్ఠింపఁబడియుండెను. తద్దర్శనము మానవులకు సర్వపాప
విమోచకంబైనది. లవణసముద్రతీరంబున నాభాస్కరదేవుని మనోహ
రక్షేత్రము గలదు. అది సకలదిశలయందును సైకతప్రాంతములచే
సమాకీర్ణమై యుండును. సర్వర్తుసంపన్నంబు లగుచంపకాశోకపున్నా
గాదివివిధకుసుమసముజ్జ్వలంబును, పనస, నారికేళ, కపిత్థసహకారాది
ఫలభూరుహంబులచే నలంకృతంబును నగునాపుణ్యక్షేత్రము సకలజగ
త్ప్రసిద్ధమైనది. అది నలుదెసలను యోజనపరిమితంబుగలది. భోగ
మోక్షప్రదాయకుండును, సహస్రకిరణుండును నగుదివాకరుం డందు
కోణాదిత్యనామంబున విరాజిల్లుచుండును. మాఘమాసంబున శుక్ల
పక్షసప్తమియం దుపవసించి యథావిధిగ సముద్రస్నానంబు చేసి శౌ
చాచారంబున విశుద్ధుండై యాదినం బంతయు దివాకరుని స్మరించు
చు పరదివసంబు ప్రభాతంబున మరల సముద్రస్నానం బొనర్చి దేవర్షి
పితృతర్పణంబుల నాచరించి జలోత్థితుండై నిర్మలవస్త్రద్వయమును
ధరించి కృతాచమనుండై మహోదధితీరంబునఁ గూర్చుండి నియమ

పూర్వకంబున సూర్యోదయకాలంబునఁ బ్రాఙ్ముఖుండై రక్తచందనద్రవంబుచే అష్టపత్త్రవిలసితంబును ఊర్ధ్వకర్ణికాయుతంబును కేసరసమన్వితంబును నగునొకసౌరపద్మమును లిఖింపవలయును. తదుపరిభాగంబున నొకతామ్రపాత్రమునుంచి తిలతండులజలంబులను, రక్తచందనమును, రక్తపుష్పములను, కుశలను అందు ప్రక్షేపింపవలయును. తామ్రపాత్రాభావంబున అర్కపత్త్రపుటంబునఁ దిలాదుల నునిచి పత్త్రాంతరంబుచే నాచ్ఛాదింపవలయును. అనంతరము విశేషశ్రద్ధతో అంగన్యాసకరన్యాసంబులఁ గావించి, తన్ను భాస్కరమూర్తిగా ధ్యానించుచు ధీమంతుం డగుసాధకుఁడు, ఆగ్నేయము, నైఋతి, వాయు, ఈశానకోణంబులయందును, మధ్యభాగంబునను భాస్కరునిఁ బూజింపవలయును. పరమసుఖస్వరూపుండును, పరమారాధ్యుండును, గగనస్థితుండును నగుసూర్యదేవుని పద్మోపరిభాగంబున నారాధనంబుచేసి పూజించి పిమ్మటఁ గర్ణికోపరిభాగంబున స్థాపించి ముద్రాప్రదర్శన మాచరింపవలయును. పిమ్మట స్నానాదిసకలోపచారంబులను జేసి సమాహితుండై తేజోబింబస్వరూపుండును, శుక్లపద్మస్థితుండును, పింగాక్షుండును, ద్విభుజుండును, రక్తవర్ణుండును, పద్మపత్త్రారుణాంబరుండును, సర్వలక్షణలక్షితుండును, సర్వాభరణభూషితుండును, సుస్వరూపుండును, వరదుండును, శాంతుండును, ప్రభామండలమండితుండు నగుభాస్కరుని ధ్యానింపవలయును. తరువాత, ఉదయించుచున్న సాంద్రసిందూరసదృశుం డగురవిమూర్తిం గాంచి పూర్వకల్పితంబగు నర్ఘ్యపాత్రంబును గైకొని నతజానుండై అర్ఘ్యపాత్రమును మస్తకమునం దాల్చి, యేకాగ్రచిత్తంబున మౌనము వహించి త్ర్యక్షరమంత్రముతో సూర్యదేవుని కర్ఘ్యప్రదానము చేయవలయును. అదీక్షితుండైనచో శ్రద్ధాపూర్వకంబుగ భావయుక్తుండై సూర్యనామోచ్చార

ణంబు సేయుచు అర్ఘ్యదానంబు చేయవలయును. సూర్యదేవుండు భక్తియోగలభ్యుండు గావున నంతమాత్రంబుచేతనే యాతనియర్చనంబు సంపూర్ణంబు గాఁగలదు. అనంతరము ఆగ్నే, నైఋతి, వాయు, ఈశానకోణంబులయందును మధ్యభాగంబునను పూర్వాదిదిగ్భాగంబులను ఆయాదిగధీశ్వరులనుగూర్చి హృదయము, శిరస్సు, శిఖ, చర్మము నేత్రాద్యంగంబులను బూజింపవలయును. తరువాత, సుగంధధూపదీపనైవేద్యంబుల నివేదించి జపస్తవనమస్కారంబులను ముద్రాప్రదర్శనంబును గావించి యుద్వాసనంబు నొసర్పవలయును. ఈవిధముగా బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులలో స్త్రీలైనను, పురుషులైనను సుస్థిరభక్తిభావముతో, విజితేంద్రియులై సూర్యార్ఘ్యప్రదానంబు సేయువారికి నిహపరలోకసుఖంబు లభియింపఁగలదు. త్రైలోక్యదీపకుండును, నభోమణియు నగుభాస్కరు నాశ్రయించినమానవులు పరమసుఖభాజను లగుదురు. భాస్కరున కర్ఘ్యప్రదానము సేయకుండ, విష్ణువు, శంకరుఁడు, సురేశ్వరుఁడు మొదలుగాఁగలయెవ్వరిపూజనంబును గావించుట విధేయంబు గాదు. కావున ప్రతిదినంబును బ్రయత్నపూర్వకంబుగ మనోహరపుష్పగంధాదులచే నాదిత్యున కర్ఘ్యమీయవలయును. సప్తమీతిథియందు సమాహితచిత్తుండై స్నానాంతంబున శుచియై ఆదిత్యున కిట్లర్ఘ్య మిచ్చువానికి సర్వాభీష్టసిద్ధి యగును. సూర్యార్ఘ్యప్రదానమువలన రోగులకు రోగనాశనంబును విత్తార్థులకు ధనలాభంబును, విద్యార్థులకు విద్యాప్రాప్తియు, సంతానార్థులకుఁ బుత్రలాభంబును గాఁగలవు. ధీమంతుం డగువాఁడు, ఎట్టికోర్కులతో సూర్యార్ఘ్యప్రదానం బొనర్చిన నట్టికోర్కులెల్లను సిద్ధింపఁగలవు. స్త్రీపురుషులలో నెవ్వరైనను సాగరస్నానంబుచేసి సూర్యార్ఘ్యప్రదాన మాచరించి ప్రణామంబు గావించినచో వారికి సర్వకామ ఫలప్రాప్తి యగును.

మానవుఁడు శ్రద్ధాయుక్తుఁడై మౌనియై పుష్పములం గైకొని సూర్యా లయంబునకుం బోయి ముమ్మాఱు ప్రదక్షిణ మాచరించి భానుదేవు నర్చింపవలయును. గంధపుష్పధూపదీపంబులును, నైవేద్యంబు నర్పిం చి దండప్రణామంబు చేసి జయశబ్దపూర్వకంబుగ నాజగత్పతిని స్తవం బునేసి యీసహస్రరశ్మి నర్చించువాఁడు సర్వపాపవిముక్తుండై దివ్యదే హంబును ధరియించి దశాశ్వమేధఫలలాభంబును గాంచఁగలఁడు. కో ణాదిత్యు నర్చించువాఁడు తనకుఁ బూర్వము సప్తపురుషులను పరము స ప్తపురుషులనుద్ధరించుటయే కాక సూర్యప్రతిముండై కామగమనంబగు నుజ్జ్వలవిమానంబు నధిరోహించి, గంధర్వగణస్తూయమానుండై సూ ర్యలోకంబున ప్రళయకాలపర్యంతమును దివ్యభోగంబుల ననుభవించి పుణ్యక్షయంబున మరల మర్త్యలోకంబున నుత్తమకులంబున జన్మించి చతుర్వేదవిదుండును, స్వధర్మనిరతుండును, పవిత్రుండును, బ్రాహ్మ ణుండును నై తుదకు సూర్యసమ్మోహితుండై మోక్షలాభంబును బొం దును. చైత్రమాసంబున దమనభంజికాయాత్ర యను మహోత్సవం బు నచ్చట సందర్శించు మహాత్మునకుఁ బూర్వోక్త సకలఫలంబులును కరగతంబు లగును. భానుదేవుని శయనోత్థానంబులందు విషువాయ నంబులను, రవివారంబులను, రవితిథులను, మఱియు నితరపర్వకాలం బులను శ్రద్ధావంతులై నియమపూర్వకంబుగా నీయాత్రానుష్ఠానంబు లను గావించువారు రవినిభవిమానారోహణంబు నొనర్చి సూర్యలోక ప్రాప్తు లగుదురు. ఆసముద్రతీరంబుననే సర్వకామప్రదుం డగుశివుండు రామేశ్వరనామంబున విఖ్యాతుండై యున్నవాఁడు. యథావిధిగ మ హోదధిస్నానంబు గావించి యాకామారిని సందర్శించి గంధపుష్ప ధూపదీపనైవేద్యప్రదక్షిణాస్తోత్రగీతమనోహరవాద్యాదులచే సద్దేవు నా రాధించువారికి రాజసూయాశ్వమేధ ఫలంబులు లభించును. మోక్షం

బుగూడ వారికిఁ గరతలామలకంబు లగును. అట్టివారు దివ్యవిమానారూఢులై శివలోకంబునఁ జేరి దివ్యభోగంబుల ననుభవించి పిదప మర్త్యలోకంబున నుత్తమబ్రాహ్మణజన్మంబునంది యంతంబున శైవయోగావలంబనంబుచే మోక్షప్రాప్తు లగుదురు. ఆసూర్యక్షేత్రంబునఁ బ్రాణత్యాగంబు సేయువాఁడు సూర్యలోకప్రాప్తుండై స్వర్గంబున దేవసన్నిభుండై విహరించుచు ననంతరము మర్త్యలోకంబునఁ గర్మనిష్ఠుం డగు రాజై పుట్టి యంతంబున భాస్కరునందు విలీనుండై మోక్షలాభంబు నందఁగలఁడు.

## సూర్యపూజావిధానము.

అని యిట్లు బ్రహ్మదేవుం డానతిచ్చుటయు మునివరు లానందాంతఃకరణులై దేవదేవా! భుక్తిముక్తిప్రదం బగు భాస్కరక్షేత్రంబునుం గూర్చి మీరు ప్రశంసించితిరి. సుఖదాయకంబులును పాపనాశకంబులును భవదీయముఖనిస్సృతంబులును నగు పవిత్రకథల నెన్ని మా కర్ణించినను మాకుఁ దనివి దీఱకున్నది. మహాదేవా! ఆసూర్యదేవుని పూజాఫలము, దానఫలము, మఱియు, ప్రణిపాతము, నమస్కారము, ప్రదక్షిణము, ధూపము, దీపము, సమ్మార్జనము, ఉపవాసము, నక్తభోజము మొదలగువానివిధులును అర్ఘ్యప్రదానవిధియు భానుదేవుండు ప్రసన్నుం డగుటకుఁ దగినభక్తిపూజావిధానంబులును మా కెఱింగింపవలయు నని ప్రార్థించుటయు బ్రహ్మదేవుం డిట్లనియె.

ద్విజోత్తములారా! మనంబుచే భగవంతుని భావించుటయే భక్తి యగుచున్నది. ఆవిషయంబున మానసికం బగు నిచ్ఛయే శ్రద్ధ యనంబడును. ధ్యానమే సమాధి. భగవత్కథలను వినువాఁడు, వినుపించువాఁడును, భగవద్భక్తులను బూజించువాఁడును అగ్నిపరిచర్యం

గావించువాఁడును భగవన్నివిష్టహృదయుండును నిరంతరదేవపూజానిరతుండును పరమభక్తుం డనంబరగును. దేవోద్దిష్టంబులగు కర్మంబుల నామోదించువాఁడును, సర్వదా భగవన్నామసంకీర్తనంబు గావించువాఁడును భక్తశ్రేష్ఠుం డనఁబడును. భక్తులయెడల నసూయలేక కులదైవతంబుల నిందింపక యాదిత్యవ్రతానుష్ఠానతత్పరుం డగువాఁడు భక్తుం డని యెన్నఁబడుచున్నాఁడు. గమనావస్థాననిద్రాఘ్రాణోన్మేషనిమేషాది సకలవ్యాపారములయందును భాస్కరస్మరణంబు గావించువాఁడు భక్తశ్రేష్ఠుండు. అభిజ్ఞుం డగువాఁడు భగవానునియెడల నీవిధముగా భక్తి గలిగియుండవలయును. భక్తిధ్యానకీర్తనంబులచే నియతులై దేవపితృప్రీతికరంబుగా బ్రాహ్మణులకు దానంబు గావించినచో దానిని దేవపితృగణంబులు ప్రతిగ్రహింతురు. భక్తిసహితంబుగ పత్రపుష్పఫలజలంబులను ఏకొలఁదినైన దేవతలకు సమర్పించినచో వానిని ప్రీతిపూర్వకంబుగ దేవతలు ప్రతిగ్రహింతురు. నాస్తికప్రదత్తంబులగు వేనినిఁగూడ దేవతలు పరిగ్రహింపరు. నియమపూర్వకంబుగా విశుద్ధభావంబుతో దానంబు సేయవలయును. అట్టిదానమే సఫలంబు గాఁగలదు. భక్తిపూర్వకంబుగ నుపవసించి జపస్తుతిపూజోపహారంబులచే భాస్కరు నారాధించినచో సర్వపాపవిముక్తుం డగును. మహీతలంబున మస్తకంబు మోపి వినతుండై సూర్యునకు నమస్కరించువాఁడు తత్క్షణమందే సర్వపాపవిముక్తుం డగును. భక్తితో సూర్యదేవునకుఁ బ్రదక్షిణంబు సేయువానికి సప్తద్వీపసహితం బగు భూమండలంబును బ్రదక్షిణంబు చేసిన ఫలంబు లభియించును. నిర్మలహృదయంబున సూర్యదేవునే ధ్యానించుచు వ్యోమమండలప్రదక్షిణంబును గావించినచో సర్వదేవతాప్రదక్షిణంబుఁ జేసినఫలంబు చేకూరును. భక్తితో నేకాహారుండై షష్ఠితిథియందు సూర్యదేవు నర్చించి, నియతవ్రతానుష్ఠా

నతత్పరుండై సప్తమీతిథియం దహోరాత్రము లుపవసించి భాస్కర దేవునిం బూజించువానికి నశ్వమేధఫలంబు గలుగును. సప్తమియందైనను, షష్ఠియందైనను సూర్యదేవార్చనము పరమగతికారణం బగుచున్నది. కృష్ణసప్తమియందు జితేంద్రియుండై యుపవసించి సర్వోపచారంబులచే నాదిత్యు నారాధించువాఁడు పద్మపత్త్రప్రభం బగు విమానము నధిరోహించి సూర్యలోకంబును జేరఁగలఁడు. శుక్లసప్తమియందు ఉపవాసతత్పరుండై శుక్లోపహారాదులచే సూర్యారాధనంబు సేయువాఁడు సర్వపాపముక్తుం డగును. సూర్యలోకప్రాప్తుండును నగును. అర్కపత్త్రసంపుటంబునఁ బ్రతిసప్తమియందును నేకైకవృద్ధిక్రమంబుగఁ జతుర్వింశతిపుటంబుల నుదకపానంబు సేయుచు నిట్లు రెండు వత్సరంబులు నియమపాలనంబు గావించుటయే యర్కసప్తమీవ్రతంబు నాఁబడును. ఇది ప్రశస్తంబును సర్వకామప్రదంబునైనది. రవివారసహితం బగుశుక్లసప్తమి విజయ యనంబడును. ఆదినంబున స్నానదానజపతపోహోమోపవాసాదివ్రతంబులు మహాఫలదాయకంబులు. రవివారంబున శ్రద్ధాయుతులై దేవార్చనంబు గావించువారు అభీష్టఫలసిద్ధు లగుదురు. తా మొనరించు సకలకర్మంబులును ఆదిత్యోద్దిష్టంబులుగా నాచరించువారివంశంబున దరిద్రులును వ్యాధితులును గలుగరు. శ్వేత, రక్త, పీతవర్ణంబుల మృత్తికతో సూర్యస్థానం బుపలేపించువారు సర్వాభీష్టసిద్ధు లగుదురు. ఉపసించి, చిత్రపుష్పగంధాదులచేఁ జిత్రభానునిఁ బూజించువారికిఁ గోరిన కోర్కులు సిద్ధించును. ఘృతముతోఁగాని, తిలతైలముతోఁగాని సూర్యునకు దీపదానంబు సేయువానికి నెన్నఁటికిని చక్షూరోగంబు గలుగదు. ఆతనిజ్ఞానదీపము నిరంతర ముద్భాసిత మగుచుండును.

తిలరాశి, పవిత్రతైలము, తిలధేనువు—ఈమూఁడును దానము

నకుఁ బ్రశస్తము లైనవి. అగ్నియందు తిలాహుతి సేయుటయు, దే
వాలయంబులఁ దైలదీపంబుల నర్పించుటయు మహాపాతకనాశకంబు
లు. చతుష్పథదేవాయతనాదులయందు దీపదానంబు గావించువాఁడు
రూపవంతుండును, సుభగుండు నగును. ఘృతదీపము ప్రశస్త మైనది.
ఓషధీతైలాదులచే నైనది ద్వితీయపక్షము. వసామేదోస్థినిర్యాసంబుల
చే నెన్నఁటికిని దీపదానంబు సేయంజనదు. దీపము ఊర్ధ్వగతం బై
యుండును గాని యధోగతిగా నెన్నఁడు నుండదు. అట్లే దీపదాతయు
దీప్తిమంతుండై యెన్నఁటికిని దిర్యగ్గతుండు గానేరఁడు. జ్వలించుచు
న్నదీపమును హరించుటగాని నశింపఁజేయుటగాని తగదు. దీపహర్త
యగువాఁడు బంధము, నాశము, క్రోధము, తమంబును బొందఁగలఁ
డు. దీపదాత స్వర్గంబున కేఁగి దీపమాలికంబోలి విరాజిల్లుచుండును.
కుంకుమాగరుచందనంబులచే నతినియమంబున విలేపనంబు గావించు
వాఁడు పరజన్మంబున యశస్వి గాఁగలఁడు. సూర్యోదయకాలంబున
రక్తచందనమిశ్రితము లగు రక్తపుష్పంబులచేఁ బ్రతిదినము నర్ఘ్యప్రదా
నంబు గావించువానికి సంవత్సరాంతంబున సిద్ధిలాభం బగును. సూ
ర్యోదయంబు మొదలుగ నస్తమయంబువఱకును ఏదేనొకమంత్రజపంబు
గాని స్తోత్రపాఠంబుగాని గావించుచుండుట యాదిత్యవ్రతం బనంబడు
ను. ఈవ్రతాచరణంబున మహాపాతకనాశనం బగును. సూర్యోదయం
బున శ్రద్ధతో నర్ఘ్యం బర్పించుటచే సర్వపాపవిముక్తి యగును. సూ
ర్యార్ఘ్యప్రదాత యగువాఁడు సప్తజన్మంబులవఱకును ధనకనకవస్తువా
హనసంపన్నుం డగును. అగ్ని, జలము, అంతరిక్షము, పుణ్యభూమి
ప్రతిమ మొదలగువానియందు ప్రయత్నపూర్వకంబుగ సూర్యార్ఘ్యప్ర
దానంబు గావించుట కర్తవ్యంబు. సవ్యాపసవ్యంబులఁగాక భక్తితోఁ
దిన్నగ సూర్యాభిముఖుండై ఘృతగుగ్గులాదిసహితంబుగ సూర్యార్ఘ్యం

బు సేయువాఁడు సద్యఃపాపవిముక్తుండు గాఁగలఁడు. సూర్యదేవునకు శ్రీవాస, దేవదారు, కర్పూ, రాగురుధూపాదుల నర్పించువాఁడు స్వర్గలోకప్రాప్తుం డగును. ఉత్తరదక్షిణాయనంబుల సూర్యదేవు నర్చించుట పుణ్యప్రదము. విషువంబులయందును, ఉపరాగంబులయందును, షడశీతిపుణ్యకాలాదులయందును సూర్యదేవు నర్చించుట మహాఫలదాయకము. సర్వకాలంబులయందును భక్తిపూర్వకంబుగ నాదిత్యు నారాధించువాఁ డర్కలోకప్రాప్తుం డగును. కృసర, (పులగము) పాయస, పూప, ఫల, మూల, ఘృతోదనాదులచే నాదిత్యున కుపహారప్రదానంబు గావించుట సర్వకామప్రదంబు. సూర్యునకు ఘృతతర్పణంబు గావించువాఁడు సర్వసిద్ధుండగును. క్షీరతర్పణంబు సేయువాని కెన్నఁటికిని మనస్తాపంబు గలుగదు. దధితర్పణంబువలన నభీష్టసిద్ధియగును. శ్రద్ధాయుక్తుండై సూర్యాభిషేకంబునకు జలంబు దెచ్చువాఁడు సర్వతీర్థశుద్ధుండై పరమగతిం గాంచును. ఛత్రము, ధ్వజము, వితానము, పతాక, చామరము మొదలగువస్తువులను శ్రద్ధతో సూర్యదేవున కర్పించువాని కిష్టార్థసిద్ధి యగును. భక్తితో భానుదేవునకు నేయద్రవ్యంబుల నర్పించిన నాయాద్రవ్యంబులు భాస్కరదేవానుగ్రహంబున శతసహస్రగుణాధికంబులై వర్ధిల్లఁగలవు. భానుదేవతాప్రసాదంబున మనోవాక్కాయకంబులగుసకలదుష్కృతంబులును సమూలంబుగనశింపఁగలవు. ఒక్కదినంబున భానుదేవుని భక్తితోఁ బూజించినఫలము యథావిధి దక్షిణాసంపన్నంబు లగు శతక్రతువులవలననైనను గలుగనేరదు.

## ఆదిత్యమాహాత్మ్యము.

అని పితామహుం డుపదేశించుటయు మునివరు లోదేవదేవా! గృహస్థబ్రహ్మచారివానప్రస్థులలో మోక్షకాము లగువా రేదేవు నా

రాధింపవలయునో, అక్షయం బగుస్వర్గలాభం బెట్లు సిద్ధించునో, యే కర్మంబు నాచరించుటచే స్వర్గవాసులగువా రటనుండి పుణ్యక్షయంబున మరల భ్రష్టులు గాకుందురో, దేవగణంబులకు దేవతయు, పితృగణంబులకుఁ బితయుఁ, బరాత్పరుండు నగునాతఁ డెవ్వఁడో, స్థావరజంగమాత్మకం బగునీవిశ్వమంతయు నెవ్వనినుండి జనించునో, మరల నిదియంతయుఁ బ్రళయకాలంబున నెవ్వని నాశ్రయించునో సవిస్తరంబుగ నెఱింగింపవలయు నని ప్రార్థించుటయు బ్రహ్మదేవుం డిట్లనియెను.

తపోధనులారా! ఉదయించినంతమాత్రమున స్వీయకరనికరంబుచే జగదంధకారమునంతను బటాపంచలుగాఁ జేయు భానుదేవునికంటె నితరదైవతంబు లెవ్వరును లేరు. అతఁ డాద్యంతరహితుండును, శాశ్వతుండు నగునవ్యయపురుషుండు. అతఁడు తనరశ్మినిచయంబుచే సకలభువనంబులను దపింపఁజేయుచుండును. సర్వదేవమయుండును, తపనశీలుండును, సర్వజగన్నాథుండును, సర్వలోకపితయు నగునాతఁడే భూతంబులసృష్టిసంహారంబులు గావించుచుండును. అతఁడు తనకిరణంబులను బ్రసరింపఁజేసి తాపంబును, వర్షంబునుగూడఁ గల్పించుచుండును. ధాతయు, విధాతయు, భూతాదియు, భూతభావనుండు నగునాతని కెన్నఁటికిని క్షయంబులేదు. అతఁడే ప్రసిద్ధం బగుధ్రువస్థానము. సృష్టికాలంబున జగంబంతయు నాదిత్యునుండియే జనించి ప్రళయకాలంబున నాతనియందే విలీన మగుచుండును. మహాయోగులగువారు దేహపరిత్యాగంబు సేసి వాయుమూర్తులై తేజోరాశి యగుదివాకరునందు ప్రవేశింతురు. ఆకాశప్రసారితంబులగుతరుశాఖలంబోని యాతనిసహస్రకిరణంబుల నాశ్రయించి సిద్ధగంధర్వాదిదేవమునిగణంబులు నివసించి యుందురు.

గృహస్థులును, మహాయోగులగు సనకాదిమహర్షులును, బ్ర

హ్మవాదులగు వాలఖిల్యాదిఋషులును, వానప్రస్థులగు నితరమునిగణంబులును, వ్యాసప్రముఖులగు సర్వసాధుపురుషులును, యోగమార్గంబున సౌరమండలమునఁ బ్రవేశించి యుందురు. శ్రీమంతుఁ డగు వ్యాసనందనుఁడు శుకుండును, యోగమార్గము నవలంబించి సూర్యకిరణలాభముం గాంచి భవవిజయుండయ్యెను. బ్రహ్మవిష్ణుమహేశ్వరాదిసకలదేవతలును బ్రత్యక్షదేవస్వరూపుఁడును, దిమిరధ్వంసకుండు నగుభాస్కరునికంటెఁ బరులు గారు. కావున శుభాకాంక్షియగునాతని కన్యదైవతంబులయెడల భక్తి యవిధేయమైనది. బ్రహ్మవిష్ణ్వాదిదేవతలు దృష్టిగమ్యులుగారు. భాస్కరుఁ డొక్కఁడుమాత్రమే ప్రత్యక్షదైవతము. ఆతఁడే జగంబునకంతకును మాతయుఁ బితయు గురుండునై యున్నవాఁడు. రశ్మిమంతుం డగునాతఁడు జగన్మిత్రుఁడు. సాగరద్వీపసహితంబులగుచతుర్దశభువనంబుల నాతఁడే సృజించి నిలిపి యున్నాఁడు. భగవానుం డగునాతఁడే ప్రజాపతులను, బ్రజలనుగూడ సృజించి తన్ను ద్వాదశమూర్తులుగా విభజించుకొని యాదిత్యరూపంబున విరాజిల్లుచున్నవాఁడు. ఇంద్రుఁడు, ధాత, పర్జన్యుఁడు, త్వష్ట, పూషుఁడు, అర్యముఁడు, భగుఁడు, వివస్వంతుఁడు, విష్ణు, అంశుఁడు, వరుణుఁడు, మిత్రుఁడు ననునీద్వాదశమూర్తులచేఁ బరమాత్ముఁడగుసూర్యదేవుఁ డీజగంబంతటను వ్యాపించి యున్నాఁడు.

ఇంద్రనామకంబగు నాతనిప్రథమమూర్తి దేవగణంబులశత్రువులను సంహరించుచు దేవరాజత్వముం గాంచి తేజరిల్లుచుండును. ధాతృనామకంబగునాతనిద్వితీయమూర్తి ప్రజాపతిత్వముంగాంచి ప్రజాసర్గంబు సేయుచుండును. పర్జన్యనామకంబగుతృతీయమూర్తి మేఘరూపమున వర్షంబును గురియించుచుండును. త్వష్టృనామకంబగుచతుర్థమూర్తి వనస్పతులయందును, ఓషధులయందును వ్యాపించియుండు

ను. పూషాఖ్యం బగుపంచమమూర్తి యన్నాధిష్ఠితంబై యుండును. అర్యమనామకంబగుషష్ఠమూర్తి వాయురూపంబునఁ జలనశీలంబై దేవదేవతలనాశ్రయించి యుండును. భగనామకంబగుసప్తమమూర్తి జీవదేహమధ్యగతంబై యుండును. వివస్వన్నామకం బగునష్టమమూర్తి యగ్నిప్రతిష్ఠితమై జీవులభుక్తాన్నపరిపాకంబు గావించుచుండును. విష్ణునామకంబగునవమమూర్తి యసురవైరిసంహారంబునకై యెల్లప్పుడు నవతరించుచుండును. అంశుమన్నామకదశమమూర్తి వాయుప్రతిష్ఠితమై జీవులకాహ్లాదంబు గూర్చుచుండును. వరుణనామకంబగు నేకాదశమూర్తి జలజంబులయం దుండి నిరంతరమును బ్రజాపోషణంబు సేయుచుండును. మిత్రనామకంబగుద్వాదశమూర్తి లోకహితార్థమై చంద్రసరిత్తీరంబున బ్రతిష్ఠితమై యుండును. నామంబుచేతనేగాక యూతఁడు జగంబునకంతకును బరమమిత్రుఁడై యుండును. ఆమిత్రుండు వాయుభోజియై తపంబు సేయుచు భక్తాభీష్టంబులఁ బ్రసాదించుచుండును. పరమాత్ముం డగు సవిత్రుండు ద్వాదశమూర్తులచేతను జగమంతటను వ్యాపించి యుండును గావున భక్తులగువారు నిత్యము నమ్మహాదేవుని ద్వాదశమూర్తిరూపంబున ధ్యానప్రణామాదులం గావించుచుండవలయును. ద్వాదశనామశ్రవణపఠనంబులవలన సూర్యలోకప్రాప్తి యగును.

అనిచెప్పుటయు మునులో దేవా! సూర్యుం డాదిదేవుండును సనాతనుండు నైనచో వరప్రాప్తికై ప్రాకృతునిం బోలి తపం బేలగావింపవలయునని ప్రశ్నించిరి. అంత బ్రహ్మదేవుం డిట్లు చెప్పందొడంగెను. మునులారా! మిత్రనారదసంవాదం బనునితిహాసమువలన నియ్యర్థంబు సర్వంబును దెలుపఁగలను. వినుండు. ఆదిత్యునిద్వాదశమూర్తులం గూర్చి యిదివఱకే చెప్పియుంటిని. ఆమూర్తులలో మిత్రుండును,

వరుణుండు ననునిరువురును దపోనిరతులై యుండిరి. అందు వరుణుండు జలమాత్రాహారియై పశ్చిమసాగరంబునను, మిత్రుండు వాయుమాత్రభోజనుండై మిత్రవనంబునను విరాజిల్లుచుండుదురు.

ఒకప్పుడు యోగీంద్రుం డగునారదుండు మేరుగిరిశృంగము నుండి యవతీర్ణుండై భూమండలసంచారంబు సేయుచు మిత్రుండు దపంబు సేయుచున్నయాశ్రమంబున కేతెంచి తపోనిరతుం డగుమిత్రుం గాంచి యాశ్చర్యాన్వితుండై అక్షయుండును, అవ్యయుండును, వ్యక్తావ్యక్తస్వరూపుండును, సనాతనుండును, త్రైలోక్యధరుండును, సర్వదేవేశ్వరుండును, ప్రభుండును నగునీతఁడు మరల దేవపితృగణంబుల నేల యర్చించుచున్నాఁడని వితర్కించి యద్దేవుని సమీపించి యోదేవా ! వేదవేదాంగశాస్త్రపురాణాదులు నిన్నజుండనియు, శాశ్వతుండనియు, ధాత యనియు, నుత్తమనిధానుఁడనియుఁ బ్రశంసించుచున్నవి. భూతభవిష్యద్వర్తమానంబు లన్నియు నీయందు ప్రతిష్ఠితంబులై యుండును. చతురాశ్రమవాసులు నహరహంబును నిన్నర్చించుచుందురు. అట్టినీవుగూడ నింకను నేదేవునిగూర్చి యారాధించుచుంటివో నాకేమియును బోధపడకున్నది. దయయుంచి యెఱింగింపవలయునని ప్రార్థించుటయు మిత్రుండిట్లనియెను.

నారదమునీంద్రా! పరమభక్తుండవగునీయెదుట సనాతనంబును, గుహ్యంబును, బరమపదంబును నగువిషయముంగూర్చి ప్రశంసించెదను. సూక్ష్ముండును, అవిజ్ఞేయుండును, అవ్యక్తుండును, అచలుండును, ధ్రువుండును, ఇంద్రియంబులకు, నింద్రియార్థంబులకును, సర్వభూతంబులకు నగోచరుండును, క్షేత్రజ్ఞుండు నగుపురుషుండు సర్వభూతాంతరాత్మయని ప్రశంసితుండై యుండును. త్రిగుణాతీతుం డగునాభగవానుఁడే హిరణ్యగర్భుఁడు. అతఁడే బుద్ధి. మహాత్స్వరూపుఁడును, బ్ర

ధానుండునుగూడ నాత్మడే. సాంఖ్యయోగు లాతని బహునామంబుల
చేఁ గీర్తించియుండిరి. ఏకాత్మకుండగునాతఁ డీత్రైలోక్యమును ధరిం
చియుండును. త్రిమూర్త్యాత్మకుఁడు, విశ్వాత్ముఁడు, శర్వుఁడు, అక్ష
రుఁడు ననునామంబు లాతనికి నిర్దిష్టంబులైనవి. అశరీరి యగునాతఁడు
సర్వశరీరంబులయందు నుండియుఁ గర్మలిప్తుండు గాకుండును. నీవును,
నాకును, దేహధారులగునెల్లవారికినిగూడ నాతఁడు సాక్షీభూతమగు
నంతరాత్మయై యుండును. ఆతని నెవ్వరు నెన్నఁటికిని గ్రహింపఁజాల
రు. సగుణనిర్గుణస్వరూపుఁ డగునాతఁడు జ్ఞానైకవేద్యుఁడై యుండును.
ఆతనిసర్వాంగకములును సర్వతోముఖములై యుండును. సర్వదేవతా
ముఖ్యుండును, సర్వేశ్వరుండు నగునాతఁడు సర్వజగంబుల నాచ్ఛాదించి
యుండును. విశ్వవ్యాపి యగునాతఁడు క్షేత్రస్థితుండై యథేచ్ఛముగ
విహరించుచుండును. శరీరసమూహము క్షేత్రసంజ్ఞకంబైనది. సర్వ
శరీరంబుల నెఱింగినవాఁడు గావున నాతఁడు క్షేత్రజ్ఞుం డనఁబడును.
విశ్వవ్యాపియు, బహురూపుఁడు నగుటచే నాతఁడు విశ్వరూపుఁడని
యు, మహత్త్వం బాతనియందు ప్రతిష్ఠితం బగుటచే నాతఁ డేకమా
త్రపురుషుండనియు, సనాతనుండగుటచే మహాపురుషుం డనియు నా
తఁడు ప్రశంసితుం డగుచుండును. విధిక్రియాయత్తుం డగునాతఁడు
తన్నుఁదానే శతధా, సహస్రధా, శతసహస్రధా సృజించుకొనుచుండు
ను. ఆకాశమునుండి పతితం బగుజలము మృత్తికాభేదసంబంధవశంబు
న రుచిభేదముం గాంచునట్లు పురుషుండును గుణభేదంబులచే విభిన్న
రూపంబులతోఁ బ్రతీయమానుం డగుచుండును. ఏకంబగువాయువు
దేహిసమూహంబునందు పంచవిధంబుల విభక్తంబగునట్లాతనియం
దేకత్వమును పృథక్త్వమును గానవచ్చుచుండును. అగ్ని నానాసంజ్ఞ
లం గాంచినట్లే సనాతనైకపురుషుం డగునాతఁడు హరిప్రభృతిసంజ్ఞల

చే విరాజిల్లుచుండును. ఒకదీపము సహస్రదీపములుగాఁ బ్రజ్వరిల్లు నట్లే యాసనాతనపురుషుండును సహస్రవిధంబుల సృష్టిని విస్తరింపఁ జేయుచుండును. ఆతనికాత్మజ్ఞానలాభం బైనప్పుడు కైవల్యభావము సిద్ధించుచుండును. ఏకత్వము లయంబైనంతనే యాతనియందు బహుత్వము ప్రవర్తితం బగుచుండును. ఈజగంబునం దేవస్తువును నిత్యంబు గాదు. సర్వవ్యాపియు, సనాతనుండు నగునాతఁడొక్కఁడే నిత్యుఁడు. వ్యక్తావ్యక్తంబు లాతనినుండియే యుత్పన్నంబు లైనవి. వ్యక్తము, నవ్యక్తము నగునదియే ప్రకృతి. అదియే బ్రహ్మయోని. సనాతనస్వరూపుండును, దేవపితృకర్మములయందు పూజ్యుండును నగునాతని కంటె దేవపితృగణంబులలో శ్రేష్ఠు లెవ్వరును లేరు. కేవలాత్మచేతనే విజ్ఞేయుం డగునాతనింగూర్చియే నేను పూజించుచున్నాను.

ఓదేవమునీంద్రా! స్వర్గవాసులగువారిలో నెవ్వ రాతని నారాధింతురో వారు తదుద్దిష్టగతిప్రాప్తు లగుదురు. నానారూపధరులగు దేవతలు తమయాశ్రమంబులయందే యుండి భక్తిపూర్వకంబుగ నాద్యుం డగునయ్యాదిత్యు నారాధించి తత్ప్రసాదంబుచే నభీష్టసిద్ధిం గాంచుచుందురు. ఆసూర్యదేవుఁడే సర్వగామియు, నిర్గుణుండు నని చెప్పంబడును. ఆదేవదేవుఁ డగుదివాకరుని నేనుగూడ నిట్లే భావించి జ్ఞానమూలంబున నాతని నారాధించుచున్నాను. నారదమునీంద్రా! నేనిప్పుడు నీయెదుట నీగూఢతత్త్వముంగూర్చి కీర్తించితిని. మావలెనే నీవుగూడ నాతని పరమపదంబని యెఱుంగుము. దేవతాగణంబులును, బ్రాచీనఋషిగణంబులునుగూడఁ బరమపురుషుం డగునాతని వరప్రదునిగా నెఱింగియున్నారు. కావుననే వారందఱును బరాత్పరుం డగుదివాకరు నర్చించుచుందురని బోధించెను.

మునివరులారా! పూర్వము భానుదేవుండు స్వయముగ నార

దున కుపదేశించిన యీగూఢతత్త్వముం గూర్చి తెలిపితిని. నాచేఁ జె ప్పండిన యియాఖ్యానము నాదిత్యభక్తివిహీనుం డగువానికిని జెన్నం డును దెలుపవలదు. ఈనిర్మలాఖ్యానమును వినువాఁడును, వినుపించు వాఁడును నిశ్చయముగా నాదిత్యదేవునందు విలీనులగుదురు. ఈచరిత్ర ము నాద్యంతము సాకర్ణించునార్తుండు రోగముక్తుండును, జ్ఞానియు, నిష్టగతిప్రాప్తుండు నగును. దీనిని బఠించువాని కచిరకాలంబుననే ము క్తిలాభం బగును. దీనిని బారాయణచేయువానికిఁ గోరినకోరికలు లభిం పఁగలవు. కావున మీరంతయును దేవదేవుం డగుదివాకరుని నిత్యమును స్మరించుచుండుఁడు! అయ్యాదిత్యుఁడు సర్వజగద్విధాతయు, ధాత యుఁ బ్రభుండు నని యెఱుంగుఁడు.

—◆ ఆదిత్యునియేకవింశతినామములు. ◆—

అని యుపదేశించి బ్రహ్మదేవుండు మఱియు నిట్లనియెను. ము నులారా! ఆదిత్యుఁడే త్రిభువనంబులకును మూలము. సురాసురనర పరివృతంబగు సమస్తజగంబును నాతనినుండియే యుత్పన్నం బైనది. అతఁడే రుద్రోపేంద్రమహేంద్రాదితేజోమూర్తులకుఁ దేజం బగుచు న్నాఁడు. అతఁడే పరమదైవతము. అగ్నియందు ప్రదత్తం బగునా హుతివలన నాదిత్యుండు తృప్తుం డగును. అతనివలన వృష్టియు, దా నివలన నన్నంబును గలుగుచున్నవి. ఆయన్నముచేతనే ప్రజలు జీవిం చుచుందురు. అతఁడు ధ్యాతలకు ధ్యానంబును, ముముక్షువులకు మో క్షంబు నై యుండును. ఆదిత్యునకు భిన్నముగా క్షణముహూర్తాహో రాత్రపక్షమాససంవత్సరాదికాలపరిణామంబులు లేవు. కాలంబు లేకు న్నచో నియమనిర్దేశం బెంతమాత్రమును లేకయుండును. అగ్నికా ర్యములు విలుప్తములై పోవును. ఋతువిభాగంబు లేకయుండును. ఇంకఁ

బుష్పఫలోత్పత్తికిని, సస్యనిష్పత్తికిని మార్గ మేమున్నది? కాలాభావం బునఁ ద్రిలోకవ్యవహారంబు లన్నియుఁ గట్టువడిపోవును. అయ్యభావ ము జగత్కారణుండును, జలతస్కరుండు నగుభాస్కరుని మూలముననే సంపూర్ణమగుచున్నది.

సూర్యదేవుండు వర్షింపకుండఁ దాపశోషణంబులంగూర్చుటగాని పరివేషంబు దాల్చుటగాని యెన్నఁటికిని జేయఁడు. జలవర్షణంబువల ననే సవిత్రుండు దీప్తిమంతుం డగును. ఆదిత్యుఁడు వసంతంబునఁ గపి లవర్ణంబును, గ్రీష్మంబునఁ గాంచనవర్ణంబును, వర్షంబున శ్వేతవర్ణం బును, శరత్తునఁ బాండువర్ణంబును, హేమంతమునఁ దామ్రవర్ణంబు ను, శిశిరంబున లోహితవర్ణంబు నగుప్రభతో నుదయించుచుండును. ఇట్లు ఋతువుల కనురూపం లగువర్ణంబులతో నుదయించుసూర్యుఁడు లోకమంగళంబు, సుభిక్షంబును గూర్చుచుండును. ఆదిత్యుఁడు, సవి త, సూర్యుఁడు, మిహిరుఁడు, అర్కుఁడు, ప్రభాకరుఁడు, మార్తండుఁ డు, భాస్కరుఁడు, భానుఁడు, చిత్రభానుఁడు, దివాకరుఁడు, రవి యను నీసూర్యద్వాదశనామంబులును విశిష్టములైనవి. మఱియు సూర్యదే వుండు విష్ణుఁడు, ధాత, భగుఁడు, పూషుఁడు, మిత్రుఁడు, ఇంద్రుఁడు, వరుణుఁడు, అర్యముఁడు, వివస్వంతుఁడు, అంశుమంతుఁడు, త్వష్ట, ప ర్జన్యుఁడు నను ద్వాదశనామంబులచే ద్వాదశమూర్తుల విరాజిల్లుచుం డును. ద్వాదశమాసంబులయందును గ్రమంబుగ నీద్వాదశాదిత్యులు నుదయించుచుందురు.

అందు విష్ణుండు పండ్రెండువందలును, అర్యముండు పదుమూఁ డువందలును, వివస్వంతుండు పదునాలుగువందలును, అంశుమంతుం డు పదునేనువందలును, పర్జన్యుండు పదునాలుగువందలును, వరుణుం డు పదుమూఁడువందలును, త్వష్ట పదునొకండువందలును, ఇంద్రుం

డాతనికి ద్విగుణంబున్ను, ధాత పదునొకండువందలును, మిత్రుండు సహస్రంబును, పూషుండు తొమ్మిదివందలు నగుకిరణంబులచేఁ బ్రదీపించుచుందురు. సూర్యకిరణంబు లుత్తరాయణంబునఁ బ్రవృద్ధంబులును, దక్షిణాయనంబునఁ క్షీణములు నగుచుండును. ఈవిధముగా సూర్యలోకమునుండి సహస్రసహస్రకిరణంబులు ప్రవర్తిల్లుచుండును. సూర్యదేవునకుఁ జతుర్వింశతినామంబులే కాక యింకను సహస్రనామంబులు గలవు. అం దతిపవిత్రంబు లగు వికర్తనుఁడు, వివస్వంతుఁడు, మార్తండుఁడు, భాస్కరుఁడు, రవి, లోకప్రకాశకుఁడు, శ్రీమంతుఁడు, లోకచక్షువు, గ్రహేశ్వరుఁడు, లోకసాక్షి, త్రిలోకేశుఁడు, కర్త, హర్త, తమిస్రహుఁడు, తాపనుఁడు, తపనుఁడు, శుచి, సప్తాశ్వవాహనుఁడు, గభస్తిహస్తుఁడు, బ్రహ్మ, సర్వదేవనమస్కృతుఁడు ననునేకవింశతినామంబులచేతను స్తవంబుసేయుట యాదిత్యున కతిప్రియంబు. ఈస్తవరాజము లోకత్రయవిశ్రుత మైనది. ఉభయసంధ్యల నుదయాస్తమయకాలంబుల శుచియై సూర్యునిఁగూర్చి యీస్తవంబు గావించుట యారోగ్యధనయశస్కరంబును సర్వపాపహరంబును ముక్తిప్రదంబును నగును. సూర్యసమీపంబున నీస్తవము నొక్కసారి పఠించినచో మనోవాక్కర్మజన్యంబులగు సకలపాపంబులును నశింపఁగలవు. హోమము, సంధ్యోపాసనము, ధూపము, అర్ఘ్యము మొదలగువాని యందు కేవల మీమంత్రజపమే ప్రశస్తమైనది. ఈమహామంత్రమును జపించుచు అన్నదానము, ధనదానము, ప్రణిపాతప్రదక్షిణాదులు గావించుట సర్వపాపహరం బగును.

## మార్తాండజననాదికథనము.

అని చెప్పి బ్రహ్మదేవుండు మఱియు నిట్లనియె. మునివరులారా! దక్షప్రజాపతికి అదితి, దితి, దను, వినత మొదలుగాఁగలయుబు

పదిమందికన్యలు గలిగిరి. సుందరీమణు లగునాకన్యలలోఁ బదుమువ్వుర నాతఁడు కశ్యపున కిచ్చెను. అం దదితి కశ్యపునివలనఁ ద్రిభువనేశ్వరు లగు దేవతలను పుత్త్రులుగాఁ గాంచెను. దితి దైత్యగణంబులను, దనువు దానవగణంబులను, వినతాదిసతీగణంబు స్థావరజంగమాదివివిధసంతానంబును గాంచెను. ఆకశ్యపుని పుత్త్రదౌహిత్రులచే సకలజగంబులును బరివ్యాప్తంబు లయ్యెను. ఆతనిపుత్త్రులలో సాత్త్వికులగు దేవతలే ప్రధానులు. ఆతని కింకను రజస్తమోగుణప్రధాను లగునందను లనేకులు గలరు. దేవతలు యజ్ఞభాగులును త్రిభువనప్రభువులును నై యుండిరి. ప్రజాపతియు బ్రహ్మవిద్వర్యుండును సర్వభూతస్రష్టయు నగుపరమేష్ఠి దేవతలను యజ్ఞభోజనులుగను, త్రిభువనేశ్వరులుగాను గావించెను. దైత్యదానవులు శత్రుభావముచే సర్వదా దేవతలను పీడించుచుండిరి. దైత్యదానవులచే తాడితు లగుచుండుటయుఁ, ద్రిభువనంబులును దైత్యదానవులవశంబు లగుచుండుటయు దేవత లందఱును క్షుధాతురు లై యుండుటయుఁ గనుంగొని అదితి తనపుత్త్రులకై యజ్ఞభాగంబుల నాహరించి యతిప్రయత్నంబున సవితృదేవు నారాధింపఁ దొడంగెను. ఆమె నియతాహారయై యతినియమంబుతో నేకాగ్రచిత్తంబునఁ దేజోరాశియు, గగనస్థితుండును నగు దివాకరు నవలోకించి యిట్లు స్తోత్రముచేయ నారంభించెను.

‘‘మహాత్మా! నీవు సూక్ష్ముండ వయ్యును అతులపవిత్రతేజోమయుండవు. తేజస్వుల కీశ్వరుండవు. సర్వతేజోధారుండవు. నిత్యపురుషుండవు. ఓదేవా! అట్టినీకు నమస్కారము. లోకోపకారకంబునకై నేను నిన్నుఁ బ్రార్థించుచున్నాను. అతితీవ్రం బగు నీమూర్తినుద్దేశించి నమస్కరించుచున్నాను. ఎనిమిదిమాసంబులపర్యంతమును, అంబుమయం బగురసంబును గ్రహించుచు నతితీవ్రం బగు నీమూర్తి యెదు

టు నిలిచి నమస్కరించుచున్నాను. అగ్నిషోమసమేతంబును గుణాత్మకంబు నగు నీమూర్తికి నమస్కారంబు. ఋగ్యజుస్సామసమూహంబు లేకీభూతంబులై నీయందు ప్రతిభాసిల్లుచున్నవి. ఓవిభావసూ? త్రయీసంజ్ఞికం బగు నీవిశ్వమూర్తికి నానమస్కారంబు. తత్పరం బగు నీ యోంకారమూర్తికి నమస్కారంబు. ఓసనాతనా! అస్థూలంబును, స్థూలంబును అమలంబును నగునీమూర్తికి నమస్కారము."

అని యిట్లదితిదేవి నిరాహారయై స్తుతియించుచు నిరంతరమును వివస్వంతు నారాధింపఁదొడంగెను. ఇట్లు బహుకాలంబు సనుటయు భగవానుం డగుతపనుండు దక్షదుహిత యగునదితిదృష్టిపథంబున నావిర్భూతుం డయ్యెను. అట్లు సాక్షాత్కరించి భూమండలంబున నంబరావృతం బగువిపులశైలశృంగాకారం బగు తేజోరాశిని బోలియున్న యాభానుదేవునిదివ్యమూర్తిం గాంచి యదితి యతిసంత్రస్తభావంబున వినీతస్వరం బుతో "ఓజగదాదిమూర్తీ! నేను నీదివ్యమూర్తిని సందర్శింపఁజాలకున్నాను. నీవు నాయెడలఁ బ్రసన్నుండవై సౌమ్యరూపంబున సాక్షాత్కరింపుము. ఓభక్తదయావమా! విభూ! నీభక్తురాలగు నన్ననుగ్రహించి నాపుత్త్రులను రక్షింపు" మని ప్రార్థించుటయు నాతేజోమండలమునుండి తప్తతామ్రవర్ణంబున విభావసుం డవతరించి ప్రణతయైయున్న యదితిం గాంచి 'ఓదేవీ? నీకభీష్టం బగు వరంబు గోరుకొ' మ్మని పలికెను.

అదితియును జానువుల వినతంబులఁ గావించి మస్తకంబును వంచి వరదాత యగువివస్వంతుం గాంచి యిట్లు ప్రార్థించెను. దేవదేవా! ప్రసన్నుండ వగుము. ప్రబలు లగు దైత్యగణంబులు నాపుత్త్రుల త్రిభువనరాజ్యంబు నాక్రమించి, వారిని యజ్ఞభాగంబులనుండి వంచితులం గావించిరి. మహాత్మా! నీవు నన్ననుగ్రహించి, అంశకత్రి

యంబున నాపుత్త్రులకు భ్రాతృస్వరూపుండవై సకలశత్రువినాశంబు గావింపుము. నానందను లందఱకు నెప్పటియట్ల యజ్ఞభాగంబులును త్రైలోక్యాధిపత్యంబును లభించునట్లు ప్రతికల్పంబునను వారియెడలఁ బ్రసన్నుండ వగుచుండుము.

అని యదితి ప్రార్థించుటయు వారితస్కరుం డగు భాస్కరుం డు ప్రసాదసుముఖుండై, ఓదేవీ! నేను సహస్రాంశంబుచే నీగర్భంబున నుద్భవించి, నిరాకులచిత్తంబున నీపుత్త్రులశత్రువుల సంహరించెదను ' అని చెప్పి యంతర్ధానంబు నొందెను. అదితియు నీవిధంబుగా సూర్య దేవునివలన వాంఛితసిద్ధిం గాంచి తపంబు చాలించెను. పిమ్మట నొ క్కవర్షం బతీతంబగుటయు భాస్కరునిసహస్రకిరంబులలో సుషుమ్నా నామకం బగు నొక్కకిరణంబు దేవమాత యగు నదితిగర్భంబునఁ బ్ర వేశించి యామె యభీష్టసిద్ధికై వర్ధిల్లుచుండెను. అప్పు డదితి నేనీగర్భ మును శుచినై ధరించెద నని నిశ్చయించి సమాహితచిత్తంబున కృ చ్ఛ్రచాంద్రాయణాదివ్రతంబుల నాచరింప నారంభించెను. ఇట్లుండ, నొకప్పుడు కశ్యపుండు కించిత్క్రోధస్వరంబున నదితిం గాంచి నీవీవిధ ముగ నిత్యోపవాసంబులచే నీగర్భాండంబు నేల వినష్టంబు గావించు కొందు వని మండలించెను. అప్పు డదితియును గ్రోధముతోనే స్వా మీ! బాగుగఁ బరీక్షింపుము. నే నీగర్భాండమును నాశముచేయుట లేదు. దీనివలననే శత్రుకులంబంతయు వినాశనంబు గాఁగలదు. అని యుత్తరం బిచ్చుచు పతివచనకుపిత యగుసురమాత తత్క్షణమే తేజః ప్రదీప్తం బగు స్వీయగర్భంబును విమోచనంబు గావించెను. ఉదయిం చుచున్న సూర్యునివలెనే తేజఃపుంజమయం బగు గర్భాండమును దిల కించి సంతుష్టుండై కశ్యపుండు, శ్రద్ధాసహితంబుగ నుదారవచనంబుల తో స్తోత్రముసేయనారంభించెను. ఆసమయంబున నయ్యండమునుం

డి పద్మపత్త్రప్రభాసంపన్నుండును, తేజోమండలమండితుండు నగు నొకపుత్త్రుఁ డావిర్భవించెను. పరముహూర్త్తమునందే మునిప్రవరుం డగు కశ్యపుని సంబోధించుచు సజలజలదగంభీరంబున నశరీరవాణి "ఓమునిచంద్రా! నీవదితియెడలఁ గుపితుండవై గర్భాండంబును నాశంబు గావించుచున్న దని శంకించితివి గావున నీపుత్త్రుండు మార్త్తండనామంబున విఖ్యాతుండు గాఁగలఁడు. ఈతఁడు యజ్ఞభాగాపహారులగు నసురులను సంహరింపఁగలఁడు." అని ప్రబోధించెను. ఆవాక్యంబుల నాలకించి దేవత లందఱును బరమానందభరితు లైరి. అసురులు తేజోవిహీనులైరి. పిమ్మట దేవగణపరివృతుం డగు నింద్రుండు యుద్ధంబునకై దైత్యుల నాహ్వానించెను. అప్పుడు దేవాసురులకు ఘోర సంగ్రామం బయ్యెను. శస్త్రాస్త్రవర్షణంబున సకలభువనాభ్యంతరంబులును బ్రదీప్తంబు లయ్యెను. ఆరణరంగమునందు అప్పుడు భగవానుం డగుమార్త్తండుండు విపక్షదళంబుపై దృష్టిపాతంబు గావించుటయు నమ్మహాతేజముచే సకలదానవులును భస్మీభూతులైరి. దేవతలు పరమానందముతోఁ దేజోమండలమండితుం డగు మార్త్తండుని అదితిని గీర్త్తించుచు నెప్పటివలె స్వస్వపదప్రాప్తు లైరి. భగవానుం డగు మార్త్తండుఁడును దనయధికారమును స్థాపించుకొనియెను. ఆతఁడు తనరశ్మినిచయంబుచే కదంబపుష్పాకృతిగా నూర్ధ్వాధోదేశంబుల నావహించి యగ్నిపిండసదృశం బగు నాతిస్ఫుటదేహధారణంబు గావించెను.

ప్రజాపతి యగు విశ్వకర్మ ప్రణతుండై యావివస్వంతునిఁ బ్రసన్నుం జేసికొని తనతనయ యగు సంజ్ఞాదేవి నాతనికి సంప్రదానంబు గావించెను.

* * * * *

అని చెప్పి వనజాసనుండు మఱియు నిట్లనియెను. సమస్తలోకశ

బులును తమఃపుంజపరివృతంబులై స్థావరజంగమంబులు విధ్వస్తంబులైనప్పుడు ప్రకృతినుండి ప్రప్రథమంబున గుణహేతుకం బగుబుద్ధి యుత్పన్నం బయ్యెను. దానినుండి మహాభూతప్రవర్తకం బగునహంకారంబును పిమ్మట వాయువు అగ్ని జలము ఆకాశము భూమి బ్రహ్మాండమును ఆవిర్భూతంబు లయ్యెను. ఆబ్రహ్మాండంబునందే సప్తలోకంబులును సప్తద్వీపసప్తసాగరపరివృతం బగు పృథ్వీమండలమును విరాజిల్లుచుండును. నేనును విష్ణుండును మహేశ్వరుండును మువ్వురమునుగూడ నందే యుందుము. తమఃపరివృతు లగుజీవు లెల్లరు నప్పుడీశ్వరారాధనంబు గావించుటయు మహాతేజుం డగుతిమిరవైరి యావిర్భూతుం డయ్యెను. ఆతని ధ్యానయోగంబుచే సవితృమూర్తిగా నెఱింగి మేమందఱమును విభిన్నంబులును దివ్యంబులు నగుస్తవంబులచే నాతనిని స్తుతించితిమి.

* * * * *

భగవంతుం డగు సూర్యదేవుం డీవిధముగాఁ బ్రస్తుతుండై తైజసరూపంబున సాక్షాత్కరించి కల్యాణకరంబు లగువాక్యంబులతో నభీష్టవరప్రార్థనంబు గావింపుఁ డని యానతిచ్చుటయు దేవగణంబు లోప్రభూ! అత్యుజ్జ్వలం బగునీరూపము నెవ్వరమును సహింపఁజాలకున్నాము. జగద్ధితంబుకొఱకు భవదీయదివ్యరూపంబు సకలజీవసహనీయం బగున ట్లనుగ్రహింపవలయు నని ప్రార్థించిరి. భగవానుం డగునాదిత్యుం డందులకు సమ్మతించెను. సాంఖ్యమతవేదులును యోగమార్గావలంబులును ధ్యాననిష్ఠాగరిష్ఠులును ముముక్షువులు నగువారందఱును దివాకరదేవుని హృదయంబున ధ్యానించుచుందురు. సర్వలక్షణహీనుండైనను సర్వపాపాన్వితుండైనను దివాకరునిశరణంబు గాంచి సర్వపాపవిముక్తుం డగును. అగ్నిహోత్రిబలంబులైనను వేదాభ్యా

సబలంబైనను బహుదక్షిణాన్వితయజ్ఞబలంబైనను భానుభక్తబలంబున షోడశాంశం బైనను గాఁజాలవు. ఇంద్రాదిసురవందితుం డగు దివాకరునిశరణంబు గాంచువారికి తీర్థసేవనఫలంబును పవిత్రతాలాభంబును వారు పాపముక్తులై సవితృలోకప్రాప్తు లగుదురు.

అని చెప్పి బ్రహ్మదేవుండు కృపాళుండై యమ్మునివరులకు భగవానుం డగు నాదిత్యునియష్టోత్తరశతనామస్తవంబును* సవిస్తరంబుగ నుపదేశించెను. ప్రాతఃకాలంబున సమాహితచిత్తులై యాస్తవరాజంబును బఠించువారికి ధనదారపుత్త్రలాభంబును, జాతిస్మరత్వంబును పరమమేధాలాభంబును గలుగును.

## దక్షాధ్వరవిధ్వంస కథనము.

బ్రహ్మదేవుం డిట్లనియెను. మునివరులారా! సర్వవ్యాపియు, దేవదేవుండును, త్రిపురారియుఁ, త్రిలోచనుండును, ఉమాపతియు, చంద్రమౌళియు, రుద్రుండును, పూర్వకాలంబున దక్షయజ్ఞసమాగతులగు సురసిద్ధవిద్యాధరాదులను పలాయితులం గావించినవాఁడును సర్వసంభారపరిపూర్ణం బగు దక్షయజ్ఞంబును ధ్వంసముచేసినవాఁడును, కైలాసశైలనివాసుండును, వరప్రదాతయు, పినాకపాణియు, త్రిశూలధారియు, భగవానుండు నగు వృషభధ్వజుండు—ఉత్కలదేశసంస్థితం బగు నేకామ్రవనంబున సర్వకామప్రదాతయై వెలసియున్నవాఁడు. అని చెప్పుటయు మునివరులో దేవా! సర్వభూతహితార్థియగు శివుండు సర్వదేవమయంబును సంపన్నంబు నగు దక్షయజ్ఞంబు నేల విధ్వంసము గావించెను. అల్పకారణంబుచే నిట్టికార్యం బెన్నఁటికిని జరుగ దని తలంచెదము. కావుననే సవిస్తరంబుగ నక్కథ నాకర్ణింప మిక్కిలి

* ఈ స్తవము గ్రంథాంతమునఁ గానఁబడును.

కుతూహలపడుచున్నా మని ప్రార్థింపఁగా వారికి వనజగర్భుం డిట్లని యెను.

మునీంద్రులారా! దక్షప్రజాపతికి నెనమండ్రు తనయులు గల రు. వారందఱకును వివాహము లయ్యెను. ఒకప్పుడు దక్షుండు యజ్ఞార్థియై తనదుహితలఁ బుట్టినింటికిం గొనితెచ్చి విశేషాదరంబున స్నాన భోజనాచ్ఛాదనాదులచే సన్మానించుచుండుటయు నాకన్యకలు పరితృప్తలై పితృగృహంబున సుఖనివాసంబు గావించుచుండిరి. త్ర్యంబకపత్ని యగుసతీదేవి దక్షునిజ్యేష్ఠపుత్త్రిక. రుద్రునియందలిద్వేషముచే దక్షుం డామె నాహ్వానింపఁ డయ్యెను. స్వభావతేజస్వియు జామాతయు నగు మహేశ్వరుండును మామ యగుదక్షునియెడల నెట్టివినయంబును బ్రకటింపలేదు.

తనతోడంబుట్టువు లందఱును బుట్టినింటికి విచ్చేసి రనువృత్తాంతమును దెలిసికొని సతీదేవి అనాహూత యయ్యును పుట్టినింటికి బయలుదేఱెను. ఆమె పితృగృహంబునఁ బ్రవేశించెను గాని దక్షుం డామెను దక్కినకూఁతులకంటె హీనురాలుగను శ్రద్ధారహితముగను సత్కరించెను. అది యంతయుం గాంచి సతీదేవి కుపితయై జనకు నవలోకించి ‹‹ ప్రభూ! నేను నాచెల్లెం డ్రందఱకంటె వయస్సుచేఁ బెద్ద నగుటయే కాక యెల్లవిధముల శ్రేష్ఠురాలను. అట్టినన్ను యథాయోగ్యముగ నీవేల గౌరవింపవు? గర్హితభావంబున నిప్పుడు నేను నీచే నవమానితనై యసత్కృత నైతిని. తండ్రీ! మరలఁ జెప్పుచున్నాను. నేను జ్యేష్ఠురాలను; శ్రేష్ఠురాలను. నన్ను నీవు సత్కరింపవలయును.” అని సతీదేవి యుగ్గడించుటయుఁ గ్రోధావేశంబుచే దక్షునినయనంబులు రక్తవర్ణంబు లయ్యెను. అప్పు డాతఁడు తీవ్రస్వరముతోఁ దక్కినసాతనయ లందఱును నీకంటె నెల్లవిధంబుల శ్రేష్ఠురాండ్రును, వర్షలును

బూజ్యురాండ్రు నై యున్నారు. ఆకన్యాగణంబులఁ బాణిగ్రహణంబు గావించియున్నవా రందఱునుగూడ నాకు బహుమాననీయులై యున్నారు. వారందఱును నీపతియగు విరూపాక్షునికంటె బ్రహ్మనిష్ఠులును, వరిష్ఠులును, మహాయోగరతులును, ధర్మపరాయణులును, గుణశ్రేష్ఠులును, శ్లాఘ్యులు నై యున్నారు. వసిష్ఠుఁడు, అత్రి, పులస్త్యుఁడు, అంగిరుఁడు, పులహుఁడు, క్రతువు, భృగుఁడు, మరీచి అను వారు నాజామాతలు. నీపతి యగు శర్వుండును వారును పరస్పరము స్పర్ధాళువులై యుందురు. అందుచేతనే నేను నీవిషయంబున శ్రద్ధవహించుటలేదు. మఱియు నీపతి యగు భవుండు నాకుఁ బరమశత్రువు.

అని యిట్లు దక్షుండు మాటచెప్పుచుండె ఆత్మనాశంబుకొఱకు తత్కాలంబున సతీదేవితో నిట్లు వాదించుటయుఁ దండ్రివచనంబులకు సతీదేవి క్రోధపరవశయై 'తండ్రీ! మనోవాక్కర్మంబులచే నెట్టిదుష్కృత్యంబును గావించియుండని నన్ను నీవీవిధంబునఁ గటువాక్కులచే నొవ్వఁజేసితివి. కావున నీవలనం గలిగినయీశరీరముం బరిత్యజించుచున్నాను. అని సతీదేవి పితృకృతావమానదుఃఖంబును సహింపఁ జాలక యమ్మహితయై స్వయంభువునకు నమస్కరించి 'దేవదేవా! నేనీదేహంబును బరిత్యజించి మరల సుజ్వలదేహంబు ధరియించి ధార్మికురాలను అనన్యాత్మురాలను నై జన్మించి యప్పటివలె ధీమంతుం డగు త్ర్యంబకుని ధర్మపత్నీత్వమును గాంతును.' అని పలుకుచు క్రోధోద్రేకముతో నచ్చట సమాసీనయై యాత్మను సమాధిమగ్నంబుం గావించి యాత్మయం దాత్మమూలంబున నాగ్నేయీధారణంబును గావించెను. అనంతరము వాయుసముద్దీప్తంబు లగువహ్నిజ్వాల లామెసకలాంగకములనుండియు వినిర్గతంబులై నిమేషమాత్రంబున నామెను భస్మీభూతం గావించెను.

క్రమముగా నీసతీదారుణనిధనవార్త త్రిశూలపాణికిఁ దెలియవ చ్చెను. దక్షసతీసంవాదవిషయముగూడ నాతనికి యథారూపంబుగఁ గర్ణగోచరంబయ్యెను. అప్పుడు భగవానుం డగుశంకరుండు దక్షవినా శనంబునకుఁ గుపితుండై యోదక్షా! సతీదేవి నీయింటికి వచ్చి నీచే నవమానితమైనది. అచ్చటనే నీయితరపుత్త్రికలు తమభర్తలతోఁగూ డ సత్కరింపఁబడిరి. కావున నీజామాతలందఱును చాక్షుషమన్వంత రంబున వైవస్వతమనువునధికారకాలంబున భవదనుష్ఠితంబగుద్వితీయ యజ్ఞంబున నయోనిజులై జన్మింతురుగాక! అక్కాలంబున నీవును మానవరాజేంద్రుఁడవై ప్రాచీనబర్హిపౌత్త్రుం డగుప్రచేతునకు మారి షయనుపత్నిగర్భంబునఁ బుత్త్రుండవై జన్మింపఁగలవు. అప్పుడును నీకు దక్షనామమే యుండును. ఓదుర్మతీ! అప్పుడు నీవొనరించుధర్మకామా ర్థదాయకంబు లగుకర్మంబు లన్నియును నాచే విఘ్నసంకలితంబు ల గుంగాక!

అని రుద్రుండు శపించుటయు దక్షుఁడును గ్రుద్ధుండై యో క్రూరా! నాయొనరించినకర్మంబునకు నీవుఋషులను శపించితివి గావు న బ్రాహ్మణులు యజ్ఞంబులయందు సురగణంబులతోఁగూడ నిన్న ర్చింపకుండెదరు గాక! నీకాహుతి నిచ్చునప్పుడైనను నీ(రుద్ర)నామ ము నుచ్చరింపునప్పుడెల్ల హోతలు జలమును స్పృశింతురుగాక! యు గాంతమున స్వర్గమును వీడి భూలోకవాసుఁడవగుచున్నావు." అని శపి యింపఁగా, రుద్రుం డిట్లు పలికెను. "ఓయీ! దేవతలలోనయితము చాతుర్వర్ణ్యము గలదు. అయినను వా రందఱు నొక్కచోటనే భు జింతురు. దానం జేసి వారితోఁ జేరి పూజింపఁబడుట నాకెన్నఁడును సరిపడదు. కావుననే నాకుఁ గలుగుపూజాదికము ప్రత్యేక మగుచున్న ది. మఱియు, నెల్లలోకంబులకన్నను భూలోకమే మొదిలోకము. కావు

ననే దానిని నే నొక్కఁడనే స్వేచ్ఛాపూర్వకముగ ధరించుచున్నాను గాని నీయాజ్ఞచే ధరించుచుండుట లేదు. నాచే ధరింపఁబడిన యీలోకమునుబట్టి తక్కిన లోకములును శాశ్వతముగా నవస్థితంబు లగుచున్నవి. అన్నిటికంటె ప్రధానమైనది గావున నే నీలోకమునందే వసించుచున్నాను. అంతియకాని యిందు నీయాజ్ఞ యేమియు లేదు."

(ఇట్లు చెప్పి బ్రహ్మదేవుఁడు మరల నిట్లనియెను.) అనంతరము రుద్రుని యభిశాపంబుచే దక్షప్రజాపతి స్వాయంభువం బగు తన దేహమును బరిత్యజించి మర్త్యలోకంబునందు మానవగర్భంబున జనియించి, గృహపతి యైనపిమ్మట సమస్తయజ్ఞానుష్ఠానంబులను సమకూర్చి దేవతలసహితముగ యజ్ఞేశ్వరారాధనమును గావించెను.

ఈసమయంబున వైవస్వతమన్వంతర ముపస్థితంబు గాఁగా పరమేశ్వరి యగుసతీదేవి పర్వతరాజగు హిమవంతునికి మేనకాగర్భంబున జననంబుం గాంచెను. ఆమె పూర్వజన్మమునందు సతీనామంబున విఖ్యాత యయ్యెను. ఇప్పు డామె యుమాదేవి యని యెఱుంగఁబడుచున్నది. సతీదేవి భగవంతుం డైన భవుని నెన్నఁడును విడిచియుండలేదు. ఇట్లే భవుండును సతీదేవి నెడఁబాసి యెప్పుడు నుండలేదు. ఈ ప్రకారము వారుతమయమితప్రేమముతో ననేకమన్వంతరంబులు గడపిరి. మహాపతివ్రతయగు—అదితిదేవి కశ్యపుని, శ్రీదేవి నారాయణుని, శచీదేవి మహేంద్రుని, కీర్తిదేవి విష్ణుదేవుని, ఉషాదేవి సూర్యుని, అరుంధతీదేవి వసిష్ఠుని—నేరీతిని విడిచి యుండలేదో యారీతినే సతీదేవియు శివుని విడనాడి యెన్నఁడు నుండలేదు. రుద్రునిచే నభిశప్తుఁడై మహాత్ముం డగు దక్షప్రజాపతి చాక్షుషమన్వంతరంబునఁ బ్రాచీనబర్హిపౌత్త్రుండును ప్రాచేతసదశకంబునకు పుత్త్రుండు నై రెండవమాఱు మారిషాదేవిగర్భంబున మానవజన్మంబుం గాంచినవాఁ డయ్యెను.

రుద్రశాపంబున భృగ్వాదిమహర్షులుగూడ నట్లే జనించిరి. వైవస్వత మన్వంతరంబున నాదిత్రేతాయుగంబున యజ్ఞస్థలంబున మహాదేవుం డును వారుణీమూర్తిం దాల్చి జనించెను. ఈవిధముగా దక్షుండును మహాదేవుండును వేర్వేఱువిధంబుల జనించి యనుతప్తులైరి. కావున జన్మాంతరంబుల శుభాశుభంబులంగూర్చి యెన్నఁడు ననుతపించుట తగదు. అభిజ్ఞులగువారు వానింగూర్చి యెన్నటికిని విచారింపరు.

మునిశ్రేష్ఠులారా! సర్వకామప్రదంబును, పాపనాశకంబును, పావనంబు నగు నుమాశంకరకల్యాణముంగూర్చి చెప్పెదను వినుండు. ఒకప్పుడు మునివరుం డగుకశ్యపుండు తనయాశ్రమంబు వెలువడి హిమాలయమునకుం బోయినసమయంబున హిమవంతుం డాతనింగూర్చి మునిసత్తమా! లోకహితంబును, విఖ్యాతంబును, అక్షయస్వర్గప్రాప్తికి హేతుభూతంబును, సాధుకీర్తితంబు నగుకర్మం బెయ్యదియో యానతీయవలయునని యడుగుటయుఁ గశ్యపుం డిట్లనియెను. ఓమహాబాహూ! నీవడిగినయర్థంబు లన్నియు నపత్యంబుమూలంబున సిద్ధింపఁ గలవు. బ్రహ్మదేవుండు నన్నును, మఱియు నితరర్షులను నపత్యరూపం బునఁ బడసి యెట్టివిఖ్యాతిం గాంచెనో నీవెఱుంగవా? ఎఱింగియు నన్నిట్లు ప్రశ్నించుచున్నావు. ఈయర్థంబున నేనెఱింగినపూర్వేతిహా సంబును జెప్పెదను వినుము.

నేనొకప్పుడు వారాణసీధామంబునకుఁ బోయి యంతరిక్షంబున సుందరంబును, దివ్యంబును, ననుపమానంబును, సర్వలక్షణసంపన్నం బు నగునొక విమానమును సందర్శించితిని. దానికిఁ దిన్నగఁ గ్రింది భాగంబున భూమియందు నొకగర్తంబుండెను. దానినుండి యొకయార్త నాదము వినవచ్చుచుండెను. తపోబలంబుచే నేనంతయుం గాంచుచుఁ బ్రచ్ఛన్నుండనై యుంటిని. అప్పుడు తీర్థస్నానపవిత్రుండును, దపస్వి

యు, నియమనిష్ఠుండు నగు నొకవిప్రుండు వ్యాఘ్రభయంబున నచ్చోటికి వచ్చి యాగర్తంబునఁ బ్రవేశించి యందలివిరణస్తంబం బవలంబనంబుగా నిలిచి దుఃఖార్తులై యున్న కొందఱుమునిపుంగవులం గాంచి యిట్లనియెను. అయ్యా! యిట్లధోముఖులై ప్రేలాడుచు నిట్లు దుఃఖించుచున్న మీరెవ్వరు? ఏకార్యమువలన నీదుఃఖము శాంతించునో యెఱింగింపుఁ డనుటయుఁ బితృగణంబు లిట్లు చెప్పందొడంగిరి.

ఓమహాభాగా! మేమందఱమును గృతపుణ్యుండవ వగునీకుఁ బితృపితామహప్రపితామహులమై యున్నారము. నీదుష్కర్మంబువలననే మాకిట్టికష్టంబు సంప్రాప్తించినది. అందుచేతనే మాకిట్టిగర్తరూపం బగునరకంబు లభించినది. నీవే యీవిరణస్తంబమవు. నిన్నాధారముగఁ జేసికొనియే మేమిట్లు ప్రేలాడుచున్నాము. కుమారా! నీవీ భూమండలమున జీవించి యున్నంతకాలమును మేమిట్లు ప్రేలాడుచుందుము. నీయనంతరమున మేమందఱమును నరకపతితులమై పోయెదము. నీవు దారపరిగ్రహంబు గావించి గుణవంతుం డగు నొక్కపుత్త్రునిం బడయఁగలిగినచో మేమందఱమును బాపవిముక్తులము గాఁగలము. ఇదిగాక నీవెన్నితపంబులు చేసినను, ఎన్నితీర్థస్నానంబులఁ గావించినను మమ్ముల నుద్ధరింపఁజాలవు. కావున నోమహామతీ! నీవు మాచెప్పిన విధంబున నాచరించి మాకుఁ బరిత్రాణంబు గూర్పుము. అని పితృగణంబులు ప్రార్థించుటయు నాభూసురోత్తముండు వారివచనంబుల కంగీకరించి యట్లు గావించి వృషభధ్వజు నారాధించి తనపితృదేవతల నందఱను మహాదేవానుగ్రహంబున గర్తంబునుండి యుద్ధరించి గణాధిపతులం గావించి తానును సురేశనామంబున రుద్రప్రియతముం డగు గణపతి యయ్యెను.

ఓయచలేంద్రా! నీవును ఘోరతపంబు గావించి గుణవంతుం

డగు పుత్త్రుని, వరవర్ణిని యగుపుత్త్రికను గాంచి ధన్యుండ వగుము. అని కశ్యపుం డుపదేశించుటయు శైలేంద్రుండు వల్లె యని నియమపూర్వకంబుగ నన్నుఁగూర్చి మహాతపంబుగావించుటయు నేను పరితుష్టుండనై నీయభీష్టవరప్రార్థనంబు గావింపు మని యనుగ్రహించితిని. అంత హిమాచలేంద్రుండు వినతుండై దేవదేవా! సర్వగుణాలంకృతుండగు నొకపుత్త్రుని నాకుఁ బ్రసాదింపవలయు నని ప్రార్థించెను. మునివరులారా! నేనాతనికోరికను మన్నించి యోసువ్రతా! నీయీతపంబునకు ఫలంబుగా నీకొకకన్యారత్నంబు గలుగఁగలదు. ఆసంతానప్రభావముచే నీవు సర్వత్ర పూజ్యుండ వయ్యెదవు. నీవు కోటికోటితీర్థంబులచేఁ బరివృతుండవై సకలగణార్చితుండవై సర్వదా సర్వపుణ్యంబులచేఁ బవిత్రుండ వయ్యెదవు. నీకు శుభవతు లగుమువ్వురు తనయలుదయింతురు. అందీతపోలబ్ధ యగుకన్యయే జ్యేష్ఠురా లగును. అని వరం బిచ్చితిని.

కాలక్రమంబున నప్పర్వతాధీశ్వరునకుఁ బత్నియగుమేనగర్భమునుండి అపర్ణ, ఏకపర్ణ, ఏకపాటల యనునామంబులచే మువ్వురుపుత్త్రికలు జనించిరి. అందేకపర్ణ యొకవటపత్త్రంబును నొకపాటలపత్త్రంబు నాహారంబుగా దేవదానవులలో నెవ్వరికినిగూడ దుస్సాధ్యంబగు మహాతపంబును శతసహస్రవర్షంబులు గావించెను. ఏకపాటలయు నేకమాత్రపాటలపత్త్రంబును భక్షించుచు సంపూర్ణముగ సహస్రవర్షంబులపర్యంతమును ఘోరతపంబు గావించెను. అపర్ణమాత్ర మాహారమునే విసర్జించి ఘోరతపంబు సేయుచుండెను. తల్లియగుమేన వాత్సల్యముచే నీకుఁ ఘోరతపంబు వలదని యపర్ణను నిషేధించెను. అయినను నామె తపంబును విడువలేదు. అందుచేతనే యామెకు "ఉమా" నామంబు గలిగెను. ఆరమణీమణులతపోవృత్తాంత మీభూమండల ము

స్నాంతవజనకును బ్రశంసితంబగుచునే యుండును. మహాభాగ్యవత లగునా హిమాచలతనయలు ముగ్గురును యోగావలంబనంబుచేఁ దపంబు గావించుచు నిత్యయౌవనశాలినులై విరాజిల్లుచుండిరి. సర్వలోకజననులును, బ్రహ్మచారిణులు నగునా ముగ్గురును దపోమూలంబున సర్వదా సర్వజీవులయెడలను స్వయముగా ననుగ్రహముఁ జూపుచుండిరి.

వారిలో నపర్ణయను నుమాదేవి సర్వజ్యేష్ఠయై మహాయోగప్రభావముచే నిత్యమును మహాదేవు నారాధించుచుండెను. భృగునందనుండగు నుశనునకు నామెను దత్తపుత్రిం డయ్యెను. అతనివలన నేకపర్ణ దేవలుండను నొకతనయుం గనియెను. ఏకపాటల యలర్కునందనుండగు జైగీషవ్యునియొద్ద నుండెను. ఆమెకు శంఖలిఖితు లను నయోనిజు లగునిరువురు నందనులు గలిగిరి. ఉమాదేవి ఘోరతపంబుచే నిఖిలజగంబును బరితప్తంబై పోవుచున్నసమయంబున నేనచ్చటికిం బోయి యామెను సందర్శించి ఓదేవీ! నీవీజగంబు నేల పరితపింపఁ జేసెదవు? ఇదియంతయు నీచేతనే సృజింపఁబడినది. తల్లీ! నిజతేజముచేతనే నీవీవిశ్వమునంతను ధరించియుంటివని నేనెఱుంగుదును, అట్టినీవిట్టుగాఁ దపంబుగావించుటకు నీయభీష్టమేమియో తెలుపవలయును నని యడిగితిని. అప్పుడాదేవి యోపితామహా! నేనెందుకొఱకీ తపంబు నేయుచుంటినో యావిషయము నీవెఱుంగనిది గాదు. అయినను నీవిట్లు ప్రశ్నించెదవనుటయు నేనో దేవీ! నీవెవ్వనికొఱకుఁ దపంబాచరించుచుంటివో యాతఁడు స్వయముగనే యిచ్చటికి వచ్చి నిన్ను వరింపఁగలఁడు. జగన్మాతా! శర్వుఁడే సర్వలోకేశ్వరుఁడు. ఆతఁడే నీకుఁ దగినవాఁడు. మేమందఱము నాతనికి వశీభూతుల మగుకింకరులము. దేవదేవుండును పరమేశ్వరుండును, స్వయంభువు నగుసమ్మహాదేవుఁడు స్వయముగ నీ

చెంతకు రాఁగలఁడు. ఉదారుఁ డగునవ్విరూపాక్షుండే యాదిదేవుఁడు. ఆతనితో సమాను లెవ్వరును లేరు. మహేశ్వరుం డగునాతఁడు పర్వతంబులయందు వసించి యుండును. చరాచరేశ్వరుం డగునాతఁ డప్రమేయుఁడు. ఇంద్రసమతేజుండగునిందుండు లేకయున్నచో నాతనిభీషణమూర్తి నెవ్వరును దర్శింపఁజాలరు. తల్లీ! నీయభీష్టమచిరకాలంబున సిద్ధింపఁగలదని చెప్పితిని.

## పార్వతీసత్త్వదర్శనము.

బ్రహ్మదేవుండు మఱియు నిట్లనియెను. మునివరులారా! పిమ్మట దేవతలందఱు నచ్చటికి వచ్చి శోభనాంగి యగునద్దేవినుద్దేశించి యచిరకాలంబుననే నీలలోహితుం డగుధూర్జటి నీభర్త కాఁగలఁడని నివేదించి యద్దేవికిఁ బ్రదక్షిణంబుచేసి ప్రణమిల్లి యంతర్హితులైరి. దేవతలు శుభవచనంబులు పలికిరని దేవియు నప్పుడు తపంబు చాలించి తనయాశ్రమద్వారమునకడనున్న యశోకతరుతలంబున నివసించియుండెను. అనంతరము త్రిపత్రహారుండును, చంద్రహారియు నగుమహాదేవుండు హ్రస్వబాహుండును, భగ్ననాసుండును, పింగళకేశభారుండును, కుబ్జుండునై వికృతరూపముతో నచ్చటకు వచ్చి వికృతస్వరముతో నో దేవీ నిన్ను నేను వరించవచ్చితి ననియెను. యోగసిద్ధురాలగు, బ్రాహ్మణప్రియయను నగుమహాదేవి యోగబలంబున నాతని శంకరునిగా నెఱింగి విశుద్ధాంతఃకరణముతో నమ్మహాదేవుని యాశ్రమగృహంబుఁగొని యర్ఘ్యపాద్యాదివిధిపూర్వకంబుగా నక్కపటబ్రాహ్మణు నర్చితుం గావించి యోమహాభాగా! నేనస్వతంత్రురాలను. నాకు సర్వవిధముల సమర్థుఁడైన నాతండ్రి గృహంబునం దున్నాఁడు. ఓవిప్రవరా! నేను కన్యను. ఇట్టినన్ను సంప్రదానంబుగావించుట కా

తఁడే కర్తయై యున్నాఁడు. నీవిప్పుడు నాతండ్రియగునై క్షేమముగ నికడ కుఁబోయి యర్థింపుము. ఆతఁడు నన్ను నీకొసంగినచో నది నాకును సమ్మతమే యని చెప్పెను.

అంతభగవానుండగు శంకరుం డావికృతాకారముతోడనే హిమవంతునిచెంతకుం బోయి నాకు నీతనయనిచ్చి పెండ్లిచేయవలయునని కోరెను. హిమవంతుండును వికృతరూపుండగునాతని రుద్రునిగా నెఱింగి శాపభయంబుచే భీతుండై వికలహృదయముతో నోదేవా! భూదేవతలగుబ్రాహ్మణుల నెన్నఁడును నేనవమానించువాఁడనుగాను. కాని పూర్వమే నేనీవిషయంబున నొకసంకల్పంబు చేసికొని యుంటిని. స్వయంవరసభయందామె యెవ్వని వరించునో యాతని కామె నర్పింపఁదలంచితినని చెప్పుటయు వృషభధ్వజుం డటనుండి కదలి యుమాదేవియొద్దకు వచ్చి యోదేవీ! నీజనకుండు స్వయంవరంబున నీవు వరించినవారికి నిన్నొసంగునఁట. ఓవరాననా! నిన్నొకమాట యడుగుచున్నాను. ఎందఱోసుందరమూర్తులగువారు స్వయంవరసభకు విచ్చేయఁగలరు. అప్పుడు నీవు వారినందఱఁ గాదని యిట్టినన్ను వరించుట యెట్లుపొసంగును? అని మహాదేవుండు పలుకుటయు, నద్దేవి రుద్రాశ్రితచిత్తంబున విషయపర్యాలోచనంబు సేయుచుఁ బ్రసన్నహృదయయై యోదేవదేవా! నీచిత్తం బన్యథాయత్తంబుగాకుండునేని నేను నిన్నే వరింతును. దీనికెన్నఁటికిని వ్యత్యయంబు లేదు. నీకీవిషయంబున సంశయంబయ్యేనేని నేను నిన్నిప్పుడే వరించెదను.

అని చెప్పి యుమాదేవి స్వయముగా నశోకపుష్పస్తబకంబు గోసి దానిచే శంకరుని స్కంధప్రదేశము నలంకరించి నేను నిన్నే వరించితి నని పలికెను. ఇట్లు మహాదేవుం డుమాదేవిచే వరింపఁబడి సంతుష్టుండై తనమనోరథంబులచే నయ్యశోక[illegible]

జేయుచున్నవాఁడుంబోలి యిట్లనియెను. ఓయశోకతరువరమా! పవిత్రంబగు నీకుసుమస్తబకంబుచే నేను వరింపఁబడితిని గావున నియ్యుపకారంబు కారణంబుగా నీవు జరామరణంబులులేని యమరత్వముం గాంచెదవుగాక. నీవింతటినుండి సర్వకామదంబులగు ప్రసూనంబులతోఁ గామరూపముందాల్చియుండి నాకతిప్రియపాత్రమవయ్యెదవుగాక. నీవు సర్వాభరణపుష్పసమన్వితమై సర్వపుష్పఫలాఢ్యమై యమృతమధురంబగునీమూర్తిచే దేవతలందఱకును సంతుష్టింగూర్చుచుందువుగాక. నీకెందు నెట్టిభయంబును లేకుండుఁగాక. ఇంతటినుండి యీయాశ్రమము చిత్రకూటనామంబున విఖ్యాతం బగుఁగాక! దీనినిదర్శించుపుణ్యాత్ములకు వాజిమేధఫలంబు లభించును. ఇందు మరణించినవారికి బ్రహ్మలోకప్రాప్తి కాఁగలదు. ఈయాశ్రమంబున నియమనిష్ఠులై మరణించువారు మహాగణపతిపదారూఢు లగుదురుగాక! అని దేవదేవుండును, భూతపతియు నగుశంకరుండు దేవదేవితో సంభాషించి యనంతరమంతర్ధానుండయ్యెను.

అంత గిరిరాజనందన దేవదేవుండు సనినదిక్కు మొగంబై యొక శిలాఖండముపై నధివసించి నిశాకరవిహీనం బగురజనింబోలి పరిమ్లానయై యుండెను. అప్పుడయ్యాశ్రమంబున కనతిదూరంబుననున్నసరోవరమధ్యంబున నుండి యొకబాలకునియార్తనాదము వినవచ్చెను. పరాత్పరుం డగుశంకరుఁడే స్వయముగ లీలాబాలకవేషముం దాల్చి యాసరోవరంబున గ్రాహగ్రస్తుండై యాక్రందనము గావించుచుండెను. యోగమాయాబలపూర్వకంబుగ నిఖిలప్రపంచసృష్టికి హేతుభూతుం డగు నాదేవుం డట్లు బాలకరూపంబుతో నుండి "అయ్యో! నన్నొక మొసలి పట్టిలాగుచున్నది. ఎవ్వరైనఁ బుణ్యాత్ములు వచ్చి నన్ను రక్షింపుఁడు. నేను బాలకుఁడను. ఇంకను నాకెట్టిమనోరథములును

దీరలేదు. అతిదారుణం బగుమకరముఖంబునఁ బడితుండనై యుపాయంబు గానక మరణించుచున్నాను. ఈగ్రాహము నన్ను గ్రసించి వైచుచున్నది. నేనేకాకినై దిక్కుమాలి దుఃఖించుచున్నాను. నేను నాజీవితంబునకై యింతగా వగచుట లేదు. దీనులగు నాతల్లిదండ్రులు దిక్కుమాలినవారై పోదురుగదా యని మిగుల దుఃఖించుచున్నాను. వారికి నేనొక్కఁడనే తనయుఁడను. వారు నన్నెంతయో ప్రేమించుచున్నారు. నానిధనవార్త విన్నంతనే వారు మరణింపకమానరు. అయ్యో! ఎంతకష్టము! ఏయాశ్రమచర్యయుఁ గావింపకుండఁగనే మరణించుచున్నాను." అని రోదనము చేయఁదొడంగెను.

దేవియగు శైలేంద్రనందన యతికరుణాకరంబగు విప్రబాలకుని యార్తనాదము నాలకించి లేచి యతివేగంబున నచ్చటికిం బోయి సరోవరమధ్యంబున గ్రాహగ్రస్తుండై కంపించిపోవుచున్న సుకుమారాకారుండగు నవ్విప్రబాలకుం గనుంగొనియెను. ఆదేవి యచ్చటికి వచ్చినంతనే యామొసలి యాబాలకుని బట్టి సరోవరగర్భంబున కీడ్చికొనిపోయెను. బాలకుండును దేజస్వియయ్యు నేమియుం జేయఁజాలక యాక్రందించుచుండెను. అదియంతయుం గాంచి గిరిజాదేవి దుఃఖితయై మకరంబు నుద్దేశించి యోగ్రాహరాజా! మహాసత్త్వా! మహాదంష్ట్రా! భీమవిక్రమా! దయయుంచి యీబాలకుని విడువుము! అతిశీఘ్రముగ విడువుము! అని ప్రార్థించెను.

అప్పుడమ్మకరంబు పార్వతి నుద్దేశించి 'దేవీ! దివసంబున షష్ఠముహూర్తంబున కేజీవి నన్ను సమీపించునో దానిని నే నాహారంబుగాఁ గైకొందును. పూర్వంబున లోకకర్తలచే నాకిట్టివిధి విహితంబైనది. ఓశైలనందనా! ఈబాలకుండు షష్ఠముహూర్తంబున నాకు లభించినాఁడు. నిశ్చయముగా నాకొఱకీతని బ్రహ్మదేవుండు పంపి యుం

షును. కావున నీతని నేనెంతమాత్రమును విడువఁజాలను. అనుటయు దేవదేవి యోగ్రాహరాజా ! నీకు నమస్కరించెదను. నేను హిమాలయశృంగమునందుండి యతికఠోరం బగునుత్తమతపంబు గావించితిని. ఆతపోబలంబుచేనైన నీవీతని విముక్తుం గావింపుమని ప్రార్థించెను. ఆమాట విని మకరము దేవీ ! నీవ్రూరక తపోవ్యయంబు సేయకుము. నేను చెప్పినట్లు చేసినచో నీబాలకుఁడు ముక్తుం డగును. అనుటయు దేవి మహాత్మా ! బ్రాహ్మణులు నాకతిప్రియతములు. సాధుజనసమ్మతం బగునేకార్యమైనను నీచెప్పిన ట్లీబాలకునికొఱకు నేను గావించెదననియెను. అప్పు డమ్మకర మోదేవీ ! నీవు గావించినయుత్తమతపఃఫలం బంతయు నర్పించినచో నేనీబాలకుని విడుతు నని యంగీకరించుటయుఁ ద్రిలోకజననియగు నుమాదేవి సంతుష్టయై నేనీజన్మంబునఁ గావించినతపం బంతయు నీకర్పించితిని. ఈబాలకుని రక్షింపుము. అని చెప్పినంతనే యాతపఃప్రభావముచే నమ్మకరము మధ్యందినమార్తండసదృశంబగు దివ్యతేజోరూపముం దాల్చి లోకధాత్రి యగు శైలపుత్త్రిం గాంచి దేవీ ! ఎంతపని చేసితివి! అతికష్టంబుచే సంచితంబైన మహాతపఃఫలం బంతయుఁ బరిత్యజించుట యుక్తిసంగతముగ లేదు. నీవెంతమాత్రమును సంశయింపక యింతటి ఘనకార్యముం గావించితివిగావున నేను నీబ్రాహ్మణభక్తికిఁ బరితుష్టిం గాంచితిని. కావున నీకు వరంబిచ్చెదను. ఈబాలకునితోఁగూడ నీతపఃఫలంబును మరలఁ గైకొనుము.

అని చెప్పుటయు మహావ్రతయగు నుమాదేవి యోగ్రాహేంద్రా ! దేహపాతంబు గావించియైనను బ్రాహ్మణరక్షణంబు గావించుట నాకుఁ గర్తవ్యము. ఎట్లయినఁ బ్రియత్నించి మరలఁ దపస్సంచయంబు సేయఁగలనుగాని మరణించినచో నీవిప్రకుమారు నెట్లు పడ

ణ్యుఁ గలుగుదును? విప్రునికంటెఁ దపంబు శ్రేష్ఠంబైనది కాదుగా న్పున నేనాలోచించియే యీకార్యంబు గావించితిని. నేను నాతపం బంతయును నీకు దానము చేసితిని. దానిని మరలఁ గైకొనఁజాలను. సాధుజను లెవ్వరును దత్తవస్తువును బరిగ్రహింపఁజాలరు. నేను దీనిని నీకిచ్చివైచితిని. ఇఁక నాకక్కఱలేదు. ఈబాలకుని విముక్తుం గావించుటయే నాకోరిక. ఈనాతపం బంతయు నీయందే ప్రతిభాసితం బగుఁగాక! అని యిట్లు గౌరి వచించుటయు నాదిత్యనిభతేజోవిరాజితం బగునాగ్రహ మావిప్రబాలకుని విముక్తుం గావించి యంతర్ధానంబునొందెను. గ్రహముక్తుం డగు నాబాలుండును సరోవరతీరంబునకు వచ్చి స్వప్నదృష్టం బగుసౌధముంబోలి యంతలోనే యదృశ్యుండై పోయెను.

అంత శైలేంద్రనందనయుఁ దనతపంబంతయును సంక్షయం బయ్యెనని భావించి మరలఁ దపశ్చరణంబు గావించుటకై నియమ మవలంబించెను. అప్పుడు శంకరుం డామెకు సాక్షాత్కరించి మహాదేవీ! నీవింకను దపంబు సేయనక్కఱలేదు. నీవు నీతపంబు నంతను నాకే దానము చేసితివి. ఈదానంబునకు ఫలంబుగా నీతపంబంతయు సహస్రగుణంబుల వర్ధిల్లఁగలదు. అది నీకక్షయంబు గాఁగలదని ప్రబోధించి యమ్మహాదేవుం డంతర్హితుం డయ్యెను. పార్వతీదేవియుఁ దనతపం బక్షయం బయ్యెనని విని యానందించి తనస్వయంవరవ్యాపారముం గాంచుటకై సంతోషముతో బయలుదేఱెను. మహాదేవుని యీ బాలక్రీడంగూర్చి వినువారును బఠించువారును దేహాంతంబునఁ గుమారప్రతిముం బగుగణాధిపలాభముం గాంచఁగలరు.

## —♦ ఉమామహేశ్వరకల్యాణము. ♦—

బ్రహ్మదేవుండు వెండియు నిట్లు చెప్పం దొడంగెను. మునిపుంగవులారా! క్రమముగా హిమవంతంబంతయు శతసహస్రవిమానంబులచే నిండిపోయెను. పర్వతేశ్వరుం డగు హిమాచలుండు తనతనయ దేవదేవుని వరించియుండె నని ధ్యానయోగముచే నెఱింగియుండియుఁ దనప్రతిజ్ఞాపాలనంబు గావించుటకై సకలలోకంబులయందును బార్వతీస్వయంవరవార్తను ఘోషింపఁజేసెను. దేవదానవసిద్ధగణసమక్షంబున నాబిడ్డ దేవదేవుం డగునీశ్వరుని వరించినచో నాసుకృతము ఫలించి నేను ధన్యుండ నగుదునని యాతఁడు భావించుకొనియెను. అచలేశ్వరుం డిట్లు నిశ్చయించుకొని హృదయంబున మహేశ్వరుని ధ్యానించుచుఁ దనరాజ్యంబంతయు నమూల్యరత్నాలంకారపరిశోభితంబు గావించి బ్రహ్మాదిసకలదేవతాసమాజంబులందును గౌరీస్వయంవరవార్తను ఘోషింపఁజేసెను. అంత సకలజగన్నివాసు లగుదేవతలందఱు నమూల్యవేషభూషణాలంకృతులై పరమానందముతో హిమాచలంబునకు విచ్చేసిరి. ఆగిరీంద్రుని యామంత్రణంబున నేనును సిద్ధయోగిగణపరివృతుండనై యచ్చటికిం బోయియుంటిని.

మదధారాకలితం బగునైరావతగజారోహణంబు గావించి సర్వాభరణాలంకృతుండై వజ్రహస్తుం డగుమహేంద్రుండును, ఆతనికంటె నధికతేజస్వియై తనకిరణసమూహంబులు దశదిశల వెలిఁగించుచుండ దివ్యపతాకాలంకృతం బగుహైమవిమానారూఢుండై మహాత్ముండును, తేజోబలాజ్ఞానురూపం బగురూపంబుతో భీషణ[illegible] రూఢుండై దండపాణియు, మహామహీధరోన్నతం బగు[illegible] సుందరమాల్యాలంకారశోభితంబు గావించుకొని దివ్యవిమానం[illegible] సధిరోహించి వాయుదేవుండును మఱియుఁ దమతమవిభవంబులు మె

ఆయ హుతాశనుండును, కుబేరుండును, సుందరాకారుం డగు సుధా కరుండును, గదాధరుండగు విష్ణుదేవుండును, అశ్వినీకుమారులును, మహానాగపరివృతుం డగు ననంతుండును, దైత్యేంద్రుండును, గంధర్వరాజును, స్వయంవరసభారంగమున కేతెంచియుండిరి. దివ్యభూషణాలంకృతులై యక్షగంధర్వోరగకిన్నరగణంబులు హిమాచలంబునకు విచ్చేసియుండిరి. సకలదేవతామధ్యంబునం దనప్రాభవంబు దీపించుచుండ శచీపతియగు సురపతి యాసీనుండై యుండెను.

అప్పుడు త్రిలోకహేతుభూతయు, జగద్ధాత్రియు, సురాసురగణంబులకు మాతయు, పురుషప్రధానుండగు శంకరునకుం బత్నియు, పురాణకీర్తిత యగు పరాప్రకృతియు, భగవతియు నగు సతీదేవియవతారంబై జనించి దేవకార్యసాధనంబు గావింపనున్న గిరిరాజనందన మణిహేమమయం బగు విమానము నధిరోహించి చెలికత్తియ లిరుగడల చామరంబులు వీచుచుండ సర్వర్తుసంభవంబులగు సుగంధపుష్పంబులచే గూర్పంబడిన వరణమాలికను గరంబునం దాల్చి స్వయంవరరంగంబునకు వచ్చెను. మహాదేవుం డగు శంభుండద్దేవి మనోభిప్రాయము నెఱుంగం దలంచి యప్పుడు పంచశిఖుండగు నొకశిశుమూర్తిం దాల్చి యాకస్మికముగ నామె యుత్సంగమును జేరి నిద్రించుచున్నట్లు నటించెను.

దేవి యగు పార్వతియు నాబాలకుం గాంచి ధ్యానబలంబుచే నాతని శంకరునిగా నెఱింగి పరమానందముతో నాతని నెత్తికొని తన మనోరథంబు సిద్ధించెనను సంతోషముతో నటనుండి వెడలిపోవుచుండెను. పార్వతీదేవియొడియందలి యాబాలకునిం గాంచి దేవతలందఱు నాశ్చర్యముతో నిదియేమని యాలోచింప నారంభించిరి. ఆబాలకుని నిహతుం గావింపవలయు నని మహేంద్రుండు క్రోధముతోఁ దన

వజ్రాయుధమును బైకెత్తెను. కాని యాతని యెత్తినబాహు వట్లే స్తంభించిపోయెను. బాలకరూపుఁడగుసీశ్వరునిప్రభావముచే నింద్రుఁడును స్తంభితుఁడై పోయెను. ఆదిత్యుండుగూడ నట్లే చేయంబోవుటయు శంకరుఁడాతనిబలతేజంబులనుగూడ స్తంభితములుగాఁ జేసివైచెను. అప్పుడు విష్ణుదేవుండు శిరఃకంపంబు సేయుచు శంకరునివంక వీక్షింపఁదొడంగెను. ఈరీతగా సురసమాజం బంతయు క్రోధపరవశం బయ్యు నేమియుంజేయఁజాలకపోయెను.

అది యంతయుం గాంచి నేనప్పు డతిశీఘ్రంబుగా లేచి పరమాదరంబున బాలకమూర్తియగునీశ్వరునిచరణకమలంబులకు వందనంబు గావించి యతిప్రాచీనంబులగుసామగీతంబులచేతను, బరమగుహ్యంబులగుదివ్యనామంబులచేతను నమ్మహాదేవుని ననేకవిధంబుల వినుతింపనారంభించితిని. పిమ్మట నమ్మహాదేవుండు ప్రసన్నుం డగుటయు నీదేవతలకందఱకును యథారీతిబలతేజంబులఁ బ్రసాదింపవలయు నని యద్దేవుని బ్రార్థించి దేవతలనుద్దేశించి మీరందఱును విమూఢులై పోయితిరి. ఈమహాత్ముండు సాక్షాత్సదాశివుండు. ఈతని మీ రెఱుంగఁజాలరైతిరి. కావున మీరిప్పుడు నాతోఁగూడ వచ్చి యీమహాదేవుని శరణంబు గోరుకొనుఁడు. అని ప్రబోధించితిని.

ఇంతవఱకును స్తంభితులై పోయియున్న దేవతలందఱు నప్పుడేకీభవించి విశుద్ధచిత్తంబున మనస్సంయోగంబు గావించి యమ్మహాదేవునిపాదంబులకుఁ బ్రణామంబులు గావించుటయు దేవదేవుం డగు మహేశ్వరుండు వారియెడలఁ బ్రసన్నుండై బలతేజంబుల నెప్పటియట్ల ప్రసాదించెను. ఈవిధముగా దేవతలకు శాంతి లభించుటయు దేవదేవుం డప్పుడు పరమాద్భుతం బగుత్రిలోచనరూపంబును దాల్చెను. ఆదివ్యతేజోమయరూపసందర్శనంబుచే నెల్లవారి నేత్రంబులును బ్రతి

హాతంబు లయ్యెను. దయాళుం డగుమహేశ్వరుం డప్పుడు వారికందఱకును దనదివ్యరూపముం గాంచఁగలనేత్రశక్తిని బ్రసాదించుటయు సురాసురగంధర్వాదులందఱును బరమానందముతో నవ్విభునికల్యాణమూర్తిం దర్శించి కృతార్థమ్మన్యు లగుచుండిరి.

ఆసమయంబున గిరిరాజనందన యగుభవానీదేవి సకలదేవతా సమక్షంబున దనహస్తమునందలి వరణమాలికను దేవతలందఱును సాధువాదంబులు సేయుచుండఁ బరమహర్షంబున భవునిపాదపద్మంబుల కడ సమర్పణంబు గావించి పాదతలంబున దనమస్తకంబు నుంచి నమస్కారంబు గావించెను. అప్పుడు నేనును సకలదేవతాగణంబులును గలసి మహాద్యుతిమంతుండగు హిమాచలేంద్రు నిట్లు ప్రశంసించితిమి. ఓపర్వతరాజా! భగవానుం డగుశర్వుని జామాతగాఁ బడయుటచే నీకు మహాభ్యుదయంబు గలిగినది. నీవెల్లవారికిని బ్రశంసనీయుఁడవు, పూజ్యుఁడవును, వంద్యుఁడవు నైతివి. మహాత్ముండవగు నీవింకను గాలక్షేపము చేసెదవేల? శుభకరంబగు వివాహమహోత్సవము సంపూర్ణంబు గావింపుము.

అని యుత్సాహంబు గూర్చుటయు నయ్యచలేశ్వరుండు సగౌరవంబుగ నాకుఁ బ్రణామంబు గావించి దేవా! నాసకలాభ్యుదయంబులకును నీవే కారణుండవు. పితామహా! ఏసమయంబున నేవిధముగాఁ గల్యాణంబు సర్వసంపన్నం బగునో యట్టిప్రయత్నం బంతయును నీవే కావింపుమని ప్రార్థించెను. అనంతరము నేనును శంకరుం గాంచి యుద్వాహవిధి ననుష్ఠింపవలయు నని ప్రార్థించుటయు నమ్మహాదేవుం డంగీకరించెను. అప్పుడు మేమందఱమును గలసి నానారత్నమయంబగు నొకపురంబును నిర్మించి మణిహేమమయాలంకారములతో నలంకరించితిమి. ఆపురంబు మరకతకుట్టిమశోభితంబును, సువర్ణస్తంభవిరా

జితంబును నై కన్నులపండువుగా నుండెను. రమణీయం బగునాపురంబునకు ద్వారదేశంబున సూర్యచంద్రులంబోని మహామణు లలంకరింపఁబడి ప్రకాశించుచు శైత్యతాపంబులఁ గూర్చుచుండెను. సుఖస్పర్శంబులగు మందపవనంబు లందు సుగంధంబులఁ బ్రవహింపఁజేయుచు నీశ్వరేశ్వరునియందలి భక్తిభావమును బ్రదర్శించుచు వీతెంచుచుండెను.

సాగరచతుష్టయంబును, శక్రాదిసురగణంబులును, సకలదేవనదులును, మహానదులును, సిద్ధగంధర్వాప్సరోగణంబులును, నాగయక్షరాక్షసగణంబులును, జలచరఖేచరకిన్నర దేవచారణగణంబులును, నారదతుంబురుప్రభృతినామగాయకగణంబులును నానగరంబు నలంకరించి యుండిరి. తపోధనులగు ఋషిగణంబులు వేదసమ్మతంబులగు విధుల నుపదేశించుచుండ ననేకులగు మహర్షులు వైవాహికంబు లగు మంత్రంబులను బఠించుచుండిరి. దేవకన్యకల వివిధమంగళసంగీతము లారంభ మయ్యెను. ఆకల్యాణంబునకు ఋతువులాఱును మూర్తిమంతములై విచ్చేసెను.

వైవాహికమంత్రశ్రవణంబుచే నీలనీరదసదృశంబులగు శిఖికులంబులు హర్షోత్కర్షంబుచేఁ గేకారవంబు సేయుచు నృత్యము సేయ నారంభించెను. ఆసమయంబున విలోలపింగళస్పష్టవిద్యుద్రూపంబున మందహాసంబు గావించుచు వర్షర్తువేతెంచెను. కుముదకుసుమవిరచితంబులగు శిరోభూషణంబులంబోలి శుక్లవర్ణంబులగు బలాకపంక్తులు గగనతలంబునఁ బరిభ్రమింప నారంభించెను. అందందు శిలీంధ్రకదళీప్రభృతి వివిధతరులతాదులు నవనవోద్భిన్నపల్లవసమూహంబులచే శోభిల్లుచుండెను. మనోహరంబులగు మయూరకేకారవంబులచే మానవతులగు మత్తకాశినుల మనోధైర్యములు క్షణకాలంబున విభంగంబు

లగుచుండెను. శశాంకరేఖంబోలి కుటిలంబును, వివిధవర్ణోజ్జ్వలంబును దర్శనీయంబునగు నింద్రధనువు మేఘమండలసమీపంబున నతిరమణీయంబై యుండెను. విచిత్రపుష్పంబుసంభూతంబులును, సుగంధకలితంబులు నగుసమీరణంబులు వర్షజలసంపర్కంబున శీతలంబులై యతిసుఖంబుగ వీతెంచుచు సురాంగనలనీలాలకంబులఁ గంపింపఁజేయుచుండెను. శబ్దాయమానంబులగు పయోదమాలికలు చంద్రమండలము నావరించుచుండెను. పథికాంగన లుత్కంఠలై నిట్టూర్పులు విడుచుచు సాదరంబుగ వర్షాగమంబును నిరీక్షించుచుండిరి. మఱియు నవవర్షాగమంబు హంసనినాదంబులను నూపురధ్వనులతోడను, సమున్నతపయోధరంబులను పయోధరంబులతోడను, చంచలచంచలాలతలను హారంబులతోడను, వికచకమలంబులను లోచనంబులతోడను నతిరమణీయంబై యుండెను. ఆనీలనీరదధ్వనులం గాంచి మదమరాళంబులు విత్రస్తంబు లగుచుండెను. నిరంతరవిమలధారాపతనంబువలన నుత్పలదళాగ్రంబులు వినమ్రంబు లగుచుండెను. ఇట్లు సురభికుసుమరాగంబు లంగరాగంబు చేసికొని గిరిజాదేవివివాహమునకు వర్షర్తు వేతెంచెను.

పిమ్మట ననురాగవతియు, మనోహారిణియు నగుకామినీమణింబోలి శరత్తు సనుదెంచెను. ఉన్ముక్తమేఘకంచుకయు, విస్ఫుటకమలశోకపయోధరయు, హంసధ్వనినూపురనినాదయు, విస్తీర్ణపులినశ్రోణియు, సారసమాలికామేఖలయు, ప్రఫుల్లేందీవరనీలనయనయు, పక్వబింబఫలాధరయు, కుందదంతప్రహాసినియు, నవశ్యామలతాశ్యామరోమరాజియు, చంద్రాంశుమాలికయు, సమదాళికులోద్గీతమధురభాషియు, చలత్కుముదకుండలశోభినియు, రక్తాశోకపల్లవాంగుళియు, అశోకపుష్పవిలసితామాల్యవసనశోభినియు, రక్తోత్పలదళచరణయు, జాతీకుసుమ

సఖావళియు, కదళీస్తంభవామోరువిరాజితయు, శశాంకవదనయు, సర్వలక్షణసంపన్నయు, సర్వాలంకారవిలసితయు నై ప్రేమమయియు, సానురాగయు, మనోరమయు నగుకాంతరంబోలి నిర్ముక్తాసితమేఘకంచుకపటయు, పూర్ణచంద్రబింబాననయు, నీలాంభోజవిలోచనయు, రవికరోద్భిన్నపద్మకోశపయోధరయు నగుశరద్రమణి నానాకుసుమరజోగంధంబులచే హృదయాహ్లాదంబు గూర్చుచు దేవదేవియగు గౌరీదేవి కల్యాణంబునకు విచ్చేసెను.

అనంతర మతిశీతలంబులగు మంచుబిందువులచే దశదిశలను ప్లావితంబులుగాఁ జేయుచు హేమంతఋతు వేతెంచుటయు నెల్లెడల వ్యాపించినమంచుచే నాహిమాచలంబంతయు క్షీరసాగరముంబోలి విరాజిల్లుచుండెను. హిమాచ్ఛన్నంబులగుశిఖరంబులచే నాగిరీంద్రము సితచ్ఛత్రశోభితుండగు మహారాజేంద్రుంబోలి యొప్పుమీఱుచుండెను. నిర్మలజలపూర్ణంబులగు సరోవరంబులయందలి పద్మోత్పలకుసుమషండంబులపై నుండి సురనారీగణంబులకు మదనోద్దీపకంబులగు సమీరడింభకంబులు మెల్లమెల్లగ వీతెంచుచుండెను. మఱియు నాశైలేంద్రకన్యకాపరిణయంబునకు వసంతంబు వచ్చుటయు నాకస్మికముగ రమణీయాకృతులం బొల్చుసరమణీమణుల పయోధరాగ్రభాగంబులు కించిద్భిన్నములయ్యెను. నాతిశీతోష్ణంబు లగుసరోవరజలంబులు పద్మపరాగంబులచేఁ గపిలంబులై జలవిహంగదంపతులకలకలారావంబులచే ముఖరితంబు లయ్యెను. దిక్పాలకుల మదగజేంద్రంబులు పరమానందంబునఁ గ్రీడలాడుచుండెను. ప్రింకణంబులును, సహకారంబులును బహుస్వరాతిశయంబుఁ జూపుచు వికచమంజరులచే విలసిల్లుచుండెను. శుభ్రవర్ణంబులగు హిమశృంగంబులయందలి తిలకభూజంబులు కుసుమవర్షణంబు సేయుచు శుభకావ్యసమాగతులగుసుబుధులంబోలి శోభిల్లుచుండెను. సాలవృక్షశ్రేణులకునశోకవల్లికలు కాంతునికంఠాలింగనంబు గావించుకొనుకామినీగణంబులంబోలి మనోజ్ఞంబులై యుండె

ను. అవ్వసంతాగమంబుతోఁగూడఁ గదంబ, నీప, తాల, తమాల, సరళ, అశోక, పున్నాగ, కోవిదార, లవంగ, కర్ణికార, సప్తపర్ణ, అగురు, నారికేళాదులైన తరురాజంబులు ప్రఫుల్లకుసుమంబులతోడను, బరిణతఫలంబులతోడను రమణీయంబులై యుండెను. నిర్మలజలపూరితంబులగు జలాశయంబులు చక్రవాకకారండవాదివిహంగంబులచేతను, బద్మోత్పలాదికుసుమంబులచేతను, మీనాదిజలచరంబులచేతను శోభిల్లుచుండెను. మలయానిలంబులు సుఖశీతలంబులై పర్వతనిచయంబులందలి ప్రసూనంబుల రాల్చుచు మందమందగమనంబుల వీతెంచుచుండెను.

ఈవిధముగా ఋతువు లన్నియును బరస్పరమిశ్రితంబులై సవిభ్రమభావంబునఁ బ్రవర్తిల్లుచు నతిమనోహరంబులగు సుమమంజరులచేఁ దమతమశోభను బ్రకటింపఁజేయుచుండెను. జలాశయంబులందలి జలంబులొకచో మత్తమధుకరవేష్టితంబులగు పద్మంబులచే నీలవర్ణంబులును, మృణాలదండంబులచే గౌరవర్ణంబులును, రక్తోత్పలంబులచే రక్తవర్ణంబులు నై యుండెను. హిమాలయహేమశృంగంబు లన్నియు బహుపుష్పశోభితంబులై, బహువిహంగనినాదితంబులై, బహులతాతరుపరిశోభితంబులై కన్నులపండువుగా నుండెను. అందందు జరించుకోకిలాదివిహంగములు మృదుమధురగీతంబుల నాలపించి చంచలపక్షంబులై నీలకంఠంబులు నృత్యంబులు సేయుచుఁ గేకారవంబులఁ గావించుచుండ ననంగదేవుండు బలసంచయంబు గావించుకొని కుసుమచాపధరుండై దేవాంగనలను వేధించుటకు బద్ధపరికరుండయ్యెను.

క్రమముగా సూర్యతాపంబు ప్రఖరంబగుటయు జలాశయంబులు శుష్కప్రాయంబులగుచుండ ఘోరకల్యాణంబునకు గ్రీష్మం బేతెంచెను. ఆగ్రీష్మంబునందును హిమాలయశృంగములు వివిధకుసుమలతాతరువిలసితంబులుగనే యుండెను. పాటలకదంబార్జునాదితరుషండంబులనుండి సుగంధకలితంబులగు మందపవనంబులు వీతెంచుచునే

యుండెను. జలాశయంబులన్నియు జలజకేసరంబులచే నరుణితంబుల గుటయుఁ దీరంబులఁ గలహంసాదిజలవిహంగములు మధురగీతంబులచే వీనులవిందు సేయుచుండెను. నగశృంగములు కుసుమపాంసురంబులగు కురవకంబులచే శోభిల్లుచుండెను. అమ్మహీధరవిశాలనితంబంబులయం దందందువకుళకుసుమంబులు పరివ్యాప్తములై యుండెను. అప్పుడు సకలజాతివృక్షంబులును గుసుమవిలసితంబులై, సకలపక్షిగణంబులును మధురగానకలితంబులై యుండుటయు నెల్లయెడల నతిరమణీయంబై యుండెను.

ఈవిధముగాఁ బార్వతీవివాహమహోత్సవంబునకు ముహూర్తంబును వచ్చెను. క్రమముగా సర్వజీవగణంబులును సమాగతంబులయ్యెను. వివాహమంటపంబున వివిధవాద్యంబులు మొరయుచుండెను. ఓమునివరులారా! అప్పుడు నేను గౌరీదేవికి యథాయోగ్యం బగునలంకారంబు సేయించి స్వయముగాఁ గళ్యాణవేదికడకుఁ దీసికొనివచ్చి దేవదేవుండగు శంకరుంగాంచి మరల నిట్లు నివేదించితిని. దేవా! నేను నీకుఁ బురోహితుండనై యగ్నిహోత్రంబు గావించెదను. దేవరయాజ్ఞయైనచో నీకల్యాణవిధు లన్నియు యథోచితంబుగ నిర్వర్తించెదను.

అనుటయు మహాదేవుండు నన్నుంగాంచి పితామహా! నీచెప్పిన విధంబున సమస్తకార్యంబులును సంపన్నంబులుగాఁ జేయుము. నేను నీయుపదేశానుసారంబుగఁ బ్రవర్తించెదనని యానతిచ్చెను. అప్పుడు నేను ప్రహృష్టహృదయుండనై సత్వరంబుగఁ గుశానయనంబు గావించి పార్వతీపరమేశ్వరులహస్తద్వయంబును యోగబంధంబుచే నాబద్ధంబు గావించితిని. హుతాశనుం డాసమయంబున స్వయముగా నేతెంచి కృతాంజలిపుటుండై యుండెను. శ్రుతిగీతంబులును, మహామంత్రంబులునుగూడ మూర్తిమంతంబులై వచ్చి యుపాసనంబు సేయుటయు యథావిధిగ హోమకార్యనిర్వాహణంబు గావించి గౌరీశంకరులచేఁ గల్యాణవహ్నికిఁ బ్రదక్షిణంబు సేయించి పరమానందముతోఁ గంకణ

విమోచనంబు గావించితిని. ఈవిధముగాఁ గల్యాణవిధులన్నియుఁ బరిసమాప్తంబులైన వెనుక నేను భగవానుండగు నృషధ్వజునకుఁ బ్రణామం బాచరించితిని. ఇట్లు యోగబలంబుచేతనే యుమామహేశ్వరుల వివాహవ్యాపారంబంతయు సంపన్నంబయ్యెను. కాని యామాహాత్మ్యమును దేవతలుకూడ నెఱుంగఁజాలకుండిరి. మునులారా! స్వయముగఁ బౌరోహిత్యముం గావించిననేనె మీకిప్పుడు గౌరీశంకరులకల్యాణచరిత్రమును సంక్షేపముగఁ జెప్పితిని. ఆవివాహసంబంధమునందింకను సత్యపూర్వంబగు విచిత్రవిషయంబున్నది చెప్పెదను వినుండు.

## శివస్తుతినిరూపణము.

అని చెప్పి బ్రహ్మదేవుండు వెండియు నిట్లనియెను. తపోధనులారా! ఈవిధముగా నమితతేజుం డగు మహాదేవుని పరిణయ మహోత్సవము సంపూర్ణం బగుటయు నింద్రాది బృందారకబృందంబులు పరమానందభరితులై యతిప్రాచీనంబులగు వాక్సముదాయంబుచే సద్దేవ దేవు నిట్లు వినుతింపం దొడంగిరి. ఓసర్వతలింగా! సర్వేశ్వరా! పవనవేగా! విరూపా! నీకు నమస్కారము. అజితుండవు, క్లేశనాశనుండవు, శుభసంపత్తి దాతవు, నీలకంఠుండవు, అంబికానాయకుండవు నగు నీకు వందనములు. ధవళరూపుండును, శతరూపుండును, సహస్రనేత్రుండును, సహస్రపాదుండును, దేవవయస్యుండును, శైవరూపుండును, విరూపాక్షుండును, వేదాంగుండును, ఇంద్రబాహుస్తంభనుండును, దేవాంకురుండును, చరాచరేశ్వరుండును, శమనుండును, సలిలలింగుండును, యుగాంతుండును, కపాలమాలాధరుండును, కపాలసూత్రాభరణుండును, కపాలహస్తుండును, దండధరుండును, గదాధరుండును, త్రిలోకనాథుండును, పశుపతియుఁ, ఖట్వాంగహస్తుండును, ప్రమథార్తిహరుండును, నగు నీకుఁ బ్రణామంబులు. యజ్ఞశిరోహంతయు, కృష్ణకేశాపహారియు, భగనేత్రనిపాతనుండును, పూషదంతహరుండును, పినాక

పాణియు, శూలహస్తుండును, ఖడ్గముద్గరధరుండును, కాలకాలుండును, త్రినయనుండును, అంతకాంతకుండును, పర్వతనిలయుండును, సువర్ణరేతుండును, నగునీకు నమస్కారము. దేవా! నీవు యోగిగురుండవు, చంద్రార్కనేత్రుండవు, సాధుగృహస్థుండవు, శ్మశానరతుండవు, శ్మశానవరదుండవు, దేవతానాథుండవు, త్ర్యంబకుండవు, కార్యకారణస్వరూపుండవును, అప్రమేయుండవు, నగునీకు నమస్కారము. ఓభూతభావనా! ప్రభూ! మాయెడల సౌమ్యుండవగుము.

అని యిట్లు భగవానుండగు జగత్పతిం గూర్చి దేవతలందఱు ననేకవిధంబుల వినుతించుటయు దేవదేవుండు ప్రసన్నుండై మీయభిమతవరంబుల నర్థింపుఁడని యానతిచ్చెను. అప్పుడు సురలందఱును ప్రణతులై మహాత్మా! అవశ్యకంబైనప్పుడు మేమునిన్నర్థించెదము. అప్పుడు మాయీప్సితవరదానంబు గావించునట్లనుగ్రహింపు మని ప్రార్థించిరి. భగవానుండగు మహేశ్వరుండట్లే చేసెదనని కరుణించి వారికి సెలవొసంగి పంపి తానును స్వీయభవనంబునఁ బ్రవేశించెను. కల్యాణోత్సవసమయంబున దేవతలచేఁ గావింపఁబడిన యీశివస్తోత్రరాజమును బఠించువారును, వినిపించువారును, దేహాంతంబున గణేశతుల్యులగుదురు.

## మదనదహనము.

దేవదేవుం డగుమహేశ్వరుం డిట్లు స్వయంభవనంబునఁ బ్రవేశించుటయు క్రూరహృదయుండగు మన్మథుం డద్దేవుని గుసుమశరాహతుం గావింపవలయు నని నిశ్చయించెను. దురాచారుండును, దురాత్ముండును, గులాధముండు నగునిమ్మదనునకు సకలలోకపీడనంబు గావించుటయే స్వభావము. అతఁడు మహాత్ములవ్రతనియమంబులకు విఘ్నకారియై యుండును. అప్పుడా కుసుమశరుండును, రతియును, చత్రవాతదంపతులరూపముం దాల్చి వచ్చి యట విహరించుచుండిరి.

ఆతతాయి యగునమ్మదనుం గాంచి మహాదేవుండు తిరస్కారంబు సేయుచు నాతనిపైఁ దనతృతీయనయనంబు దృష్టిపాతంబు వించెను. తోడనే యద్దేవునినయనంబునుండి సహస్రసహస్రంబులగు హుతాశనజ్వాలామాలికలు ప్రదీప్తంబులై వెలువడి సత్వరంబుగ రతిపతిని సపరిచ్ఛదంబుగ భస్మీభూతునిం గావించెను. దహ్యమానుండగు మదనుండును కరుణస్వరంబున రోదనంబుసేయుచు దేవదేవుని చరణసమీపభూతలంబునఁ బడిపోయెను. అప్పుడు రతీదేవి దుఃఖాతిరేకంబున విలపించుచుఁ బార్వతీపరమేశ్వరులంగూర్చి పతిభిక్షముం గోరుకొనియెను. అట్లు దుఃఖించుచుఁ బ్రార్థించుచున్న రతీదేవిం గాంచి దేవియు, దేవుండును దయార్ద్రహృదయులై యామె నూఱడించుచు నోభద్రా! నీపతి దగ్ధుండయ్యెను. ఇఁక నాతనిపునరుత్పత్తి కుపాయంబు లేదు. కావున నీనాథుఁ డింతటినుండి యనంగుఁడై యుండియు సకలకార్యంబులను నిర్వర్తించుచుండును. కొంతకాలంబునకుఁదరువాత నాతఁడు వాసుదేవునకుఁ బుత్త్రుండై జనించి నిన్నుఁ బెండ్లియాడఁగలఁడు. అని యానతిచ్చుటయు రతీదేవి వరలాభంబునందు ముదితహృదయయై యాదేవదేవులకడ సెలవు గైకొని నిజనివాసంబునకుం బోయెను.

## సుమేరుప్రస్థానము.

వృషధ్వజుండును నీరీతిగాఁ గామదహనంబు చేసి ప్రహృష్టచిత్తుండై యుమాసహితంబుగ హిమాచలంబున యథేష్టవిహారంబులఁ గాలక్షేపము సేయుచుండెను. దివ్యకందరంబులయందును, నిర్మలజలాశయంబులయందును, రమణీయకర్ణికారవనంబులయందును, కమనీయనదీతీరంబులయందును, సుందరశైలశృంగంబులయందును, నానావిహంగకలాలాపముఖరితంబులగుపుణ్యతీర్థంబులయందును, పవిత్రాశ్రమంబులయందును, సకలపుణ్యమయప్రదేశములందును, యథాగంధ

ర్వవిద్యాధరసేవితంబులగునితరసుందరదేశంబులయందును దిరిగెనుగ్రుం డు గిరితనయాద్వితీయుండై విహరింపఁదొడంగెను.

అప్పు డింద్రాదిదేవతాగణంబులును, మునిగణంబులును నమ్మహాదేవుని బరివేష్టించియుండిరి. పరమానందముతో నప్సరోగణంబులు నృత్యంబులు సేయందొడంగిరి. గంధర్వులు వివిధవాద్యగీతంబులు గానింప నారంభించిరి. అనేకు లయ్యాదిదంపతులను స్తోత్రము సేయుచుండిరి. మహాత్ముం డగుమహేశ్వరుం డిట్లు బహువినోదంబులతోఁ గాలయాపనంబు సేయుచు దేవీప్రియంబు సేయంగోరి యాహిమాచలంబును విడువ నొల్లఁడయ్యెను. చంద్రమౌళి యగునాదేవుండా దేవికి సంతోషంబు గూర్ప నెంచి హిమాచలశృంగంబున నివసించి యుండి యనేకగణేశమూర్తులం దాల్చి యామె కానందంబుఁ గూర్చుచుండెను.

ఇట్లుండ నొకప్పుడు పరమేశ్వరి యమూల్యహేమాసనాసీనయైయున్న తల్లియగు మేనచెంత కరుదెంచెను. తల్లియుఁ దనపుత్రిక నొకయమూల్యపీఠంబునఁ గూర్చుండఁజేసి తల్లీ! నీవు చాలదినంబుల కిచ్చటికి వచ్చితివి. నీశుభసంవాదంబు నాకెఱింగింపుము. అమ్మా! నీవు దరిద్రురాలవయ్యును భర్తతోఁ గలసి గలసి క్రీడించుచుంటివిగాదా? నిరాశ్రయులును, దరిద్రులు నగువారు నీనాథునివలెనే క్రీడించుచుందురు. అనుటయు సతీదేవి యసంతుష్టయయ్యును మిగుల నోర్పుగలిగి తల్లి కెట్టియుత్తరమును జెప్పక యచటనుండి కదలి మరలఁ దనపతికడకుం బోయి భర్తం గాంచి దేవదేవా! నేనింక నీభూధరంబున నివసింప నొల్లను. ఈభూమండలమున నివసించుటకు మనకనేకస్థలంబులున్నవి. నావిన్నపమును మన్నించి మనము మఱియెచ్చటికైనఁ బోయి నివసించియుండుట కంగీకరింపవలయును. అని ప్రార్థించుటయు దేవదేవుండు ప్రియా! మనమన్యత్రనివసింపవలయు నని నీకెప్పుడును జెప్పుచునే యున్నాను. కాని నీకప్పు డట్టియభిప్రాయము లేకపోయి

నది. ఏకారణముచేతనో నీకిప్పు డట్టియుద్దేశము గలిగినది. నేప్పుడు దేవీ ! ఇంతయాకస్మికముగా నీకీభావపరివర్తన మేల గలిగినది ? అని ప్రశ్నించుటయు దేవి యిట్లనియెను.

దేవదేవా ! నేనిప్పుడు నాపితృగృహంబునకుం బోయితిని. ఎవ్వరును జెంతలేని సమయంబున నాతల్లి నన్నుం గాంచి సనూపరభావం బునఁ గూర్చుండఁజేసి తల్లీ ! నీభర్తపరిభ్రమించియ్యును సుఖముగఁ గ్రీడించుచున్నాఁడు. అట్లు క్రీడించువారు దేవతలలోఁగూడ నెవ్వరును లేరని పలికినది. మహాదేవా ! నీవు గణసమూహంబుతోఁ గలసిక్రీడించుట మాయమ్మ కిష్టముగా లేదు. అనిచెప్పుటయు శివుండు చిఱునవ్వు నవ్వుచు దేవిని బరిహసించుటకై ప్రియా ! మీయమ్మచెప్పినమాట సత్యమే. అందులకు సందేహము లేదు. దానికై నీవింతదైన్యంబును, క్రోధంబును గాంచుటేల ? నేను చిరకాలమునుండియుఁ గృత్తివాసుఁడను, దిగంబరుఁడను, శ్మశానవాసియు నైయుంటిని. నివసించుటకు సాకారగృహంబును లేదు. నేను భూతగణంబులతోఁ గలసి వనంబులను, బర్వతకందరంబులను బరిభ్రమించుచుందును. నీవు నీతల్లిపైఁ గోపింపకుము. ఆమె సత్యమే వచించినది. ఈభూతలంబునఁ దల్లితోఁ దుల్యులగుబంధువు లెందును లేరని యెఱుంగుము.

అనుటయు దేవదేవి యోమహాదేవా ! నాకు బంధువులతోను బాంధవముతోడను బ్రయోజనంబు లేదు. నేనుసుఖంబుగ నివసించ నట్టియేర్పాటు గావింపుమని వేడుకొనియెను. ఇట్లు దేవి ప్రార్థించుటయు మహాదేవుండు గౌరీదేవికిఁ బ్రియంబు సేయఁగోరి యాహిమాలయంబును బరిత్యజించి ప్రియపరిజనంబు లగుగణబృందంబులతోఁగూడ సురసిద్ధచారణసేవితంబగు సుమేరుశైలంబునకుఁ బ్రస్థానంబుఁ గావించెను.

శ్రీరామచంద్ర.

# బ్రహ్మపురాణము

## ద్వితీయసంపుటము.



రూపగుణరహితు, నజు, ని
ర్లేపుని, గూటస్థు, నచలు, లీలాగాత్రము, స
ర్వోపాధిముక్తు, సర్వో
ద్దీపితు, నచ్యుతుని బ్రస్తుతింతుము భక్తిన్.

— • పదియష్టాధ్యాయము. • —

బ్రహ్మదేవుం డిట్లనియెను. సుమేరుశైలంబున నానారత్నవిరాజితంబును, విచిత్రంబును, త్రిలోకపూజ్యంబును, అప్రమేయంబును, సర్వజనపూజితంబును నగు జ్యోతిష్కస్థలం బను శృంగమునందు సర్వధాతుచిత్రితంబును, పర్యంకముంబోలి విశాలంబునగు శిలాతలంబునందు పూర్వమొకప్పుడు దేవదేవుండగు శంకరుం డేకాకియై కూర్చుండియుండెను. నిత్యానపాయినియగు గిరికుమారియు నమ్మహాదేవుని పార్శ్వమునం దుపవిష్టయై యుండెను. మహాత్ములగు నాదిత్యగణంబులును, తేజోనిధులగు వసుగణంబులును, భిషగ్వరులగు నశ్వినీకుమారులును, గుహ్యకగణపరివృతుండగు యక్షరాజు వైశ్రవణుండును జగదీశ్వరుండగు నాతని నుపాసించుచుండిరి. ఉశనుండను మహామునియగు నుశనుండును, సనత్కుమారప్రముఖమహర్షులును, అంగిరసాది దేవర్షులును, పర్వతనా

దులును, గంధర్వాప్సరోగణంబులును నచ్చటికేతెంచిరి. వివిధకుసుమ పరిమళంబులతో మందమారుతంబులు వీతెంచుచుండెను. తరులతాదులు సర్వర్తుకుసుమసమూహంబులచే విరాజిల్లుచుండెను. సిద్ధవిద్యాధరాదితపోధనులును, నానారూపధరు లగుభూతగణంబులును, మహాకాయు లగురాక్షసగణంబులును, పిశాచసంఘములును, వివిధాయుధధరులై, వివిధాకారులైన దేవానుచరులును, శూలధరుండును, భగవానుండు నగునందీశ్వరుండును, సర్వతీర్థమయియైమూర్తీభవించియున్నగంగాదేవియు పశుపతి యగునమ్మహాదేవు నుపాసించుచుండిరి.

ఇట్లు సకలదేవతాసమూహంబులచేతను భగవానుండగుశంకరుండు సంపూజితుండై యున్నసమయంబున బ్రజాపతి యగుదక్షుండు పూర్వోక్తవిధానంబున యజ్ఞము గావించుట కారంభించి యుండెను. స్వర్గమునుండి యింద్రాదిదేవతలందఱును దక్షాలయంబునకుఁ జేరియుండిరి. వారందఱును దివ్యవిమానారూఢులై నానాద్రుమలతాకీర్ణంబగు గంగాద్వారమునఁ బరివేష్టించి యుండిరి. యజ్ఞభాగులగునాదిత్యవసురుద్రసాధ్యాదిదేవగణంబులందఱును విష్ణుదేవునితోఁగూడ వచ్చియుండిరి. యజ్ఞకర్తలగుఋషిగణంబులును విచ్చేసియుండిరి. అనలతేజులగుదేవతాగణంబులు కళత్రసహితముగా విమానారూఢులై వచ్చియుండిరి.

యజ్ఞదర్శనార్థులై యిట్లువచ్చియున్నవారినందఱిం గాంచి దధీచిమునీంద్రుండు దక్షప్రజాపతి నుద్దేశించి సక్రోధంబుగా నిట్లనియెను. అపూజ్యులఁ బూజించుటవలనను, పూజ్యులఁ బూజింపకుండుటవలననుగూడ మహాపాపము సంభవించు ననుటకు సందియము లేదు. పశుపతి సర్వపూజ్యుండు. నీవాతనిఁ బూజింపక యేలయుపేక్షించుచుంటివి? అనుటయు దక్షుండు నాకిచ్చటఁ ద్రిశూలధరులును, గపర్దులు నగునేకా

దశరుద్రిలున్నారు. వీరికిభిన్నుం డగుమహేశ్వరు నేనేన్నండు నేఱుం
గ ననియెను. అంత దధీచిమునీంద్రిండు క్రోధముతో సకలలోకా
ధ్యుండగుశంకరుని నీవీయజ్ఞమునకాహ్వానింపనై తివి. నేను నిశ్చయ
ముగా నమ్మహాదేవునికంటె నితరదైవతంబుల నెఱుంగనివాఁడ నైతి
నేని నాసత్యబలంబుచే నీదక్షుయజ్ఞము సుస్థిరంబు గాకుండుఁగాక! అని
పలుకుటయు దక్షుండు నేను విష్ణుదేవునకు వివిధంబు లగుయాగభాగం
బుల నర్పించితిని. రుద్రాదులును, దక్కిన దేవతలునుగూడఁ దమతమ
భాగములం గైకొనిరి. నేను శంకరునకుమాత్రిము యజ్ఞభాగము స
ర్పింపఁదలఁచుకొనలేదు. అని చెప్పెను.

ఇట నుమాదేవి దక్షుయజ్ఞమునకుఁ బోవుచున్న దేవతలం గాంచి
తనపతి యగుపశుపతినుద్దేశించి దేవా! ఈయింద్రాదిదేవతలందఱు
నెచ్చటికిఁ బోవుచున్నారో యానతీయవలయునని ప్రార్థించుటయు
మహేశ్వరుం డో దేవీ! ప్రిజాపతి యగుదక్షుం డశ్వమేధయాగము సే
యుచున్నాఁడు. వీరందఱు నచ్చటికే పోవుచున్నారని చెప్పెను. అంతఁ
బార్వతీదేవి మహాదేవా! ఆయజ్ఞమునకు మీ రేల పోలేదని ప్రిశ్నించు
టయు మహేశ్వరుండు ప్రియా! సర్వయజ్ఞములందును నాకు భాగము
లేకుండునట్లు దేవతలచేతనే కల్పింపఁబడియెను. నేనట్లే పూర్వాగతపథ
ము నవలంబించి సంచరింపవలయును. దేవతలు నాకు యజ్ఞభాగము
ల నర్పింపరు. అనుటయు గౌరీదేవి దేవా! గుణప్రిధానములచే సకల
దేవతలయందును మీరేప్రధానులు. తేజోయశశ్శ్రీలచే మీరెల్లవారికి
నజేయులు. అట్టిమీకు యజ్ఞభాగము లేకుండుట నాకు వి[illegible]
నున్నది. ఈదుఃఖముచే నాదేహమంతయుఁ గంపించిపోవుచు[illegible]. ఓ
భూతనాథా! ఇంద్రాదిదేవగణంబులతోఁ గూడ నీకును యజ్ఞభాగము
లభించుటకు నేనెట్టిదానతపోనియమాదులఁ గావింపవలయునో చెప్ప

పునిచెను. సతీమణి యగుగౌరి యిట్లు సంతోషభరితహృదయముతోఁ బ్రశ్నించుటయు మహాదేవుం డించుకచింతించి యోదేవీ! నీవిట్లనుట యుక్తము గాదు. ఓవిశాలాక్షీ! ఇంద్రాదిదేవతాగణంబులు ధ్యాన మూలంబున నాతత్త్వము నెఱింగియే యున్నారు. నేను కోపించినచోఁ ద్రిభువనంబులును దగ్ధములై పోవును. బ్రహ్మవేత్త లగుసాధుపురుషులు నన్ను యజ్ఞేశ్వరునిగాఁ బ్రస్తుతించుచుందురు. రథంతరసామగీతము నన్నుద్దేశించియే గానము చేయఁబడుచున్నది. యజమానులు బ్రహ్మమంత్రములతో నన్నర్చించుచుందురు. నాకొఱకు యజ్ఞభాగము కల్పింపఁబడియున్నది.

అని యుపలాలించుటయు దేవి యిట్లనియెను. ఓశర్వా! నీవు సాధారణస్త్రీజనంబునుంబోలి యాత్మస్తుతి చేసికొని గర్వపడుచున్నావని యెత్తిపొడుచుటయు, భగవానుం డోదేవీ! నేనూరక యాత్మస్తవము చేసికొనుట లేదు. ఇదిగో! నాభాగరక్షణంబునకై యొక్కని సృష్టించెదను చూడుము! అని చెప్పి మహాదేవుండు తనక్రోధానలంబుచే వక్త్రమునుండి యొకభూతమును సృజించి నీవు సత్వరంబుగఁ బోయి దక్షాధ్వరధ్వంసనుం గావించిరమ్మని యాజ్ఞాపించెను. సింహావేషముం దాల్చియున్నయాభూతము తీవ్రవేగంబున బయలుదేఱినప్పుడే దక్షమఖంబు విధ్వస్తంబైనట్లు తోఁచెను. భీమవిగ్రహయు మహేశ్వరియు నగుభద్రకాళి సాక్షీరూపంబున నాతని ననుసరించి పోయెను. శ్మశానవాసనిరతుండును, శివక్రోధమూర్తియు నగునాభూతము వీరభద్రనామంబున విఖ్యాతిం గాంచెను. ఆవీరభద్రుండును స్వయముగాఁ దన రోమకూపంబులనుండి రుద్రవీర్యులగుబహుసహస్రరుద్రానుచరులను సృజించెను. ఆగణేశ్వరు లందఱును రుద్రానుచరులును, రుద్రపరాక్రములునైరి. వారందఱును కిలకిలారావంబులచే భూనభోంతరములఁ

ప్రతిధ్వనింపఁజేయుచు నత్యుత్సాహముతో బయలుదేఱిరి. వారిఘో రారావంబులచే స్వర్గవాసు లందఱును విభ్రాంతు లగుచుండిరి. పర్వతములు బ్రద్దలై పోవుచుండెను. వసుంధర కంపించిపోవుచుండెను. భీకరప్రభంజన సమీరములు చెలరేఁగిపోవుచుండెను. సాగరములు సంక్షుభితములగు చుండెను. అగ్నులు దీప్తిహీనము లగుచుండెను. భాస్కరచంద్రబింబ పరిమ్లానము లగుచుండెను. గ్రహతారకాగణంబు లప్రకాశమానము లగు చుండెను. దేవదానవమానవాదిసకలజీవులును నిస్తేజులై పోయిరి. ఈ విధముగా జగంబంతయు నిబిడాంధకారబంధురముగాఁ జేయుచు తమ స్వేచ్ఛాగమనంబులచే గణేశ్వరు లందఱును విజృంభించుచుండిరి. వారు యజ్ఞశాలం బ్రవేశించినంతనే యూపంబుల నన్నిటిని పెల్లగించి పాఱ వైచి యొక్కసారిగా సింహనాదములం గావించుచు భీకరాకారంబుల తో నుద్ధతులై చిందులుద్రొక్కుటయు యజ్ఞపాత్రంబు లన్నియును జీర్ణీభూతములై పోయెను. యజ్ఞశాలయంతయు విధ్వస్తమై పోయెను. పర్వతోపమంబు లగుదివ్యాన్నంబులును, పానీయంబులును, భక్ష్యంబులును, మఱియు నాయజ్ఞంబునకు సంపాదింపఁబడిన పాలు, నేయి, తేనె, పాయసము, షడ్రసములు, మాంసములు, దివ్యంబులగు చోష్య లేహ్యపేయపదార్థంబులునుగూడ నారుద్రానుచరులచేఁ గబళితములై యపవిత్రములై వినష్టములై పోయెను.

రుద్రకోపసంభవులును, రౌద్రమూర్తులును, కాలాగ్నిరుద్రతేజులును, పర్వతాకారులునగు ప్రమథగణంబులు భయంకరవిహారంబులఁ గావించుచు, వివిధభక్ష్యంబుల భుజియించుచు, సురసుందరీమణులం బట్టి నలుదెసలకు విసరివైచుచు ననేకవిధంబుల యజ్ఞశాల యంతయును జిందఱవందఱగఁ జేసివైచిరి. ఈవిధముగా రుద్రకోపప్రేరితుండును, ప్రతాపవంతుండు నగువీరభద్రుండు దుర్ధర్షులగురుద్రాను

చరులతోఁ గలసి సర్వదేవరక్షితంబగు దక్షయజ్ఞమును భద్రకాళీసమక్షంబున దగ్ధంబు గావించివైచెను. రుద్రానుచరులందఱును విజయోల్లాసముచే సింహనాదములం గావించుచుండిరి. అప్పుడింద్రాదిదేవతలందఱును దక్షప్రజాపతిసహితులై నిటలతటంబుల నంజలిబంధంబు గావించుకొని వీరభద్రునుద్దేశించి మహాత్మా! నీవెవ్వఁడవో యెఱింగింపు మని ప్రార్థించుటయు వీరభద్రుం డిట్లనియెను.

ఓసురవరులారా! నేనుదేవదానవులలో నెవ్వండను గాను. నే నెద్దియైన ననుభవింపఁగోరి యిచ్చటికి వచ్చియుండలేదు. నాకుఁ జూడఁదగిన దేదియును లేదు. నేనింద్రుఁడనుగాను. ఇటకు వచ్చుటకు నాకెట్టికోరికయును లేదు. దక్షమఖధ్వంసము చేయుటయే నాయుద్దేశము. అందుకొఱకే వచ్చితిని. నేను రుద్రకోపమువలన జనించితిని. నాపేరువీరభద్రుఁడు. దేవీకోపసంజనిత యగునీమె భద్రకాళి. ఈమె దేవదేవుని యాదేశముచే నిటకు వచ్చినది. కావున నోదేవతలారా! మీరుసత్వరంబుగ మహాదేవునిశరణముం గాంచుఁడు. ఏమనిన— శివానుచరులయనుగ్రహముకంటె నుమాపతికోప్రధమే యించుకప్రియమైనది. అనిప్రబోధించెను.

మునివరులారా! దక్షమఖశాలయందలి సకలవస్తువులును జెల్లాచెదరై పోయెను. శివానుచరులెల్లకడల నమంగళారావములం గావించుచుండిరి. అప్పుడు యజ్ఞము మృగరూపముం దాల్చి యాకాశమార్గమునఁ బలాయితంబగుచుండుటయు గణేశ్వరుండగువీరభద్రుండు కనుంగొని ధనుర్బాణధారియై యామృగంబు ననుసరించెను. అప్పుడు తేజోమయుండగువీరభద్రునికోప్రధమువలన నొకస్వేదబిందువుపతితంబై దానినుండి కాలానలసన్నిభంబగు నొకయగ్నిజ్వాల యుదయించెను: ఆయగ్నిమధ్యమునుండి హ్రస్వాకారుండును, రక్తాక్షుండును, హ

రితశ్మశ్రుయుండును, ఊర్ధ్వరోముండును, భయంకరుండు నగునొకపురు
షుండుదయించెను. ఆతనిశరీరమంతయును రోమరాజిచే నిండియుండె
ను. కృష్ణవర్ణుండును, రక్తకర్ణుండును, రక్తవసనధారియు మహాసత్త్వశాలి
యు నగునాపురుషుఁ డగ్నిం బోలి పాఱిపోవుచున్నయజ్ఞమృగమును ద
గ్ధముచేసివైచెను. అప్పుడు దేవతలందఱును భయభ్రాంతులై దశది
శలఁ బలాయితు లగుచుండిరి. ఆపురుషునివిక్రమవిహారంబునకు స
ప్తద్వీపవతి యగుపృథ్వి యంతయును గంపింపసాగెను. దేవలోకభ
యంకరంబులగుమహాభూతంబులు నలుదెసలఁ బరుగులెత్తుచుండెను.
అప్పుడు నేను మహాదేవుని బూజించి మహాదేవా! సకలదేవతలును
నీకు యజ్ఞభాగమును సమర్పించెదరు. నీవు క్రోధము నుపసంహరింపు
ము. ఈసకలదేవతలును, ఋషులును నీక్రోధమువలన శాంతిలాభముం
ను బడయఁజాలకున్నారు. మహాత్మా! నీస్వేదమునుండి జనియించిన
మహాపురుషుఁ డింతటినుండి జ్వరనామంబున విఖ్యాతిం గాంచఁగలఁ
డు. నీతేజమునందలియీయంశమును లోకమంతయు నేకమైనను భ
రింపఁజాలదు. కావున దీనిననేకరూపములుగా విభజింపుమని ప్రార్థిం
చుటయుఁ బినాకపాణి నావిన్నపమును మన్నించి సంప్రీతుండై యా
క్రోధజ్వరము ననేకభాగములుగా విభజించెను. అప్పుడు దేవదేవున
కు యజ్ఞభాగము నిర్ధారితమయ్యెను.

అప్పుడు దక్షుఁడు ప్రాణము లుగ్గఁబట్టుకొనివచ్చి మహాదేవుని
శరణముం గాంచెను. శత్రుదమనుండగు నద్దేవుం డంతట నవలోకిం
చుచు మందహాసవదనముతో దక్షునుద్దేశించి నీకేమికావలయునో కోరు
కొను మనియెను. దక్షుండును ప్రాంజలియై భయముతో సబాష్ప
నయనుండై మహాదేవా! నీవు నాయెడలఁ బ్రసన్నుండవైతివేని, నేను
నీదయకుఁ బాత్రుండ నగుదునేని చిరకాలమునుండి యతిప్రయత్నము

ళ్లో సంపాదింపఁబడి నీయనుచరగణంబులచే విధ్వస్తంబులై పోయిన సకలయజ్ఞపరికరంబులును, అన్నాదిదానములును, వివిధభక్ష్యభోజ్యద్రవ్యంబులునుగూడ నీయనుగ్రహంబుచే సఫలసంపన్నంబులగుంగాక! యని ప్రార్థించెను. అంత మహాదేవుండట్లే యగునని యనుగ్రహించెను.

దక్షుండిట్లు వరప్రాప్తుండై పరమేశ్వరునకు సాష్టాంగనమస్కారంబు గావించి యష్టోత్తరసహస్రనామంబుల నుచ్చరించుచు సంస్తవంబు గావించెను. అప్పుడు మహాదేవుండు సుప్రసన్నుండై యోసువ్రతా! నీసంస్తవంబునకు నేను సంతుష్టుండనైతిని. నీకు సాలోక్యము నొసంగితినని యాశ్వాసించి యోప్రజాపతీ! నీవు నీయజ్ఞము విధ్వస్తంబయ్యె నని విచారింపకుము. నాయనుగ్రహముచే నీకు సహస్రాశ్వమేధయజ్ఞఫలంబును, శతవాజపేయయజ్ఞఫలంబును లభింపఁగలదు. దేవదానవదుర్లభంబును, నిగూఢంబును, అనిందితంబును, వర్ణాశ్రమధర్మావిరుద్ధంబును, పశుపాశవిమోక్షణంబును, సర్వాశ్రమసమ్మతంబును, సర్వపాపహరంబును, శుభకరంబునగు ద్వాదశవర్షపాశుపతవ్రతఫలలాభంబు నీకు సిద్ధించుఁగాక! నీవు విచారమును విడువు మని యనుగ్రహించి గణసహితంబుగా సంతర్ధానుం డయ్యెను.

ఆసమయమునందు మహాదేవుఁడు యథోచితముగా యజ్ఞభాగమును బడసి సర్వభూతశాంతికొఱకు శైవజ్వరమును బహురూపములుగా విభజించెను. అందు నాగగణంబులకు శిఖాభితాపంబును, పర్వతంబులకుశిలాజత్తును, జలంబులకు నీలికయు, భుజగంబులకు నిర్మోకంబును, సురభిగణంబులకు ఖోరకంబును, భూతలంబున కూషరంబును, శునకంబులకు దృష్టిప్రతిరోధంబును, అశ్వంబులకు రంధ్రాగతంబును, బర్హిగణంబులకు శిఖోద్భేదంబును, కోకిలంబులకు నేత్రరోగంబును, మహాత్ములకు ద్వేషంబును, శుకంబులకు హిక్కయు, శార్దూలంబుల

కు శ్రీమయు జ్వరంబులమ్యేను. మానభలలో నిది జ్వరంబనియే విఖ్యాతంబగుచున్నది. ఈజ్వరము జనించినదిమొదలుమరణించువఱకును మానవదేహముల నధిష్ఠించి యుండును. జ్వరనామకంబగునీమహేశ్వరతేజము సర్వజనసన్మాన్యంబును వంద్యంబు నైనది. నిశ్చలచిత్తుండై యీశ్వరచరిత్రమును నిత్యమును బఠించువాఁడు ముక్తరోగియై పరమానందముతో సర్వాభీష్టసిద్ధుండగును.

—• ఏకామ్రక్షేత్రమాహాత్మ్యము. •—

మహాత్ములందఱును బ్రహ్మచేఁ జెప్పంబడినయీపుణ్యచరిత్రము నాలకించి యానందపులకితులై పితామహునింగాంచి దేవా! నీవుమహాదేవుండగుశంకరునిమాహాత్మ్యమును వర్ణించితివి. దక్షయజ్ఞధ్వంసకథను వింటిమి. మాకిఁక నేకామ్రక్షేత్రమాహాత్మ్యముంగూర్చి బోధింపుమని ప్రార్థించిరి. అప్పుడు బ్రహ్మదేవుం డిట్లుచెప్పందొడంగెను.

మునివరులారా! మహాదేవునకుఁ బ్రియంబగునేకామ్రక్షేత్రము సర్వపాపహరంబును, పుణ్యప్రదంబును, సర్వజనదుర్లభంబు నైనది. దానింగూర్చిసంక్షేపముగాఁ జెప్పెద నాలకింపుఁడు. అది యష్టతీర్థసమన్వితమైనది. కోటివిలసితంబగువారణాసింబోలి యది యతిపవిత్రమైనది. ఆక్షేత్రమునందుఁ బూర్వమొక యామ్రవృక్షముండెడిది. అవృక్షమువలననే యాక్షేత్రమున కాపేరు గలిగినది. ఆదివ్యక్షేత్రము నిత్యసంతుష్టులగునరనారీగణంబులచేతను, విద్వజ్జనంబులచేతను, ధనధాన్యసమృద్ధులచేతను మనోహరగృహగోపురంబులచేతను, అమూల్యమణిగణంబులచేతను, రాజహంససన్నిభంబులగుశుభ్రప్రాసాదమాలికలచేతను, వివిధరాజమార్గంబులచేతను, విచిత్రప్రాకారంబులచేతను, విరాజిల్లుచుండును. వివిధవర్ణపతాకాభిశోభితంబగునానగర మగాధంబులగునగడ్తలచేతను, ఆయుధపాణులగుభటులచేతను సర్వదా పరిరక్షి

త్తమై యుండును. అందెల్లప్పుడు నానందోత్సవములు పూర్ణీభవించి యుండును. వీణావేణుమృదంగాదివివిధవాద్యంబులు దశదిశలనూలు మ్రోగుచుండ నాక్షేత్రము దివ్యోద్యానంబులచేతను, దేవభవనంబు లచేతను శోభిల్లుచుండును. అందు రత్నహారాలంకృతలును, బద్మప త్త్రాయతాక్షులును, పీనోన్నతవక్షోభాగలును, యువతులును, బూ ర్ణచంద్రాననలును, సూక్ష్మావలగ్నలును నగురమణీమణులు సర్వదా ప్రఫుల్లహృదయములతో విహరించుచుందురు. అందలిరమణీమణు లందఱును విదుషీమణులే. అందఱును బ్రియదర్శినులే. అందఱును సౌ భాగ్యవతులును, బ్రియవాదినులు, స్థిరయౌవనగర్వితలు, సుచరిత్రు లు దివ్యమాల్యాలంకృతలు నై యుండుదురు. అందుస్త్రీలేకాక పురుషు లుగూడ రమణీయాకారులె. అందు చతుర్వర్ణంబులవారును స్వధర్మ నిరతులై వాసము చేయుచుందురు. అందు దుర్వృత్తులుగాని, పర ద్రోహకారులుగాని, నిర్ధనులుగాని, మూర్ఖులుగాని, మలినులుగాని, రోగులుగాని, మాయావులుగాని యెవ్వరునులేరు.

అచ్చటివారందఱును నిత్యసుఖులే. అచ్చటిసర్వక్షేత్రములు ను సస్యపరిపూర్ణములై యుండును. కుసుమఫలభరితంబు లగువివిధ తరులతాదులచే నందలివనంబులు విరాజిల్లుచుండును. అందలి కమ లేందీవరమండమండితంబు లగుసరోవరంబులు జలవిహంగమకలకూజి తంబులచే నతిమనోహరంబులై యుండును. ఈవిధముగా నేకామ్రక్షే త్రము సర్వసంపత్సమృద్ధంబై పుణ్యజలాశయంబులచేఁ బరిశోభితం బగుచుండును. ఆక్షేత్రమునందు భుక్తిముక్తిప్రదాయకుండును, కృ త్తివాసుండును, వృషధ్వజుం డగుసదాశివుండు సర్వలోకహితార్థమై స్వయముగా వేంచేసియుండును.

భూమండలమునందలిసమస్తపుణ్యతీర్థములు, నదములు, నదు

లు, సరోవరములు, పుష్కరిణులు, తటాకములు, వాపీకూపములు, సాగరములు మొదలగువానినుండి మహాదేవుండొక్కొక్కబిందువును సంగ్రహించి లోకహితంబుకొఱకు దేవతాసహితుండై యాక్షేత్రంబు ననొకతీర్థంబును నిర్మించియుండెను. ఆతీర్థమునుబిందుసరనామంబుచేఁ బ్రఖ్యాతం బగుచున్నది. మార్గశీర్ష బహుళాష్టమీతిథియందును, విషువంబులయందును బిందుసరతీర్థంబునఁ జితేంద్రియుండై సందర్శించి యథావిధిగ నందు స్నానంబు గావించి దేవర్షిపితృతర్పణంబులు చేసి మౌనియై తిలోదకప్రదానంబుశ్రద్ధతోఁ గావించువాఁ డశ్వమేధఫలలాభంబు నందఁగలఁడు. చంద్రసూర్యగ్రహణంబులయందును, విషువసంక్రాంతులయందును, యుగాదులయందును, అయనసంక్రాంతుల యందును, మఱియునితరపుణ్యదినంబులయందును, నచ్చట దానము లం గావించుట యితరతీర్థదానంబులకంటె శతగుణాధికఫలదాయకం బగును. ఆబిందుసరస్తీరంబునఁ బితృదేవతలకుఁ బిండప్రదానంబు గావించినచో వారికక్షయసంతృప్తి కాఁగలదు.

అనంతరము జితేంద్రియుండును మౌనియునై మహాదేవమందిరంబునఁ బ్రవేశించి శంకరునకు ముమ్మాఱు ప్రదక్షిణంబు చేసి ఘృతక్షీరాదుల చేనభిషేకంబు చేసి చందనము, కుంకుమాదిసుగంధద్రవ్యములు, వివిధపుష్పములు, బిల్వదళములు, అర్కపత్రములు, అమలకఫలములు మొదలగువానిచే నాగమోక్తమంత్రవిధానంబునఁ బ్రహ్మ పూజ యగునుమాపతి నర్చింపవలయును. దీక్షారహితుం డగువాఁడు శివనామోచ్చారణమాత్రంబునసే పూజింపవలయును. సువిధముగా గంధపుష్పధూపదీపనైవేద్యాదులచే నర్చించి పిమ్మట సాష్టాంగప్రణామంబాచరించి నృత్యగీతవాద్యాదులతోడను, స్తోత్రపాఠములతోడను, జయధ్వనులతోడను ప్రదక్షిణంబు చేయవలయును. ఇట్లునిశ్చివి

ధానంబున దేవదేవు నర్చించువారు సర్వపాపవిముక్తులును, రూపయౌవనశోభితులును, సర్వాభరణభూషితులు నై, మణిమయ హేమవిమానంబు నధిరోహించి గంధర్వాప్సరోగణంబులచేఁ గీర్తింపఁబడుచు దిగంతంబులఁ దమతేజముచే వెలిఁగించుచు శివలోకప్రాప్తు లగుదురు. అట్టివారు శివలోకంబున నభీష్టసుఖభోగంబు లనుభవించుచుఁ గల్పాంతమువఱకును నివసించి యనంతరము మరల నీభూమండలంబునఁ జతుర్వేదవిదులగు యోగివరులగృహంబున జన్మించి పాశుపతయోగప్రాప్తులై తుదకు మోక్షలాభముం గాంతురు.

శయనైకాదశి, సంక్రాంతి, అయనములు, అశోకాష్టమి మొదలగు పవిత్రదివసములందు కృత్తివాసుం డగునమ్మహాదేవుని సందర్శించువారు సూర్యసన్నిభంబగు విమానము నధిరోహించి శివలోకముం జేరఁగలరు. ఆదేవదేవుని నిత్యమును సందర్శించు ధీమంతు లెల్లరును శివలోకప్రాప్తు లగుదురు. ఆదేవునకు నలువంకలను సార్ధయోజనద్వయపరిమితంబగు ప్రదేశంబంతయును భుక్తిముక్తిప్రదాయకం బైనది. ఆక్షేత్రంబున భాస్కరేశ్వరలింగంబు గలదు. పూర్వకాలంబున నాదిత్యుం డు దాని నర్చించి యుండెను. అందు గల కుండంబునందు స్నానంబుచేసి యాశివలింగమును దర్శించువారు సర్వపాపవిముక్తులై దివ్యవిమానారూఢులై గంధర్వాప్సరస్సంస్తుత్యులై శివలోకంబుఁ జేరి, యందు నిఖిలభోగంబుల ననుభవించుచుఁ గల్పాంతమువఱకు నుండి యనంతర మిహలోకంబున యోగికులంబున వేదవేదాంగవిదులును, సర్వభూతహితులును, మోక్షపర్వులును, సర్వసములును, ద్విజశ్రేష్ఠులునై జన్మించి శాంభవయోగసిద్ధులై మోక్షప్రాప్తు లగుదురు. ఆక్షేత్రమునందలి సకలవనంబులయందును రథ్యలయందును చతుష్పథంబులయందును, శ్మశానాదులయందును, మఱియు నెల్లప్రదేశంబులయం

మను గల పుణ్యక్షేత్రంబులు, సుపూజ్యంబులు నగులింగంబు లన్నియును మానవులకు బహుళసుఖంబు లైనవి. అవ్యగ్రచిత్తుండును, సమాహితుండును, శ్రద్ధాసహితుండును నై తల్లింగంబుల నభిషేకించి గంధపుష్పధూపదీపనైవేద్యనమస్కారస్తవప్రణామాదులచేతను, స్తోత్రగీతాదులచేతను యథావిధిగ నర్చించువాఁడు శివలోకప్రాప్తుం డగును. స్త్రీజనంబులకైనను శ్రద్ధాసహితంబుగ శివపూజం గావించినచోఁ బూర్వోక్తఫలలాభంబు గలుగు ననుటకు సందియం బేమాత్రంబును లేదు. ఆదివ్యక్షేత్రంబునందలి సకలగుణంబులను వర్ణించుటకు పరమేశ్వరుండు గాక మఱియెవ్వండు సమర్థుం డగును? వైశాఖాదిమాసంబులయం దేతిథియం దైనను శ్రద్ధతో నైన నశ్రద్ధతోనైన స్త్రీయైనఁ బురుషుండైన నయ్యుత్తమక్షేత్రంబునకుం బోయి బిందుసరోవరంబున స్నానంబుసేసి యందున్న దేవదేవుండగు విరూపాక్షుని దేవియగు వరదాభవానిని చండాఖ్యుండగు గణముఖ్యుని, కార్తికేయుని, గణేశ్వరుని, నందీశ్వరుని, కల్పద్రుమంబును, సావిత్రిని సందర్శించినచో నట్టివారికి శివలోకప్రాప్తి యగును. అట్టి పాపహరం బగు కపాలతీర్థంబున విధిపూర్వకంబుగ స్నానంబుసేయువానికి నభిమతఫలలాభంబు చేకూరుటయే కాక శివలోకావాసంబుకూడ సిద్ధించును. జితేంద్రియుండై యాదివ్యక్షేత్రంబున స్తంభారోపణంబు గావించువాఁడు తనకులంబున నేకవింశతిపురుషుల నుద్ధరించి శివలోకసాయుజ్యంబు సేకూర్పంగలండు. శివప్రియంబగు నీయేకామ్రక్షేత్రంబు వారాణసీతుల్యపవిత్రంబు. అందు స్నానపూజనంబులఁ గావించువానికి మోక్షలాభంబు ధ్రువంబు.

## ఉత్కలక్షేత్రవర్ణనము.

బ్రహ్మదేవుం డిట్లనియెను. మహర్షిశేఖరులారా! బ్రహ్మణో

యు, జగన్మాతయు నగువిరజాదేవిచేఁ బ్రతిష్ఠితంబగువిరజాక్షేత్రమును దర్శించినమాత్రమునఁనే సప్తపురుషాంతరంబులవఱకును గులంబు పవిత్రం బగును. ఒక్కసారి యాక్షేత్రమును సందర్శించి భక్తిపూర్వకంబుగ పూజాప్రణామాదులు గావించువారు కులోద్ధారకులై బ్రహ్మలోకప్రాప్తు లగుదురు. ఆక్షేత్రమునం దనేకదేవీమూర్తులు ప్రతిష్ఠింపఁబడి యున్నవి. వానినారాధించుటచే సర్వపాపహరంబును, నభీష్టఫలలాభంబును నగును. అందు సర్వపాపహారిణి యగు వైతరణీనది కలదు. ఆనదియందు స్నానముచేయువారు సర్వపాపవిముక్తు లగుదురు. ఆక్షేత్రంబున విష్ణుదేవుండు స్వాయంభువం బగువరాహమూర్తితో విరాజిల్లుచుండును. ఆదేవుని దర్శించుటవలనను, బూజించుటవలనను విష్ణులోకప్రాప్తి యగును. ఆవిరజాక్షేత్రంబున కాపిలంబును, గోగ్రహంబును, సోమతీర్థంబును, అలాబుతీర్థంబును, మృత్యుంజయంబును, క్రోడతీర్థంబును, వాసుకంబును, సిద్ధేశ్వరంబును, ననునష్టతీర్థంబులు గలవు. ఆతీర్థంబులయందు విధిపూర్వకంబుగా స్నానంబుచేసి యందలిదేవతాగణంబుల నర్చించువారికి సర్వపాపవిముక్తియు నంతంబున బ్రహ్మలోకప్రాప్తియు నగును.

మదీయం బగువిరజాక్షేత్రంబునఁ బిండప్రదానంబుగావించినచోఁ బితృదేవతలు పరితృప్తు లగుదురు. ఆదివ్యక్షేత్రంబున మరణించువారికి మోక్షలాభంబు సిద్ధించును. సాగరతీర్థంబున స్నానముచేసి కపిలదేవుని సందర్శించి వరాహమూర్తి నారాధించువానికి స్వర్గలోకప్రాప్తియగును. ఆవిరజాతీర్థంబున నింకను ననేకపుణ్యతీర్థంబులును, బుణ్యాయతనంబులునుగలవు. సముద్రంబున కుత్తరతీరంబునఁ బరమగుహ్యంబును, పాపహరంబును, ముక్తిప్రదంబు నగునొకక్షేత్రముగలదు. అచ్చటిప్రదేశంబు లన్నియును వాలుకామయంబులై

యుండును. ఆక్షేత్రము సర్వకామప్రదంబైనది. దశయోజనపరిమితంబగునది మానవులకు దుర్లభంబైనది.

ఆక్షేత్రమునకు నలువంకలను ఫలపుష్పభరితంబులగునానాతరులతాభిశోభితంబులగుమనోహరవనంబులు విరాజిల్లుచుండును. ఆసకలపాదపంబులయందును గిరశారికాకోకిలాదివిహంగములు కలకలధ్వనులచే వీనులవిందు చేయుచు విహరించుచుండును. కమలేందీవరశోభితంబు లగుజలాశయంబును, పుష్కరిణులును, దీర్ఘికలును, తటాకములును నందందు విలసిల్లుచుండును. అవియన్నియును నిర్మలజలపూరితంబులై యుండును. కాదంబ, చక్రవాక, జలకుక్కుట, కారండవ, ప్లవ, మరాళాదిజలవిహంగములును, మత్స్యకూర్మాదిజలచరంబులును వానియందు విహరించుచుండును. ఆక్షేత్రమునందుఁ జతుర్విధాశ్రమనిష్ఠులును, స్వధర్మనిరతులునగు చతుర్వర్ణములవారు సందు నివసించియుందురు. అందలిస్త్రీపురుషు లెల్లరును నిత్యసంతుష్టులై యుందురు. సకలవిద్యలకు నాకరమై సకలధర్మములకు నాకరమై సకలగుణంబులకు నిధానమై జగంబునఁ బరమదుర్లభం బగు నాక్షేత్రముశోభిల్లుచుండును.

మునివరులారా! ఆదివ్యక్షేత్రమునందు విఖ్యాతుండగుపురుషోత్తమదేవుఁడు విరాజిల్లుచుండును. భగవానుం డగుపురుషోత్తమదేవుని సంస్థానంబగునుత్కలదేశమంతయును శ్రీకృష్ణదేవు ననుగ్రహంబుచే నతిపవిత్రంబైనది. జగద్వ్యాపకుండగుజగన్నాథుం డందే సుప్రతిష్ఠుండై యుండును. నేనును, రుద్రేంద్రాగ్నిప్రముఖదేవగణంబులును సర్వదా యందు నివసించి యుందుము. గంధర్వులు, అప్సరసలు, పితృదేవతలు, దేవమానవగణంబులు, యక్షులు, విద్యాధరులు, సిద్ధులు, నియమవంతులగుమునిగణంబులు, వాలఖిల్యాదిఋషిగణంబులు,

కశ్యపాదిప్రజాపతులు, సుపర్ణులు, కిన్నరులు మొదలగువారందఱును, సాంగకంబులగుచతుర్వేదంబులును, వివిధశాస్త్రంబులును, సకలేతిహాసంబులును, పుణ్యపురాణసమూహంబులును, బహుదక్షిణాసిద్ధయజ్ఞంబులును, వివిధపుణ్యనదీగణంబులును, నానాతీర్థంబులును, నానాయతనంబులును, సాగరసమూహంబులును, శైలబృందంబులును సర్వంబు నందు విలసిల్లుచుండును. దేవర్షి పితృసేవితంబును, సర్వోపభోగమయంబును పావనంబు నగునాదేశమునందు వసించుట కెవ్వరభిలషింపకుందురు? ఆదేశముకంటె శ్రేష్ఠతమం బగుదేశ మింకెచ్చట నున్నది?

ఆపుణ్యదేశంబున ముక్తిప్రదాత యగుపురుషోత్తముండు స్వయముగా నివసించి యుండును. ఉత్కలదేశంబున నివసించుభాగ్యము గాంచిన విబుధసదృశులగుమానవులే జగంబున ధన్యులు. అచ్చటఁ దీర్థస్నానంబు చేసి పురుషోత్తముని దర్శించువారికి యమాలయసందర్శనంబు లేదు. వారు స్వర్గమునే చేరఁగలరు. పవిత్రమగు నుత్కలదేశమునందలి పవిత్రపురుషోత్తమక్షేత్రంబునందు వసించువారిజీవితము సఫలమైనది. సుప్రసన్నాయతలోచనాన్వితంబును, మనోహరభ్రూలతావిలసితంబును, వినీలకుంతలవిరాజితంబును, సువర్ణమణిమకుటశోభితంబును, మందహాససుందరంబును, కర్ణకుండలాలంకృతంబును, సుకపోలలలాటనాసాభిశోభితంబును, సులక్షణాన్వితంబును, త్రిలోకానందజనకంబు నగుశ్రీకృష్ణదేవునిప్రసన్నవదనమండలమును సందర్శించుమహాత్ములే ధన్యులు.

## —♦ అవంతికావర్ణనము. ♦—

అని చెప్పి లోకపితామహుండు మఱియునిట్లనియెను. మునివరులారా! కృతయుగంబున శ్రీమంతుండును, మహేంద్రపరాక్రమశాలి

వర్ణసాగరంబున స్నానంబు సేయువారికి మోక్షలాభం బగును.

అని చెప్పుటయు మునివరులో దేవా యింద్రద్యుమ్నుం డెందు కొఱకు ముక్తిప్రదం బగుపురుషోత్తమదివ్యక్షేత్రంబునకుఁ బోయెనో, యాతఁ డచ్చట నశ్వమేధంబు నెట్లు నిర్వర్తించెనో, యథావిధిగఁ బురుషోత్తమదేవు నెట్లర్చించెనో, సర్వకామప్రదంబగు నాక్షేత్రమునఁ దైత్రిలోక్యవిశ్రుతం బగుప్రాసాదము నెట్లు నిర్మించెనో, కృష్ణబలరామసుభద్రామూర్తుల నెట్లు నిర్మింపఁజేసి యాప్రాసాదమధ్యంబునం దెట్లు ప్రతిష్ఠించెనో సవిస్తరంబుగ నెఱింగింపవలయు నని ప్రార్థించుటయు బ్రహ్మదేవుండిట్లనియెను.

మునివరులారా! సర్వపాపహారంబును, భోగమోక్షప్రదంబును, పౌరాణికంబునగునీపుణ్యచరిత్రముంగూర్చి తెలిసికొననిచ్చగించి[illegible]మీ కనేకసాధువాదములు. మీరునిశ్చలచిత్తములతో నీపవిత్ర[illegible]ము నాలకింపుఁడు. మాళవదేశమునందు [illegible]గర ము గలదు. అది యింద్రద్యుమ్ననకు రాజ[illegible] [illegible]గరము నిత్యతృప్తులగుజనంబులతోడను, దృఢంబులగు [illegible] [illegible]రణ, యంత్రార్గళద్వారపరిఖాసమూహంబులతోడను, సుశోభితమై సురక్షితమై యుండెను. అచ్చట వివిధదేశములనుండి యేతెంచినవర్తకులవివిధవస్తుసంభరితంబులగునంగడులచే వీథులన్ని యును [illegible]చుండును. రాజహంసంబులంబోలి శుభ్రవర్ణంబులై విచిత్రంబులును, మనోహరంబులు నగుప్రాసాదములం దనేకములు గలవు. అందలి రథగజతురగపదాతిసేనలకును, వివిధవర్ణంబులగుపతాకలకును, నానాదేశసమాగతవీరయోధులకును [illegible]ఘే లేదు. ఆనగరంబు నిరంతరమును యజ్ఞోత్సవంబులచే నామోదితమై, మనోహరగీతవాద్యంబులచే ముఖరితంబగుచుండును. బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రాది,నానావర్ణంబుల

వారు నందు నివసించియుందురు. ఆపట్టణంబున విద్వాంసులెందఱో కలరు. మలినులును, మూర్ఖులును, నిర్ధనులును, రోగులును, హీనాంగులును, ద్యూతాదివ్యసనలంపటులును నందు లేరు. అందలిస్త్రీపురుషులు నిత్యానందులై సర్వదా విహరించుచుందురు. పురుషులందఱును సుందరవేషభూషణాలంకృతులును, కందర్పకాంతిసంపన్నులును, సులక్షణులును, రూపవంతులును, సర్వశాస్త్రజ్ఞులును, శత్రుమర్దనులును, దాతలును, భోగులునై యుందురు. రమణీమణులు మదమాతంగమరాళగమనలును, వికచారవిందనయనలును, సుందరకటిజఘనలును, చారువదనలును, సుకపోలలును, స్థిరాలకలును, హావభావవిలాసవిభ్రమవతులును, తాంబూలరాగరంజితాధరలును, అమూల్యమణిసువర్ణాలంకారవిభూషితలును, దివ్యమాల్యాలంకృతలును, దివ్యాంబరధారిణులును, దివ్యగంధానులేపితలును, చతురలును, సౌభాగ్యవతులును, కాంతలును, ప్రియదర్శినులును, రూపలావణ్యవతులును, మందహాసవిలసితలును, విలాసనిరతలును, మదాలసలు నై యుందురు. వారందఱును సభలయందును, ప్రాంగణములయందును, క్షేత్రంబులయందును గీతవాద్యమధురాలాపంబులచే హృదయాకర్షణంబు గావించుచుందురు. అటనున్న నానావిధదివ్యకుసుమశోభితంబులగు దేవాలయంబులకును, బవిత్రంబులగు మనోజ్ఞవనోపవనంబులకును లెక్కయే లేదు. అవియన్నియును బహువిధకుసుమఫలభరితంబులగు లతాతరుసంతతులచే గప్పఁబడినవై సంపన్నములై యుండును.

ఈరీతిగా బహువిధప్రియదర్శనీయంబులగు లతాపాదపసమాజంబులచేతను, నానాపుష్పమయజలాశయంబులచేతను, సరోజోద్యానంబులచేతను, స్థలజలవిహంగకలకలాలాపంబులచేతను, దివ్యదేవాయతనంబులచేతను నమ్మహానగరము శోభిల్లుచుండును. అందుఁ ద్రిపురా

దురు. మఱియునా క్షేత్రమునందు విష్ణుదేవుండు విక్రమస్వామినామం
బున సుప్రతిష్ఠుండై యుండును. ఆదేవునిసందర్శించుమానవులకుంగూ
డం బూర్వోక్తఫలలాభం బగును. ఆదివ్యక్షేత్రమునం దింద్రాదిసక
లదేవతలును, మాతృగణంబులును నివసించియుందురు. వేయేలయుగ
వారిని దర్శించి పూజాప్రణిపాతాదిసకలారాధనంబులం గావించువారు
సర్వపాపవిముక్తులై స్వర్గప్రాప్తు లగుదురు.

ఈరీతిగా వివిధోత్సవంబులచేఁ బ్రముదితమై యుత్సవశోభాపరి
వృతమై విలసిల్లు నారమణీయనగరరాజము రాజశ్రేష్ఠుండగునింద్రద్యు
మ్నునిచేఁ బరిపాలితం బగుచు దేవేంద్రునియమరావతింబోలి శోభిల్లు
చుండును. అందలివిశాలంబులును, దీర్ఘంబులు నగుచతుష్పథంబు ల
న్నియును ధనుర్గుణవినాదంబులచే మాఱుమ్రోఁగుచుండును. బహువి
... నవిభూషితంబును, నిరంతరసే
... నిర్భరితంబును నగుసర్వద
... లె తేజరిల్లుచుండును.

## ఇంద్రద్యుమ్నునిక్షేత్రనివాసము.

మతిమంతుం డగునింద్రద్యుమ్నుం డానగరంబునందుండి య
త్యుత్తమపద్ధతిని రాజ్యశాసనంబుగావించుచుఁ బ్రజలను దనబిడ్డలుగా
భావించి పాలించుచుండెను. సత్యవాదియు, మహాప్రాజ్ఞుండును, శూ
రుండును, సర్వగుణాకరుండును, ధార్మికుండును, బ్రహ్మణ్యుండును, శ
స్త్రధారులయందు శ్రేష్ఠుండును, సత్యశీలుండును, దాంతుండును, శ్రీ
మంతుండునగు నారాజేంద్రుండు పరపురంజయుండై విఖ్యాతిం గాంచె
ను. అతండు తేజమునం దాదిత్యునివలెను, రూపమునం దశ్వినీకుమా
రులపోల్కిని, ప్రజ్ఞయందు సురాచార్యునివలెను, పరాక్రమంబున శ

క్రమవిధంబునను, సులక్షణంబున శరత్సుధాకరునికైవడిని విరాజిల్లు చుండెను. ఆభూపాలచంద్రుఁ డశ్వమేధాదివివిధయజ్ఞాహరణకర్తయై యుండెను. దానమునందును, యజ్ఞానుష్ఠానమునందును, తపంబునందును, మఱి యేవిషయంబుననుగూడ నాతనింబోలినమహీపాలుఁ డింకొకఁ డెవ్వఁడును లేఁడు. ఆప్రభుండు యజ్ఞంబులయందు దక్షిణలుగా బ్రాహ్మణులకు బహువిధమణిమౌక్తికమహాధనవాహనాదులను దానము చేయుచుండెను. అతనికిఁగల యేనుఁగులు, గుఱ్ఱములు, రథములు, కంబళములు, అజినములు, వస్త్రములు, రత్నరాసులు, ధనధాన్యములు మొదలగువానికి బరిమితిలేదు. ఈవిధముగా నానరనాథుండు సర్వసంపన్నుండై నిష్కళంకభావంబున మహీపాలనంబు గావించుచుండెను.

ఇట్లుండఁగా నొకప్పు డమ్మహారాజునకు భుక్తిముక్తిప్రదాయకుండును, సర్వయోగేశ్వరుండు నగుశ్రీహరి నారాధింపవలయు ననుసద్బుద్ధి కలుగుటయు, నాతఁడు సకలశాస్త్రములను, తంత్రములను, ఆగమంబులను, పురాణములను, ఇతిహాసములను, వేదాంగములను సమగ్రంబులగుధర్మశాస్త్రములను బాగుగ శోధించి యతిప్రయత్నంబున వేదపారగులగు బ్రాహ్మణుల నుపాసించి కృతకృత్యుండయ్యెను. మఱియుఁ బరమంబును నవ్యయంబు నగు [illegible] ను, భ్రాంతిజ్ఞానరాహిత్యమునకును, జితేంద్రియత్వమునకును, [illegible] ప్రాప్తికిని నివాసుండును, జగన్నాథుండును, శంఖచక్రగదాధరుండును, వనమాలాలంకృతుండును, బర్హిపలాశ[illegible]నుండును, శ్రీవత్సలాంఛనుండును, ముకుటాంగదభూషితుండును, [illegible] దేవు నెల్లర్చింపవలయు నని చింతించుచు నాతఁడు [illegible] సభృత్యపురోహితపరివృతుండై తనరాజధానినుండి బయలుదేఱెను.

ఆ యుధపాణులగు మహారథులనేకులు చిత్రధ్వజవిలసితంబులును, విమానప్రతిమానంబులు నగు మహారథంబుల నధిరోహించియు మ్మహీపాలు ననుసరించి వెడలిరి. ప్రాసతోమరహస్తు లగు సాదిగణంబులు గూడఁ బవనజవంబులగు నశ్వంబుల నధిరోహించి యానరనాథుని వెంబడించిరి. హిమగిరిసంజనితంబులును, బ్రమత్తంబులును, బ్రచండంబులును, షష్టివర్షవయస్సంపన్నంబులును, హేమకక్షంబులును, పతాకాభిశోభితంబులు నగుగజంబులనధిరోహించి యనేకులగుగజయుద్ధనిపుణులును, శరశరాసనకృపాణధారులై దివ్యమాల్యాలంకృతులై దివ్యగంధానులేపితులై మహావీరులగు ననంఖ్యపదాతిసైనికులును, సర్వశస్త్రాస్త్రవిదులును, నిత్యరణోత్సాహులును, శౌర్యధనులు నగు యువకదళంబులును, బింబాధరలు, చారుదర్శనలు, సర్వాభరణభూషితలు, దివ్యవసనలు, దివ్యగంధానులిప్తలు, శరచ్చంద్రనిభాననలు, తనుమధ్యలు, మనోజ్ఞవేషలు, తాంబూలరాగాధరలు, రక్షకభటసురక్షితలు, మణికాంచనాలంకారశోభితలు, ఉత్తమమధ్యమ యానాధిరూఢలు, గాయకస్తుతిపాఠకోపగీయమానలు, పద్మపత్రలోచనలు, నగునంతఃపురరమణీమణులును, బ్రహ్మక్షత్రియవైశ్యగణంబులును నారాజేంద్రుననుసరించిరి. ఇంతియకాక నగరవాస్తవ్యులగు సువర్ణరత్నవర్తకులును, అస్త్రవిక్రయులును, తాంబూలవిక్రయులును, తృణకాష్ఠవస్త్రతైలమాంసాదిబహుపదార్థవిక్రయులును, సస్త్రీకులై యాభూపాలునితో బయలుదేఱిరి. మఱియు గాయకులు, నర్తకులు, మంగళపాఠకులు, శైలూషులు, పురాణపండితులు, కథకులు, కవులు, కావ్యకర్తలు, నానాకళాకోవిదులు, గారుడవిషఘ్నులు, రత్నపరీక్షకులు, లోహకారకులు, చిత్రకారకులు, కుంభకారకులు, దండకారకులు, మల్లయుద్ధనిపుణులు, కాయస్థులు, తంతువాయులు, రూపకారులు, వార్తికులు, తైలకారులు,

నై త్తిరికులు, మృగవిహంగోపజీవులు, గోగజాశ్వసరస్వతుల్య వైశ్యులు, శూద్రు లు, దాహకులు, మొదలగువారందఱు మహారాజు ననుసరించి లింఢిగ్రీ తో బిడ్డలనలె పరమానందముతో బయలుదేఱిరి.

ఈరీతిగా నింద్రద్యుమ్నమహీపాలుండు మహావైభవముతో సపరివారముగఁ బ్రయాణము సాగించి చాలదినంబులకు దక్షిణసాగర తీరముం జేరి బహుసహస్రతరంగమాలికలతో నృత్యము చేయుచున్న ట్లున్న సముద్రమును సందర్శించెను. మఱియు నమ్మహాజలనిధి వివిధ రత్నాకరంబును, అగాధజలపూర్ణంబును, వివిధజీవసమాకులంబును, మహాశ్చర్యమయంబును, తీర్థప్రధానంబును, గభీరావర్తసంకలితంబును, అపారంబును, భయంకరంబును, బహువిధజలచరసంసేవితంబును నై యుండెను. ఆమహాసాగరము శ్రీమన్నారాయణునకు శయన స్థానము. సర్వపాపహరమైనది. పవిత్రమైనది. సర్వకామప్రదమైనది. అనేకావర్తములచే గంభీరమైనది. దానవులకు నివాసము. అమృతంబున కరణి. దేవయోని. జలపతి. నిఖిలజంతువులకును జీవనాధారము. పవిత్రంబులకెల్లఁ బవిత్రమైనది. మంగళంబులకెల్ల మంగళమైనది. తీర్థంబులకెల్ల నుత్తమతీర్థము. సకలభూతంబులకు [illegible] దేవగణంబుల కమృతాలయంబును, సకల [illegible] సంహారహేతుభూతంబును, సనాతనంబును, [illegible] రంబును నగులవణసముద్రమును సందర్శించి [illegible] మాద్భుతప్రమోదకలితుండై యాతీరంబు [illegible] సించియుండెను.

అనంతర మా రాజేంద్రుం డానదీపంబున సముద్రమునుం బోలి విశాలమై సారవంతమై పవిత్రమై మనోహరమై [illegible] దివ్య లోకవందితంబు నగుసీక్షేత్రమును గాంచెను. అదికపంబపున్నాగనారి

కేళ, పనస, నారంగ, వకుళకపిత్థనాగకేసరబిల్వఖర్జూరబదరీసపనింబాబ్రాతకకోవిదారభల్లాతకామలకవటదేవదారుచందనజంబీరాది వివిధఫలభూరుహంబులచే విరాజిల్లుచుండెను. అందుఁ బ్రతివృక్షశాఖయందును శుకశారికాహారీతభృంగరాజచాతకబహుపుత్రిక జీవంజీవక కలకంఠకలవంకకపోతాదివిహంగములు శ్రుతిమనోహరంబుగ గానము చేయుచుండెను. మఱియు నందు నిరంతరపుష్పశోభితంబులగు కేతకీమల్లికాదిలతావనఖండంబులు వేర్వేఱుగ విరాజిల్లుచుండెను. ఆలతలన్నియును సురభికుసుమగుచ్ఛంబులచే ఘ్రాణతర్పణంబు గావించుచు నాలోకరమణీయములై యుండెను. ఇట్లు సుందరతరుషండంబులచేతను, కుసుమలతానికుంజములచేతను, నిర్మలసరోవరంబులచేతను, స్థలచరంబులును, జలచరంబులును, ఆకాశసంచరములు నగు నానాజీవసంఘంబులచేతను నతిరమణీయమైయున్న యాదివ్యక్షేత్రము దశయోజనవిస్తీర్ణంబును, బంచయోజనాయతంబునై యాశ్చర్యమయంబును, బరమదుర్లభంబునై యుండెను.

## ——♦ పురుషోత్తమక్షేత్రపూర్వవృత్తాంతము. ♦——

అని బ్రహ్మదేవుండు చెప్పుటయు మునివరులో ప్రభూ! ఇంద్రద్యుమ్నభూపాలుం డచ్చటికి సపరివారంబుగ వచ్చి యందు బలరామకృష్ణమూర్తులను, సుభద్రామూర్తిని బ్రతిష్ఠించు పఱకును బవిత్రంబును బుణ్యక్షేత్రంబునగు నాపురుషోత్తమస్థానంబున నెట్టివిష్ణుప్రతిమయుఁ బ్రతిష్ఠింపఁబడనేలేదా? యని ప్రశ్నించుటయు లోకపితామహుం డిట్లని చెప్పం దొడంగెను. మునివరులారా! పాపనాశనం బగుప్రాచీనచరిత్రము నాకర్ణింపుఁడు. పూర్వకాలంబున లక్ష్మీదేవి భగవానుం డగుశ్రీహరిని బ్రశ్నించినయీవిషయమును సంక్షేపంబుగఁ జెప్పెదను. సుమేరుశైలంబున సర్వైశ్వర్యమయం బగుకాంచనశృంగమునందు

లోకవిఖ్యాతు లగు సిద్ధవిద్యాధరయక్షకిన్నరదేవదానవగంధర్వాప్సర స్సానర్గమునిగుహ్యకమరుద్గణంబులును, గశ్యపాదిప్రజాపతులును, వాలఖిల్యాదిమహర్షులును జేరియుండి యాకాంచనభూధరంబునకు శోభా సంపాదనంబు చేయుచుండిరి. సర్వర్తుకుసుమవిలసితంబులును, వివిధవర్ణవిరాజితంబులు నగులతాతరువనంబులాగిరిశృంగము నలంకరించుచుండెను. వివిధకుసుమపరిమళంబులచేతను, విహంగకలకూజితంబులచేతను విలసిల్లుచున్నయాసువర్ణశృంగంబున నొకప్పుడు జగద్విఖ్యాతయు, జగన్నాథుండు నగువాసుదేవుండు నివసించి యుండఁగా భగవతి యగు కమలవాసిని యమ్మహాదేవునకు సాష్టాంగప్రణామంబు గావించి సర్వలోకహితంబు గోరి యోసర్వలోకేశ్వరా! నాహృదయంబున నొక సంశయంబు గలదు. దానిని నీవు నివారింపవలయును. మహాశ్చర్యమయంబును, సుదుర్లభంబును, గర్మభూమియు నగుమా[illegible] కామక్రోధలోభమోహాదులచే జలజంతుపూర్ణ[illegible] ముంబోలి విరాజిల్లుచున్నది. ఈసంసారసాగరము[illegible] క్తిలాభం బెట్లు గలుగునో నాయందు దయయుంచి యుపదేశింపవలయునని ప్రార్థించెను.

అంతజనార్దనుండు శ్రీదేవివచనంబుల నాకర్ణించి ప్రీతచేతస్కుండై యమృతోపమంబులును, బరమంబులును, సారసంగ్రహంబులు నగు వచనంబులతో నిట్లనియెను. దేవీ! ప్రధానంబులగుతీర్థము లన్నిటియందును 'బురుషోత్తమక్షేత్రమే ముఖ్యోపాస్యమైనది. అది సుసాధ్యంబును, మనోరమంబును, సత్ఫలదాయకంబునై జగద్విఖ్యాతంబై నది. పురుషోత్తమంబునకుఁ దుల్యంబగుతీర్థము త్రిభువనంబులయం దెందును లేదు. ఆతీర్థనామకీర్తనంబుననే సకలపాపహారం బగును. సమస్తదేవదైత్యదానవులకును, మరీచ్యాదిమహర్షులకును గూడ నాతీర్థమహిమం

బు సువిదితంబు గాదు. ఓవరాననా! అదియే గుహ్యంబగుమదీయ క్షేత్రము. ఆక్షేత్రమహిమంగూర్చివర్ణించెద నాకర్ణింపుము.

పూర్వము ప్రళయకాలమునందు చరాచరంబు లగుసకలపదార్థములును వినష్టంబు లయ్యెను. దేవదైత్యవిద్యాధరోరగాదు లందఱును విలీనులై పోయిరి. విశ్వమంతయును తమోమయంబై యుండెను. జ్ఞానగమ్యంబగువస్తు వేదియును లేకుండఁబోయెను. అప్పుడేక మాత్రభూతాత్మకుండును, బరమాత్ముండును, జగద్గురుండును, సగుణమూర్తియుఁ, ద్రిమూర్తిధరుండును, మహేశ్వరుండును, వాసుదేవుండు నగుశ్రీహరియొక్కఁడే సాక్షిభూతుండై యుండెను. ఆతండు యోగనిద్రావసానంబునఁ దననాభికమలమునుండి పద్మకేసరసంకాశుండును, అవ్యయుండు నగుబ్రహ్మదేవుని సృష్టించెను. సర్వలోకేశ్వరుం డగు విరించి యుద్భవించి క్రమక్రమముగాఁ బంచభూతాత్మకం బగుసమస్తచరాచరసృష్టిని గావించుటకుఁ బ్రవృత్తుండై స్థూలసూక్ష్మస్థావరజంగమంబులనుచతుర్విధభూతబృదంబులను దన్మాత్రలనుండి సృష్టించెను. అనంతరము ప్రజాసృష్టి కారంభించి మరీచి ప్రభృతి మునిబృందములను, సమస్తదేవతలను, అసురులను, పితృదేవతలను, యక్షవిద్యాధరాదులను, గంగాదినదులను, నరవానరసింహాదులను, విహంగమంబులను, జరాయుజములను, అండజములను, స్వేదజములను, భూజములను వరుసగాఁ బుట్టించెను. ఈవిధముగాఁ దృణగుల్మలతాదులను, బిపీలికాపర్యంతసకలజీవ బృందంబులను, సృష్టించి మహాత్ముండగుబి ధాత మఱియు నాత్మచింతనంబు చేసి తనదక్షిణాంగంబునుండి పురుషుని వామాంగమునుండి స్త్రీని సృష్టించెను. అంతటినుండి యమ్మిథునసంబంధమువలన నుత్తమమధ్యమాధమ శ్రేణులుగాఁ బ్రజాగణంబుసముద్భూతం బయ్యెను.

పూర్వకాలంబునఁ బద్మసంభవుం డీరీతిగా సృష్టిసంకల్పనంబు చేసి ధ్యానావలంబనంబున వాసుదేవమూర్తినే చింతింపఁదొడంగెను. అతఁ డిట్లుధ్యానంబు సేయుటయు సహస్రాక్షుండును, సహస్రపాదుండును, సహస్రశీర్షుండును, పుండరీకాక్షుండును, నీలనీరదసంకాశుండును, శ్రీవత్సలాంఛనుండును, శ్రీమంతుండు నగుజనార్దనుండు స్వయముగ నావిర్భూతుండయ్యెను. అట్లు సాక్షాత్కరించిన దేవదేవుం గాంచి విరించి యథోక్తపాద్యాసనాదిప్రదానంబులచే నాతని నర్చించి సమాహితచిత్తుండై స్తోత్రము చేయనారంభించెను. ఓ దేవీ! అప్పుడు నేను బ్రీతుండనై కమలసంభవా! నీవు నన్ను ధ్యానించుటకు నిమిత్తం బేమని ప్రశ్నించుటయు లోకపితామహుం డో దేవా! స్వర్గద్వారంబునకు సోపానంబు లగుసకలయజ్ఞంబులను, దానంబులను, వ్రతంబులను, యోగంబులను, సత్యమును, తపంబును, శ్రద్ధను, వివిధతీర్థసేవనంబును, బరిత్యజించి యైనను దేనినాశ్రయించినచో ననాయాసంబుగ సకలఫలలాభంబును సిద్ధించునో, జగంబునం దేస్థానము సర్వోత్కృష్టంబని భువనవిఖ్యాతిం గాంచునో, మర్త్యలోకమున దుర్లభంబగునట్టి పవిత్రక్షేత్రం బేదియో, లోకహితంబుకొఱకు నాకెఱింగింపవలయు నని ప్రార్థించెను.

దేవీ! అప్పుడు నేను బ్రహ్మదేవుని కిట్లు ప్రబోధించితిని. ఓవిధాతా! సర్వక్షేత్రంబులయం దుత్తమంబును, సంసారతారకంబును, ధన్యంబును, బుణ్యదాయకంబును, గోబ్రాహ్మణహితకరంబును, చతుర్వర్ణశుభవర్ధకంబును, మానవులకుఁ బాపనిర్మూలకంబును, భోగమోక్షప్రదంబును, సర్వసిద్ధిప్రదంబును, నగుక్షేత్రంబు నొకదానిఁ జెప్పెదను వినుము. పూర్వకాలమునందే సర్వలోకవిఖ్యాతంబును, ఋషిముఖ్యగణసేవితంబును, సనాతనంబును, సకలతీర్థప్రధానంబు నగునొకదివ్యక్షేత్రి

మాహాత్మ్యాతఁబై యున్నది. ఆక్షేత్రము దేవదానవగంధర్వాదులయం దును, సకలచరాచరవస్తుసముదాయమునందును నుత్తమపురుషునివలె విరాజిల్లుచుండుటంజేసి పురుషోత్తమనామంబునఁ బ్రఖ్యాతంబైనది. దక్షిణసాగరతీరంబునం దెచ్చట వటమహీరుహంబు గలదో యటనుం డి దశయోజనవిస్తీర్ణంబగు పురుషోత్తమక్షేత్రము తేజరిల్లుచుండును. ఆవటభూజము ప్రళయకాలమునందలి మహోల్కాపాతంబులచే నైన ను వినష్టంబు గాదు. స్వయముగా నేనచ్చట నివసించియుందును. ఆఘనతరుసందర్శనంబునను, దానిచాయసోకుటవలనను సకలపాపములు ను నశింపఁగలవు. దానికిఁ బ్రదక్షిణంబు సేయుమానవులు పాపవిము క్తులగుదురు. ఆవృక్షంబునకుత్తరంబునఁ గలకేశవాలయమునకుఁ గొం చెముదక్షిణముగాఁ బురుషోత్తమప్రాసాదము విరాజిల్లుచుండును. అ దియే ధర్మమయం బగుస్థానము. అందు దేవతలచేఁ బ్రతిష్ఠితమై యున్న దివ్యప్రతిమను సందర్శించువా రనాయాసముగా ముక్తియం బగుస్థానమును బొందఁగలుగుదురు.

ప్రియా! మానవులందఱును నాలోకమును జేరుచుండుటం గాంచి యొకప్పుడు ధర్మరాజగుయముండు నాసన్నిధికి వచ్చి ప్రణామ ము గావించి యోలోకనాథా! జగత్పతీ! క్షీరసాగరనిలయా! శేష భోగిశాయీ! వరా! వరేణ్యా! నీకునమస్కారము. వరదుండవు, కర్త వు, అకారణుండవు, ప్రభుండవు, విశ్వేశ్వరుండవు, అజుండవు, సర్వజ్ఞుం డవు, అపరాజితుండవు, నీలోత్పలనిభుండవు, పుండరీకాక్షుండవు, విష్ణుం డవు, నిర్గుణుండవు, శాంతుండవు, జగద్విధాతవు, అవ్యయుండవు, సర్వలోకమయుండవు, పురాణపురుషుండవు, వ్యక్తావ్యక్తస్వరూపుండ వు, సనాతనుండవు, పరాపరుండవు, లోకనాథుండవు, జగద్గురుండవు, శ్రీవత్సాంకితవక్షుండవు, వనమాలాధరుండవు, పీతాంబరుండవు, చతు

ర్భావహుండవు, శంకచక్రగదాధరుండవు, హారకేయూరభూషితుండవు, ముకుటాంగదమండనుండవు, సర్వలక్షణసంపన్నుండవు, సర్వేంద్రియవిరహితుండవు, భావాభావవినిర్ముక్తుండవు, సర్వవ్యాపివి, ప్రకృతిపరుండవు, సుఖదుండవు, ఈశ్వరుండవు జగన్నాథుండవు, ప్రభుండవు, దేవదేవుండవు, కూటస్థుండవు, అచలుండవు నగు నీకు నమస్కారము.

అని స్తోత్రము చేయుచు సంజలిబద్ధుండై నిలిచియున్నయమధర్మరాజుం గాంచి ఓ వైవస్వతా! మహాభాగా! నీరాకకుఁ గతంబేమి యని నేనడుగుటయు యముండిట్లనియెను. ఓపుండరీకాక్షా! విఖ్యాతంబును, పవిత్రంబు నగుపురుషోత్తమక్షేత్రంబున సర్వకామప్రదంబును, ఇంద్రనీలమయంబు నగునుత్తమప్రతిమ విరాజిల్లుచున్నది. ఏకాగ్రచిత్తముతో దానిని దర్శించి యారాధించుమానవులు నిశ్చయముగా విష్ణులోకప్రాప్తు లగుచున్నారు. అందువలన నాయధికారమున కుచితంబులగు కార్యముల నాచరించుటకు నాకవకాశము లేకుండఁబోవుచున్నది. కావున ఓ మధుసూదనా! నీవు నాయెడలఁ బ్రసన్నుండవై యాప్రతిమ నటనుండి యపసారితంబు గావింపవలయునని ప్రార్థించుటయు నేను కరుణించి యప్పుడాప్రతిమను వాలుకాచ్ఛన్నంబుగాఁ జేసివైచితిని.

ఓ దేవీ! స్వర్ణవాలుకారాశిచే నాప్రతిమ లోకదుర్లభంబుగాఁ జేసివైచినంతనే యముండును సంతోషముతోఁ దనునగరంబునకుంబోయి విధాయకకృత్యముల నిరాతంకముగ దీర్చుకొనుచుండెను.

—♦ పురుషోత్తమక్షేత్రవర్ణనము. ♦—

అని చెప్పి బ్రహ్మదేవుండిట్లనియెను. ఓమునివరులారా! అట్టి దివ్యక్షేత్రంబును జేరి మహీపాలుం డగునింద్రద్యుమ్నుం డంబరీరమణీయప్రదేశములను, నదీసమూహంబులను సందర్శింప నారంభించెను.

అచ్చట వింధ్యపాదమునుండి వినిర్గతంబైన సర్వపాపహరం బగుమహా నది శివజటాజూటనిర్గతంబగుగంగానదింబోలి దక్షిణసాగరాభిముఖం బుగాఁ బ్రవహించుచుండెను. ఆనదీమతల్లి చిత్రోత్పలానామంబునం గూడఁ గీర్తింపఁబడుచుండును. అది దక్షిణాబ్ధిమధ్యంబునంబ్రవేశిం చి మిగుల శోభిల్లుచుండును. ఆమహానది యుభయతీరంబులయందును నెన్నియోనగరంబులును గ్రామంబులును గానవచ్చుచుండును. ఆగ్రా మము లన్నియును సస్యపరిపూర్ణములై మనోహరములై, నిత్యోత్సవ లగుజనులచే నాకర్షకములై యుండును. అందు స్వధర్మనిరతులును, శాం తులును, సుందరవేషభూషణాలంకృతులు నగుచతుర్వర్ణములప్రజలు ను వాసము చేయుచుందురు. అచ్చటివారివదనములు తాంబూలరా గరంజితములును, గ్రీవములు, సురభికుసుమమాలికాలంకృతములునై యుండును. అగ్నిహోత్రనిరతులును, వేదశాస్త్రనిపుణులును, యా గశీలురును, భూరిదాతలు నగునందఱిబ్రాహ్మణులవాణి వేదమయంబై యుండును. ఆనగరంబులయందలిచత్వరంబులును, రాజమార్గములును, వనోపవనంబులును, సభామండపములును, ప్రాసాదమాలికలును, దే వాలయములును బహుజనసమాకీర్ణములై యుండును. ఎచ్చట నాల కించినను బురాణేతిహాసప్రశంసలును, వేదశాస్త్రపాఠంబులును, వినవ చ్చుచుండును. అందలిరమణీమణులు సర్వాంగసుందరులును, సర్వా లంకారభూషితలునై సకలజనహృదయనయనానందకారిణులై విలసి ల్లుచుందురు. అంతటను వేణువీణామృదంగపణవగోముఖశంఖాదిమ ధురనాదంబులు శ్రవణమనోహరంబుగ వినవచ్చుచుండును. ప్రజలం దఱును నిత్యానందులై విలాసవిహారములం గావించుచుందురు. ఆ గ్రామంబులయందనేకులు భిక్షులు, వైఖానసులు, సిద్ధులు, స్నాతకు లు, మంత్రసిద్ధులు, తపస్వులు, సోమయాజులు, మొదలగుసాధుపురు

షులు గానవచ్చుచుందురు.

ఈవిధముగాఁ బరమమంగళమయం బగునాదివ్యక్షేత్రమును సందర్శించి యింద్రద్యుమ్నభూపాలుండు తానచ్చటనేయుండి భగవానుండును, సనాతనుండును, జగద్గురుండును, పరాత్పరుండును, పరమపదుండును, సర్వేశ్వరుండును, అపరాజితుండు, అనంతుండు నగువిష్ణుదేవు నారాధింపవలయునని సుస్థిరసంకల్పుండయ్యెను. అతఁడు పరమోత్సాహముతో నుత్తమతీర్థం బగుపురుషోత్తమక్షేత్రమును నేను దర్శింపఁగలిగితిని. ఇదియే యాదివ్యతీర్థము. విశాలంబును, సాంద్రంబు నగునివ్వటభూజముచెంగటనే దేవదేవుని యింద్రనీలమయం బగుదివ్యప్రతిమ శ్రీమన్నారాయణునిచే నతిగోప్యముగ దాఁచఁబడినది. ఇచ్చట నిఁక నేవిధమగువైష్ణవప్రతిమయుఁ గానవచ్చుట లేదు. కావున నేనిచ్చట సత్యపరాక్రముండును, దేవదేవుండును, జగన్నాథుండు నగువిష్ణుండు నాకుఁ బ్రత్యక్షుంబగునట్లు సాధ్యమైనంతవఱకుఁ బ్రయత్నించి చూచెదను. నేనిఁక నిశ్చలచిత్తుండనై యింతటినుండి యీదివ్యక్షేత్రంబున, యజ్ఞదానతపోహోమాధ్యయనార్చనోపవాసాదులను విధిపూర్వకంబుగ నాచరించుచు దేవదేవసాక్షాత్కారంబునకు వేచియుండెద నని నిశ్చయించుకొనియెను.

## —♦ పురుషోత్తమప్రాసాదనిర్మాణము. ♦—

మునివరులారా! పృథ్వీపాలుం డగునింద్రద్యుమ్నుం డిట్లు దృఢసంకల్పుండై ముందుగఁ బురుషోత్తమమందిరమును నిర్మింపఁదలంచి బహుశాస్త్రజ్ఞులగుగణకులను, ఆచార్యులను పిలిపించి భూశోధనంబు చేయించి జ్ఞానసంపన్నులగుబ్రాహ్మణులు, అమాత్యులు, మంత్రులు, వాస్తువిద్యావిశారదులు మొదలగువారితో నాలోచించి చంద్రతారాగ్రహబలసంపన్నం బగుశుభదినంబున శుభముహూర్తం

బున జయమంగళధ్వనులతోడను, వివిధమనోజ్ఞవాద్యంబులతోడను, మధురసంగీతంబులతోడను బూర్ణకుంభదీపస్థాపనంబు సేయించి పుష్పములు, లాజలు, అక్షతలు, చందనము మొదలగువానితో శ్రీధ్రాసహితుండై యర్ఘ్యం బొసంగి యుత్కళకళింగకోసలాధిపతులను బిలిపించి వారితో నిట్లనియెను.

ఓప్రభువరులారా! మీరు స్వామికార్యతత్పరులై మీయనుచరులతోఁగూడి యతిశీఘ్రముగ శిలాసంగ్రహంబు గావింపుఁడు. శిలాకర్మనిపుణులగుశిల్పిశ్రేష్ఠులను బిల్పించి బహుకందరవిలసితంబును, సువిస్తీర్ణంబును నగువింధ్యాచలమునకుం బంపి సానుదేశంబులం గల యుత్తమశిలాఫలకంబులఁ దీయించి శకటంబులందును, నావలమీఁదను వేయించి తీసికొని రండు! ఆలస్యము చేయవలదు. అని యాజ్ఞాపించి వారిని బంపి పిదప నమాత్యులను, బురోహితులను బిలిపించి మహాభాగులారా! ఈభూమండలంబునం గలరాజులందఱకడకును దూతలను బంపి యెల్లవారును సమతమరథగజతురగపదాతిసైన్యంబులతో నిచ్చటికి వచ్చునట్లు చేయుఁడనియాదేశించెను. ఆనృపాలరాజాజ్ఞానతిం దలఁదాల్చి దూతలందఱును రాజులకడకుం బోయి యింద్రద్యుమ్నమహీపతియాదేశము నెల్లవారికిని దెలియఁజేయుటయుఁ బూర్వపశ్చిమోత్తరదక్షిణభాగంబులం గలరాజన్యులందఱును, బర్వతద్వీపభూపాలురందఱును సపరివారంబుగ బహుధనరత్నరాసులంగొని పురుషోత్తమక్షేత్రమునకు వచ్చిచేరిరి.

వారినందఱం గాంచి యింద్రద్యుమ్నుండు సంప్రీతుండై యథాదరపూర్వకముగా నృపవరులారా! నేని భోగమోక్షప్రదంబగు దివ్యక్షేత్రంబున నశ్వమేధమహాయజ్ఞంబును, వైష్ణవప్రాసాద నిర్మాణంబును గావింపఁదలంచితిని. ఇక్కార్యం బెట్లుసంపన్నంబగునని చింత

చుచున్నాఁడను. మీరందఱును నాకు సాహాయ్యంబు గావించినచో నిరంతరాయంబుగ సకలకార్యంబులును సఫలంబులగునని యాశపడు చున్నాను. అని చెప్పుటయు వచ్చినరాజులెల్లరును సంతుష్టులై ధనకనకరత్నవర్షంబులు గురియింప నారంభించిరి. ఉత్తమోత్తమంబులగు కంబళాజినంబులు, రత్నరాంకవాస్తరణంబులు, వజ్రవైడూర్యాదినవరత్నములు, గజములు, అశ్వములు, ధనధాన్యాదులు, వివిధద్రవ్యములు, నవధాన్యములు, దధిక్షీరఘృతాదులు మొదలగు సమస్తవస్తువులతోఁడను యజ్ఞస్థలం బంతయును నిండిపోయెను.

అప్పుడు శ్రీమంతుం డగునింద్రద్యుమ్నుండు సకలసంభారంబులను, యజ్ఞధర్మజ్ఞులును, శాస్త్రజ్ఞులును, సర్వకర్మజ్ఞులు నగుభూసురులను, ఋషులను, మహర్షులను, తపస్వులను, బ్రహ్మచారులను, గృహస్థులను, వానప్రస్థులను, యతులను, స్నాతకులను, ద్విజులను, మఱియు నితరాగ్నిహోత్రులను, తపస్స్వాధ్యాయసంపన్నులగు నాచార్యులను, ఉపాధ్యాయులనుగాంచి పరమానందముతోఁ దనపురోహితునింబిలిచి వేదపారీణులగు నీబ్రాహ్మణగణంబులతోఁగూడ నశ్వమేధయాగక్రియానిర్వాహణంబునకై యజ్ఞస్థలంబును సంశోభితంబుగఁ జేయుమని చెప్పుటయుఁ బురోహితుండు ప్రముదితుండై మంత్రులతోఁగూడ నాతని యాదేశములను బరిపాలించెను.

అప్పుడు ప్రాజ్ఞుం డగుపురోహితుండు యజ్ఞక్రియాదక్షులగు భూసురోత్తముల నగ్రవర్తులం జేసికొని వచ్చినమహారాజులతోఁగూడ యజ్ఞస్థానమునఁ బ్రవేశించి యచ్చట యథావిధిగ యజ్ఞవాటమును నిర్మాణంబు సేయించెను. అచ్చట మహేంద్రప్రాసాదసన్నిభంబులగు ననేకమణియసౌధంబులును, గనకచిత్రితస్తంభంబులును, నతివిశాలోన్నతంబులగుతోరణంబులును, నిర్మితంబు లయ్యెను. ధర్మాత్ముండగుప్ర

రోహితుండు కనకమయం బగుయజ్ఞాయతనంబు నట్లు నిర్మింపఁజేసి నానాదేశాగతులగురాజన్యగణంబుల కంతఃపురంబులును, వివిధదేశ వాసులగు బ్రహ్మక్షత్రియవైశ్యాదులకు నికేతనంబులును నందు యథోచితంబుగ నేర్పఱిచెను.

నరనాథుం డగునింద్రద్యుమ్నుని సంప్రీతుం గావించుటకై దేశదేశంబులనుండి ప్రధానులగుమహారాజులును, రమణీగణంబులును బహురత్నంబులం గైకొని యయ్యుత్సవంబునకు విచ్చేసి యుండిరి. వా రందఱును సపరివారంబుగఁ దమతమశిబిరంబులఁ బ్రవేశము గావించు నవ్వుడు సాగరఘోషముంబోలినయొకమహాగభీరారావము భూనభోం తరముల వ్యాపించిపోయెను. మహారాజగునింద్రద్యుమ్నుఁడు స్వయ ముగా వారి కందఱకును యథోచితస్థానంబుల నేర్పఱచి యథాయో గ్యాసనశయ్యాదులనొసంగి, యుత్తమంబులగుపానభోజనాదులనందిం చునట్టియేర్పాటులను గావించెను. ఆమహాయజ్ఞంబునకు బ్రహ్మవా దులగుననేకభూసురశ్రేష్ఠులు తమతమశిష్యులతోఁగూడ వచ్చియుండి రి. మహామతియగునమ్మహీపతి వారికందఱకును దగినవసతుల నొసం గి సన్మానసత్కారాదులం గావించెను. ఆమహీపాలుండు గర్వంబించు కంతయును లేక వినీతభావంబున నెల్లవారిని దానేయెదుర్కొని యజ్ఞ సందర్శనాగతులగువారినందఱను సన్మానించుచుండెను.

అనంతరము శిల్పిగణంబులు తమతమకార్యములను బూర్తిచేసి యజ్ఞవిధులంగూర్చి విజ్ఞాపనంబు సేయుటయు మహారాజు మంత్రిగ ణంబులతోఁగూడఁ బ్రహృష్టహృదయుండై యజ్ఞారంభంబు గావించె ను. నానాదేశాగతులగునరపతులందఱును మహేంద్రవిభవుండగు నిం ద్రద్యుమ్నునిందర్శించి యజ్ఞశాలయందలికనకతోరణశయ్యాసనాదుల ను, రత్నకంబళములను, రత్నకుంభంబులను, రత్నపాత్రలను, రత్నక

టాహంబులను, ననేకంబులగు మంగళకలశంబులను దిలకించి యూసం దింపఁదొడంగిరి. ఆయజ్ఞపరికరంబులలో సువర్ణమయంబుగాని వస్తు వొక్కటియును లేకుండెను. హేమమయంబులగుయజ్ఞయూపంబులన్నియును, మంత్రపాఠపూర్వకంబుగా స్థాపింపఁబడియెను. స్థలజంబులును, జలజంబులునగుపశువు లన్నియును సమానీతంబు లయ్యెను. ధనధాన్యాదులతోడను, సమస్తయజ్ఞపరికరంబులతోడను నిండియున్నయజ్ఞశాలం గాంచి రాజులందఱును మహాశ్చర్యభరితులైరి. బ్రాహ్మణాదిజనంబులు బహువిధంబులగుమృష్టాన్నంబుల నారగించుచుండిరి. లక్షబ్రాహ్మణభోజనానంతరంబున మాటిమాటికిని మేఘగంభీరంబగు దుందుభిధ్వానము వినవచ్చుచుండెను. అట్టిదుందుభి, దినమున కెన్నియోసారులు మ్రోగుచుండెను. సహస్రసహస్రంబులగునన్నపర్వతంబులను, దధికుల్యలను, దుగ్ధకుల్యలను, ఆజ్యనదులను దిలకించినవారందఱును బరమాశ్చర్యభరితు లగుచుండిరి.

నానాజనపదపరివృతంబగుజంబూద్వీపమునందలిబ్రాహ్మణు లెల్లరు నాయజ్ఞంబునకు విచ్చేసి యుండిరి. ఎచ్చటఁజూచినను వేలకొలఁదిప్రజలు గానవచ్చుచుండిరి. అందఱును రాజభోగ్యంబు లగునన్నపానాదులచేఁ బరితృప్తు లగుచుండిరి. భూపాలచంద్రుం డగునింద్రద్యుమ్నుఁడు బ్రహ్మవిదులగుబ్రాహ్మణులను భూరిదక్షిణలచేతను, నానాదేశాగతులగురాజన్యులను యథాయోగ్యసత్కారంబులచేతను బరితుష్టులం గావించుచుండెను. ఆరాజేంద్రునకు సర్వాంగసుందరులును, సర్వాలంకారవిభూషితలునగుపదునొకండువందలమంది భార్యలు గలరు. వారెల్లరును బ్రత్యేకమణిమందిరములయం దుచితపరివారములతో నివసించియుండిరి. పర్వతోపమానంబులగుమదగజంబులును, బవనజవనంబులగుసుందరాశ్వంబులును, దేవకుమారప్రతిము లగుపదాతిసై

నికులును, నందు నివసించియుండ నాయజ్ఞశాల కన్నులపండువుగా నుండెను.

అప్పుడు మహారాజు తనకర్మచారులం బిలిచి సర్వలక్షణసంపన్నం బగుమఖాశ్వము నతిశీఘ్రముగ భూపర్యటనంబు సేయింపవలయును. ఆయశ్వరక్షణంబునకై జితేంద్రియులగురాజపుత్రులను బంపవలయును. విద్వాంసులగుధర్మజ్ఞులు హోమకార్యములందుం బ్రవృత్తులు గావలయును. ద్విజగణంబులు, కృష్ణచ్ఛాగకృష్ణసారాదియజ్ఞపశువుల నన్నింటిని సంసిద్ధములుగఁ జేయవలయును. విష్ణుప్రాసాదనిర్మాణంబునకుఁ ద్వరపడవలయును. స్త్రీ. [illegible] సగర, ధనాదులను బ్రాహ్మణుల కభీష్టానుసారంబుగ [illegible] సేయింపవలయును. ఎవ్వరికి నేదియు లేదనుమాట చెప్పఁగూడదు. మహాదేవుండగు పురుషోత్తముండు సాక్షాత్కరించువఱకు నేనిచ్చటనేయుండి నిరంతరయజ్ఞకార్యాచరణంబున నిమగ్నుఁడనై యుండెదను. అని యాజ్ఞాపించి యాభూపరుండప్పుడు కోటికోటిసువర్ణంబులను దానముచేయనారంభించెను. అతఁడు వేదవిదు లగుబ్రాహ్మణులకు వేలకొలఁది యేనుంగులను, నియుతసంఖ్యాకంబులగునశ్వములను, అర్బుదంబులకొలఁదివృషభంబులను, రూపవంతములును, పయస్విన్యులును, స్వర్ణశృంగసమంచితంబులు నగుననేకధేనువులను దానము గావించెను. మఱియు నమూల్యవస్త్రంబులను, రత్నకంబళంబులను, నవరత్నంబులను, సర్వాలంకారశోభితలై [illegible] సుందరీమణులగుకన్యలనుగూడ బ్రాహ్మణులకు దానంబు గావించెను. సర్వజనులకును నిరంతరమృష్టాన్నసంతర్పణంబులఁ గావించుచుండెను. ఆమహీపాలుఁడు దానముచేసినధనమునకుఁ బరిమితిలేదు.

ఇదియంతయుం గాంచి, దేవగంధర్వాప్సరోగణంబులును, సి

ద్ధచారణదైత్యదానవాదులును, ఋషులును, ప్రజాపతులునుగూడ బరమాశ్చర్యనిమగ్నులై పోయిరి. ఆయజ్ఞంబిట్లు నిరంతరాయముగఁ గొనసాగుచుండుటంగాంచి పురోహితులును, మంత్రులును, మహారాజునుగూడఁ బరమానందభరితులైరి. ఆస్థలంబున మలినులును, దీనులును, క్షుధార్తులు నగువారొక్కరును లేకయుండిరి. ఆధివ్యాధిభయాదు లందుఁ జేరవచ్చుటలేదు. ఆయజ్ఞంబునకు వచ్చినమహాత్ములందఱును బరమానందనిమగ్నులై యుండిరి. అంతటిమహావైభవముతోనట్టి యజ్ఞము మఱి యేకాలమునందును జరుగలేదు. ఈవిధముగా నమ్మహారాజు హయమేధయాగంబును, బురుషోత్తమప్రాసాదనిర్మాణంబును నిర్విఘ్నపరిసమాప్తిం గావించెను.

## ప్రతిమానిర్మాణచింతనము.

ఇట్లు మహారాజచంద్రుం డగునింద్రద్యుమ్నుండు యజ్ఞంబును, బ్రాసాదంబును బూర్తి గావించి ప్రతిమావిషయంబున రేయింబవలాలోచింపనారంభించెను. సర్వదేవతాధీశ్వరుండును, సర్వలోకపాలనుండును, సృష్టిస్థితిసంహారకారణుండును నగుపురుషోత్తము నెవిధముగా సందర్శింపవలయు నని యారాజేంద్రుండు దివారాత్రంబులు నిద్రాహారంబులులేక విచారించుచుండెను. ఆతఁ డాహారమును బరిత్యజించెను; ఎట్టిభోగ్యవస్తువును గైకొనుట లేదు. తుద కానృపాలుండు స్నానభూషణాదులనుగూడఁ బరిత్యజించివైచెను. వాద్యములు, గానములు, గంధద్రవ్యములు, వర్ణకములు, మదమాతంగములు, ఉత్తమాశ్వములు, పద్మరాగములు, ఇంద్రనీలములు, సువర్ణములు, వజ్రములు, మౌక్తికములు మొదలగునేపదార్థము లైనను, అంతరిక్షచరంబులును, వనచరంబులు నగు నెట్టివిహంగమాదు లైనను నాతనిమనంబునకు సంతుష్టిం గూర్పఁజాలకుండెను. శిలామయంబును, మృత్తికామయంబును

దారుమయంబు నగుప్రతిమలయం దేమూర్తి సర్వలక్షణసంపన్నుండ గు విష్ణుదేవు నారాధించుటకు యోగ్యమైనదిగా నుండునో, ఈత్రివిధ మూర్తులయందును దేనిని బ్రతిష్ఠించి యర్చించుటచే సర్వదేవార్చి తుండును, సకలలోకప్రియుండును నగువిష్ణుదేవునకుఁ బ్రీతిలాభం బగు నో యని యాలోచించుకొనుచు దివారాత్రము లాభూపాలుండు పరి తపించిపోవుచుండెను.

—♦ కారుణ్యస్తవము. ♦—

ఇట్లుండి యొకనాఁ డమ్మహీపాలుండు పాంచరాత్రవిధానంబున విష్ణుదేవార్చనంబు గావించి యించుకసేపు ధ్యాననిమగ్నుండై యనం తర మీరీతిగా జగన్నాథు నుద్దేశించి స్తోత్రము సేయ నారంభించెను. ఓవాసుదేవా! మోక్షకారణా! నీకు నమస్కారము. సర్వలోకేశ్వరుం డవగు నీవు దయామయుండవై నన్నీభవసాగరమునుండి తరింపఁజేయు ము. పురుషోత్తమా! నిర్మలాంబరసన్నిభుండవు, సంకర్షణుండవు, ధరణీ శ్వరుండవు నగునీకు నమస్కరించెదను. నన్ను రక్షింపుము. ఓమకర ధ్వజా! హేమగర్భాభా! రతికాంతుండవు, శంబరాంతకుండవు నగు నీకు మాటిమాటికిని నమస్కరించెదను. నాకుఁ బరిత్రాణంబు గూ ర్పుము. భక్తవత్సలా! అంజనసంకాశుఁడవు, అనిరుద్ధుఁడవు నగునీకు వందనములు. నన్నుఁ గరుణించి నాకు వరప్రదానంబు సేయుము. విబు ధప్రియా! నారాయణా! నీకనేక సాష్టాంగప్రణామములు. నీకు శర ణాగతుండ నగునన్ను రక్షింపుము. బలిశ్రేష్ఠా! లాంగలాయుధుఁడవు, చతుర్ముఖుండవు, జగద్ధాముండవు, ప్రపితామహుండవు నగునీకు నమ స్కారము. నన్నుఁ గరుణింపుము. నీలమేఘశ్యామా! త్రిదశార్చితా! జగన్నాథా! విష్ణుదేవా! భవసాగరనిమగ్నుండ నగునన్నుద్ధరింపుము. ప్రళయానలసంకాశుఁడవు, దితిజాంతకుండవు, మహావీర్యుండవు, దీప్త

లోచనుండవు, నరసింహుండవు నగునీకు నమస్కారము. నాయెడలఁ బ్రసన్నుండ వగుము. పూర్వకాలంబున రసాతలమునుండి యీభూతలమును వరాహరూపధారివై నీవే యుద్ధరించితివి. అట్టినీవు నన్నీదుఃఖసాగరమునుండి దరిఁజేర్పుము. ఓకృష్ణా! సకలాభీష్టప్రదంబగు నీదివ్యమూర్తి నిగీర్తించెదను. [illegible] నీవే. నీవే యీసకలరూపంబులతోడను వేఱు [illegible]

అచ్యుతా! [illegible] ప్రసన్నుండవు నగు నీకు [illegible] మూర్తులఁ నన్నిటిని భావించి యర్చనాస్తవప్రణామంబులఁ గావించుచుంటిని. నీవా సకలదివ్యమూర్తులతోడను సాక్షాత్కరించి నాకు ధర్మార్థకామమోక్షంబులఁ బ్రసాదింపుము. శ్రీహరీ! నిన్నర్చించుకొఱకు భిన్నరీతులఁ గల్పింపంబడిన భవదీయంబులగు సంకర్షణాదిదివ్యమంగళమూర్తు లన్నియును నీయందే ప్రతిష్ఠితములై యున్నవి. కాని దేవేశా! పరమార్థదృష్టిచే నీకెట్టిభేదభావంబును లేదు. నీకుపచారంబులఁ గావించుటకే నీ విషయంబున వివిధమూర్తులు కల్పితంబు లయ్యెను. నీవు కేవలమ ద్వితీయుండవు. నిన్ను ద్వైతమూర్తిగా మానవు లెట్లు నిర్దేశింపఁగలుగుదురు? శ్రీహరీ! నీవేకమూర్తివి. అద్వయుండవు. సర్వవ్యాప్తుండవు, చిత్స్వభావుండవు, నిరంజనుండవు, పరమంబగు నీదివ్యమూర్తి భావాభావవిరహితంబును, నిర్లేపంబును, నిర్గుణంబును, శ్రేష్ఠంబును, కూటస్థంబును, అచలంబును, ధ్రువంబును సర్వోపాధివినిర్ముక్తంబును సత్తామాత్రంబునై విరాజిల్లుచుండును. అట్టి నీరూపతత్త్వమును దేవతలైనను గ్రహింపఁజాలరు.

ప్రభూ! నేను మానవుఁడను. అట్టి నీదివ్యమంగళస్వరూపము నెట్లు భాషింపఁగలుఁగుదును? మహాదేవా! పీతాంబరవిలసితంబును,

చతుర్బాహుసమన్వితంబును, శంఖచక్రగదాఖడ్గసంకలితంబును, ముకు
టాంగదాద్యలంకారవిభూషితంబును, శ్రీవత్సాంకితంబును, వనమా
లాలంకృతంబు నగు దివ్యమూర్తి నీసహస్రమూర్తులలో నేకతమం బై
నది. విబుధగణంబులును నిన్నాశ్రయించిన మానవగణంబులునుగూడ
నట్టి నీమూర్తినే యారాధించుచుందురు. దేవదేవా ! సురజ్యేష్ఠా !
భక్తజనాభయప్రదా ! పద్మపత్రాక్షా ! విషయార్ణవనిమగ్నుండ నగు
నన్నుఁ గటాక్షింపుము.

లోకేశ్వరా ! శరణాగతుండ నగు నేను నీకంటె నితరదైవతం
బుల నెఱింగినవాఁడను గాను. కావున నో కమలాకాంతా ! మధుసూ
దనా ! కృపాళుండవై నాయెడలఁ బ్రసన్నుండవగుము. మహాత్మా !
నేననేకంబులగు నాధివ్యాధిజరాజాలంబులచే జడితుండనై నానాదుఃఖం
బులచే నిపీడితుండనై, హర్షవిషాదంబులచే విమూఢుండనై, అసం
ఖ్యంబులగు కర్మపాశంబులచే బంధితుండనై దస్సియున్నాఁడను. మ
ఱియు నతిభీషణంబగు సంసారసాగరంబునఁ బతితుండనై కొట్టుకొను
చున్నాఁడను. ఈ సంసారపారావార మతివిషమంబులగు దుఃఖతరంగ
ములచే నపారమైనది. రాగద్వేషాదిజలచరంబులచే నాకులమైనది.
ఇంద్రియావర్తములచే గంభీరమైనది. తృష్ణాశోకవీచికలచే సంక్షుభితం
బైనది. ఇందెట్టి యాశ్రయమును లేదు. ఎట్టియవలంబనమును లేదు.
ఎట్టిసారమును లేదు. ఇది నిరంతరమును జంచలమైనది. ప్రభూ! నేను
నీమాయచే మోహితుండనై చిరకాలమునుండి యీసంసారజలధియం
దుఁ బడి భ్రమించుచుంటిని. అనేకపర్యాయము లనేకగర్భాంతరముల
నవతరించుచుంటిని. ఈసంసారమునందు నే నెన్నివేల లక్షలకోట్ల జన్మ
ముల నెత్తితినో దానికి లెక్కయే లేదు.

ఓజనార్దనా ! నేను సాంగములగు సమస్తవేదములను, విధిపూర్వా

స్త్రములను, అనేకేతిహాసములను, బురాణములను, బహువిధశాస్త్రము లను గూడ నధ్యయనంబు చేసితిని. జగన్నాథా! ఎన్నియో క్షయం బులును, వృద్ధులును, క్షీణులును, శీలంబులును, సంతోషములును, దుఃఖములును, సంచయంబులును, అపచయంబులును, వ్యయంబులు ను నాకుఁ బ్రాప్తించినవి. ఎందఱో భార్యలును, మిత్రులును, శత్రు లును, బుత్రులును, బంధువులు మొదలగువారితో సంయోగవియో గములు నాకనుభవంబు లైనవి. ఎన్నియోపర్యాయము లెందఱో తల్లిదండ్రులు నాదృష్టిపథంబున సంచరించిరి. నేననేకదుఃఖంబులను, సు ఖములనుగూడ ననుభవించితిని. భ్రాతలు, పుత్త్రులు, బాంధవులు, జ్ఞాతులు మొదలగువారనేకులు నాకు లభించిరి. నేననేకపర్యాయము లనేకయువతుల విణ్మూత్రపిచ్ఛిలంబులగు గర్భకుహరంబులయందు వాసము చేసితిని. ఆగర్భవాససమయంబులం దనేకదుఃఖంబుల ననుభ వించితిని.

ప్రభూ! నేను బాల్యయౌవనకౌమారములయం దేయేదుఃఖ ముల ననుభవించితినో యవియన్నియును వార్ధకంబునఁగూడఁ దట స్థించినవి. హృషీకేశా! మరణానంతరంబునఁగూడ యమాలయమా ర్గంబునం గలదుఃఖముల నన్నిటిననుభవించితిని. మఱియు నరకలోకం బున నెంతటిభీషణయాతనలుగలవో యవియన్నియు నే నెఱుంగనివి లేవు. క్రిమికీటాదులు, మృగములు, పక్షులు, గోమహిషాదిజంతువు లు, మొదలగువానిగర్భంబులయందును, బ్రాహ్మణులు, శూద్రులు, ధనాఢ్యులు, దరిద్రులు, క్షత్రియులు, దీనులు, గృహస్థులు,నృపాలురు, రాజసేవకులు, మొదలుగాఁగల యనేకులగృహస్థులయిండ్లయందు నేను మాటిమాటికిని జన్మించుచునే యుంటిని.

దేవా! నేననేకపర్యాయములు దాసజాతులకు దాసత్వమం

గావించితిని. ఒకప్పుడు దరిద్రపదంబునను మఱియొకప్పుడు ధనాఢ్యపదంబునను, వేఱొకప్పుడు ప్రభుపదంబునను నేను బ్రతిష్ఠితుండనైతిని. ఒక్కొకప్పుడు నేనొక్కని, బలువురనుగూడ నిహతులం గావించితిని. మఱియు ననేకులచే ననేకులను నిహతులగునట్లు చేయించితిని. అనేకులు నాకు దానంబులం గావించి యుండిరి. నేనుగూడ ననేకులకు భూరిదానములం గావించితిని.

జనార్దనా! నేను కేవలమును సిగ్గువిడిచి తండ్రులు, తల్లులు, మిత్రులు, భ్రాతలు, భార్యలు మొదలగువారికొఱకు కొన్నిసమాసారులు ధనికులు మొదలుదరిద్రులవఱకునుగలయెందఱో పురుషులయొద్ద ననేకవిధంబులగు దైన్యోక్తుల నుచ్చరించితిని. ప్రభూ! సచరాచరంబగు నీప్రపంచమునందుఁ గలతిర్యఙ్మానవ జాతులలో నేను జన్మింపనిస్థాన మేయును లేదు. జగన్నాథా! ఈరీతిగా నేనొకప్పుడు నరకమునందును, మఱియొకప్పుడు స్వర్గమునందును నివసించుచుంటిని. ఒకప్పుడు మానవలోకమునందును, మఱియొకప్పుడు తిర్యక్సంఘమునందును సంభ్రమించుచుంటిని. జలయంత్రమునందు రజ్జునిబద్ధంబగు ఘటంబు క్రమముగా నూర్ధ్వమధ్యమనిమ్నాభిముఖంబుగాఁ బరిభ్రమించునట్లే నేనును గర్మపాశబద్ధుండనై యూర్ధ్వాధోమధ్యభాగంబులకు యాతాయాతంబులం గావించుచుంటిని. ఇట్లే నేనీభయంకరసంసారచక్రంబునఁ బడి చిరకాలమునుండి సంచరించిపోవుచుంటిని. దీనికంతం బెచ్చుటను గనుంగొనఁజాలకుంటిని.

మహాప్రభూ! నేనిప్పుడు వ్యాకులితేంద్రియుండనై పడియుంటిని. కర్తవ్యం బేమియు నాకు బోధపడుట లేదు. శోకతృష్ణాములచే నభిభూతుండనై యున్న నాకుఁ జైతన్యము లేకుండఁబోవుచున్నది. ఇప్పుడు నేను కింకర్తవ్యతావిమూఢుండనై యున్నాఁడను. దుఃఖవిహ్వ

అనాథుండనగు నేనిప్పుడు నీశరణంబు గోరి యున్నవాఁడను. ఓశ్రీకృష్ణా! దుఃఖితుండను, సంసారసాగరనిమగ్నుండను నగునన్ను నీవు నీభక్తునిగా నంగీకరించెదవేని జగన్నాథా! అట్లయినచో నీకృపాకటాక్షములను నావంకకు మరలింపుము. దేవా! నాకు నీకంటెఁ బ్రాణబంధువు లెవ్వరును లేరు. నాకొఱకుఁ జింతించువా రెందును లేరు.

వాసుదేవా! నీవంటిపరిత్రాణకర్తను బడయఁ గలిగిననాకు జీవితమరణములంగూర్చి గాని, యోగక్షేమములంగూర్చి గాని యెట్టిభయంబును లేదు. ప్రభూ! నిన్ను యథావిధిగ నర్చింపఁజాలనినరాధములకు సంసారబంధమునుండి విముక్తిలాభం బెట్లు సంఘటిల్లును? జగద్ధారణకర్తయగు కేశవునియందు భక్తిభావంబు గలుగనివిమూఢులకుఁ గులశీలవిద్యాధనజీవనంబులవలనఁ బ్రయోజన మేమున్నది? అసురప్రకృతులై విమూఢభావంబున జగన్నాథుండవగునిన్ను నిందించువారు మాటిమాటికిని జననమరణంబులం గాంచుచు ఘోరనరకంబునఁ బతితు లగుచుందురు. నిర్గుణుండవగునీయందు దోషారోపణముం గావించునరాధముల కెన్నటికిని నరకార్ణవమునుండి నిష్కృతిలాభంబు చేకూరదు.

శ్రీహరీ! నేను నిన్ననేకవిధంబులఁ బ్రార్థించుచున్నాఁడను. కర్మానుసారంబుగ నేనెచ్చట నేరూపంబున జన్మించినను, నాకు నిరంతరమును నీయందు సుదృఢంబగు భక్తిభావంబు గలుగునట్లనుగ్రహింపుము. దేవదానవమానవాదు లెల్లరును సంయతచిత్తంబులతో నిన్నారాధించుటవలన బరమసిద్ధిలాభముం గాంచఁ గలుగుచుందురు. కావున నోస్వామీ! అట్టిని న్నెవ్వరారాధింపకుందురు? బ్రహ్మాదిదేవగణంబులైనను నిన్ను సంపూర్ణముగ నన్నుతింపఁజాలరు. ప్రభూ! అట్టిచో నజ్ఞానుండ నగునేను నిన్నుస్తోత్రము చేయుచున్నాను. ఈభక్తునిసంస్తు

డును, నిత్యుండును, బురాణపురుషుండును, నగువానిని ధ్యానము చేయు మహాభాగులు ముక్తిభాగులై యజ్ఞాగ్నియందు మంత్రహుతం బగుహవ్యమ్ముంబోలి విష్ణుదేవుని దివ్యమంగళతేజమునందు విలీనులగుదురు. పరాత్పరుండగు శ్రీహరియొక్కఁడే భవదుఃఖములను హరించువాఁడు. అతనికంటె సర్వకర్త యగువాఁ డెవ్వఁడును లేఁడు. అతఁడే స్రష్టయు, పాతయు, వినాశకుండును, నిఖిలసంసారమునందును సారభూతుండు నగువిష్ణుదేవుఁడు. మోక్షప్రదుండును జగద్గురుండు నగు శ్రీకృష్ణదేవునందు భక్తిలేనివారికి విద్యాగుణయజ్ఞదానతపంబులు నిష్ఫలంబులై పోవును. పురుషోత్తముం డగునాపరమపురుషునియందు భక్తిగలవారే ధన్యులు. వారే శుచిమంతులును, విద్వాంసులును, యజ్ఞతపోదానాదిగుణగణంబులచే నగ్ర్యులును, జ్ఞాతలును, దాతలును, సత్యవంతులు నగుచున్నారు.

## ప్రతిమోత్పత్తి.

మహీపతి యగు నింద్రద్యుమ్నుం డీవిధముగా సనాతనుండును, జగన్నాథుండును, వాసుదేవుండు నగు పురుషోత్తముని స్తుతించి ప్రణామంబు చేసి ధ్యానమగ్నుండై భూతలంబునఁ గుశాసనంబున శయనించి జనార్దనుండు తనకు సాక్షాత్కరింపవలయునను సంకల్పముతోఁ దదేకచిత్తంబున భావించుచుండెను. ఆసమయంబున జగద్గురుండును, శంఖచక్రగదాధరుండును, నగు వాసుదేవుం డాతనికి స్వప్నంబున సాక్షాత్కరించెను. గరుడారూఢుండును, ప్రళయకాలాదిత్యసంకాశుండును, అష్టభుజుండును, నీలమేఘశ్యామకాంతివిలసితుండును, [illegible] నగు దేవదేవుం డిట్లు సాక్షాత్కరించి యోమహారాజేంద్రా! నీవు ధన్యుఁడవు. నీవు గావించిన [illegible]హోమంబులచేతను, నీ నిశ్చలభక్తికిని నేను సంతుష్టుండనైతిని. రాజచంద్రా! ఊరక నీవి

క్లేశముల పరితపించెదవు? ఈస్థానంబున జగత్పావనంబగు సనాతనదేవ ప్రతిమ నీకు లభించు నుపాయంబు చెప్పెదను వినుము. మహాభాగా! నేటినిశావసానంబున వినిర్మలమార్తాండమండలం బుదయించునప్పుడు లవణజలధితీరంబున నానాద్రుమవిభూషితం బగు జలప్రాంతంబున నేకతరంగపరిప్లుతంబగు మహాజలరాశి సందృష్టంబు గాఁగలదు. ఆజల కూలసమీపంబున నించుకజలంబును స్థలంబును గలసియున్నచోట న మహాభూరుహంబు నిలిచియుండును. ఆపాదపరాజంబు సాగరతరంగముల చే నాహతంబగుచుండియు నిష్కంపితంబై యుండును. నీవు కుఠారహస్తుండవై యొక్కరుండవు నాతరంగమధ్యంబునకుం బోయినచో నావృక్షము నీకు దృగ్గోచరంబు గాఁగలదు. శంకలుడిగి మనంబునఁబట్టి నీవా భూరుహమును గనిపెట్టి నిశ్శంకచిత్తముతో దానిని ఛేదింపుము. అట్లు చేసినచోఁ జెల్లవాఱునప్పటికి భిన్నంబగు నావృక్షము పరమాద్భుతంబగు నొకరూపముం దాల్పఁగలదు. దానివలన నీకుఁ బ్రతిమాలాభంబు సిద్ధింపఁగలదు. విమోహనంబగు నీహృదయవిచారము నిప్పుడే పరిత్యజింపుము.

అని యిట్లు శ్రీమన్నారాయణుం డాభూపాలుని కుపదేశించి యంతర్హితుం డగుటయు రాజేంద్రుండు మేల్కాంచి తాను గాంచిన శుభస్వప్నంబునకుఁ బరమవిస్మయాక్రాంత చిత్తుండై నిశావసానంబున కెదురుచూచుచు, విష్ణుమంత్రంబులను, విష్ణుసూక్తంబులను బఠించుచు నారాత్రిని వేగించి ప్రాతఃకాలంబున లేచి యత్యుత్సాహంబుతో సాగరజలంబున నవగాహనంబు చేసి బ్రహ్మణ్యులగు బ్రాహ్మణుల కభీష్టదానంబు లాచరించి పూర్వాహ్ణకకృత్యంబులం దీర్చుకొని యేకాకియై సాగరతీరంబునఁ బ్రవేశించి యన్వేషించుచుండఁ దేజోమయంబగు నమ్మహావృక్షమాతనికి దృగ్గోచరం బయ్యెను. అప్పు

మహోన్నతంబును మహాకాయంబును, విశాలంబును, నానాజాతివిరహితంబును, గాఢాంజనసన్నిభంబునై జలమధ్యంబున నిదురించుచున్నదియుంబోలె విరాజిల్లుచుండెను.

నరనాథుండును బరమానందంబున నమ్మహీరుహరాజమును సందర్శించి సమీపించి నిశితకుఠారంబుతో దానిని ఖండించెను. అనంతర మావృక్షఖండమును రెండుభాగములుగాఁ జేయవలయు నని యాభూపాలుం డాతరుఖండమువంకఁ జూచుచుండఁగాఁ దేజోమయమూర్తులును, దివ్యపుష్పమాలికాలంకృతులును, దివ్యగంధానులిప్తులు విష్ణుదేవ విశ్వకర్మలు బ్రాహ్మణరూపధారులై యాకస్మికముగా మహేంద్రసఖుండగు నమ్మహీపాలుని యెట్టయెదుటఁ బ్రత్యక్షంబై మహారాజా! ఏమిచేయుచున్నావు? ఈవనస్పతి నిట్లు ఛేదించుటకు నిమిత్తమేమి? ఈమహాసింధుతటంబున దుర్గమంబును, నిబిడంబును, నిర్జనంబునగు నీకాననమునందిట్టి వనస్పతి యిది యొక్కటియే యున్నది. దీని నూరక యేలఖండించెదవు? అని ప్రశ్నించుటయు మహారాజు ప్రముదితహృదయుండై చంద్రసూర్యసదృశులై యున్న యవ్విప్రవరుల నీక్షించి నతమస్తకుండై వారికి నమస్కరించి మృదుమధురస్వరంబున నిట్లనియెను.

మహాత్ములారా! దేవదేవుండును, అనాదియు, అనంతుండును, జగన్నాథుండును నగుపురుషోత్తము నారాధించుటకై నేనీస్థానమునందుఁ బ్రతిమానిర్మాణమును జేయవలయు నని యభిలషించుచున్నాను. మఱియు నేనివ్విషయంబున దేవదేవుండగుపరమాత్మునిచే నిట్లాజ్ఞాపింపఁబడితిని. అని చెప్పుటయు విశ్వవిభావియగు విష్ణుదేవుండు మందహాసవిలసితవదనుండై యారాజచంద్రునిం గాంచి మహీపాలా! నీకిట్టి సత్సంకల్పంబు గలిగినందులకు నిన్ననేకవిధంబుల నభినందించుచున్నాను. కదళీదళచంచలం బగునీసంసారసాగర మతిభయానకమైనది.

దీనియం దెట్టిసారంబును లేదు. కామక్రోధదుఃఖపరంపరలచే సమాకు లంబై యుండును. మఱియు నిది యింద్రియంబులను నావర్తంబుల నిండి దుస్తరమై, జలబుద్బుదంబులంబోలి యస్థిరమై, వివిధవ్యాధి పూర్ణంబై యుండును. ఇట్టిసంసారమునందుండియు విష్ణుదేవు నారా ధింపవలయు ననునుత్సాహము గలవాఁడవగుటచే నీవు సంస్తవనీయుఁడ వు. సర్వగుణాలంకృతుండవగు నిన్నుఁ బ్రజాపాలకునిగాఁ బడసిన పుర నగరప్రజాసమన్వితంబగునీభూమండలము ధన్యమైనది. మహాభాగా! లెమ్ము! మాతోఁగలసి మధురసంభాషణంబు సేయుచు సుఖశీతలం బగునీతరుచ్ఛాయ నుపవసింపుము. నావెంటవచ్చినయీబ్రాహ్మణుఁ డు విశ్వకర్మంబోలి సకలకార్యకరణదక్షుండైనవాఁడు. నాయాజ్ఞచే నీతఁడు ప్రతిమానిర్మాణంబు చేయఁగలఁడు.

అని చెప్పుటయు నింద్రద్యుమ్నుండు సాగరతీరమును వదలి యాసమీపమునందున్న శీతలవృక్షచ్ఛాయను గూర్చుండియుండెను. అప్పుడు బ్రాహ్మణవేషధారి యగువిశ్వాత్ముండు విశ్వకర్మం బిలిచి యి ట్లని యాజ్ఞాపించెను. ఓవిప్రశ్రేష్ఠా! నీవీదారుఖండంబులతోఁ బ్రతి మానిర్మాణంబు సేయవలయును. అందు ముందుగాఁ బరమశాంతుం డును, పద్మపత్రాయతలోచనుండును, శ్రీవత్సకౌస్తుభశంఖచక్రగదాధ రుండును నగుశ్రీకృష్ణదేవునిప్రతిమను నిర్మింపవలయును. తరువాత గౌరాంగుండును, క్షీరవర్ణుండును, స్వస్తికాంకితుండును, లాంగలధరుం డును దేవదానవగంధర్వాదుల కవిదితుండు నగునసంతుని ప్రతిమను గావింపవలయును. పిమ్మట శుభలక్షణసంపన్నయు, శోభనాంగియు, సువర్ణవర్ణయు వాసుదేవభగినియు నగుసుభద్రాదేవిప్రతిమను నిర్మిం పవలయును. అని యాజ్ఞాపించెను.

సకలకర్మదక్షుం డగువిశ్వకర్మ దేవదేవునియాజ్ఞమైనంతనే ప్రతి

మానిర్మాణంబున కారంభించి ముందుగా శుక్లవర్ణుండును, శరచ్చంద్ర సమతేజుండును, ఆరక్తనేత్రుండును, మహాకాయుండును, ఫణిఫణాకుల మస్తకుండును, గదాముసలపాణియు నగుబలదేవమూర్తిని, పిమ్మటనీలజీమూతశ్యాముండును, పుండరీకనయనుండును, అతసీపుష్పసంకాశుండును, పీతాంబరుండును, శ్రీవత్సవక్షుండును, సౌమ్యవిగ్రహుండును, చక్రధరుండును, సర్వపాపహరుండును, నగుశ్రీహరిదివ్యమూర్తిని, తదనంతరము శుద్ధజాంబూనదవర్ణయు, పద్మపలాశనయనయు, విచిత్రవసనాలంకృతయు, హారకేయూరభూషితయు, విచిత్రాలంకారిణియు, రత్నమాలాధారిణియు, సమున్నతవక్షోభాగయు, మనోహారిణియు నగు సుభద్రామూర్తిని యథావిధిగ నిర్మాణంబు గావించెను.

అట్లు విశ్వకర్మచే నిర్మింపఁబడిన దివ్యవసనాలంకృతంబులును, నానారత్నాలంకారశోభితంబులును, సర్వలక్షణసంపన్నంబులును, మనోరమంబులు నగుమూఁడుప్రతిమలను గాంచి మహీపాలశేఖరుం డగునింద్రద్యుమ్నుండు పరమాశ్చర్యనిమగ్నుండై మహాత్ములారా! మీరు బ్రాహ్మణరూపులై వచ్చినదేవతలో, పరమాద్భుతదేవచరిత్రుల గుమానవులో యెఱుంగఁజాలకున్నాఁడను. దేవమానవయక్షగంధర్వవిద్యాధరసంఘంబులలో మీరెవ్వరైననగుదురుగాక ! మాయారూపులై వచ్చియున్న మీతత్త్వము నాకు సుబోధంబు గాకున్నది. పరమపురుషులారా! శరణాగతుండ నగు నాయెడలఁ బ్రసన్నులై నిజస్వరూపంబులతో సాక్షాత్కరింపుఁడు.

## — పురుషోత్తమవర్ణనము. —

అని యమ్మహారాజశేఖరుండు ప్రార్థించుటయు దేవదేవుం డిట్లనియెను. రాజేంద్రా! దేవదానవయక్షగంధర్వాదులు, మహేంద్రుఁడు, బ్రహ్మ, రుద్రుఁడు మొదలగు వారిలో నేనెవ్వండను గాను.నన్ను

సకలార్తిహారుం డగు పురుషోత్తమునిగా నెఱుంగుము. నేను సర్వభూతంబులకు నారాధనీయుండను. అనంతుండను. సర్వశాస్త్రసంకీర్తితుండను. నిగమాంతప్రతిపాద్యుండను. యోగిగణంబులు నాకు జ్ఞానగమ్యుం డనియు, వాసుదేవుం డనియు నామనిర్దేశంబు గావించి యున్నారు. స్వయముగా బ్రహ్మయు, విష్ణుండును, శివుండును, దేవరాజగు నింద్రుండును, జగత్సంయమనుం డగు యముండును నేనే. పృథివ్యాది సకలభూతంబులును, దేవతాగ్నులును, జలపతియగు వరుణుండును, ధరిత్రియు, మహీంధరాదిసమస్తంబును నాకంటె నన్యంబులు గావు. ఈ త్రిభువనంబులయందును వాఙ్మయంబులగునవి యన్నియును, స్థావరజంగమాత్మకంబగు విశ్వంబంతయును, నేనే. నాకు భిన్నంబుగ దేనికినిగూడ నస్తిత్వంబు లేదు. ఓ నృపాలా! నేను నీయెడలఁ బ్రసన్నుండ నైతిని. నీయభీష్టవరప్రదానంబు గావించెదను. అకృతపుణ్యులగువారికి స్వప్నంబులయందైనను నాదర్శనలాభంబు గలుగదు. నీవు దృఢభక్తిసంపన్నుండవు. కావుననే నీకు నేను సాక్షాత్కరించితిని.

అని మహాదేవుం డనుగ్రహించుటయు మహీపాలుండానందపులకాంచితసర్వావయవుండై యో శ్రీకాంతా! శ్రీపతీ! పీతాంబరధరుండవు, శ్రీదుండవు, శ్రీశుండవు, శ్రీనివాసుండవు, శ్రీనికేతనుండవు నగు నీకు నమస్కారము. ఆద్యుండును, ఈశానుండును, సర్వేశ్వరుండును, సర్వతోముఖుండును, నిష్కలుండును, సనాతనుండును, పరమేశ్వరుండు నగునీకుఁ బ్రణామంబులు. దేవా! నీవు శబ్దాతీతుండవు, గుణాతీతుండవు, భావాభావవిరహితుండవు, నిర్లేపుండును, నిర్గుణుండును, సూక్ష్ముండును, సర్వజ్ఞుండును, సర్వభావనుండును, నీలజలదసంకాశుండును, గోబ్రాహ్మణహితరతుండును, సర్వరక్షకుండును, సర్వవ్యాపియు, శంఖచక్రధరుండును, గదాముసలధారియు, నీలోత్పలదళసన్నిభుండును, వర

పురుషుండును, దేవదేవుండును, నగు నీకు శతసహస్రవందనములు. క్షీర సాగరమధ్యంబున భుజగపర్యంకశయనుండ వగు నో హృషీకేశా! నీకు నమస్కారము. సర్వపాపహరుండవగు శ్రీహరీ నీకుఁ బ్రణామము! దేవా! నీవు విభుండవును, వరదుండవును, సర్వలోకేశ్వరుండవును, మోక్షకారణుండవును, అవ్యయుండవు నగు విష్ణుదేవుఁడవు. నీకు నమస్కారము.

అని యనేకవిధంబుల వినుతించుచు సాష్టాంగప్రణామంబు గావించి యంజలిబద్ధుండై యింద్రద్యుమ్నుండు వినయమధురవచనంబులతో జగన్నాథా! నీవు నాయెడలఁ బ్రీతుండవై తివేని దేవతలు, అసురులు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, సిద్ధసాధ్యవిద్యాధరాదులు, పరివ్రాజకులు, యోగులు, తత్త్వచింతకులు, మోక్షదర్శనులు, నగు మనీషివరులు నిరంతరమునేపరమపదముంగూర్చి ధ్యానించుచుందురో యట్టి యసితదదుర్లభంబగు పరమపదంబు నీయనుగ్రహముచే నాకు లభించుఁగాక! అని మహారాజు ప్రార్థించుటయు మహాదేవుండు మహాభాగా! నీకు సర్వశుభంబులును బ్రాప్తించుఁగాక! నాప్రసాదంబుచే నీసకలాభీష్టంబులును సిద్ధించుఁగాక! నీవు పదివేలతొమ్మిదివందలవత్సరంబులవఱకును మహామహీరాజ్యభోగంబుల ననుభవించి యనంతరము దుర్లభంబగు దివ్యపదప్రాప్తుండ వయ్యెదవు. పూర్ణంబును, శాంతంబును, గుహ్యంబును, వ్యక్తావ్యక్తంబును, పరాత్పరంబును, సూక్ష్మంబును, నిర్లేపంబును, నిష్కలంబును, ధ్రువంబును, చింతాశోకవిరహితంబును, క్రియాకారణవర్జితంబును, పరమానందమయంబును, క్షేత్రయాఖ్యంబు నగు పరమపదంబును, నీవు సందర్శింపఁగలవు. మఱియు నాకాశంబును, మేఘంబులును, రవిచంద్రతారాగణంబులును, సప్తసముద్రంబులును, మేరుమందరాదిపర్వతంబులును, నెంతకాలంబుండు

నో, స్వర్గలోకంబున దేవత లెంతకాలంబు నివసించి యుందురో యంతకాలంబువఱకు నీమహీమండలమునందు సర్వస్థానములందును నక్షయంబగు నీకీర్తి ఘోషితంబగుచుండుఁగాక! నీచేఁగావింపంబడిన యజ్ఞమునుండి సంభూతంబై యింద్రద్యుమ్నసరోవరనామంబున నొక దివ్యతీర్థము విఖ్యాతంబు గాఁగలదు. ఆతీర్థజలంబుల నవగాహనంబు సేయుమానవులు స్వర్గలోకంబునఁ బదునలువురింద్రులు పరిపాలించుసంతకాలంబువఱకును సుఖోపభోగంబుల ననుభవింపఁగలరు.

ఆసరోవరంబునకు దక్షిణభాగంబున నైఋతికోణంబునందొక వటవృక్షంబు గలదు. దాని సమీపమునందున్న మండపము కేతకీవనాచ్ఛన్నంబై బహువిధఫలభూరుహలతావేష్టితంబై యున్నది. ఆషాఢంబున శుక్లపక్షంబున మఘానక్షత్రసంకలితం బగు పంచమీ తిథియందు నామూర్తి నామండపమునందు స్థాపించి శుభాకాంక్షులగు మానవులు అమూల్యంబులును, సుందరంబులు నగు వేషభూషణాదులచే నన్నలంకరించి మనోహరనృత్యగీతవాద్యంబులచేతను, రత్నభూషణ స్వర్ణదండ చామరాదిప్రదానంబులచేతను సప్తదివసంబులవఱకును నన్నారాధించి మహోత్సవంబులు గావింపవలయును. అందుఁ జతురాశ్రమనిరతు లగుబ్రాహ్మణులు నానావిధస్తోత్రంబులను, వేదపాఠంబులను గావింపవలయును. అనంతరము బలరామకేశవమూర్తులను సందర్శించి ప్రణామంబులు చేసి భక్తిపూర్వకంబుగ స్తోత్రంబు గావించినచో నట్టివారు దివ్యాయుతవర్షంబులు విష్ణుమందిరనివాసులై నారాయణానుచరరూపంబులతో గంధర్వాప్సరోగణంబులచే సంకీర్తితులగుచు శ్రీమన్నారాయణసహితులై విహరింపఁగలరు. అట్టివా రాదిత్యభువనంబున నాదిత్యసన్నిభవిమానారూఢులై సంచరించుచు సకలాభీష్టభోగంబుల ననుభవించుచుందురు.

అని చెప్పి భగవంతుండగు పురుషోత్తముం డింద్రద్యుమ్న మహీపాలునకు వరప్రదానంబు గావించి విశ్వకర్మసహితుండై యంతర్హితుం డయ్యెను. అప్పు డింద్రద్యుమ్నుండు భగవద్దర్శనంబున సంప్రీతుండై తన్నుఁ గృతార్థునిగాఁ దలంచుకొని యుప్పొంగుచు సమాత్యపురోహితసహితుండై సుభద్రాకృష్ణబలరామమూర్తులను మణికాంచనవిచిత్రవిమానప్రతిమంబులగు రథంబులపై నధిష్ఠింపఁజేసి మహాసమారోహముతోఁ, మంగళగీతవాద్యములతోఁ దీసికొని వచ్చి వేదఘోషంబులతోఁ బవిత్రం బగు శుభస్థానమునందు నిలిపి ద్విజసహితుండై యథావిధిగ శుభతిథియందు, శుభనక్షత్రమున, శుభముహూర్తమునం దాదివ్యప్రతిమలను బ్రతిష్ఠించెను. ఈవిధముగా నమ్మహీపతి యాచార్యమతానుసారంబుగా సకలకార్యంబులను నిర్వర్తించి విధిపూర్వకంబుగా నాచార్యులకు బహుదక్షిణల నొసంగి యమ్మహోత్సవసందర్శనార్థులై వచ్చిన యతిథిసంఘంబులకం దఱకును యథేష్టధనదానంబులం గావించెను. ఇట్లు విధిదృష్టవిధానంబున నుత్తమప్రాసాదమునం దాప్రతిమలను బ్రతిష్ఠించి నానాసుగంధపుష్పంబులను, స్వర్ణరత్నాదులను, శోభనవస్త్రములను సమర్పించి యథావిధిగ నర్చించుచు నమ్మహారాజు నిరంతరవివిధదానక్రియలతోడను, వివిధయజ్ఞానుష్ఠానంబులతోడను గాలక్షేపంబు సేయుచు ధర్మరాజ్యపాలనంబునఁ గృతకృత్యుండై సకలపరిగ్రహపరిహారపూర్వకంబుగఁ దుదకు విష్ణుదేవుని పరమపదలాభంబు గాంచి కృతార్థుండయ్యెను.

మునివరులారా! నృపశ్రేష్ఠుండగు నింద్రద్యుమ్నుని పుణ్యచరిత్రమును, పవిత్రపురుషోత్తమక్షేత్రమాహాత్మ్యంబును సంక్షేపముగఁ గీర్తించితిని. ఇంకను నేమి వినఁగోరెదరో చెప్పుఁడు! అని బ్రహ్మదేవుం డానతిచ్చుటయుఁ బరమాశ్చర్యనిమగ్నులగు మునులు పరమానందము

తో నిట్లనిరి. ఓసురశ్రేష్ఠా! పురుషోత్తమయాత్రనెప్పుడు చేయవల యునో, యేవిధిననుసరించి పంచతీర్థకృత్యంబుల నిర్వహింపవలయునో, అందొక్కొక్కతీర్థస్నానంబువలనను, దానములవలనను, దేవతాసందర్శనంబువలనను నేయేఫలలాభంబగునో వేఱువేఱుగ వక్కాణింపవల యును. అని ప్రార్థించుటయు బ్రహ్మదేవుండు మహర్షిశేఖరులారా! ఒక్కసారి జ్యేష్ఠశుక్లద్వాదశీదినంబున నుపవాసియై భక్తిపూర్వకంబుగఁ బురుషోత్తముని దర్శించువానికిఁ గురుక్షేత్రంబున సప్తాయుతవత్సరంబులు జితేంద్రియుండై జితక్రోధుండై తపంబు గావించినఫలము సిద్ధించును.

కావున స్వర్గాపవర్గకాంక్షితులగుమానవులు ప్రయత్నపూర్వకంబుగా జ్యేష్ఠశుక్లద్వాదశీదినంబునఁ బురుషోత్తమసందర్శనంబు గావింపవలయును. తీర్థసేవనులగుపుణ్యాత్ములు పంచతీర్థంబులను సేవించి పురుషోత్తము నర్చించినచో శాశ్వతవిష్ణులోకనివాసంబు లభించును. మహాజ్యేష్ఠసమయంబునఁ బురుషోత్తమంబునకుం బోయి పంచతీర్థకృత్యంబులనిర్వహించి పురుషోత్తమదర్శనంబు గావించుట శుభాకాంక్షులగువారి కవశ్యకర్తవ్యము. దూరమునందుండియైనను, నిర్మలచిత్తముతో భక్తిభావంబునఁ బురుషోత్తనామసంకీర్తనంబు సేయువానికి యాత్రాఫలంబును, విష్ణులోకనివాసంబును లభించును. పురుషోత్తమప్రాసాదముపైనున్నచక్రమును దూరమునుండియైనను భక్తియుక్తుఁడై సందర్శించి ప్రణామంబు గావించుమానవులు సర్వపాపవిముక్తు లగుదురు.

## —♦ మార్కండేయవటదర్శనము. ♦—

మునులారా! పూర్వకాలంబున మహాప్రళయము సంభవించిన ప్పుడు కాల మతిభయంకరమయ్యెను. చంద్రసూర్యాదిగ్రహంబులును, స్థావరజంగమాదివస్తువులు నేవియు లేకయుండెను. ప్రళయాది

త్యుండు వెలుంగుచుండెను. ప్రచండఘనగర్జనంబులు వినవచ్చుచుండె ను. ఉల్కాపాతంబులచేఁ దరుపర్వతాదులన్నియును జూర్ణీభూతము లై పోయెను. సకలజీవగణంబులును, వినష్టంబులై పోయెను. మహాత్తరం బులగునుల్కాపాతము లగుచుండెను. సమస్తజలాశయములును శుష్కీ భూతము లయ్యెను. అట్టిసమయంబునఁ బవనప్రభాకరసాహాయ్యము చే నతిభీషణంబగుసంవర్తకానలం బుద్భూతంబై పృథ్వీతలంబును భే దించుకొని రసాతలంబునఁ బ్రవేశించి దేవదానవయక్షగంధర్వాదుల కు మహాభయోత్పాదనంబు గావించుచుండెను. ఆయగ్నిజ్వాలాపరం పరలచే నాగలోకమంతయును దగ్ధమైపోయెను. క్షితిమండలంబునం గలసమస్తపదార్థములును భస్మీభూతము లయ్యెను. ఊర్ధ్వాధోభాగం బులంగలయెల్లవస్తువులును నిమిషమాత్రమున వహ్నిజ్వాలలకాహుతి యైపోయెను.

అప్పుడు ప్రబలవేగవంతం బగుప్రభంజనంబును, సంవర్తకాన లంబును శతసహస్రసహస్రయోజనంబులప్రదేశమంతయు నల్పకాల ములోనే దగ్ధీభూతంబుగాఁ జేసివైచెను. దేవాసురగంధర్వాదులును, సకలజీవులును నమ్మహానలంబున దగ్ధులైపోయిరి. ఆకల్పానలజ్వాలలు ప్రదీప్తములై, ఘోరారావంబు సేయుచుఁ గోటిసూర్యసంకాశములై సురాసురనరగంధర్వాదిపరివృతంబులగుత్రిలోకములను నిమిషములో దహించివైచెను. అంతటిమహాఘోరంబును, భీభత్సంబునగుప్రళయ కాలమునందుఁ బరమధార్మికుం డగుమార్కండేయమునివరుం డొ క్కఁడుమాత్రమే ధ్యాననిష్ఠుండై యుండెను. కాని మోహపాశనిబ ద్ధుండగునాతఁడు క్షుత్తృష్ణాకులితేంద్రియుండై పరితపించిపోవుచుండె ను. దారుణవహ్నిజ్వాలాదర్శనంబున నాతని కంఠోష్ఠతాలువులు శుష్కీ భూతము లై పోయెను. భయవిహ్వలుం డగునాతఁ డప్పుడు తృష్ణా

ర్తుండై తపంబు సాలించి యచేతనప్రాయుండై యేమియుం దోఁచక సమస్తభూమండలమును బరిభ్రమింపనారంభించెను. కాని యాతని కెందును రక్షకుండు కానఁబడకుండుటచే నిటునటుఁ బరుగులెత్తుచుండెను.

ఆతని కెందును విశ్రామస్థానము కానంబడదయ్యెను. అప్పుడాతఁడువిభ్రాంతుండై యేమిచేయుదును ? ఎక్కడకుఁ బోవుదును ? ఎవ్వరి నాశ్రయింతును ? నాకేమియుం దోఁచుటలేదు. సనాతనుండును బురుషోత్తముండును నగు దేవదేవునిదివ్యదర్శనంబు నాకెట్లు సిద్ధించును ? అని యనేకవిధంబులఁ దలపోయుచు మార్కండేయుం డేకాగ్రచిత్తంబున మహాప్రళయకారణుండును, సనాతనుండును, బరమపదస్వరూపుండునగు జగన్నాథునింగూర్చి చింతించుచు ననతిదూరంబునఁ బురుషేశనామంబుచే విఖ్యాతంబగు వటవృక్షమును దర్శించి యతిత్వరితంబుగ దానిసమీపమునకుం బోయి యాచెట్టుమొదటఁ గూర్చుండెను. ఆస్థానంబునఁ గాలానలజ్వాలాభయంబుగాని, యంగారవర్షణంబుగాని, ఉల్కాశనిపాతంబుగాని యేమియు లేకయుండెను.

## ప్రళయసందర్శనము.

అనంతరము తటిన్మాలాభీలంబులును, అద్భుతాకారంబులు నగు మేఘంబు లన్నియు నాకాశమునం దలముకొనియెను. నీలోత్పలశ్యామలంబులును, కుముదప్రతిమంబులును, కింజల్కవర్ణంబులును, పీతహరిద్వర్ణంబులును, పద్మపలాశసంకాశంబులును, కాకాండసన్నిభంబులు నగుజలదబృందంబులు పురపర్వతాకారంబులతో నలముకొని గభీరగర్జనంబులుగావించుచుఁ గుంభవృష్టితో సకలదిశలను ముంచివైచుచుండెను. బ్రహ్మాండమంతయును గ్రమముగా జలప్లావితమై పో

మెను. ఈవిధముగా బ్రళయానలంబును జల్లార్చి యేకధారగా ద్వా దశవర్షంబులు మహావర్షపాతం బగుచుండెను. అప్పుడు సముద్రంబు లన్నియు వేలాతిక్రమణంబు గావించి భూమండలమునంతను ముంచి వై చెను. తుదకాసాగరంబులన్నియును, ప్రబలఝంఝామారుతాహ తులచే సంక్షుభితంబులై చెదరిపోవుచుండ నాదిపద్మాలయుండగువిష్ణు దేవుండు భయంకరప్రభంజనమునంతను బానము చేసి యేకార్ణవమ ధ్యంబున శయనించియుండెను. దేవాసురయక్షరాక్షసాదులన్వైన లే కుండఁ బోయెను. స్థావరజంగమంబులగుసకలవస్తువులును వినష్టంబు లయ్యెను.

అప్పుడు మార్కండేయుండు తానాశ్రయించియున్నవటవృక్ష మును, భూమిని, దిక్కులను, జంద్రసూర్యులను, వాయువును, మహా నలమును, మఱియేవస్తువునుగూడఁ జూడఁజాలకపోయెను. ఘోరంబ గునయ్యేకార్ణవంబున నేయాశ్రయంబును లేకుండెను. అంతటను ద మోరాశి యాక్రమించుకొని యుండెను. ఆసమయంబున జలార్ణవ మగ్నుం డగునాతఁ డెట్లో యుత్తీర్ణుం డగుటకుఁ బ్రయత్నించెను. కా ని లాభము లేకపోయెను. ఆర్తుం డగునాతఁడు జలంబులం దేలి యుండదందుఁ గొట్టుకొనుచుఁ బరిభ్రమించుచుండెను. ఆతని దరిఁజేర్చు టకు దిక్కెవ్వరును గానవచ్చుట లేదు. అట్లు శరణ్యంబులేక యతివి హ్వలుండై యున్నమార్కండేయుం గాంచి దయాళుం డగుపురుషో త్తముండు మధురగంభీరస్వరంబున వత్సా ! సువ్రతా ! బాలుండవగు నీవు చాలడస్సితివి. నీవు నాభక్తుఁడవు. మార్కండేయా ! లెమ్ము ! నీకేమియును భయము లేదు. నాసమీపమునకు రమ్ము ! అని యాన తిచ్చెను.

ఆవాక్యంబుల నాలించి మార్కండేయుండు కుపితుండై యతి

విస్మయంబుతో దెసల నవలోకించి యిట్లుగా నాతపోబలంబున కీవిధ ధముగా నవజ్ఞాతం జూర్చి నాపేరు పెట్టి నన్నుఁ బిలుచుచున్నవారెవ్వరు? నన్ను బాలుండని నిర్దేశించి బహుసహస్రవర్షంబులు గడపిన నా జీతకాలమును గూడఁ దృణీకరించుచున్న నా రెవ్వరు? దేవతలయందిట్టివ్యవహారమెన్నఁడును గానంబడుట లేదు. దేవదేవుండగు బ్రహ్మదేవుండు నన్ను దీర్ఘాయుష్మంతునిగా సేర్పఱచియున్నాఁడు. నన్నిప్పుడిట్లు పిలిచి స్వయముగా మృత్యువును గోరి తెచ్చుకొనుచున్నవిగతజీవుండెవ్వఁడు? అని యిట్లు మార్కండేయుండు, చింతావిష్టుండై యిది యేమిస్వప్నమా? కాక నాకజ్ఞానము గలిగినదా? అని యనేకవిధంబుల వితర్కించుకొని నిశ్చలచిత్తంబున ధ్యానించుటయు నాతనికి సకల దుఃఖవిధ్వంసిని యగుమహశ్శక్తి యావిర్భావం బయ్యెను.

అప్పు డాతఁడు భక్తిపూర్వకంబుగఁ బురుషోత్తమదేవుని శరణంబు నాశ్రయింపవలయు నని నిశ్చయించుకొని యమ్మహాదేవునిధ్యానంబునఁ దన్మయుం డగుటయు నవ్వటభూరుహంబు మరలలో సలిలోపరిభాగంబున నెప్పటియట్లు తేలుచున్నట్లాతనికి గోచరించెను. ఆభూరుహావిశాలశాఖోపరిభాగంబున విశ్వకర్మనిర్మితంబును, నవరత్నఖచితంబును, నానారత్నాలంకారభూషితంబును నానాస్తరణాచ్ఛన్నంబును, ఆలోకరమణీయంబును, ప్రభామయంబు నగుసోపానపర్యంకము పరమాద్భుతంబుగ సమ్మునీంద్రునకుఁ గానవచ్చెను. ఆపర్యంకోపరిభాగంబునఁ గోటిసూర్యప్రభాభాసమానుండును, చతుర్భుజుండును, సుందరాంగుండును, పద్మపత్రాయతలోచనుండును, శంఖచక్రగదాధరుండును, శ్రీవత్సవనమాలాలంకృతుండును, దివ్యకుండలధరుండును నగు శ్రీకృష్ణుండు బాలకాకారంబునఁ బవళించి యుండెను.

మునివరుం డగుమార్కండేయుండు " దేవదేవుండగు శ్రీకృష్ణుం

గాంచి విస్మయోత్ఫుల్లనయనుండును, ఆనందపులకితసర్వాంగుండును
నై సాష్టాంగప్రణామంబు గావించి ఆహా! ఘోరంబగునీయేకార్ణవం
బున సర్వంబును నిమగ్నంబై పోయిన యీసమయమునం దీబాలుం
డొంటిగా నిర్భయంబుగ నిందెట్లున్నాఁడు? అని భావించుకొనుచు భూ
తభవిద్వర్తమానవిదుండయ్యును మార్కండేయుండు మాయామోహం
బుచే నేమియు నెఱుంగనివాఁడయ్యెను. అతఁ డట్లజ్ఞానుండై తనతపో
బలంబును, జ్ఞానంబును, కర్మంబులును, దీర్ఘజీవనంబును, మానత్వం
బునుగూడ నిరర్థకంబు లయ్యె ననియు, నీమణిపర్యంకశాయియగుబా
లకుం డెవ్వఁడో తెలియంగఁజాలకుంటి ననియు నచేతప్రాయుండై చిం
తించుచు నేకార్ణవంబునఁ దేలిపోవుచుండెను. ఎందును శరణ్యంబు లే
కుండుటచే నాతనికి నిర్వేదంబు గలిగెను. స్వమహిమాధిష్ఠితుండును,
బాలార్కసదృశుండును, దివ్యతేజోమయుండు నగునామాయాబాలకుని
మార్కండేయుండు దర్శింపఁజాలకపోయెను.

జలంబుల నట్లీఁదుకొనివచ్చుచున్నమార్కండేయునిం గాంచి
యాబాలకుండు మందహాసవదనుండై మేఘగంభీరస్వరంబున వత్సా!
నీవు చాలఁ బరిశ్రాంతుండవైన ట్లగపడుచున్నావు. సంరక్షణంబుకొఱ
కు నన్నాశ్రయింపఁజూచుచుంటివి. రమ్ము! శీఘ్రముగ వచ్చి నాశరీ
రంబునఁ బ్రవేశింపుము. అందువలన నీకు విశ్రాంతి గలుగును. అని
ప్రబోధించుటయు మార్కండేయుండు మాఱుమాట చెప్పక మోహా
వేశవివశుండై వివృతంబగునాబాలకునివదనంబునఁ బ్రవేశించెను.

## —♦ భగవద్గర్భపరివర్తనము ♦—

అట్లు మార్కండేయుం డాబాలకునియుదరంబునఁ బ్రవేశించి
యందు నానాజనపదపరివృతంబగు సమస్తభూమండలమును, సప్తసము

ద్రింబులను, సప్తద్వీపంబులను, భారతాదివర్షంబులను దర్శించెను. మఱియు సర్వరత్నమయంబును, బహుకందరయుతంబును, నానామునిజనాకీర్ణంబును, నానాతరులతాశోభితంబును, నానాసత్వసంపన్నంబును, నానాశ్చర్యమయంబును, వ్యాఘ్రసింహాదినానాజంతుపరివృతంబును, శక్రాదిబృందారకసేవితంబును, సిద్ధచారణయక్షాప్సరోగణాధిష్ఠితంబును, బహువిధదేవతాయతనసమలంకృతంబును, మనోహరంబునగు మేరుపర్వతమును దర్శించెను. ఈవిధముగా మార్కండేయుం డాబాలునియుదరంబున సంచరించుచు మేరుశీతశైలహేమకూటాది సకలపర్వతంబులును, కురుక్షేత్రంబును, పాంచాలమద్రకేకయాదిసకలదేశంబులను, భూమండలమునందలి సకలతీర్థములను, గ్రామనగరకృషిగోరక్షావాణిజ్యక్రయవిక్రయాదిస్థానంబులను, ఇంద్రాదిదేవతలను, మహర్షులను, రాక్షసులను సకలజీవులనుగూడ సత్యాశ్చర్యముతోఁ గనుంగొనుచుండెను. బ్రహ్మాదితృణపర్యంతముంగల చరాచరప్రపంచమంతయు నయ్యుదరంబునం దమ్మునీంద్రునకు దృగ్గోచరం బయ్యెను.

అప్పు డాతని కవ్యాహతంబగుమనశ్శక్తియు, నద్భుతంబగుస్మృతిశక్తియుఁ బరమేశ్వరానుగ్రహంబున లభించుటయు నమ్మునివరుం డాభగవద్గర్భస్థంబగుబ్రహ్మాండమునం దంతటను బరిభ్రమింపఁ దొడంగెను. కాని యావిష్ణుదేవునిదివ్యోదరంబున కంతం బెచ్చటను నాతఁడు గనుంగొనఁ జాలఁడయ్యెను. అతఁ డెంతతిరిగినను నంతంబు గానలేక వరదుండగు నాదేవదేవునకు శరణాగతుం డయ్యెను. ఇట్లు పరమేశ్వరు శరణంబు గోరినంతనే యావిష్ణుదేవుని వివృతవదనగహ్వరమునుండి యమ్మునీంద్రుండు బహిర్గతుం డయ్యెను.

## —◆ పరమేశ్వరస్తవము ◆—

మార్కండేయమునీంద్రుం డాబాలకునిగర్భంబునుండి బహిర్గతుండై మరల నేకార్ణవీకృతం బై యున్న భూమండలమును, మఱియు నచ్చటశాఖాంతరంబునఁ బర్యంకముపై మునుపటివలెనే శిశురూపియై శయనించియున్న దేవదేవుని గనుంగొనియెను. ఆపుండరీకాక్షుండును, శ్రీవత్సవక్షుండును, పీతాంబరధరుండును, చతుర్భుజుండు నగుదేవుఁడే సకలజగత్కబళనంబు గావించియుండెను. అప్పు డాబాలకాకారుండగు దేవదేవుండు జలార్ణవంబునం దేలియాడుచున్న మార్కండేయునిం గాంచి మందహాసము చేయుచు వత్సా! నాయుదరంబున నివసించుటవలన నీకెంచుక యాయాసము తీఱినదా? అందు సంచరించుచు నీ వెట్టివింతలను గనుంగొంటివి? మునిశ్రేష్ఠా! నీవు నాభక్తుఁడవు. ఆయాసపడి నీవు నన్నాశ్రయించితివి. కావున నొకసారి నన్నవలోకింపుము! అని ప్రబోధించుటయు మార్కండేయుండు హర్షపులకితాంగుండై రత్నాలంకారభూషితుండును, దుర్నిరీక్ష్యుండు నగునాపురుషోత్తమునివంక దృష్టిపాతంబు గావించెను.

అంతలోనే యమ్మునిశ్రేష్ఠునిదృష్టి విమలంబును బ్రసన్నంబు నయ్యెను. దేవదేవానుగ్రహముచే నాతనికభినవచక్షుశ్శక్తి లభించినట్లయ్యెను. అప్పుడు మార్కండేయుండు సురసేవితంబులగునామహాదేవునిపాదపంకజంబులకుఁ బ్రణమిల్లి యంజలిబద్ధుండై పరమాశ్చర్యనిమగ్నచిత్తంబుతో, హర్షగద్గదస్వరంబుతో నిట్లుస్తుతింప నారంభించెను. ఓజగన్నాథా! మాయాబాలకరూపా! పద్మాక్షా! దేవదేవా! దుఃఖితుండనై శరణాగతుండ నగునన్ను రక్షింపుము. స్వామీ! నేను సంవర్తానలజ్వాలలో సంతప్తుండనై, యంగారవర్షణంబునకు భీతుండనైతిని. మఱియు నతిప్రచండవాయువేగముచే శోషితుండను, విహ్వ

లుండను, శ్రాంతుండను నైతిని. ప్రళయాదిత్యప్రతాపంబునకును, పుష్కలావర్తమేఘవర్షంబునకును గమునుడివడిపోయితిని. పురుషోత్తమా! నాకుఁ బరిత్రాణంబు గావింపుము. జగత్ప్రభూ! తృషితుండను, క్షుధితుండను, దుఃఖితుండనునై యసన్యశరణ్యుండనై పరితపించుచున్నాను. దేవా! నీయుదరంబున సమస్తప్రపంచమును గాంచి విస్మితుండనై విషణ్ణుండ నైతిని. పురుషోత్తమా! నన్ను రక్షింపుము. ఆశ్రయరహితంబగునీసంసారమునందు నాకుఁ బ్రసన్నుండవగుము.

విబుధశ్రేష్ఠుండవు, విబుధప్రియుండవు, విబుధనాథుండవు, విబుధాలయుండవు, సర్వలోకేశ్వరుండవు, జగ[illegible]వు నగునీవు నాకుఁ బ్రసన్నుండవగుము. సర్వజగత్కర్తవు, భూధరుండవు, సలిలావాసుండవు, మధుసూదనుండవు, కమలాకాంతుండవు, త్రిదశేశ్వరుండవు, కంసకేశిఘ్నుండవు, అరిష్టనాశకుండవు, దైత్యహంతవు, దనుజాంతకుండవు, కృష్ణుండవు నగునీవు ప్రసన్నుండవగుము. మథురావాసా! యదునందనా! ఇంద్రావరజా! వరదా! అవ్యయా! ప్రసన్నుండవగుము. దేవా! పంచభూతంబులును, మనంబును, అహంకారంబును, బుద్ధియు, ప్రకృతియు, సత్త్వాదిగుణంబులును, జగద్వ్యాపి యగుపురుషుండును, పురుషోత్తముండును, సకలేంద్రియంబులును, శబ్దాదివిషయంబులును, దిక్కులును, కాలంబును, ధర్మంబును, వేదంబులును, సదక్షిణంబు లగుయజ్ఞంబులును, ఇంద్రుండును, శివుండును, హరియు, హుతాశనుండును, యముండును, రాక్షసేశ్వరుండును, జలపతి యగు వరుణుండును, వాయువును, ధనేశ్వరుండును, ఈశానుండును, అనంతుండును, గణేశ్వరషణ్ముఖవసురుద్రాదిత్యులును, ఖేచరులగు యక్షగంధర్వాదులును, మరుద్గణంబులును, ఋషిగణంబులును, వాలఖిల్యగణంబులును, అశ్వినీకుమారులును మఱియు జీవసంజ్ఞకంబులగుసకలం

బును నీస్వరూపంబులు. బ్రహ్మాదితృణపర్యంతంబునుగలసమస్తమును నీకంటె భిన్నంబగువస్తు వేదియును లేదు. భూతభవిష్యద్వర్తమానాదిసకలకాలంబులును, కాలికవ్యవహారంబులును నీకంటె నన్యంబులు గావు. కూటస్థుఁడవు, అచలుఁడవు, ధ్రువుండవు నగు నీపరమవస్వరూపమును బ్రహ్మాదిదేవతలుగూడ నెఱుంగఁజాలరు. అల్పబుద్ధినగునాకెట్లు విదితం బగును? దేవా! నీవు శుద్ధస్వభావుఁడవు. నిత్యుండవు. ప్రకృతికతీతుండవు. అవ్యక్తుండవు, శాశ్వతుండవు, అనంతుఁడవు, సర్వవ్యాపివి, ఆకాశమూర్తివి, అజుండవు, అవ్యయుండవు, విభుండవు, నిర్గుణుండవు, నిరంజనుండవు నిన్నుస్తవంబు సేయుటకు సమర్థుండగువాఁ డెవ్వఁడు? అల్పచేతస్కుండ నగునేను గావించినయీస్తవంబునందుగలలోపంబుల నన్నిటిని క్షమింపుము.

—♦ భగవద్దర్శనము. ♦—

మార్కండేయమునీంద్రునిచే నిట్లు సంస్తుతుండై పరమేశ్వరుండగువిష్ణుదేవుండు మేఘగంభీరస్వరంబుతో వత్సా! నీయభీష్టంబు దెలుపుము. నీసకలమనోవాంఛితంబులను సఫలంబు గావించెదను. అని బాలకుండగునా దేవదేవునిమందహాసవదనమునుండి యనుగ్రహపూర్వకముగా వెలువడినయమ్మధురవచనంబుల నాకర్ణించి మార్కండేయమునీంద్రుండు, పరమప్రీతుండై తన్మయచిత్తంబున నిట్లనియెను. దేవా! సర్వోత్తమంబగు నీమాయాశక్తి నెఱుంగఁగోరుచున్నాను. నీప్రసాదంబుచే నాస్మృతిశక్తికి లోపంబు లేకుండునట్లనుగ్రహింపుము. నేను నీశరీరోదరంబున నతివేగపరిభ్రమణంబు గావించితిని. పుండరీకాక్షా! నీవెవ్వండవో యెఱింగింపుము. సకలజగంబును గబళితంబు గావించి యిచ్చట నిట్లుబాలకరూపంబున శయనించియుండుటకుఁ గారణమేమో తెల్పుము.

అనియిట్లు మునిముఖ్యుం డగుమార్కండేయుండు ప్రార్థించుటయు మహావక్త్రయు, మహాద్యుతిమంతుండును నగు దేవదేవుం డాతని నాదరించి వత్సా! దేవతలుగూడ నాతత్త్వమును సంపూర్ణముగా నెఱుంగఁజాలరు. నేను నీయెడలఁ బ్రీతుండ నైతినిగావున సకలజగత్కర్త నగునాతత్త్వమును బోధించెదను వినుము. విప్రర్షీ! పితృభక్తుండవును, శరణాగతుండవు నగు నీయెడలఁ బరితుష్టుండ నైతిని. నీయసాధారణబ్రహ్మచర్యంబు నే నెఱుంగుదును. పూర్వకాలంబున నేను జలంబునకు నారసంజ్ఞను నిర్దేశించితిని. అందుచేతనే నాకు నారాయణ నామంబు గలిగెను. నేనవ్యయుండను, శాశ్వతుండను, సర్వభూతవిధాతను, సృష్టికర్తను. విష్ణుదేవుండును, బ్రహ్మేంద్రయమవైశ్రవణులును, శివసోమప్రజాపతులును, కశ్యపుండును, ధాతయు, విధాతయు నేనే. నాకగ్నిదేవుండు ముఖంబును, భూమి పాదంబులును, చంద్రార్కులు లోచనంబులును, గగనంబు మస్తకంబును, దిక్కులు శ్రోత్రంబులును, సముద్రంబులు స్వేదసంచయంబును, దిఙ్నభంబులు కాయంబును, వాయువు చిత్తంబును నై యుండును. అనేకదక్షిణాన్వితంబు లగుక్రతుసమూహంబులచే నేనర్చింపఁబడుచుందును. వేదవిదు లగువారు నన్నే యారాధించుచుందురు. స్వర్గాపవర్గకాంక్షితు లగుక్షత్రియులును, వైశ్యులు నన్నుఁ బూజించుచుందురు. చతురుదధివలయితం బగునీధరామండలమును శేషమూర్తి నై నేనే ధరించియుందును. పూర్వకాలంబున నేనే వరాహరూపముతో వసుంధర నుద్ధరించితిని. బాడబస్వరూపంబున నేనే జలరాశియందలిజలంబులను బానము చేయుచుందును. మరల జలంబులను గల్పించుచుందును. బ్రాహ్మణులు నా ముఖంబును, క్షత్రియులు భుజంబులును, వైశ్యు లూరువులును, శూద్రులు పాదంబులు నై యున్నారు. ఋగ్యజుస్సామాథర్వవేదంబు

లునాయందే ప్రాదుర్భూతంబులై నాయందే ప్రవేశించుచున్నవి. సమ గుణావలంబనులును, నియతాత్ములును, తత్త్వచింతకులును, కామక్రోధద్వేషవిరహితులును, సంగహీనులును, పాపరహితులును, సాత్త్వికులును, నిరహంకారులును, నియతాధ్యాత్మకోవిదులు నగు బ్రాహ్మణులు సర్వదా తన్మయచిత్తంబులతో నన్నుపాసించుచుందురు. సంవర్తకజ్యోతిని, సంవర్తకానలంబును నేనే.

నభోమండలంబున జ్యోతిర్మయంబు లగునక్షత్రంబులన్నియు నారోమకూపంబు లని యెఱుంగుము. రత్నాకరంబు లగుసముద్రంబులును, దిక్చతుష్టయంబును, వసనశయననిలయాదులును, కామక్రోధహర్షమోహాదులును నాస్వరూపంబులు. మానవులచేఁ గావింపఁబడుసత్యదానతపంబులకును, అహింస మొదలగుసత్కర్మంబులకును నేనే మూలకారణుండను. దేహధారులగు వారందఱును నావిధానంబుననే విహితు లగుచుందురు. నామాయచే వారితత్త్వజ్ఞానము తిరోహితం బగుచుండును. నాయిచ్ఛానుసారంబుగనే వారు మెలంగుచుందురు. వేదజ్ఞానసంపన్నులై వివిధయజ్ఞానుష్ఠానంబులఁ గావించుచుకామక్రోధఘలును, శాంతచిత్తులునగుబ్రహ్మవిదులు నన్నే యనుగమించుచుందురు. లోభాభిభూతులును, కృపణులును, అనార్యులును, అకృతాత్ములును, నగువారు నన్నుఁ జేరఁజాలరు. ధర్మగ్లానియు, అధర్మాభ్యుత్థానంబు నగుకాలములయందు లోకహితంబునకై నేనవతరించుచుందును. దైత్యులు హింసాపరాయణులై, దేవతల కవధ్యులై దారుణపరాక్రమతులై విజృంభించుచున్నకాలములందు నేను పుణ్యాత్ములగృహంబున మానవమూర్తినై యవతరించి సర్వబాధానివారణంబు గావించుచుందును. నేను దేవమానవగంధర్వాదులను, చరాచరవస్తుప్రపంచమును సృజించి మరలమాయచే సంహారంబు చేయుచుందును. కర్మకాలంబున మరల

సృష్టి చేయుచుందును. ధర్మసంస్థాపనంబునకై నేను మానవావతారం బు నెత్తుచుందును.

మునికులతిలకా! మదీయం బగుధర్మమూర్తి సత్యయుగంబున శ్వేతవర్ణంబును, త్రేతాయుగంబున శ్యామవర్ణంబును, ద్వాపరంబున రక్తవర్ణంబును, కలియుగంబునఁ గృష్ణవర్ణంబునై యుండును. కలియు గంబున సధర్మము మూఁడుభాగము లుండును. ప్రళయకాలంబున నేనతిదారుణకాలరూపుండనై యొక్కఁడనే త్రిభువనంబులను సంహ రించుచుందును. త్రిధర్ముండను, విశ్వాత్ముండను, సర్వలోకసుఖావ హుండను, అభిన్నుండను, సర్వగుండను, అనంతుండను, హృషీకే శుండను, ఉరుక్రముండను నగునేను కాలచక్రంబును నడపించుచుం దును. సర్వభూతహితుండనగు బ్రహ్మస్వరూపుఁడను నేనే—నన్నె వ్వరు నెఱుంగఁజాలరు. భక్తులు నిరంతరమును నన్నుఁ బూజించుచుం దురు. ఓమునీంద్రా! నీవు నాయందుఁ బ్రవేశించి యనుభవించినక్లే శం బంతయును నీశుభోదయంబుకొఱకే యైనది. స్థావరజంగమాత్మ కంబగు ప్రపంచమునందు నీవుగాంచినయెల్లవస్తువులందును భూతభావ నుండ నగునాతేజము విరాజిల్లుచునే యున్నది.

ఓవిప్రర్షీ! శంఖచక్రగదాధరుండనగు నారాయణుండను నేనే. యుగ సహస్రపరివర్తనం బగునంతవఱకును విశ్వాత్ముండ నగునేను విశ్వంబు ను మోహితంబుగాఁ జేసి శయనించి యుందును. మునిసత్తమా! బ్రహ్మదేవుండు బోధితుం డగునంతవఱకును శిశుత్వము నెఱుంగని నేను బాలకరూపంబున నిరంతరమును విరాజిల్లుచుందును. అట్టిబ్ర హ్మస్వరూపుఁడ నగునేను నీయెడలఁ బరితుష్టుండనై నీకు వరప్రదానం బు గావించుచుంటిని. ఈయేకార్ణవజలంబున సముద్విగ్నుండ వి...స్థితుండ వైనను నాయనుగ్రహంబుచే నీవు నిర్గతుండవై యఖిలంబును గాం

చఁగలిగితివి. నీవు నాయుదరంబునఁ బ్రవేశించి యందును స్థావరజంగమాత్మకం బగు సమస్తప్రపంచమును దర్శించితివి. కాని యందువలనఁ గూడ నీకు నాతత్త్వము సువిదితంబు గాలేదు. కావుననే నిన్నతిశీఘ్రముగ నాముఖవివరమునుండి బహిర్గతునిం గావించితిని. మదీయం బగు నాత్మతత్త్వము సురాసురాదులకుఁగూడ నజ్ఞేయం బైనను ప్రసన్నుండనై సర్వంబును నీకెఱింగించితిని. బ్రహ్మదేవుండు ప్రబోధితుం డగునంతవఱకును నీవిచ్చటనే సుఖవిహారంబు గావించుచుండుము. బ్రహ్మదేవుండు ప్రబుద్ధుం డైనంతనే యేకాత్ముండ నగునేను సమస్తప్రపంచమును యథారూపమున మరల సృష్టింపఁజేయుదును.

అని భగవానుండగు మాధవుండు మార్కండేయు ననుగ్రహించి వత్సా! నీవెందుకొఱకు నన్ను స్తుతించితివో నీయభీష్టంబు దెల్పుము. నీకు వరప్రదానంబు గావించెదను. ఆయుష్మంతుండ వగునీవు నాభక్తుఁడవు. ఇంకను దీర్ఘాయుష్మంతుఁడ వయ్యెదవు గాక! అని శుభవచనంబులచే నాశ్వాసించుటయు మార్కండేయుం డద్దేవునకు సాష్టాంగప్రణామంబు గావించి మహాత్మా! నేను నీదివ్యమంగళస్వరూపంబును దర్శింపఁగలిగితిని. నీదివ్యదర్శనంబుచే నామాయామోహంబు విగతమైపోయినది. లోకహితార్థమై నీయనుగ్రహంబుచేఁ బుణ్యంబును, నిర్మలంబు నగునీపురుషోత్తమక్షేత్రమునందు శైవభాగవతాదులకు వివాదప్రతిషేధకంబునకై యొకశివాయతనంబును గల్పింపఁదలంచితిని. భవదీయం బగునీయుత్తమక్షేత్రమునందు శంకరమూర్తి కూడఁ బ్రతిష్ఠితుండైనచో హరిహరులకభేదంబనియు, నిరువురు నేకమూర్తులే యనియు లోకులకందఱకును సంపూర్ణవిశ్వాసము గలుగఁగలదు.

అనివిన్నవించుటయు జగన్నాథుండు ప్రీతుండై మునినాథుం గాంచి వత్సా! నాయాజ్ఞానుసారంబుగా భిన్నభావప్రశమనంబుకొఱ

నను, సకలలోకారాధనీయంబుకొఱకును బరమకారణుండగు భువనేశ్వర దేవునిదివ్యలింగమును బ్రతిష్ఠించి సత్వరంబుగ నొకశివాలయంబును నిర్మాణంబు గావింపుము. అందు శివలింగంబును, మదీయంబగుమూర్తినిగూడఁ బ్రతిష్ఠింపుము. హరిహరుల కెట్టిభేదంబును లేదు. నాయేకమూర్తియే ద్విరూపంబైనది. రుద్రుఁడే విష్ణుఁడు; విష్ణుఁడే మహేశ్వరుఁడు. పవనాకాశంబులకుంబోలి వీరికెట్టిభేదంబును లేదు. గరుడధ్వజుఁడే వృషభధ్వజుఁ డనియుఁ, ద్రిపురాంతకుఁడే మురాంతకుఁడనియు మూఢమానవు లెఱుంగరు. నీవు నీనామంబుతో నొకశివాలయంబు నిర్మించి యాదేవదేవున కుత్తరదిగ్భాగంబున మార్కండేయహ్రదంబును గల్పింపుము. ఆదివ్యతీర్థము మానవలోకంబున సుప్రసిద్ధము గాఁగలదు. అది సర్వపాపనివారకం బగును. అని ప్రబోధించి భగవానుండును, సర్వవ్యాపియు నగుజనార్దనుండంతర్హితుం డయ్యెను.

## — శ్రీకృష్ణదర్శనమాహాత్మ్యము. —

అని చెప్పి బ్రహ్మదేవుండు వెండియు నిట్లనియెను. మునివరులారా! తీర్థసేవాతత్పరుండగువాఁడు ముందుగ మార్కండేయహ్రదంబునకుఁ బోయి యందుఁ బ్రవేశించి యుదఙ్ముఖుండై —

"సంసారసాగరే మగ్నం, పాపగ్రస్తమచేతనం
త్రాహి మాం భగనేత్రఘ్న, త్రిపురారే నమోస్తు తే.
నమః శివాయ శాంతాయ, సర్వపాపహరాయ చ
స్నానం కరోమి దేవేశ, మమ నశ్యతు పాతకమ్."

అనుమంత్రమును బఠించుచు స్నానము చేసి విధిపూర్వకంబుగా దేవర్షిపితృతర్పణంబులు గావించి మరల స్నానము చేసి యాచమనపూర్వకంబుగ నటనుండి శివాలయంబునఁ బ్రవేశించి ముమ్మాఱు

ప్రదక్షిణం బాచరించి మూలమంత్రిముతో మార్కండేయేశ్వరునకుఁ బూజాప్రిణామంబులు గావించి—

" త్రిలోచన నమస్తేస్తు, నమస్తే శశిభూషణ
త్రాహి మాం త్వం విరూపాక్ష, మహాదేవ నమోస్తుతే. "

అను మంత్రిమును బఠించుచు నమ్మహాదేవుని బ్రసన్నుం గావించుకొనవలయును. ఇట్లు స్నానసందర్శనార్చనంబులఁ గావించువాఁడు దశాశ్వమేధఫలలాభంబు గాంచి సర్వపాపవిముక్తుండై శివలోకంబునఁ బ్రివేశించి యందు దివ్యంబులగుసకలోపభోగంబుల ననుభవించుచుఁ బ్రళయకాలంబువఱకును సుస్థిరుండై యుండఁగలఁడు.

అనంతరము కల్పతరుసన్నిధికిం బోయి ముమ్మాఱు ప్రిదక్షిణం బాచరించి—

" ఓంనమోవ్యక్తరూపాయ, మహాప్రిళయకారిణే
అమరత్వం సదాకల్పే హారేశ్చాయతనం వట. "

అనుమంత్రిముతోఁ బూజింపవలయును. అట్లు యథావిధిగ నవ్వటంబునకుఁ బూజాప్రణామప్రిదక్షిణంబులఁ గావించువాఁడు జీర్ణనిర్మోకం బగునజగరంబునుం బోలి సర్వపాపవిముక్తుండై విరాజిల్లును. ఆవృక్షచ్ఛాయ నాశ్రియించినవానికి బ్రిహ్మహత్యాపాతకమునుండి నిష్కృతిలాభంబు గలుగును. కృష్ణాంగప్రిభూతంబును, బ్రహ్మతేజోమయంబును, న్యగ్రోధరూపంబు నగువిష్ణుమూర్తి నారాధించుమానవులు రాజసూయాశ్వమేధంబులకంటె నుత్తమఫలలాభంబు నందుదురు. అట్టివారు స్వకులోద్ధారకులై విష్ణులోకప్రాప్తు లగుదురు. మఱియు శ్రీకృష్ణసమీపవర్తి యగువైనతేయునకు భక్తిపూర్వకంబుగఁ బ్రిణమిల్లువారు సర్వపాపవిముక్తు లగుదురు. వటవృక్షంబును, వైనతే

యుని దర్శించిన వెనుకఁ బురుషోత్తముని, బలరాముని, సుభద్రను ద ర్శించువారికిఁ బరమగతిలాభంబు గలుగును.

విష్ణుమందిరంబునఁ బ్రవేశించి ముమ్మాఱు ప్రదక్షిణంబు చేసి భక్తిపూర్వకంబుగా—

"నమస్తే హలధృగ్రామ నమస్తే ముసలాయుధ
నమస్తే రేవతీకాంత, నమస్తే భక్తవత్సల.
నమస్తే బలినాం శ్రేష్ఠ, నమస్తే ధరణీధర
ప్రలంబారే నమస్తేస్తు, త్రాహి మాం కృష్ణపూర్వజ."

అనుమంత్రపాఠముతో నద్దేవునిఁ బ్రసన్నుం గావించుకొని, యనంతుండును, అజేయుండును, సురార్చితుండును, కైలాసశిఖరాకారుండును, చంద్రాధికమనోజ్ఞవదనుండును, నీలవసనధరుండును, ఫణాచ్ఛన్నమస్తకుండును, కుండలాలంకృతుండు నగుహలధరుని భక్తిపూర్వకంబుగ ధ్యానించువాఁ డభిమతఫలలాభంబు నందఁగలఁడు. అట్టి వాఁడు సర్వపాపవిముక్తుఁడై ప్రళయకాలపర్యంతమును విష్ణులోకంబున సకలోపభోగంబుల ననుభవించుచుండును.

ఈవిధముగా హలధరుం డగుబలరాము నర్చించినపిమ్మట విచక్షణుండును, సమాహితచిత్తుండు నై ద్వాదశాక్షరమంత్రంబుతోఁ బురుషోత్తము నర్చించువాఁడు మోక్షప్రాప్తుం డగును. దేవతలకును, యోగులకును, సోమయాజులకునుగూడ లభింపని యుత్తమగతి యాతనికి లభించును. కావున ద్వాదశాక్షరమంత్రముతో భక్తిపూర్వకంబుగా శ్రీకృష్ణదేవునకుఁ బూజాప్రణామంబు లాచరించి—

"జయ కృష్ణ జగన్నాథ, జయ సర్వాఘనాశన,
జయ చాణూరకేశిఘ్న, జయ కంసనిషూదన.

జయ పద్మపలాశాక్ష, జయ చక్రగదాధర,
జయ నీలాంబుదశ్యామ, జయ సర్వసుఖప్రద.
జయ దేవ జగత్పూజ్య, జయ సంసారనాశన,
జయ లోకపతే నాథ, జయ వాంఛాఫలప్రద."

అని సంస్తుతించుచు, దేవేశుండును, వరదుండును, భక్తవత్సలుండును, సర్వపాపహరుండును, సర్వకామప్రదుండును, శ్రీవత్సుండును, ద్విభుజుండును, పద్మాక్షుండును, మహాబాహుండును, పీతాంబరుండును, శుభాననుండును, శంఖచక్రగదాధరుండును, ముకుటాంగదభూషితుండును, సర్వలక్షణసంపన్నుండును, వనమాలియు నగు శ్రీకృష్ణదేవునిఁ బ్రసన్నుం జేసికొని ప్రణామంబు చేసి యంజలిబద్ధుండై దర్శించువాఁడు సహస్రాశ్వమేధ ఫలలాభంబు నందును. సర్వతీర్థస్నానంబును, సర్వద్రవ్యదానంబును గావించినమహాఫల మొక్కసారి శ్రీకృష్ణసందర్శనంబువలన లభింపఁగలదు. బహుసువర్ణదక్షిణలతో సకలయజ్ఞంబుల ననుష్ఠించువారును, సర్వవేదాధ్యయనంబు సేయువారును, సకలదానంబుల నాచరించువారును, సకలవ్రతంబుల నిర్వర్తించువారును, నియమాచరణంబున వివిధకఠోరతపంబులఁ గావించువారును, బ్రహ్మచర్యవ్రతనిష్ఠులగువారును, శాస్త్రనిర్దిష్టాచారు లగుగృహస్థులును, వానప్రస్థధర్మప్రతిపాలకులును, సన్న్యాసులును బొందఁగలుగుసమస్తఫలంబులును శ్రీకృష్ణసందర్శనపరిణామంబులవలన లభింపఁగలవు. భక్తిభావంబున నద్దేవుని దర్శించుమానవులు మోక్షప్రాప్తులగుదురు. శ్రీకృష్ణదర్శనమాత్రంబునఁ గల్పకోటిసంభూతంబులగుసమస్తపాపంబులును నశించును.

అనంతరము విధివిహితంబుగా సుభద్రాదేవిని బూజించి ప్రణిపాతపురస్సరంబుగాఁ గృతాంజలియై,

అజితుండును, అప్రమేయుండును, భుక్తిముక్తిప్రదుండును, నగునా దేవదేవుని సర్వగుణంబులను వర్ణించి చెప్పుట కెవ్వరును సమర్థులు గాఁజాలరు. అయినను నరసింహదేవుని మాహాత్మ్యమును సంక్షేపముగ నెఱింగించెదను. దివ్యంబులును, మానుషంబులు నగుసిద్ధులన్నియు నా దేవుని ప్రసాదమువలననె సంఘటిల్లుచుండును. స్వర్గమర్త్యపాతాళంబులందును, దిక్కులను, జలంబునను, కులపర్వతంబులయందును నవ్యాహతగతి యా దేవుని యనుగ్రహంబుచేతనే సిద్ధించును. ఈచరాచరప్రపంచమున భక్తవత్సలుండగు నరసింహదేవుని కెట్టి యసాధ్యంబును లేదు. ఆ దేవదేవుండు మానవులకుఁ బ్రసన్నుండగు విధానము నెఱింగించెదను. ఈవిషయంబు దేవతలకుఁగూడ నవ్యక్తంబైనది.

మునివరులారా! సాధకుం డగువాఁడు కౌపీనధారియై ధ్యాననిష్ఠుండును, జితేంద్రియుండును, నై యరణ్యంబునఁగాని, విజనస్థలంబునఁగాని, పర్వతప్రదేశంబునఁగాని, సింధుసంగమస్థానంబునఁగాని, నదీతీరంబునఁగాని శాకయావకమూలఫలపిణ్యాకాదు లాహారంబుగా నివసించి పవిత్రస్థానంబున నరసింహమూర్తిని బ్రతిష్ఠించి యథావిధిగఁ బూజించి శుక్లపక్షంబున ద్వాదశీతిథియం దుపవాసంబు చేయుచు నియతచిత్తంబుతో నృసింహమంత్రంబును లక్షజపంబు గావించినచో భగవదనుగ్రహంబుచే నట్టివానియుపపాతకంబులును, మహాపాపంబులునుగూడ నిశ్చయముగా నశింపఁగలవు.

అమ్మహాదేవునకుఁ బ్రదక్షిణంబు చేసి సుగంధదీపధూపాదులచేఁ బూజించి ప్రణామంబు చేసి యాదేవునిశిరోభాగంబునఁ గర్పూరంబును, జందనకలితంబగు జాతీపుష్పంబును సమర్పించి సాధకుండు సిద్ధుండు గాఁగలఁడు. నరసింహదేవుండు సర్వక్రియాసాధనదక్షుఁడును,

యుగ్మమును సేవింపఁజేయుటచే సాధకుఁడు దివ్యశరీరధారియు, మహా బలసంపన్నుండునై ప్రళయకాలపర్యంతమును రమణీమణులతోఁ గలసి విహరించుచు నంతంబున వాసుదేవునియందు విలీనుండగును.

సాధకుఁ డందు నివసించుట కిష్టము లేకున్నచో నాతఁ డట నుండి బహిర్గతుండై పట్ట, శూల, ఖడ్గ, రోచనా, మణి, రస, రసాయన, పాదుకాంజన, కృష్ణాజిన, కమండలధారియై సంజీవనీయష్టిం దాల్చి యథేచ్ఛావిహారియై యుండవచ్చును. ఆతనికి సర్వసిద్ధులును గతంబు లగును. సకలశాస్త్రంబులును వచోవిధేయంబు లగును. అగ్నిస్ఫులింగవేష్టితం బగుత్రిశూలముం బోలినన్నృసింహమంత్రము నొక్కసారి హృదయంబున న్యస్తంబు గావించినచో శతకోటిజన్మార్జితంబు లగుసకలపాపంబులును నశించును. ఆమంత్రంబును విషంబునఁ బ్రయోగించినవిషంబును, దేహంబున న్యస్తంబు చేసినచోఁ గుష్ఠరోగంబును నివృత్తం బగును. స్వశరీరంబున నమ్మంత్రమును న్యస్తంబు గావించినచో భ్రూణహత్యాదిమహాపాతకంబు లాచరించినవాఁడైనను విశుద్ధుం డగును. అమ్మంత్రంబును హృదయాంతరంబున నుజ్జ్వలాకారంబుగఁ జింతించినచో మహాగ్రహబాధలు వదలిపోవును.

ఈమంత్రంబుచే బాలకులకంఠములందు రక్ష గట్టినచో గండపిండకాదిసకలశిశురోగంబులును శమించును. త్రిసంధ్యలయందును ఘృతక్షీరంబుల నిమ్మంత్రరాజంబుచే హోమంబు గావించినచో సర్వరోగంబులును నశించును. ఈమంత్రంబున కసాధ్యం బగునది యీత్రిభువనంబులయం దేదియును లేదు. ఇది సర్వాభీష్టదాయకంబైనది. ఎవ్వరేదికోరి జపించిన వారికాకోరికలు సిద్ధించును. సాధకుం డగువాఁడు, వల్మీకమునందుఁగాని, శ్మశానమునందుఁగాని, చతుష్పథమునందుఁగాని సప్తముష్టిపరిమితం బగుమృత్తికను దీసి దానిని జంద

శ్వేతగంగయందు స్నానముచేసి, శ్వేత, మత్స్యమాధవులను దర్శించు వారు శ్వేతద్వీపగతు లగుదురు. శ్వేతమాధవవృత్తాంతమును సంక్షేపముగఁ దెలిపెద నాకర్ణింపుఁడు.

పూర్వము కృతయుగంబున మహాబలసంపన్నుం డగు శ్వేతుం డనురాజేంద్రుండు భూమండలమును బరిపాలించుచుండెను. అతఁడు బుద్ధిమంతుండును, ధర్మజ్ఞుండును, శూరుండును, సత్యప్రతిజ్ఞుండును, దృఢవ్రతుండు నై యుండెను. అతనిపరిపాలనకాలంబున మానవులకు దశసహస్రవర్షంబులు పరమాయువై యుండెను. బాల్యకాలంబున మృత్యుముఖపతితు లగువారెవ్వరును లేకుండిరి. ఇట్లాతనిపరిపాలనము సకలజీవానందదాయకమై విలసిల్లుచుండెను. ఈవిధముగాఁ గొంతకాలంబు గడచుటయు నొకప్పుడు పరమధార్మికుండును, బ్రహ్మర్షియు నగుకపాలగౌతముని కుమారుండు దంతోద్గముండై నను గానివయసునందే మృత్యుముఖపతితుం డయ్యెను.

అప్పుడమ్మునివరుండు తనపుత్రుని నరనాథుని చెంతకుం గొని పోయి చూపించెను. మహీపాలుం డగు శ్వేతుండును ధైర్యవిహీనుండై సుప్తునింబోలె పడియున్న ఋషినందనుం గాంచి «యీయమసదనగతుం డగు బాలకుని సప్తరాత్రమధ్యంబున మరలఁ జీవితునిగాఁగొని రాఁజాలనైతినేని నేనప్పుడే నిశ్చయముగాఁ బ్రజ్వలితచితారోహణంబు సేయంగలవాఁడ" నని ప్రతిజ్ఞపట్టి పదునొకండువందలనీలపద్మములతో మంత్రపాఠపూర్వకంబుగ మహాదేవు నర్చింప నారంభించెను. జగదీశ్వరుం డగుమహేశ్వరుం డప్పుడమ్మహారాజునిశ్చలభక్తిభావంబునకుఁ బ్రహృష్టహృదయుండై యుమాసహితంబుగ నాతనిచెంతకేతెంచి «వత్సా! నీయారాధనంబునకు సంతుష్టుండ నైతిని" అని వచించెను.

ఆశ్వాసనపూర్వకంబు లగునమ్మధురవచనంబుల నాకర్ణించినంత

నే మహీపాలుం డాకస్మికముగఁ గన్నులఁ దెఱచి యెట్టయెదుట విభూతిరుద్రాక్షమాలికాలంకృతుండును, విరూపాక్షుండును, శారదాభ్రసంకాశాంగుండును, శార్దూలచర్మాంబరుండును, బాలశశాంకభూషణుండును, భగవానుండునగు మహేశ్వరుండు సాక్షాత్కరించి యుండుటం గాంచి భయభక్తివినయసంభ్రమంబులతో నద్దేవదేవునకుఁ బ్రణామం బాచరించి ప్రభూ! నీవు నాయెడల ననుగ్రహించి ప్రసన్నుండవైతివేని, నీకు నాయందుఁ బరిపూర్ణంబగుకరుణ గలదేని నాప్రార్థనము నంగీకరించి కాలగ్రస్తుండగు నీవిప్రకుమారుని బునరుజ్జీవితునిగాఁ జేసి యనుగ్రహింపుము. మహాత్మా! ఆకస్మికముగా మరణించిన యీబాలకుని బ్రతికించి [illegible]ంబుగా నాయుష్మంతునిం జేయుము.

అని యనేకవిధంబుల ప్రార్థించుటయు మహేశ్వరుండు హర్షావిష్టుండై యంతనే సర్వభూతభయంకరులగుయమకింకరులు మృత్యుముఖపతితుం డగు నవ్విప్రబాలకుని బునర్జీవితుం గావించి యమ్మహారాజున కర్పించి చనిరి. ఆసమయంబున మహేశ్వరానుగ్రహంబుచే సకలజగంబును మంగళమయం బయ్యెను. బ్రాహ్మణకుమారుండు సంజీవితుం డయ్యెను. అనంతర మాదేవదేవుం డుమాదేవీసహితుండై యంతర్హితుం డయ్యెను. శ్వేతుండను భూపాలచంద్రుం డీరీతిగా మునికుమారుని సంజీవితునిం గావించెను.

మహారాజగు శ్వేతుం డిట్లు సమస్తవైదిక లౌకికధర్మంబులను గ్రమంబుగఁ బరిపాలించుచు సహస్రవర్షంబులు రాజ్యంబు గావించి కేశవారాధనతత్పరుండై పురుషోత్తమక్షేత్రంబున కేతెంచి యందు సుఖంబును, రమణీయంబు నగుప్రదేశంబున శ్రీకృష్ణదేవునిసమీపంబున శ్వేతగిరియందు, శతధనుర్విస్తృతం బగుప్రాసాదమును నిర్మింపఁ జేసి

త్రేసమధ్యంబునఁ జంద్రవస్త్రితిమఱి బగుసహాధనమూర్తి యథావిధిగఁ బ్ర తిష్ఠించెను. ఆసమయంబున వేదపారగులగుభూసురులకును, దీనులకు ను, దపస్వులకును బహుధనదానంబులం గావించెను. అనంతర మ మ్మహీనాథుండు శ్వేతమాధవసన్నిధానంబునఁ బ్రణిపాతపూర్వకంబు గ ద్వాదశాక్షరమంత్రమును జపించుచు, సమాధియోగంబున మౌని యై, మాసపర్యంతము ననాహారియై విష్ణుపదధ్యాన నిమగ్నుండై యుండెను.

ఏమ్మెటు నాతఁడు నిర్మలభక్తిభావవిలసితుండై దేవదేవుండగు మాధవునుద్దేశించి యిట్లు స్తుతింప నారంభించెను. వాసుదేవా! సంకర్ష ణా! ప్రద్యుమ్నా! అనిరుద్ధా! నారాయణా! నీకు నమస్కారము. బహురూపుండును, విశ్వరూపుండును, వేధయు, నిర్గుణుండును, అప్ర తర్క్యుండును, శుచియు, శుక్లకర్ముండును నగుదేవునకు వందనము లు. పద్మనాభుండును, పద్మగర్భోద్భవుండును, పద్మవర్ణుండును, పద్మ హస్తుండును, పుష్కరాక్షుండును, సహస్రాక్షుండును, సహస్రపాదుం డును, సహస్రభుజుండును, వరాహుండును, వరదుండును, సుమేధయు, వరిష్ఠుండును, వరేణ్యుండును, శరణ్యుండును, అచ్యుతుండును, బాల రూపుండును, బాలపద్మప్రభుండును, బాలార్కసోమనేత్రుండును, ధీ మంతుండును, కేశవుండును, నారాయణుండును, మాధవుండును, గో విందుండు నగునీకుఁ బ్రణామసహస్రంబులు. ఓదేవా! నీవు విష్ణుం డవు. వసురేతుండవు. మధుసూదనుండవు, శుద్ధతేజుండవు. అంశుమూ ర్తివి. అనంతుఁడవు. సూక్ష్మస్వరూపుఁడవు. శ్రీవత్సధారివి. త్రివిక్ర ముండవు. దివ్యపీతాంబరధరుండవు. సృష్టికర్తవు. గోప్తవు. ధాతవు. గుణభృతుండవు. నిర్గుణుండవు. ప్రభూ! నాయెడలఁ బ్రసన్నుండవగు ము. వామనరూపుఁడవు, వామనకర్ముఁడవు, వామననేత్రుఁడవు, వా

మనవాహివి, రమణీయుండవు, పూజ్యుండవు, అవ్యక్తరూపుఁడవు, భయహరుండవు నగు నీవు నన్నుఁ బరిత్రాణంబు సేయుము. సంసారసాగరపోతంబవు, ప్రశాంతస్వరూపుఁడవు, శివుఁడవు, సౌమ్యుఁడవు, రుద్రుండవు, ఉత్తారకుండవు, భవభంగకర్తవు, భవభోగప్రదుండవు, భవసంఘాతస్వరూపుఁడవు, భవసృష్టికర్తవు, దివ్యరూపుఁడవు, సోమాగ్నిశ్వసితుండవు, సోమసూర్యాంశుకేశుండవు, గోబ్రాహ్మణహితుండవు, ఋక్స్వరూపుండవు, పదక్రమమూర్తివి, ఋక్ప్రణీతుండవు, ఋక్సాధనుండవు, యజుర్ధారణకర్తవు, యజుర్మూర్తివి, యజుర్యాజ్యుండవు, జుష్టుండవు, యజుర్నాథుండవు, శ్రీపతివి, శ్రీధరుండవు, శ్రీకాంతుండవు, దాంతుండవు, యోగిజనచింత్యుండవు, యోగివి, సామస్వరూపుఁడవు, సామధ్వనివరుండవు, సామసౌమ్యుండవు, సామయోగవిదుండవు, సామగానవిలసితుండవు, సామధారివి, సామయజ్ఞవిదుండవు, సామకరుండవు, అథర్వశిరుండవు, అథర్వపాదుండవు, అథర్వాక్షరుండవు, వజ్రశీర్షుండవు, మధుకైటభనిషూదనుండవు, మహోదధిజలశయనుండవు, వేదాహరణకారివి, హృషీకేశుండవు నగు నీకు మాటిమాటికిని నమస్కరించుచున్నాను. ఓనారాయణా! నీవు వాసుదేవుఁడవు. లోకహితుండవు. మోహహరుండవు, భవభంగకరుఁడవు, గతిప్రదుఁడవు. త్రైలోక్యతేజఃకర్త వగు నీవు నన్ను రక్షింపుము. ఓయోగీశ్వరా! శుద్ధుండును, శాముండును, తారకుండును, సుఖరూపుండును, సుఖనేత్రుండును, సుకృతధరుండును, వంద్యుండును, వామదేవుండును, దేహకర్తయు, భేదరహితుండును నగు నీకు నమస్కారము. నిన్ను దేవతలు సన్నుతించుచుందురు. నీవు దేవపాలివి. వాసనివాసుండును, వాసవ్యవహారుండవు, వసుకర్తయు, వసువాసప్రదుండును, యజ్ఞస్వరూపుఁడును, యజ్ఞేశ్వరుండును, యతియు, యోగేశ్వరుండును, యజ్ఞధారియు, సంకర్ష

వి...ంబున నీలజీమూతసంకాశుండును, పద్మపత్రాయతాక్షుండును, సువర్ణవర్ణధరుండును, క్షీరసాగరసన్నిభుండును, పాంచజన్యధరుండును, మహాద్యుతిమంతుండును, గరుడధ్వజుండును, శ్రీమంతుండును, శార్ఙ్గగదాసిధరుండును, నై సాక్షాత్కరించి మహారాజా ! నీయుత్తమభక్తిభావంబునకు మెచ్చి నీయెడలఁ బ్రసన్నుండ నైతిని. నీయభీష్టవరప్రార్థనంబు గావింపుము. అని యనుగ్రహించుటయు శ్వేతభూనాథుండు దేవదేవుని యమృతోపమానంబులగు నాదరవచనంబుల నాకర్ణించి యానందపులకితసర్వాంగుండై సాష్టాంగప్రణామంబు గావించి తద్గతంబగు నిశ్చలహృదయంబుతో స్వామీ ! నన్ను నీభక్తగణంబులలో నొక్కనిగాఁ బరిగణించియనుగ్రహించితివేని, మదభీష్టప్రధానంబు గావింప నిచ్ఛగించితివేని, బ్రహ్మభవనంబున కూర్ధ్వంబును, అవ్యయంబును, విరజంబును, విశుద్ధంబును, సంసారసంగవివర్జితంబును, ఉత్తమంబు నగు వైష్ణవపదంబును నాకుఁ బ్రసాదింపుమని ప్రార్థించెను.

అప్పుడు భక్తవత్సలుండగు జగన్నాథుండు సంప్రీతుండై మహీపాలశేఖరా ! విబుధమునిగణంబులకును, సిద్ధయోగిజనంబులకునుగూడ నగమ్యంబును, అనామయంబును, పరమంబును, మనోరమంబును న గుమత్పదంబు నీకనాయాసంబుగ లభింపఁగలదు. నీవింకను గొంతకాలము రాజ్యసుఖోపభోగంబుల ననుభవించి యనంతరము సర్వలోకంబుల నతిక్రమించి మదీయంబగుదివ్యలోకమును జేరఁగలవు. త్రిలోకంబులయందును నీకీర్తి విస్తృతంబు గాఁగలదు. నీయెడల నాదరంబునం జేసి నేనీప్రదేశంబున నిత్యసన్నిహితుండనై యుందును. దేవదానవగణంబు లందఱును నిరంతరమును శ్వేతగంగానామమును గీర్తించుచుండఁగల్గరు. రాజేంద్రా ! ఈశ్వేతగంగయందలి కుశాగ్రమాత్రంబగుజలకణంబునైనను స్పృశించుమానవులు నాభక్తశ్రేష్ఠులై స్వర్గలో

యహ్రిదంబునందు భక్తిభావనతో నవగాహనంబు సేయుట యవ శ్యకర్తవ్యము. విశేషించి చతుర్దశీతిథియం బాహ్రిదంబున స్నానము సేయువారి సమస్తపాపంబులును నశింపఁగలవు. విశేషించి చతుర్దశీతిథి యం దీహ్రిదంబున నవగాహనంబు సేయుట సర్వశ్రేష్ఠంబు. సముద్ర స్నానము సర్వకాలములయందును, బ్రశస్తమనదియే కాని పూర్ణిమాతి యందు సముద్రిస్నానంబు చేసినచో నశ్వమేధఫలలాభం బగును. మార్కండేయహ్రిదంబును, అక్షయవటంబును, కృష్ణబలరాములును, మహోదధియు, ఇంద్రద్యుమ్నంబును బంచతీర్థములుగాఁ బ్రికీర్తితము లైనవి. జ్యేష్ఠమాసంబున, జ్యేష్ఠానక్షత్రియుక్తం బగుపూర్ణిమకుఁ బు రుషోత్తమక్షేత్రయాత్రి గావింపవలయును. అప్పుడు మనోవాక్కాయ శుద్ధుండును, ఏకాగ్రిచిత్తుండును, సర్వద్వంద్వవినిర్ముక్తుండును, విమత్స రుండును, వీతరాగుండునై కల్పవృక్షసమీపమునకుం బోయి స్నా నంబుచేసి, వటరూపి యగుజనార్దనునకు ముమ్మారు బ్రదక్షిణము గావించినచో సప్తజన్మార్జితమహాపాపంబులు నశించుటయే కాక మ హాపుణ్యగతిలాభంబు కరతలామలకం బగును.

అమ్మహీరుహంబు చతుర్యుగంబులందును గ్రిమముగా వటం బును, వటేశ్వరంబును, కృష్ణంబును, పురాణపురుషంబు ననునామం బులచే విరాజిల్లుచుండును. మఱియు దానిప్రమాణము యుగంబుల ననుసరించి క్రమముగా నేకయోజనంబును, పాదోనయోజనంబును, అర్ధ యోజనంబును, పాదయోజనంబు నై యుండును. యథావిధిగ మం త్రిపాఠంబు సేయుచు నాకల్పవటంబునకుఁ బ్రణామంబు చేసి దక్షిణా భిముఖంబుగాఁ ద్రిశతధనుష్పరిమితదూరంబు పోయినచో నటనున్న భ గవానుం డగువిష్ణుదేవుని స్వర్గద్వారమును, సాగరజలసమాకృష్టంబగు కాష్ఠంబును దృగ్గోచరం బగును. అచ్చట విష్ణుపూజాపరిదక్షిణంబు

లు గావించినచో సర్వపాపవినిర్ముక్తుండై విముక్తుం డగును.

అనంతరము ముగ్రసేనుని సంపర్కించి యాస్వర్గద్వారపథంబున సముద్రమునకుం బోయి యాచమనపూర్వకంబుగా శుచియై, పరమపురుషుం డగు శ్రీమన్నారాయణుని ధ్యానించి తదీయంబగు అష్టాక్షరమంత్రముచే నంగన్యాసకరన్యాసంబులు గావింపవలయును. మహర్షులు " ఓంనమోనారాయణాయ " అనునీయష్టాక్షరమంత్రమే మంత్రరాజం బనియు, నితరమంత్రంబు లన్నియు మనోభ్రాంతికరంబు లనియుఁ జెప్పుదురు. ఈదివ్యమంత్రమే సర్వార్థసాధకమైనది. ఉదకంబు నరునిసంతతి యగుటచే దానికి నారంబను నాఖ్య గలిగెను. ఆయుదకమే యయనముగా గలవాఁ డగుటచే నరునకు నారాయణనామంబు గలిగెను. వేదంబులును, ద్విజులును, యజ్ఞంబులును, క్రియాసమూహంబులును, పంచభూతంబులును, మనంబునుగూడ నారాయణపరాయణంబు లైనవి. అహంకారమును, బుద్ధియు, నారాయణాత్మకము లైనవి. భూతభవిష్యద్వర్తమానంబులును, జీవసంజ్ఞకంబు లగుస్థూలసూక్ష్మాదిసకలవస్తువులునుగూడ నారాయణాత్మకములే. జలస్థలపాతాళంబులయందును, స్వర్గమునందును, గగనమునందును, దిక్కులయందును ఎల్లయెడలను వ్యాపించి నారాయణుండు విరాజిల్లుచున్నాఁడు. వేయిమాట లేల ? బ్రహ్మాదితృణపర్యంతమును గలయీసమస్తప్రపంచమును నారాయణాత్మకమైనది. ఈజగంబున నారాయణునికంటె శ్రేష్ఠుండు వేఱొకఁడును లేడు. దృశ్యాదృశ్యంబును, చరాచరంబు నగునీసమస్తమునందును నాతండే వ్యాపించి యున్నాఁడు. జలంబును, జలపతియును నారాయణాత్మకంబులు. కావునఁ బాపహరుం డగునారాయణుని జలమధ్యంబున నియతుండై స్మరింపవలయును.

విశేషించి విశుద్ధుం డగుమానవుండు స్నానకాలంబున నారాయణునిఁ బూజించి ధ్యానపూర్వకంబుగ నంగన్యాసకరన్యాసంబులఁ గావింపవలయును. అంగుష్ఠహస్తద్వయంబుల నోంకారమును, దక్షిణతర్జన్యాద్యంగుళిదళంబులయం దితరవర్ణంబులను విన్యసింపవలయును. వామపాదంబున "ఓం" కారమును, దక్షిణపాదమున "న" కారమును, వామకటియందు "మో" కారంబును, దక్షిణకటియందు "నా" కారంబును, నాభిదేశంబున "రా" కారమును, వామబాహువున "య" కారమును, దక్షిణబాహువున "ణా" కారమును మస్తకంబున "య" కారమును విన్యాసంబు చేసి, యూర్ధ్వాధోభాగంబులను, హృదయంబునను, పార్శ్వంబులను, పృష్ఠంబునను, అగ్రభాగమునను నారాయణుని ధ్యానించుచు నభిజ్ఞుం డగువాఁడు "గోవిందుండు నాపూర్వదిక్కునను, మధుసూదనుండు దక్షిణంబునను, శ్రీధరుండు పశ్చిమంబునను, కేశవుం డుత్తరంబునను, విష్ణుదేవుం డగ్నికోణంబునను, మాధవుండు నైఋతకోణంబునను, హృషీకేశుండు వాయవ్యకోణమునను, వామనుం డీశానకోణమునను, వరాహుండు భూతలంబునను, త్రివిక్రముం డూర్ధ్వంబునను నిల్చి నన్ను రక్షించుఁగాక" అను కవచమును బఠించుచు నేనే శంఖచక్రగదాధరుం డగు నారాయణదేవుండ నని భావించుకొని ధ్యానించుచు:—

"త్వమగ్ని ద్విపదాం నాథ, రేతోధాః కామదీపనః,
ప్రధానః సర్వభూతానాం జీవానాం ప్రభు రవ్యయః.
అమృతస్యారణి త్వం హి, దేవయోని రపాంపతే,
వృజినం హర మే సర్వం, తీర్థరాజ నమోస్తు తే."

అనుమంత్రము నుచ్చరించుచు విధ్యుక్తముగ స్నాన మాచరింపవలయును. అన్యప్రకారంబున సాగరస్నానంబు సేయుట ప్రశస్తంబుగాదు.

నైదికమంత్రంబులచే నభిషేకంబును, మార్జనంబును గావించి యఘమర్షణమంత్రమును జపింపవలయును. అఘమర్షణసూక్త మశ్వమేధయాగమువలెనే యఖిలపాపహారకమైనది. అనంతరము తీరమునకు జేరి విశుద్ధవసనధారియై ప్రాణాయామాచమనసంధ్యోపాసనంబునం దీర్చి భాస్కరారాధనంబు గావించి భాస్కరునుద్దేశించియూర్ధ్వంబుగాఁ బుష్పాంజలి నిక్షేపించి యూర్ధ్వబాహుండై యాదిత్యప్రీతికొఱకు కష్టోత్తరగాయత్రీమంత్రజపంబును, సౌరమంత్రజపంబును, సమాహితచిత్తంబుతో గావించి ప్రదక్షిణనమస్కారంబు లాచరించి ప్రాఙ్ముఖుండై యుపవసించి స్వాధ్యాయపఠనంబును, దేవమానవపితృతర్పణంబులను, నామగోత్రోచ్చారపూర్వకంబుగాఁ దిలమిశ్రితంబులగునుదకములచే యథావిధిగఁ బితృతర్పణంబులను గావింపవలయును. దేవతర్పణానంతరమునసే పితృతర్పణంబున కధికారి యగును.

శ్రాద్ధహోమాదికంబులకుక్రియ లన్నియు నేకహస్తంబుచేతనే నిర్వహింపవచ్చును గాని సర్వకాలంబులయందును దర్పణముమాత్ర ముభయహస్తములతోడను గావింపవలయును. నామగోత్రోచ్చారణంబు చేసి వామదక్షిణకరంబులతో “తృప్యతాం” అను మంత్రమున జలసేచనంబు గావింపవలయును. అజ్ఞానియై తనశరీరమునం దెచ్చటనైన నంటియున్నతిలలచేఁ దర్పణంబు చేయువానికిపితృదేవతలు త్వఙ్మాంసరుధిరాస్థిమూలంబున తర్పితులైనట్లుగా ననంతుష్టు లగుదురు. కావున స్వీయాంగస్థితంబు లగుతిలలతో నెన్నండును దర్పణంబు గావింపంజనదు. అందువలనఁ గర్తకుఁగూడ మహాపాపంబు సంభవించును. భూతలంబుననుండి జలంబులయందుగాని, జలంబులయందుండి భూతలంబునఁ గాని పితృతర్పణంబు గావించుట నిషిద్ధము. అందువలనఁ బితృదేవతలకుఁ దృప్తి గలుగఁజాలదు. జలంబులయందు గాని,

పాత్రింబులయందు గాని తర్పణంబు సేయంజనదు. క్రుద్ధుండై కొని, యేకహస్తంబుతోఁ గాని చేయఁగూడదు. శ్రద్ధాయుక్తుం డగువాఁడు తీరంబున నుపవసించి భూతలంబుననే తర్పణంబు విడువవలయును.

ద్విజవరులారా! నేను పితృగణంబుల కీభూమండలము నక్షయ స్థానముగా దానము చేసి యున్నాను. కావునఁ బితృప్రీతికొఱకు భూతలంబుననే తర్పణంబు సేయవలయును. భూతలమందే జనించి యందే నివసించి, యందే లయంబు గాంచుచుందురు గావున భూమియందే జలదానంబు చేయవలయును. తర్పణకాలంబున సాగ్రంబు లగు కుశలను బఱచి మంత్రంబులతో నావాహనపూర్వకంబుగా దేవపితృ తర్పణంబుల గావింపవలయును. ప్రాచీనాగ్రంబులగుకుశలయందు దేవతలకును, దక్షిణాగ్రంబులగుకుశలయందుఁ బితృదేవతలకును దర్పణంబులు విడువవలయును.

## పూజావిధి.

అని చెప్పి బ్రహ్మదేవుండు వెండియు నిట్లనియెను. ఓవిప్రవరులారా! ఇట్లు దేవర్షిపితృతర్పణాదుల నిర్వర్తించి యాచమనంబుచేసి వాఙ్నియతుండై మహోదధితీరంబున హస్తమాత్రంబును, జతుష్కోణంబును, జతుర్ద్వారమయంబును సుశోభనంబు నగునొకమండలమును జిత్రించి యందుఁ గర్ణికాయుతంబుగ నష్టదళపద్మంబును లిఖించి యష్టాక్షరమంత్రంబుచే విభుండగునారాయణు నందుఁ బూజింపవలయును. ఇఁకఁ గాయశుద్ధివిధానంబు దెలిపెదను. ఉపాసకుండగువాఁడు హృదయంబునఁ జక్రరేఖాన్వితంబగునోంకారమును ధ్యానించుచు, ఉజ్జ్వలంబును, త్రిశిఖాన్వితంబును, పాపహారంబును, చంద్రమండలమధ్యస్థితంబును నగురాకారమును మస్తకంబున, శుక్లవర్ణంబును, సు

గా నర్చింపవలయును. మఱియుఁ బూర్వదళంబున వాసుదేవుని, దక్షిణదళంబున సంకర్షణుని, పశ్చిమదళంబునఁ బ్రద్యుమ్నుని, ఉత్తరదళంబున ననిరుద్ధుని, అగ్నికోణంబున వరాహుని, నైఋతికోణంబున నరసింహుని, వాయవ్యకోణంబున మాధవుని, ఈశానకోణంబునఁ ద్రివిక్రముని విన్యాసంబుచేసి వాసుదేవసమ్ముఖంబున గరుడుని, వామపార్శ్వంబునఁ జక్రమును, దక్షిణభాగమునఁ జక్రమును, గదను అట్లే వామభాగంబునశార్ఙ్గధనువును, దక్షిణభాగంబునఁ దూణీరద్వయమును, వామంబున ఖడ్గమును, దక్షిణమున శ్రీదేవిని, ఉత్తరభాగంబునఁ బుష్టిని విన్యసింపవలయును. మఱియు సమ్ముఖంబున వనమాలికను, శ్రీవత్సమును, కౌస్తుభమును, జతుర్దిశలను, జతుష్కోణంబులను దేవదేవునిదివ్యాస్త్రంబులను విన్యాసంబు చేయవలయును. అనంతర మూర్ధ్వాధోదిశలయం దష్టదిక్పాలకులను, అనంతుని విన్యాసంబు చేసి పూజింపవలయును.

ఈరీతిగా మండలంబునందు దేవదేవుం డగుజనార్దనుని బూజించువాఁడు నిశ్చయముగా నభిమతార్థసిద్ధుం డగును. ఇట్లు విధివిధానంబునఁ బూజింపఁబడుచున్నజనార్దనదేవుని దర్శించువాఁడు గూడ నవ్యయుం డగువిష్ణుదేవుని యందు విలీనుఁడు గాఁగలఁడు. ఇట్లొక్కసారి కేశవు నర్చించువాఁడు జన్మజరామృత్యువిజయుండై విష్ణుపదోపసీతుం డగును. అశ్రద్ధ సేయక నిరంతరమును నారాయణస్మరణంబు గావించువాఁడు శ్వేతద్వీపనివాసుం డగును. ప్రణవాదిసమోంతంబును, సర్వతత్త్వమయంబు నగువాసుదేవనామమే యూపనిదివ్యమంత్రంబుగా నిర్దిష్టం బయ్యెను. ఆమంత్రముచేతనే యథాక్రమంబుగ గంధపుష్పాదుల నర్పింపవలయును. అనంతరము యథావిహితక్రమంబున ముద్రాప్రదర్శనంబు గావించి మంత్రజ్ఞుం డగువాఁ డష్టకంబుగా

సౌభాగ్యశాలియు, సత్యవాదియు, జితేంద్రియుండును, వేదశాస్త్రవిదుండును, యోగశీలుండు నగు వైష్ణవబ్రాహ్మణుండై జనించి యంతంబున వైష్ణవయోగంబుచే మోక్షప్రాప్తుం డగును.

గ్రహణములు, సంక్రాంతులు, అయనపుణ్యకాలములు, వత్సరాదులు మొదలగు పర్వదినంబులయందును, ఆషాఢకార్తికమాఘమాసంబులయందలిశుభదినంబులను బురుషోత్తమక్షేత్రంబునందు దానంబులు గావించినచో సర్వతీర్థంబులం గావించినవానికంటె సహస్రగుణఫలప్రాప్తియగును. అచ్చటఁ బితృదేవతలకుఁ బిండప్రదానంబు చేసినచోఁ బితృదేవత లక్షయతృప్తిం గాంతురు. ఈమాహాత్మ్యప్రస్తావము పురుషార్థప్రదంబును, ఆయుఃకీర్తికరంబును, భుక్తిముక్తిప్రదంబును, ధన్యంబును, బుణ్యంబును, సర్వకామప్రదంబును, సర్వపాపహరంబును, దుస్స్వప్ననాశకంబు నై యది. ఈపుణ్యవృత్తాంతమును నాస్తికుల కెన్నఁడు నెఱింగింపఁదగదు. ఈపవిత్రక్షేత్రమాహాత్మ్యము లోకంబునఁ బ్రచారితంబు గాసంతతవటుకే సకలతీర్థంబులును సన్మానితంబు లగుచుండును. పుష్కరాదిసర్వతీర్థంబులును దమశమకనుమాపంబు లగుఫలంబులఁ బ్రసాదించుచుండును గాని యీపురుషోత్తమక్షేత్రము సకలతీర్థఫలంబులను బ్రసాదింపఁగలదు.

భూతలమునందలి సకలనదీజలంబులును సాగరంబునఁ బ్రవేశించుటచే సరిత్పతి యగుసముద్రుఁడు సర్వతీర్థశ్రేష్ఠుం డగుచున్నాఁడు. కావున సర్వకామప్రదంబగుసాగరమే తీర్థరాజము. భాస్కరాభ్యుదయంబునఁ దమఃపటలముంబోలె సముద్రస్నానంబునఁ బాపసమూహంబంతయు వినష్టం బగును. ఈతీర్థరాజంబుతో సమంబగుతీర్థంబెందును లేదు. ప్రభుం డగునారాయణుండు సర్వదా సన్నిహితుఁడై యుండు నీతీర్థరాజమునందలి గుణగణంబులను వర్ణించుటకు సమర్థు లె

వ్వారున్నారు ? ఈతీర్థరాజంబునందుఁ దొంబదితొమ్మిదికోట్ల తీర్థంబులు విరాజిల్లుచుండును. ఇందుఁ గావించు స్నాన, దాన, జప, హోమ, దేవార్చనాదు లక్షయఫలదాయకంబు లైనవి.

## —♦ పంచతీర్థమాహాత్మ్యము. ♦—

మునివరులారా ! సముద్రస్నానానంతరంబున యజ్ఞాంగసంభవంబగుతీర్థంబును సేవింపవలయును. అందుఁ బరమపావనం బగునిం ద్రద్యుమ్నసరోవరము గలదు. ధీమంతుం డగువాఁడు శుచియై, యాచమనంబుచేసి మనంబున హరిధ్యానంబును, జలస్పర్శంబును గావించుచు —

" అశ్వమేధాంగసంభూత, తీర్థ సర్వాఘనాశన,
స్నానం త్వయి కరో మ్యద్య, పాపం హర నమోస్తు తే. "

అను మంత్రము నుచ్చరించుచు విధిపూర్వకముగ స్నానంబును, దేవర్షి పితృగణంబులకుఁ దిలతర్పణంబును, పితృదేవతలకుఁ బిండప్రదానంబును, బురుషోత్తమునకుఁ బూజనంబును గావించినచో శతాశ్వమేధఫలలాభంబు సంఘటయే కాక, లినకులమునందు సప్తపురుషాంతరములపూర్వులను, సప్తపురుషాంతరములవఱకును దనతరువాతివారిని విష్ణులోకప్రాప్తులం గావించును.

ఈవిధముగా నేకాదశీదినంబున నుపవసించి పంచతీర్థకృత్యంబులను నిర్వర్తించి జ్యేష్ఠపూర్ణిమయందు పురుషోత్తమసందర్శనంబు గావించుటవలనఁగూడఁ బూర్వోక్తఫలలాభం బగును. మాఘాదిపుణ్యమాసంబులకంటె నిందు జ్యేష్ఠమాసమును విశేషించి చెప్పుటకుఁ గారణమేమనిన — ఈభూతలమునందలి సరిత్తులు, సరోవరములు, పుష్కరిణులు, తటాకములు, వాపీకూపహ్రదులు, నదులు, సముద్రములు మొ

వ్యము. ఆదినంబునకుఁ బురుషోత్తమయాత్ర చేసి రామకృష్ణులను సుభద్రాసేవిని దర్శించువాఁడు ద్వాదశయాత్రాఫలము కంటె నధికఫలలాభంబు నందఁగలఁడు. ప్రయాగయు, కురుక్షేత్రము, నైమిశారణ్యము, పుష్కరము, గయ, గంగాద్వారము, కుశావర్తము, గంగాసాగరసంగమము, కోకాముఖము, సూకరము, మథుర, మరుస్థానము, సాలగ్రామము, వాయుతీర్థము, మందరము, సింధుసాగరము, పిండారకము, చిత్రకూటము, ప్రభాసము, కనఖలము, శంఖోద్ధారము, ద్వారక, బదరికాశ్రమము, లోహకుండము, అశ్వతీర్థము, సర్వపాపప్రమోచనము, కమలాలయము, కోటితీర్థము, అమరకంటకము, లోహార్గళము, జంబుమార్గము, సోమతీర్థము, పృథూదకము, ఉత్పలావర్తకము, పృథుతుంగము, కుంజకము, ఏకామ్రకము, కేదారము, కాశి, విరజ, కాలంజరము, గోకర్ణము, శ్రీశైలము, గంధమాదనము, మహేంద్రము, మలయము, వింధ్యము, పారియాత్రము, హిమాలయము, సహ్యము, శుక్తిమంతము, గోమంతము, అర్బుదము, గంగ, యమున, సరస్వతి, గోమతి, బ్రహ్మపుత్ర, గోదావరి, భీమరథి, తుంగభద్ర, నర్మద, తాపి, పయోష్ణి, కావేరి, శిప్ర, చర్మణ్వతి, వితస్త, చంద్రభాగ, శతద్రు, బాహుద, ఋషికుల్య, కుమారి, విపాశ, దృషద్వతి, సరయు, నాకగంగ, గండకి, మహానది, కౌశిక, కరతోయ, త్రిస్రోత, మధువాహిని, వైతరణి మొదలగుగా గల భూతలమునందలి యెల్లతీర్థంబులును, సర్వక్షేత్రములును, సర్వసాగరంబులును, సర్వశైలంబులును, సర్వనదీనదంబులును సందర్శించి సేవించినఫలంబును, సూర్యగ్రహణాదులయందుఁగావించిన మహాదానాదులవలనఁ గలుగుపుణ్యఫలంబునుగూడ నొక్కసారి మహాజ్యేష్ఠాపున్యకాలంబున శ్రీకృష్ణసందర్శనము గావించినంతనే సిద్ధింపఁగలదు.

కావున నీ యాషాఢశుద్ధద్వితీయాకాలంబున భోగమోక్షలాభములకు మానవు లెల్లరును బురుషోత్తమక్షేత్రయాత్ర గావింపవలయును. అవిధంబున శ్రీసుభద్రారామకృష్ణులను సేవించినవారికి విష్ణుసాయుజ్యంబు గలుగును. అట్టిపుణ్యాత్ముండు ప్రళయకాలంబునందు విష్ణులోకంబున సకలభోగంబుల ననుభవించుచునుండి యనంతరము మర్త్యలోకంబునఁ జతుర్వేదపారగుండును, స్వధర్మనిరతుండు నగు బ్రాహ్మణుండై పుట్టి శాంతుండును, శ్రీకృష్ణభక్తుండునై యంతంబున వైష్ణవయోగావలంబనంబుచే ముక్తుం డగును.

## కృష్ణస్నానమాహాత్మ్యము.

అని చెప్పి బ్రహ్మదేవుండు మఱియు నిట్లనియెను. మునిశ్రేష్ఠులారా! సర్వపాపహరంబును, బుణ్యప్రదంబును నగు శ్రీకృష్ణబలరాముల యు,సుభద్రయొక్కయు స్నానవృత్తాంతమును జెప్పెదనాకర్ణింపుఁడు. జ్యేష్ఠమాసంబునఁ బూర్ణిమాతిథియందుఁ జంద్రుఁ డైవతం బగునక్షత్రమున హరిస్నానము ప్రశస్తమైనది. తత్కాలంబున నందున్నకూపము సర్వతీర్థమయంబును, నిర్మలంబు నై యుండును. అప్పు డచ్చట భోగవతి సాక్షాత్కరించి యుండును. కావున శ్రీరామకృష్ణులను సుభద్రాదేవిని నభిషేకించుటకై యాకూపమునుండి హేమకలశంబులచే జలంబులను గొని తెచ్చి పిమ్మట దేవతామూర్తులకు స్నానార్థమై పతాకాభిశోభితంబును, సుదృఢంబును, సుఖసంచారంబును, వస్త్రపుష్పాలంకృతంబును, విస్తీర్ణంబును, ధూపధూపితంబును, శ్వేతవస్త్రావృతంబును, మౌక్తికహారాలంకృతంబు నగు మంచెపై, శ్రీరామకృష్ణులను, వారి నడుమ సుభద్రాదేవిని సంస్థాపించి వివిధజయమంగళధ్వనుల ఘోషను, బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రాది శతసహస్రసహస్ర స్త్రీపురుషజనంబుల

ర్పులును, దివారాత్రింబులును, సంవత్సరంబులును, ఉచ్చైశ్శ్రవంబును, నాగేంద్రుండును, వామనుండును, అరుణుండును, గరుడుండును, సకలంబులగు నోషధులును, భగవానుం డగు ధర్మదేవుండును, కాలుండును, యముండును, మృత్యువును, యమానుచరులును దత్కాలంబునఁ బురుషోత్తమదేవుని యభిషేకదర్శనార్థము విచ్చేసి యుందురు.

వారందఱును మంగళకరంబులగు నభిషేచనద్రవ్యములం గైకొని భూతలగతులై వచ్చి సపుష్పంబులగు కాంచనకలశంబులతోఁ బవిత్రసరస్వతీజలంబులచేతను, దివ్యంబులగు నాకాశగంగాజలంబులచేతను, రామకృష్ణుల కభిషేకంబు గావింతురు. అప్పుడు వివిధంబులగు ననేకదివ్యవిమానములు వరుసలుతీరి యంబరభాగంబున సంచారము సేయుచుండును. అవియన్నియును దివ్యపతాకాభిశోభితంబులును, నృత్యగీతవాద్యాదులచే విలసితంబులునై శోభిల్లుచుండును. ఈవిధముగా నప్పుడు శ్రీరామకృష్ణులకును, సుభద్రాదేవికిని గూడ నభిషేకంబు గావించి హర్షోత్ఫుల్లహృదయములతో నింద్రాదిదేవతలందఱును పురుషోత్తమదేవునిం గూర్చి

"జయ జయ లోకపాల భక్తరక్షక, జయజయ ప్రణతవత్సల,
జయజయ భూతచరణ జయజయాదిదేవ బహుకారణ,
జయజయ వాసుదేవ, జయజయాసురసంహారణ,
జయజయ దివ్యమీన, జయజయత్రిదశవర,
జయజయ జలధిశయన, జయజయ యోగివర,
జయజయ సూర్యనేత్ర, జయజయ దేవరాజ,
జయజయ కైటభారే, జయజయ వేదవర,
జయజయ కర్మరూప, జయజయ యజ్ఞవర,
జయజయ కమలనాభ, జయజయ శైలచర,

జయజయ యోగశాయిన్, జయజయ యోగధర,
జయజయ విశ్వమూర్తే, జయజయ చక్రధర,
జయజయ భూతనాథ, జయజయ ధరణీధర.
జయజయ శేషశాయిన్, జయజయ పీతవాసో,
జయజయ సోమకాంత, జయజయ యోగవాస,
జయజయ దహనవక్త్ర, జయజయ ధర్మవాస,
జయజయ గుణనిధాన, జయజయ శ్రీనివాస,
జయజయ గరుడగమన, జయజయ సుఖనివాస,
జయజయ ధర్మకేతో, జయజయ మహీనివాస,
జయజయ గహనచరిత, జయజయ యోగిగమ్య,
జయజయ మఖనివాస, జయజయ వేదవేద్య,
జయజయ శాంతికర, జయజయ యోగిచింత్య,
జయజయ పుష్టికర, జయజయ జ్ఞానమూర్తే,
జయజయ కమలాకర, జయజయ భవవైద్య,
జయజయ ముక్తికర, జయజయ విమలదేహా,
జయజయ సత్త్వనిలయ, జయజయ గుణసమృద్ధ,
జయజయ యజ్ఞకర, జయజయ గుణవిహీన,
జయజయ మోక్షకర, జయజయ భూశరణ్య,
జయజయ కాంతియుత, జయజయ లోకశరణ,
జయజయ లక్ష్మీయుత, జయజయ పంకజాక్ష,
జయజయ సృష్టికర, జయజయ యోగయుత,
జయజయ యాతసీకుసుమశ్యామదేహా,
జయజయ సముద్రవిష్టదేహా,
జయజయ లక్ష్మీపంకజ షట్చరణా,

జయజయ భక్తవశ, జయజయ శ్రీకాంత,
జయజయ పరమశాంత, జయజయ పరమపార,
జయజయ చక్రధర, జయజయ భోగియుత,
జయజయ నీలాంబర, జయజయ శాంతికర,
జయజయ మోక్షకర, జయజయ కలుషహార.
జయ కృష్ణ జగన్నాథ, జయసంకర్షణానుజ
జయ పద్మపలాశాక్ష, జయ వాంఛాఫలప్రద.
జయ మాలావృతోరస్క, జయ చక్రగదాధర,
జయ పద్మాలయాకాంత, జయ విష్ణో నమోఽస్తుతే. ”

అని యనేకవిధంబుల స్తోత్రపాఠంబు గావించుచు సంబరతలంబునందుండి శ్రీకృష్ణబలరాములకును, సుభద్రాదేవికిని బ్రణామంబులం గావించి తమతమనివాసములకుం బోవుచుండు. అప్పుడు గగనభాగంబంతయుఁదివ్యపతాకాభిశోభితంబులును, రత్నకాంతుస్ముజ్జ్వలంబులు నగు సువర్ణవిమానములచే నిండి యుండును. ఆసమయంబున భూలోకవాసులందఱును, బురుషోత్తమబలరామసుభద్రలను దర్శించి యవ్యయపదప్రాప్తు లగుదురు. మంచముపై బలరామసుభద్రాసహితుండై యున్నపురుషోత్తముని దర్శించువారికి నిరామయపదంబు లభించు ననుట కెట్టిసంశయమును లేదు.

మునివరులారా! సుభద్రాబలరామసహితుండగుశ్రీకృష్ణుని దర్శించినచోఁ బుష్కరక్షేత్రంబున శతసహస్రగోదానములు గావించినఫలంబు సిద్ధించును. మంచస్థుండగుశ్రీకృష్ణదేవుని దర్శ... మా... శతకన్యాదానఫలంబు లభించును. శతనిష్కపరిమితంబగుస్వర్ణదానంబును, సహస్రగోదానంబును, విధివిహితం బగుభూదానమును, అతిథుల కన్నదానంబును, వృషోత్సర్జనంబును, గ్రీష్మకాలంబున జలదా

నంబును, తిలాధేనుదానంబును, గజాశ్వరథదానంబులును, చాంద్రా యణవ్రతానుష్ఠానంబును, జలధేనుదానంబును, ఏకమాసోపవాసంబును గూడ శ్రీకృష్ణసందర్శనంబుతో సమానములు గాఁజాలవు.

వేయిమాట లేల ? సమస్తతీర్థంబులును, సమస్తవ్రతంబులును, సమస్తదానంబులును గావించుటకంటె నొక్కసారి మంచస్థులగు శ్రీకృష్ణబలరాములను సుభద్రాదేవిని దర్శించుటయే యధికఫలప్రదం బగుచున్నది. స్త్రీపురుషు లెల్లరును బురుషోత్తమసందర్శనంబు సేయవలయును. అట్టివారికి సర్వతీర్థసంసేవనఫలంబు సిద్ధించును. కృష్ణాభిషేకానంతరమున నాజలంబును శిరములం దాల్చినచో, వంధ్యలును, మృతాపత్యలును, దుర్భగలును, గ్రహపీడితలును, భూతావిష్టలును, ...రోగాక్రాంతలును సగుణములై యభీష్టఫలలాభంబు నొందుదురు. ఆజలంబుల నభిషిక్తులగువారి కోరినకోరిక లన్నియును సిద్ధించును. భూతలమునం గలయెల్లతీర్థజలంబులును గలసి యాస్నానశేషజలంబున షోడశాంశఫలంబునైనను గల్పింపఁజాలవు. కావున శ్రీకృష్ణస్నానావశిష్టజలంబులచే నెల్లప్పుడు నభిషేచనంబు చేసికొనుట శ్రేయోదాయకము.

స్నానాంతంబున దక్షిణాభిముఖుండై పోవుచున్న శ్రీకృష్ణదేవుని దర్శించువారు బ్రహ్మహత్యాదిసర్వపాపంబులనుండియు ముక్తులగుదురు. అట్టివారికి ముమ్మాఱు భూప్రదక్షిణంబు గావించినఫలంబు లభించును. భూతలమునందలి సకలతీర్థములను సేవించుట, బదరికాశ్రమంబు పోయి నారాయణుని దర్శించుట, కురుక్షేత్రంబునను, గంగాద్వారమునందును, స్నానాదానాదులం గావించుట, మాసమాసంబునఁ బ్రయాగయాత్ర గావించుట, మహాభిధానం బగుకార్తికంబునఁ బుష్కరగమనంబు సేయుట, గంగాసాగరసంగమంబున స్నానదానం

బు లాచరించుట, గంగాయమునాసరస్వత్యాది పుణ్యనదులయందు ను, పుణ్యసరోవరంబులయందు నవగాహనం బొనరించుట సూర్యచం ద్రాదిగ్రహణంబులయందు విశిధదానంబులు సేయుట మొదలగువాని వలన లభించుపుణ్యఫలంబంతియును, శ్రీకృష్ణదేవునిదక్షిణాభిముఖయా త్రాదర్శనమువలన లభింపఁగలదు. వేయేల? వేదశాస్త్రపురాణాదు లయందు మహర్షులచేఁ బ్రకటనీతంబులగు సకలపుణ్యకర్మంబులకును లభించుఫలంబంతయును బలరామసుభద్రాసహితంబుగా దక్షిణాభిము ఖయాత్రం గావించు శ్రీకృష్ణుని దర్శించినంతమాత్రమునఁ గరతలామల కంబు గాఁగలదు.

## గుండిచాయాత్రామాహాత్మ్యము.

శ్రీకృష్ణబలరాములును, సుభద్రాదేవియు రథారోహణంబు గావించి గుండిచాయాత్ర చేయుచుండఁగా దర్శించువారు విష్ణులోక ప్రాప్తు లగుదురు. ఆగుండిచామండపంబున సప్తాహపర్యంతమును వేం చేసియున్నయాదివ్యమూర్తులను సేవించువారికి సర్వాభీష్టసిద్ధి యగును.

మునివరులారా! పూర్వకాలంబున నింద్రద్యుమ్నసార్వభౌముం డు తనచేఁ బ్రతిష్ఠింపఁబడియున్న పురుషోత్తమదేవుం గాంచి దేవదేవా! మదీయంబగుసరోవరతీరంబునఁ బ్రతివత్సరంబును సప్తాహపర్యంతము ను భవదీయం బగుయాత్రోత్సవంబు గుండిచాయాత్రాభిధానంబున సువిఖ్యాతం బగుంగాక! అని ప్రార్థించుటయుఁ బ్రసన్నుం డగుపురు షోత్తమదేవుండు మహారాజా! నీసరోవరతీరంబున సప్తాహంబువఱకును మదీయంబగుగుండిచాయాత్రోత్సవంబు గాఁగలదు. అప్పుడు మండ పస్థితుండ నగునన్నును, బలరామదేవుని, సుభద్రాదేవిని సమారాధించి తృప్తిగ గంధపుష్పధూపదీపనైవేద్యాదులతోడను, ప్రదక్షిణనమస్కారంబుల

శ్రద్ధోత్సవంబులతోడను, గీతవాద్యనృత్యంబులతోడను యథావిధిగఁ బూజిం చువారు బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రాదులలో నెవ్వరైనను, స్త్రీలైనను, పురుషులైనను సర్వాభీష్టసిద్ధు లగుదురు. అట్టివారికి దుర్లభంబగు వాంఛిత మేదియును నుండదు.

అని దేవదేవుండగు పురుషోత్తముం డనుగ్రహించుటయు, రాజశేఖరుండును, శ్రీమంతుండు నగు నింద్రద్యుమ్నుండు కృతార్థుండయ్యెను. కావున సర్వవిధంబులను బ్రయత్నించి శ్రేయస్సాధనముం దగునాఁడు గుండిచామండపంబున సర్వకామప్రదాత యగుపురుషోత్తమదేవుని సేవింపవలయును. ఆసమయంబున బురుషోత్తమసందర్శనంబువలన నపుత్రునకు సంతానంబును, నిర్ధనునకు ధనంబును, రోగి కారోగ్యంబును, కన్యకు ననుకూలవరప్రాప్తియు నగుటయే కాక, ఆయువును, కీర్తియు, యశంబును, మేధయు, బలంబును, విద్యయు, ధృతియు, రూపయౌవనసంపత్తులును సర్వోత్తమాభీష్టభోగంబులునుగూడ లభించును. ఆషాఢంబున, శుక్లపక్షంబున గుండిచాయాత్రోత్సవసమయంబునఁ బురుషోత్తముని సేవించువారి కశ్వమేధాదికఫలలాభంబు సిద్ధించును. అట్టివారు తమకులంబునఁ దమకుఁబూర్వుల నేడుతరంబులవారిని, వెనుకటి నేడుతరంబులవారిని దరింపఁజేయుటయే కాక దివ్యవిమానారూఢులై గంధర్వాప్సరస్తూయమానులై విష్ణులోకంబునఁ బ్రవేశించి యచ్చట నపరిమిత భోగంబుల ననుభవించుచుఁ బ్రళయకాలంబువఱకు నుండి యనంతరము మర్త్యలోకంబునఁ జతుర్వేదులగు బ్రాహ్మణులై మరల జనించి వైష్ణవయోగంబుచే మోక్షముం గాంచఁగలరు.

## ద్వాదశయాత్రామాహాత్మ్యము.

మునిశేఖరులారా! ఉత్థానంబునందును, శయనంబునందును, విషువంబునందును, గుండిచాయాత్రాసమయమునందును బురుషోత్తము

ని సేవించువారు సర్వాభీష్టసిద్ధులై పదునల్వురింద్రులు పరిపాలించునంతకాలమువఱకును విష్ణులోకంబున సమస్తభోగంబుల ననుభవింపఁగలరు. జ్యేష్ఠమాసంబునఁ బురుషోత్తమయాత్రగావించువారు కల్పాంతంబువఱకును విష్ణులోకంబున సుఖనివాసులై యుందురు.

మానవులు విధ్యుక్తముగా ద్వాదశయాత్రలను గావించి యనంతరము యథావిధిగఁ బాపనాశినీప్రతిష్ఠం గావింపవలయును. జ్యేష్ఠమాసంబున, శుక్లపక్షంబున నేకాదశియందు నిర్మలచిత్తంబుతో శుచియై పవిత్రంబగుజలాశయంబునకుం బోయి శుద్ధుండై యాచమనంబు చేసి సర్వతీర్థావాహనం బాచరించి నారాయణుని ధ్యానించుచు విధివిహితముగా స్నానము చేసి [illegible] ధౌతవసనధారియై సూర్యాభిముఖుండుగా [illegible] నిఖిలపాపహారిణియు, పావనియు, [illegible] గూర్చి యష్టోత్తరశతపర్యాయములు మం[illegible] హితుండై పుణ్యమయంబు లగుసౌరమంత్రములను [illegible] త్యనకు ముమ్మాఱు ప్రదక్షిణంబును, బ్రణామంబును గావింపవలయును.

బ్రాహ్మణాదివర్ణత్రయంబునకును స్నానజపవిధానంబులు వేదమునందు నిర్దేశింపఁబడి యుండెను. కాని స్త్రీశూద్రాదులకుమాత్రము మట్టివేదోక్తవిధులు లేవు. ఏమైననేమి. మౌనభావముతోఁ బురుషోత్తమస్థానమునఁ బ్రవేశించి కరపాదప్రక్షాళనంబును, ఆచమనంబును ఘృతక్షీరమధుగంధోదకంబులచేతను, జందనజలంబులచేతను భక్తిపూర్వకంబుగాఁ బురుషోత్తమదేవు నభిషేకించి, వస్త్రసమర్పణంబు చేసి చందనాగురుకర్పూరకుంకుమాదులచే విలేపనంబును, కమలమల్లికాది సుమంబులచేఁ బూజనంబును, ధూపసేవనంబును, ఘృతదీపాదులచే

ద్వాదశదీపదానంబును, పాయసాపూపమోదకాది శ్రేష్ఠపదార్థంబుల చే నైవేద్యంబును, ఫలదానంబును గావింపవలయును. ఈవిధముగాఁ బంచోపచారంబులచేతను దేవదేవు నర్చించి "నమః పురుషోత్తమా య" అనుమంత్రమును, అష్టోత్తరశతపర్యాయములు జపంబు చేయ వలయును.

అనంతరము భక్తిపూర్వకంబుగా

"నమస్తే సర్వలోకేశ, భక్తానా మభయప్రద
సంసారసాగరే మగ్నం, త్రాహి మాం పురుషోత్తమ.
యాస్తే మయా కృతా యాత్రా, ద్వాదశ్యైవ జగత్పతే,
ప్రసాదా త్తవ గోవింద, సంపూర్ణా స్తు భవంతు మే."

అని ప్రార్థించుచుఁ బురుషోత్తముదేవుని బ్రసన్నుం గావించు కొని దండప్రణామంబు గావించి దేవగురుదేవుల శేషోదకంబును పిదప గావున గురుదేవునిగూడఁ బుష్పవస్త్రానులేపనాదులచే భక్తిభావంబున నర్చింపవలయును.

పిమ్మట శ్రోత్రియపండితులను దేవదేవార్పితభాగంబున వివిధపుష్పం బులచే నొకవిచిత్రమండపమును గల్పించి యాదేవసంకీర్తనంబులచేత ను, ధ్యానస్తోత్రపాఠంబులచేతను రాత్రియంతయును జాగరణంబు చేసి ను, నిర్మలచిత్తాంబు ద్వాదశియందు వేదపారగులును, వ్రతస్నాతులు ను, ఇతిహాసపురాణజ్ఞులును, [illegible] శ్రోత్రియులు నగు [illegible] ద్వాదశసంఖ్యవారతో పురుషోత్త [illegible] నిర్వర్తించి యనంతరము బ్రాహ్మణు [illegible] వారికి గోసువర్ణచ్ఛత్రోపానహావస్త్ర ధనాదులను దానము చేయవలయును. బ్రాహ్మణులు తుష్టులు సంతుష్టులైన చో గోవిందుండును సంతుష్టుం డగును. పిమ్మట నాచార్యునిగూడ

నిష్ఠ యర్చించి కాంస్యపాత్రంబున సంతర్పితాగ్నిం గావింపవలయును, అనంతరము నిమంత్రితు లగుబ్రాహ్మణులకు పాయసములు, పక్వాన్నములు, గుడఘృతమిశ్రితంబు లగువివిధభక్ష్యభోజ్యపదార్థంబులను సమర్పించి వారిని సంతర్పితులం గావించి యథాశక్తి దక్షిణలతో వారికి జలపూర్ణకుంభదానంబులు చేయవలయును. ఇట్లు విప్రవర్గంబును బూజించినపిమ్మట విష్ణుతుల్యుండును, జ్ఞానప్రదుండును నగుగురుని గూడ నట్లే పూజించి—

"సర్వవ్యాపీ జగన్నాథః. శంఖచక్రగదాధరః
అనాదినిధనో దేవః, ప్రీయతాం పురుషోత్తమః."

అను మంత్రమును బఠించుచు గురుబ్రాహ్మణులకు ముమ్మాఱు ప్రదక్షిణంబును, ప్రణామంబులను గావించి భక్తిభావంబుతో వారిని వీడుకొలుపుచు సీమాంతంబువఱకును వారి ననుగమించి మరల నమస్కారంబు చేసి సెలవుగైకొని వచ్చి దీనులును, భిక్షుకులు, నన్నార్థులు నగువారిం దనిపి, బంధువులు, స్వజనులు, సహోపాసకులు నగు వారితోఁ గలసి తానును భుజింపవలయును.

ఇట్లు నిశ్చలభక్తిభావముతోఁ బురుషోత్తము నారాధించు స్త్రీలైనను, బురుషులైనను సహస్రాశ్వమేధఫలంబును, శతరాజసూయఫలంబును గాంచుటయేకాక తమవంశమునం దతీతానాగతశతపురుషాంతరంబుల నుద్ధరించి స్వర్గప్రాప్తులై సర్వలక్షణసంపన్నులును, సర్వకామసంసిద్ధులును, దివ్యమూర్తులును, నిత్యయౌవనసమంచితులును, సద్గుణాలంకృతులును, గంధర్వాప్సరోగణస్తూయమానులునై యాదిత్యసన్నిభంబగు దివ్యవిమానము నధిరోహించి యనాయాసంబుగ నఖిలలోకసంచారంబు గావించుచు శతకల్పంబులవఱకును, విష్ణులోకంబున సకలోపభోగంబుల ననుభవించుచుందురు. అట్టివారు విష్ణుచే

ముంగూర్చి చెప్పెదను. సర్వైశ్వర్యమయంబును, త్రైలోక్యపూజితంబును, బుణ్యస్థానంబు నగువిష్ణులోకము సర్వలోకంబులయందును శ్రేష్ఠమైనది. అందుఁ బారిజాతాశోకపనసనారికేళపున్నాగచందనవకుళసహకారచందనాదివృక్షంబులును, మాలతీమల్లికాద్రాక్షాదిలతలును సర్వర్తుఫలపుష్పసమంచితంబులై శోభిల్లుచుండును. మఱియు ననేకవిధంబులగుపుష్పపరిమళంబులచేతను, కలవిహంగకలాలాపంబులచేతను మందమలయానిలంబులచేతను నందలియుపవనంబులు విలసిల్లుచుండును. కమలేందీవరమండితంబులగుజలాశయములయందు హంసకారండవచక్రవాకాదిజలవిహంగములు మధురాలాపంబులు సేయుచు విహరించుచుండును. అందలి కాంచనమయంబు లగుదివ్యవిమానశ్రేణులకు లెక్కయే లేదు. అవియన్నియు నానారత్నభూషితంబులును, అప్సరోగణాలంకృతంబులును, గంధర్వగీతవిలసితంబులునై, హేమమయశయ్యాసనంబులతోడను, నానాభోగ్యపరికరంబులతోడను దరుణాదిత్యప్రభల దెసల వెల్లివిరియఁజేయుచు శోభిల్లుచుండును. అవి సముచ్ఛ్రితచిత్రపతాకాలంకృతంబులును, ముక్తాహారభూషితంబులును, వివిధకుసుమగంధామోదితంబులును, చందనాగురుధూపితంబులును, మంగళవాద్యముఖరితంబులును, కింకిణీజాలశోభితంబులును, మనోజవంబులు నాలోకరమణీయములు నై యుండును.

అట్టివిమానములనధిరోహించి లోకపూజ్యంబగునవ్విష్ణులోకంబున సుందరీసహితు లగుసురగణంబులు సర్వదా సుఖవిహారంబులు గావించుచుందురు. పీనోన్నతవక్షోభాగలును, సూక్ష్మావలగ్నలును, చంద్రవదనలును, మదమాతంగగమనలు నగుగంధర్వకామినులును, అప్సరోయువతులును బురుషోత్తముని బరివేష్టించి రత్నఖచితంబు లగుసువర్ణదండములు గలచామరంబులచే వీచుచుందురు. యక్షవిద్యాధరసి

బును, రెండవది మరకతమయంబును, మూఁడవది యింద్రనీలమయం బును, నాల్గవది మహానీలమయంబును, ఐదవది ప్రదీప్తపద్మరాగమయం బును, ఆఱవది హిరణ్మయంబును, ఏడవది వైడూర్యమయంబు నై యుండును. ఆమహాభవనము రత్నమయంబులును, హేమప్రవాళాం కురభూషితంబులును, అద్భుతంబులు నగు నున్నత స్తంభంబులచే శోభిల్లు చుండును. ఆమందిరమునం బెల్లెడల సిద్ధగణంబులు విహరించుచుం డఁ దారకాగణపరివృతుం డగుపూర్ణచంద్రునాకరునింబోలి పీతాంబరుం డును, శ్యామసుందరుండును, శ్రీవత్సలాంఛితుండును, సుదర్శనచక్రధ రుండు నగువిష్ణుదేవుండు విభాసిల్లుచుండును.

ఆతఁడు కుందేందుసంకాశంబును, హారగోక్షీరసదృశంబును సముజ్జ్వలంబు నగుసహస్రమును దక్షిణకరంబునం దాల్చి యుండును. ఆతనిసవ్యహస్తంబున మహాశబ్దసమన్వితంబును, సహస్రావర్తమయం బును, విఖ్యాతంబు నగుపాంచజన్యము శోభిల్లుచుండును. దుష్కృత వినాశకంబును, దైత్యదానవనిర్ఘాతనామోఘప్రభావసంపన్నంబును, జ్వ లదగ్నిశిఖాసంకాశంబు నగుకౌమోదకియు, సూర్యసన్నిభంబగు శార్ఙ్గం బును నాతనిదక్షిణవామకరంబుల విరాజిల్లుచుండును.

సూర్యసదృశంబులును, జ్వాలామాలాకులంబులు నగుశరనికరం బులచేఁ ద్రిభువనసంహారంబు గావింపఁగలవాఁడును, సర్వానందకరుం డును, శ్రీమంతుండును, సర్వశాస్త్రజ్ఞుండును, సర్వజగద్గురుండును, సర్వదేవతావంద్యుండును, సహస్రశీర్షుండును, సహస్రాక్షుండును, సహ స్రచరణుండును, సహస్రాభిధానుండును, సహస్రాంగుండును, సహస్ర బాహుండును, సింహాసనగతుండును, పద్మపత్రాయతనయనుండును, విద్యుత్కాంతిమంతుండును, సురసిద్ధసేవితచరణారవిందుండును, చరా చరగురుండును, జగన్నాథుండు నగునాతఁడు యక్షవిద్యాధరగంధర్వాది

రుం డగువాసుదేవు నారాధించుచుండు వైష్ణవశిఖామణులకుమాత్రమే విష్ణులోకము సుగమంబై యుండును.

మునివరులారా! దక్షిణసముద్రతీరంబునఁ బరమదుర్లభంబగు పురుషోత్తమక్షేత్రంబున శ్రీకృష్ణబలరాములను, సుభద్రాదేవిని, సందర్శించి సేవించుచుఁ గల్పవృక్షనికటంబునఁ గళేబరమును ద్యజించువారు విష్ణులోకగతు లగుదురు. వటవృక్షాంతరాళంబునను, సముద్రమధ్యంబునను నిలిచి పురుషోత్తముని స్మరించుచుఁ బురుషోత్తమక్షేత్రంబున మరణించువారును విష్ణులోకంబుఁ జేరఁగలుగుదురు.

## —♦ పురుషోత్తమమాహాత్మ్యము. ♦—

మునివరులారా! ఈభూమండలంబునం గలపుణ్యాయతనంబు లన్నియును, బురుషోత్తమక్షేత్రమున షోడశాంశమునైనను బోలఁజాలవు. సర్వలోకంబులయందును, సర్వేశ్వరుం డగువిష్ణుదేవునివలెనే సమస్తతీర్థములయందును బురుషోత్తమక్షేత్రము శ్రేష్ఠంబైనది. ఆదిత్యగణంబులలో విష్ణుండును, నక్షత్రంబులలోఁ జంద్రుండును, జలాశయంబులలో సాగరంబును, వసువులలోఁ బావకుండును, రుద్రులలో శంకరుండును, వర్ణంబులలో బ్రాహ్మణుండును, విహంగంబులలో వైనతేయుండును, శిఖరంబులలో సుమేరువును, పర్వతంబులలో హిమవంతంబును, రమణీమణులలో లక్ష్మియు, సరిత్సమూహంబులలో జాహ్నవియు, గజేంద్రంబులలో నైరావతంబును, మహర్షులలో భృగుండును, సేనానులలోఁ గుమారుండును, సిద్ధులలోఁ గపిలుండును, అశ్వంబులలో నుచ్చైశ్శ్రవంబును, కవులలో నుశనుండును, మునులలో వ్యాసుండును, యక్షరాక్షసాదులలోఁ గుబేరుండును, ఇంద్రియంబులలో మనంబును, భూతంబులలో భూమియు, వృక్షంబులలో నశ్వత్థంబును,

స్తవమానంబులగువానిలోఁ బవనంబును, సర్వాలంకారములలోఁ జూడామణియు, గంధర్వులలోఁ జిత్రరథుండును, శస్త్రంబులలో వజ్రాయుధంబును, సర్వవర్ణంబులలో "అ" కారంబును, ఛందంబులలో గాయత్రియు, అంగంబులలో నుత్తమాంగంబును, స్త్రీగణంబులలో సతీశిరోమణియగు నరుంధతియు, సమస్తవిద్యలలో నాత్మవిద్యయు, మానవులలో మహీపాలుండును, ధేనువులలోఁ గామధేనువును, లోహంబులలో సువర్ణంబును, సర్పంబులలో వాసుకియు, దైత్యగణంబులలోఁ బ్రహ్లాదుండును, ధనుష్మంతులలో శ్రీరామచంద్రుండును, విసారులలో మకరంబును, మృగంబులలో సింహంబును, సముద్రంబులలో క్షీరాంబుధియు, యాదోగణంబులలో వరుణుండును, సంయములలో యముండును, దేవర్షులలో నారదుండును, ధాతునిచయంబులలోఁ గాంచనంబును, పవిత్రసమూహంబులలో దక్షిణయు, ప్రజాపతులలో దక్షుండును, ఋషిగణంబులలోఁ గశ్యపుండును, గ్రహంబులలో భాస్కరుండును, మంత్రంబులలోఁ బ్రణవంబును, యాగంబులలో నశ్వమేధంబును, ఓషధులలో ధాన్యంబును, తృణంబులలోఁ దర్భరాజంబును శ్రేష్ఠంబు క్షేత్రతీర్థంబు లన్నిటియందును, సంసారతారకంబగుపురుషోత్తమక్షేత్రము సర్వశ్రేష్ఠమైనది.

—◆ తీర్థభేదవర్ణనము. ◆—

విప్రవరులారా! పుణ్యప్రదమగు [illegible] పురుషోత్తమక్షేత్రముతోఁ దుల్యంబగుక్షేత్రము త్రిభువనంబులయందు నెచ్చటను గాంచియుండలేదు. ఈనిమిత్తము [illegible] పురుషోత్తమమాహాత్మ్యము నుపవర్ణించి చెప్పుచున్నాఁడ. [illegible] తం బగుపురుషోత్తమక్షేత్రము [illegible],

బ్రహ్మజ్ఞాన మొక్క సారి లభించినట్లే మానవులకుఁ బునర్జన్మంబు లేకుం డఁబోవును. శ్రీహరిసన్నిధానం బగు పురుషోత్తమస్థానంబునం దొక్క వత్సరంబుగాని, యొక్కమాసంబు గాని నివసించి యద్దేవు నుపాసించు వానికి క్షేత్రమాహాత్మ్యంబువలన జపహోమతపోదానాదులవలనం గలుగు సంపూర్ణఫలంబు సంప్రాప్తంబు గాఁగలదు. అట్టివానికి సర్వ యోగేశ్వరుం డగు శ్రీహరిపరమపదంబు లభించును.

కల్పవృక్షంబును, బలరాముని, శ్రీకృష్ణుని, సుభద్రాదేవిని, మార్కండేయుని, ఇంద్రద్యుమ్నుని, మాధవుని, స్వర్గద్వారంబును గూర్చి సవిస్తరంబుగఁ బ్రశంసించి తన్మాహాత్మ్యంబును, సాగరస్నానమార్జనాదివిధులను, యథాకాలంబున భాగీరథీసమాగమసంకీర్తనంబును మీహృదయంబులకు సువిదితం బగునట్లుగావించితిని. సుప్రసిద్ధం బగు పురుషోత్తమక్షేత్రమునందలి సరహస్యంబులగు విషయంబుల నన్నిటిని మీకెఱింగించితిని.

మునివరులారా! పూర్వకాలంబునం దొక్కప్పుడు నారదుండు నన్ను సందర్శించి ఓలోకపితామహా! జగత్పతీ! తపోయజ్ఞదానతీర్థసమూహంబులలోఁ బవిత్రంబగు నుత్తమతీర్థముం గూర్చి నాకెఱిగింపవలయునని ప్రార్థించుటయు నేనిట్లు వర్ణించి చెప్పితిని. వత్సా! నారదా! స్వర్గమర్త్యరసాతలంబులయందు దైవంబును, ఆసురంబును, ఆర్షంబును, మానుషంబు నని చతుర్విధంబులగు తీర్థంబులు విరాజిల్లుచుండును. అందు మానుషతీర్థంబులకంటె నార్షంబులును, వానికంటె నాసురంబులును, వానికంటె దైవతీర్థంబులును శ్రేష్ఠఫలదాయకము లైనవి. బ్రహ్మవిష్ణుమహేశ్వరులచే దైవతీర్థములు సర్మితంబులయ్యెను. ఇతరదైవతంబులచేఁ బ్రకల్పితంబులగు నన్యతీర్థంబులు వానికంటెఁ బ్రధానంబులు గావు. దేవత్రయనిర్మితంబులగు నాతీర్థంబులే త్రిభువనపావనం

బునై యుండును. ఆ తీర్థంబు బహువిధవనంబుల సహస్రయోజనంబులగు జంబూద్వీపము శ్రేష్ఠంబైనది. అందును గర్మభూమియగు భారతవర్షము సర్వతీర్థప్రధానంబైనది.

అట్టిభారతవర్షంబునందలి సకలతీర్థంబులం గూర్చి యిపుడు బ్రశంసించియుంటిని. అందు హిమవంతంబునకును, వింధ్యాచలంబునకును నడుమఁ బ్రవహించుచున్న దేవనదులును, పశ్చిమసముద్రముల మధ్యస్థంబులును, దేవసంభవంబు లగునానాతీర్థంబులును, సముద్రసంబంధంబులుగాఁ బ్రశంసింపఁబడుచున్నవి. దేవతలచేతనుగూడఁ గర్మభూమిగాఁ బరిగణింపఁబడుచున్న భారతవర్షమునందుఁ బ్రవహించుచుండుటచే నీపంచదశనదులును దేవతీర్థములుగాఁ బ్రఖ్యాతంబు లయ్యెను. మఱియు నందందుగల యార్షతీర్థంబు లాసురతీర్థంబులచే నావృతంబు లగుటంజేసి యన్నియు నాసురతీర్థంబులై పోయెను.

మహాత్ములగు వారనేకదివ్యాయతనంబులయందు మహాతపంబు గావించి దైవబలంబునను, తపస్సాహాయ్యంబునను ననేకంబులగు నార్షతీర్థములను గల్పించి యుండిరి. ఆశ్రమమార్గంబును, మోక్షంబును, ఐశ్వర్యమును, దేవతార్చనమును, ఫలమును, మహాయశంబును గాంక్షించి మానవులుగూడ నందందుఁ దీర్థప్రతిష్ఠలం గావించి యున్నారు. అవి యన్నియు మానుషతీర్థంబులు. ఇది చతుర్విధతీర్థప్రశంసనంబు. ఈభేదంబు నితరు లెవ్వరు నెఱుంగఁజాలరు. దీనిని గ్రహింపఁ జుటకు నీవర్హుండవు. అనాయాసంబుగా నభీష్టఫలసిద్ధింగాంచఁగోర మానవులకు తీర్థసేవనంబుకంటె నన్యోపాయంబు లేదు.

గోదావరి, భీమరథి, తుంగభద్ర, వేణిక, తాపి, పయోష్ణి యనునదులు వింధ్యాచలదక్షిణభాగమునుండియు, భాగీరథి, నర్మద, యమున, సరస్వతి, విశోక, వితస్త, యనునదులు హిమాలయమును

యు వినిర్గతంబు లగు చుండును. పుణ్యాత్ములగు సిద్ధులు దేవతీర్థంబులుగాఁ బ్రఖ్యాతము లగుచున్నవి. గయుఁడు, కొల్లాసురుఁడు, వృత్రుఁడు, త్రిపురాసురుఁడు, అంధకుఁడు, హయగ్రీవుఁడు, లవణుఁడు, నముచి, శృంగకుఁడు, యముఁడు, పాతాళకేతుఁడు, మయుఁడు, పుష్కరుఁడు మొదలుగాఁ గల యసురగణంబులచేఁ గల్పింపఁబడిన శుభకరంబులగు తీర్థంబు లాసురతీర్థంబులు. ప్రభాస, భార్గవ, అగస్త్య, నర, నారాయణ, వసిష్ఠ, భరద్వాజ, గౌతమ, కశ్యప, మను ప్రభృతిమునిగణంబులచే సేవితంబులగు స్థానంబు లార్షతీర్థములు. అంబరీషుఁడు, హరిశ్చంద్రుఁడు, మాంధాత, మనువు, పురువు, కనఖలుఁడు, భద్రాశ్వుఁడు, సగరుఁడు, అశ్వయూపుఁడు, నాచికేతుఁడు, వృషాకపి మొదలగుమహారాజులచే నిర్మితంబు లగునవి మానుషతీర్థంబులు. మానవులు యశోలాభంబుకొఱకుఁ దీర్థనిర్మాణంబు గావించిరి. కాని, త్రిజగంబులయందును దైవతీర్థంబులు తమంతటనే సముద్భూతంబు లయ్యెను. ఈసకలతీర్థంబులును పుణ్యజనకంబులుగ నిర్దిష్టంబు లయ్యెను. ఇది తీర్థభేదప్రకారంబు.

## —♦ శంభువివాహసంభవము. ♦—

అని బ్రహ్మదేవుండు సెప్పుటయు, నారదుం డిట్లనియె. లోకపితామహా! దేవత్రయనిర్మితంబు లగుతీర్థంబులు సర్వతీర్థశ్రేష్ఠంబు లని వచించితివి. వానిస్వరూపభేదంబు సవిస్తరంబుగా నెఱింగింపుమని వేఁడుటయు సురజ్యేష్ఠుం డిట్లనియె. దేవత్రయనిర్మితంబు లగుతీర్థంబులు దృష్టిగోచరంబులు గానంతవఱకును అన్యతీర్థంబులును, అన్యక్షేత్రంబులును, అన్యంబు లగు యజ్ఞాదులును ప్రశస్తంబులై యుండును. నిఖిలాభీష్టప్రదాయినియు, సరిద్వరయు నగు గంగాదేవి త్రివైవశ్యనామంబున విఖ్యాత యైనది. ఇప్పుడు తదుత్పత్తిచారిత్రంబు వ

కంటకు నతిభీషణంబును లోకమహాక్షోభణంబును నగు భయోత్పాదనం
బైనది. యుద్ధంబునఁ గాని తపోబలమ్మునఁగాని శాపమ్మునఁ గాని
యాతనికి వినాశంబును గూర్చుట మాకు నెట్టిసామర్థ్యంబును లేదు.
పదిదినంబులకంటెఁ దక్కువవయస్సు గలబాలకునివలననే యాతండు
మృతుం డగును. ఇఁక నెట్టియుపాయంబుచేతనుగూడ నాతనికి మర
ణంబు గలుగనేరదు. ఎట్టినీతి నుపయోగించుట కర్తవ్యమో యట్లు
గావింపుము. అని దేవతలు ప్రార్థించుటయు నారాయణదేవుండు విబు
ధవరులారా! నేను బలోత్కటుండను గాను. నావలనఁగాని నాసంతా
నమువలనఁగాని మఱియే దేవతలవలనఁగాని యయ్యసురవధంబు గానే
రదు. ఈశ్వరుండు ప్రసన్నుండై శక్తియుక్తం బగు నపత్యంబు నుద్భ
వింపఁజేసినచో నయ్యపత్యంబువలన లోకభయంకరుఁ డగు తారకుం
డు నిధనప్రాప్తుండు గాఁగలండు. కావున నోసురవరులారా! రండు.
మనము ఋషిగణసమేతులమై పోయి యీశ్వరుండు దారపరిగ్రహ
ణంబు గావించునట్లొనరింతము. అని విష్ణుదేవుం డాశ్వాసించుటయు
సురగణంబులు వెళ్లి యని రత్నమయం బగుహిమాలయంబునకుం జని
హిమాలయప్రియ యగు మేనను, హిమవంతుని సందర్శించి యేకవా
క్యంబుగా దక్షనందినియు జగజ్జననియు శంభుప్రణయినియు బుద్ధి, ప్ర
జ్ఞ, ధృతి, మేధ, లజ్జ, పుష్టి, సరస్వతి మొదలుగాఁ గల బహురూపం
బులచే జగంబులఁ బవిత్రంబుసేయుచు జగద్ధాత్రియై విరాజిల్లు నమ్మ
హాదేవి దేవకార్యార్థంబుగా మీయపత్యంబై యవతరించి జగన్మాత
యగునామె పురల నీశ్వరుని వరించి మీకును మాకును రక్షకురాలు
గాఁగలదు. అని బోధించుటయు హిమవంతుండును, మేనయుఁ బర
మానందంబున మహాప్రసాదం బని వక్కాణించిరి.

పిమ్మట జగజ్జనని యగు గౌరీదేవి హిమాలయుగృహంబున

శంభుం డవేధ్యుం డైనను నేనాతని నిశ్చయముగా వేధింపవలయును. త్రిలోకవిజయంబు లగునాబాణము లాతనిమేనం బవమపరిభావమును జూపంజాలకుండునా యని దృఢముగ భావించుకొనియెను. ఈవిచిత్ర సంఘటనమును దిలకించుటకై దేవతలందఱును గుమిగూడి వచ్చి యుండిరి. కాని త్రిలోచనుని యేకమాత్రనేత్రదృష్టిపాతంబు చేతనే రతికాంతుండు నిలువున భస్మీభూతుం డయ్యెను. అదుస్స హదుర్ఘటనముం గాంచి యఖిలదేవతలును భయాతురులై చేతులు జోడించుకొని యమ్మహాదేవునిం గూర్చి దేవా! తారకాసురపీడనంబు న మేమందఱము సిరంతరము సల్లాడుచున్నారము. భక్తవత్సలుండ వగునీవు లోకానుగ్రహంబుకొఱకుఁ బార్వతీపాణిగ్రహణంబు గావింపు మని ప్రార్థించిరి.

మదనశరవినిర్భిన్నహృదయుండగుహరుండును సురగణంబుల ప్రార్థనంబునకుఁ దక్షిణమం దే తనయంగీకారమును సూచించెను. అ ప్పుడు దేవతాగణంబులును, అరుంధతీవశిష్ఠులును, చక్రపాణియగువి ష్ణుదేవుండును, నేనును శివునిచే నాజ్ఞాపింపఁబడి హిమవంతంబుకడం బోయి ప్రబోధించి పర్వతేశ్వరునకును బరమేశ్వరునకును వియ్యమును గల్పించితిమి.

## —♦ గంగోత్పత్తి. ♦—

మునివరులారా! నానారత్నచిత్రితంబును, నానాతరులతాకీ ర్ణంబును, నానాద్విజగణనిషేవితంబును, నదీనదసరోవరకూపతటాకాది నానాజలాశయపరివృతంబును, దేవగంధర్వసిద్ధచారణాది సకలమునో విహారస్థానంబు నగుహిమాలయము పరమానందనిమగ్నంబై యుండె ను. హర్షోత్కర్షంబునకుఁ బ్రధానకారణంబులగు సుఖసమీరణంబులు వీచుచుండెను. మేరుమందరకైలాసమైనాకాదినగనిచయంబు లాహిమ

వంతుని బరివేష్టించి యుండెను. వశిష్ఠాగస్త్యపౌలస్త్యలోమశాదిమహార్షులందఱును నచ్చట వేంచేసి యుండిరి. పార్వతీపరమేశ్వరులకల్యాణమహోత్సవంబు లారంభములయ్యెను. వజ్రస్తంభసమంచితంబును, ముక్తాహారాలంకృతంబును, నానారత్నఖచితంబు నగువివాహవేదిక నిర్మింపఁబడియెను. జయ, లక్ష్మి, శుభ, క్షాంతి, కీర్తి, తుష్టి మొదలుగాఁగలశోభనదేవతలు వివాహమండపము నలంకరించి యుండిరి. మేరుమందరకైలాసాదిశైలంబులచేతను, స్వయముగ విష్ణుదేవునిచేతను సన్మానింపఁబడి హిమవత్సుతుం డగుమైనాకభూధరేశ్వరుండు శోభిల్లుచుండెను.

మహర్షులును, లోకపాలకులును, ఆదిత్యులును, మరుద్గణంబులును శూలపాణి యగుమహాదేవుని వివాహమండపమును నిర్మించిరి. విశ్వకర్మ స్వయముగాఁ గనకమణిశోభాయమానంబగు కల్యాణవేదికను నిర్మాణంబు గావించెను. అయ్యీశ్వరేశ్వరుని కల్యాణమహోత్సవసందర్శనార్థమై సురభి, నందిని, నంద, సునంద, కామదోహిని, సముద్రములు, నదులు, నగరాజములు, ఓషధులు, లోకమాతృగణంబులును, వనస్పతులును సకలదేవతలునుగూడ వచ్చియుండిరి. భూదేవి భూసంబంధక్రియలను, ఓషధు లన్నక్రియలను, వరుణుండు పానక్రియలను, ధనదుండు దానక్రియలను నిర్వహించుభారమును వహించి యుండిరి. అగ్నిదేవుండు స్వయముగా నభీష్టాన్నంబులఁ బచనము సేయుచుండెను. విష్ణుదేవుండు పూజాకార్యంబుల నిర్వర్తించుచుండెను. సరహస్యంబులగువేదంబులు గానముచేయ నారంభించెను. గంధర్వాప్సరోగణంబులును, కిన్నరగణంబులును నృత్యగీతహాస్యాలాపంబులఁ గావించుచుండిరి. మైనాకుండు లాజహోమంబునకునియుక్తుం డయ్యెను.

కల్యాణమండపంబునఁ బుణ్యాహవాచనము లారంభ మయ్యె

ను. మునిసంఘములు వివాహవేదిక నలంకరించి యుండిరి. అప్పుడు యథావిధిగ నగ్నిపరిస్తరణంబును, లాజహోమంబును, నగ్నిప్రదక్షిణంబును సంపన్నంబు లయ్యెను. అనంతరము విష్ణుదేవునిప్రేరణంబున శంభుండు ప్రస్తరస్పర్శనంబు సేయుచు దేవిపాదాంగుష్ఠమును స్పృశించెను.

మునిపుంగవులారా ! అప్పుడు హోమకార్యంబుల నిర్వర్తించుచున్న నేను దేవదేవుని సమీపంబున నున్నజగన్మాతయగుపార్వతిం గాంచినంతనే దుష్టబుద్ధివశంబున మదీయం బగువీర్యంబు నిపతితం బయ్యెను. ఆకారణంబుచే లజ్జాకలుషితుండ నగునేనప్పుడు మద్వీర్యంబు నొక్కచో నిక్షేపించితిని. అమోఘంబగునా తేజమునుండి వాలఖిల్యమునిగణంబు లుద్భూతు లగుటయు దేవతాసంఘంబున హాహాకారంబు పుట్టెను. నేనును లజ్జాక్రాంతహృదయుండనై చటాలునఁ బీఠమునుండి లేచిపోవుటయు దేవతలు మహాశ్చర్యనిమగ్నులై నావంకనే చూడఁదొడంగిరి.

అప్పుడు భగవానుం డగుమహాదేవుం డట్లు పోవుచున్ననన్నుం గాంచి నందీశ్వరునిం బిలిచి నీవుపోయి యవ్విరించి నిటకుఁ దీసికొనిరమ్ము ! నేనాతని బాపవిముక్తునిం గావించెద నని యాజ్ఞాపించెను. సాధుసత్తము లపరాధులయెడలఁ గృపార్ద్రహృదయు లయ్యెదరు. విషయంబులు విద్వాంసులకైనను మోహోత్పాదనంబు గావించును— పరమేశ్వరుం డగునుమాపతి నాయెడల నిట్లు ప్రసన్నుండై భూమియును జలంబును బాపమోచనంబునకుఁ బ్రధానోపాయములు. నేనిప్పుడు వానియందలిసారంబును సంగ్రహించెద నని చెప్పి మహాదేవుండు లోకమంగళంబుకొఱకు భూజలంబులయందలిసారమును దీసి భూసారంబునఁ గమండలునిర్మాణంబు చేసి యందు జలసారమును నిక్షేపించి

పావమాన్యాదిసూక్తంబులచే నభిమంత్రించి యందుఁ ద్రిలోకపావని యగుశక్తిని ధ్యానంబు చేసి నన్నుంగాంచి యోవిరించీ ! నీవీకమండ లువును బరిగ్రహింపుము. భూజలదేవతలు జగన్మాతలు. ఉత్పత్తిస్థితినాశహేతువులు వారియందే ప్రతిష్ఠితములై యున్నవి. జలభూసారమయంబగునీకమండలుమధ్యంబున సనాతనధర్మంబులును, యజ్ఞంబులును, భుక్తిముక్తులును, స్థావరజంగమంబులును నిలిచి యున్నవి.

ఈజలస్మరణంబున మానసికపాపంబులును, వర్ణనంబున వాచికపాతకంబులును, స్నానపానాభిషేచనంబులవలనఁ గాయికకలుషంబులును వినష్టంబు లగును. ఈజగంబునందు జలమే పరమపావనం బగు నమృతస్వరూపము. ఓవిధాతా ! నేను దీని నభిమంత్రింబు గావించితిని. నీవీకమండలువును బరిగ్రహింపుము. ఈకమండలుజలంబుల స్మరించుటవలనను, గీర్తించుటవలనను మానవులు సర్వాభీష్టసిద్ధు లగుదురు. కావున నీవు దీనిం గైకొనుము. పంచభూతంబులలో జలమే శ్రేష్ఠం బైనది. అట్టిజలరాశిమధ్యంబున నీకమండలుజలము సర్వోత్కృష్టంబైనది. కావున నీవీకమండలువును గ్రహింపుము. శుభకరంబును, బుణ్యదంబు నగునింతలిజలమును స్పృశించుటయు, స్మరించుటయు, సందర్శించుటయుఁ బాపమోక్షణంబునకుఁ బ్రధానసాధనములు. అని బోధించి మహాదేవుండు పరమానుగ్రహంబున నాకాకమండలుప్రదానంబు గావించెను. అప్పుడు సకలదేవతలును బరమాహ్లాదంబున జయజయశబ్దంబుల నుచ్చరించుచు దేవదేవేశ్వరుండగు నమ్మహాదేవునుద్దేశించి « సర్వలోకనాథా ! మీవివాహోత్సవసమయంబున నీపంకజాసనుండు జగన్మాత యగు దేవిపాదాంగుష్ఠముం గాంచి పాపభావనంబుచేసి పతితుండైనను జగజ్జనకుండ వగునీవాతనియెడలఁగరుణించి యాతనిఁ బవిత్రుంజేయుటకై స్మరణమాత్రంబున సకలపుణ్యప్రదాయిని

యుఁ బుణ్యామయకమండలునివాసినియు నగుగంగాదేవిని బ్రసాదించి యనుగ్రహించితి వని యనేకవిధంబుల వినుతింప నారంభించిరి.

## —♦ వామనావతారము. ♦—

అని యిట్లు బ్రహ్మదేవుండు చెప్పుటయు నారదుండు దేవా! గంగాదేవి నీకమండలుమధ్యంబున నిల్చి నీపుణ్యావర్ధనంబునకుఁ గారణ మైనది. ఆదేవి మర్త్యధామంబున కెట్లు లభించినదో యానతీయవల యు నని ప్రార్థించెను. అప్పుడు బ్రహ్మదేవుం డిట్లు చెప్పందొడంగెను. వత్సా! పూర్వకాలంబున దేవతలకుఁ బరమశత్రుండై బలినామంబు చే నొకమహాదైత్యుండు చక్రవర్తియై యుండెను. అతనికెందును బ రాజయంబు లేదు. ఆతనిమహోన్నతిం గాంచి దేవతలు చింతితులై యందఱు నేకీభవించి యాతని నెట్లయిన జయింపవలయు నని మంత్రా లోచనంబులు సేయ నారంభించిరి.

ఆబలిదైత్యుని రాజ్యశాసనసమయంబునఁ ద్రైలోక్యంబును నిష్కంటకమై యుండెను. ఆతనిపరిపాలనంబునం దాధివ్యాధులు గా ని, శత్రుభయంబులుగాని, ఈతిబాధలుగాని, అధర్మముగాని, అభా వముగాని, ఆర్తనాదములుగాని, దుర్జనోపద్రవములుగాని యెవ్వరికిని స్వప్నంబులందైనను ననుభూతంబులు గాక యుండెను. అప్పుడు దేవ త లాతనిమహోన్నతి యనుశరంబుచే భగ్నచిత్తులును, కీర్తియనుఖడ్గం బుచే ద్విధాకృతులును, శాసనశక్తిచే భిన్నాంగులునై యెందును శాం తి యనుమాటలేక పరితపించుచు నాతని యశఃపావకజ్వాలలచేఁ బ్ర తప్తగాత్రులును, భయవిహ్వలులునై మాత్సర్యవశంబున విష్ణుదేవుని శరణంబు గోరి వచ్చి ప్రార్థనాపూర్వకంబులగుదీనస్వరములతో దేవ దేవా! శంఖచక్రగదాధరా! ఆర్తులమును, గతసత్త్వులము నగుమమ్ముఁ

గటాక్షింపుము. జనార్దనా ! నీవు మారక్షణంబుకొఱకే యాయుధధారివైతివి. జగన్నాథా ! నీవంటిరక్షకుని ప్రాపు గాంచియుండియు మేమిట్టికష్టముల ననుభవింపవలసివచ్చినది. దేవా ! నీప్రణామస్తవంబులకు వినియోగింపఁదగినమావాక్కుల నిప్పు డాదైత్యుని నమస్కారస్తవంబులకై యెట్లుపయోగింపఁగలుగుదుము ? మేము మనోవాక్కర్మంబులచే భవదేకశరణ్యులమై యున్నాము. మీచరణకమలంబులనాశ్రయించియున్నమే మాదనుజున కెట్లు నమస్కరింపఁగలము ? అచ్యుతా ! మేమనేకయజ్ఞంబులయందు నిన్నేయర్చించుచు నుదారవచనంబులతో నిన్నేకీర్తించుచుందుము. నీవంటిదేవదేవునియాశ్రితుల మగుమేమాతని నెట్లాశ్రయింతుము. ఇంద్రప్రముఖులగుదేవతలందఱును నీబలమే రక్షణంబుగా నీచే నున్నతపదాభిషిక్తులై యున్నారు. అట్టివారొక్కదైత్యునకుఁ లోబడియుండుట యవమానకరము గాదా ? నీవుబ్రహ్మరూపివై సృష్టియు, విష్ణురూపివై పాలనంబును, రుద్రరూపివై లయంబును గావించుచుందువు. మేము నీకుభిన్నుండగుదైత్యునకు నమస్కరించుట యెట్లు ? దేవా ! ఈజగంబునం దైశ్వర్యమే ప్రధానమైనది. అది లేకున్నచో లాభ మేమున్నది? భ్రష్టైశ్వర్యులమగుమేమిప్పుడాతని కెట్లు నమస్కరింపఁగలము ? ఆదిమధ్యాంతరహితుండవును, జరాచరగురుండవు నగు నీవుండఁగా వినశ్వరుండును, శత్రుండు నగుదైత్యునకు మేము నమస్కరించుటయా ? దేవా ! మేమందఱమును నీమైశ్వర్యబలంబుచేఁ బరిపుష్టులమై యెప్పటికైనఁ ద్రిభువనవిజయంబు గావించి స్వాస్థ్యలాభంబు నందుదుముగాని యాదైత్యునకు వినతులమై యుండఁగలమా ?

అని యిట్లనేకవిధంబుల దేవతలు ప్రార్థించుటయు గదాధరుండు కరుణాఘనుండై సురవరులారా ! దైత్యేశ్వరుండగుబలి మద్భక్తుండు.

ఆతఁడు సురాసురగణంబులకవధ్యుఁడు. ఆబలీంద్రుఁడు నాచే నెట్లు పాలింపఁదగినవాఁడో యట్లే మీరును బరిపోషింపఁదగినవారై యున్నారు. నేనెట్టియుద్ధమును గావింపకుండఁగనే యుత్తమోపాయంబున నాతనిరాజ్యంబును గైకొని బంధించి యారాజ్యమును మీకొసంగెదను. అని యనుగ్రహించుటయు దేవతలు పరమానందహృదయములతో నమ్మహాదేవునికడ సెలవుగైకొని నిజనివాసంబులకుం బోయిరి.

అనంతరము భగవానుం డగుదేవేశ్వరుం డదితిగర్భంబునఁ బ్రవేశించి యజ్ఞేశ్వరుండును, యజ్ఞపురుషుండు నగునాతఁడు వామనుండై యవతరించెను. దేవతలందఱును మహోత్సవములఁ గావించుచు నుత్సాహముతో భావిఫలోదయంబున కెదురు సూచుచుండిరి. అంతఁ గొంతకాలమునకు బలిశ్రేష్ఠుం డగుబలి యశ్వమేధదీక్షితుం డయ్యెను. అనేకులగుమహర్షులు యజ్ఞార్థమై వచ్చియుండిరి. వేదవేదాంగవేది యగుశుక్రాచార్యుండు పురోహితుం డయ్యెను. ఆతఁడు ఋత్విక్కర్మనిరతుం డైనంతనే హవిర్భాగహారణార్థమై దేవగంధర్వాదు లేతెంచిరి. “దీయతామ్, భుజ్యతామ్” అనుధ్వనులు చెలరేఁగెను. ఈవిధముగా సకలయజ్ఞక్రియలును సంపూర్ణప్రాయము లగుచున్నసమయంబునఁ జిత్రకుండలమండితుం డగువామనమూర్తి సామగానంబు సేయుచు యజ్ఞశాలం బ్రవేశించి యయ్యజ్ఞంబునుగూర్చి యనేకవిధములఁ బ్రశంసించెను.

అప్పుడు భృగునందనుం డగుశుక్రాచార్యుండు దైత్యనిషూదనుండును, బ్రహ్మరూపధరుండు నగునవ్వామనమూర్తిం గాంచి యాతఁడే సకలయజ్ఞంబులకును, దపంబులకును ఫలదాత యనియు, రాక్షసకులంబునకు నిహంత యనియు స్పష్టముగా గ్రహించెను. తోడనే యాతఁడు సంభ్రమముతో విజయుండును, బలిశ్రేష్ఠుండును, దానశీ

లుండును, సస్త్రీకుండును, యజ్ఞదీక్షితుండు నగుబలిచక్రవర్తిం గాంచి యోరాజా! వామనాకృతి యగునివ్విప్రుండు నీయజ్ఞశాలం బ్రవేశించియున్నాఁడు. ఈతఁడు నిజముగా బ్రాహ్మణుండు గాఁడు. యజ్ఞవాహనుండును, యజ్ఞేశ్వరుండు నగువాసుదేవుఁడే దేవహితార్థమై యదితిగర్భంబున శిశురూపంబున నుదయించి యీవిధముగా నిప్పుడు నిన్ను యాచించుటకై వచ్చియున్నాఁడు. కావున నోప్రభూ! నాతో నాలోచింపకుండ నీవితని కెట్టిదానంబును గావింపవలదని బోధించెను.

అరిందముం డగుబలిచక్రవర్తి యాచార్యునివచనంబులాకర్ణించి గురువరా! యజ్ఞేశ్వరుఁడే యీరీతిగా నవతరించి మద్గృహంబునఁ బ్రవేశించుటచే నేను ధన్యుండనైతిని. అతఁ డేమివాంఛించునో దాని నొసంగుట కింకను నాలోచన యేల? అని చెప్పి సతీపురోహితసహితుండై వామనమూర్తి కూర్చుండియున్నతావునకుం బోయి ప్రణామంబు చేసి చేతులు జోడించుకొని నిలిచి మహాత్మా! నీకేమికావలయునో యర్థింపుమని కోరుటయు వామనుండు పదత్రయపరిమితంబగుభూదానముకంటె నాకన్యవాంఛితం బేదియును లేదని చెప్పెను. బలిచక్రవర్తియుఁ దక్షణమే మణికలశంబునందలిజలంబులచే ధారాపూర్వకంబుగ నవ్వామదేవునకు మూఁడడుగులభూమిని దానము చేసెను.

సమస్తమహర్షిగణంబులును, స్వయముగఁ బురోహితుండగు శుక్రాచార్యుండును, ప్రధానులగుదైత్యగణంబులును జూచుచుండఁగనే వామనమూర్తి కావిధముగా భూదానము గావింపఁబడియెను. అప్పుడు వామనమూర్తి మృదుమధురస్వరంబుతో స్వస్తివచనంబుల నుచ్చరించుచు రాజా! నీవు సుఖవర్యోదవుగాక! నాభూమిని నాకు సంప్రదానంబు సేయుము. నేను పోవలయుననుటయు బలీంద్రుం డట్లే

యని చెప్పి యాతనినంకఁ దిలకించుచు నిలువఁబడియెను. అట్లు చూచుచుండఁగనే వామనుండు విరాణ్మూర్తిధారణముం గావించి చంద్రసూర్యులు స్తనాంతరాళంబునను, గగనంబు మస్తకంబునను నిలుచునంతటిదూరంబుగాఁ బెరిఁగి నిలిచెను. యజ్ఞపురుషుండును, అచ్యుతుండు నగునాతనివిక్రమాకృతి కంతంబు లేకుండెను.

అప్పుడు దైత్యేంద్రుండగు బలి పత్నీసహితుండై యమ్మహాదేవునకుఁ బ్రణామంబు చేసి వినయమధురభాషణంబులతో శ్రీహరీ! జగన్నాథా! విష్ణుదేవా! నీవు నీశక్త్యనుసారంబుగా నీయిచ్ఛవచ్చినంతదూరమువఱకును నీపదంబులచే నాక్రమింపుము. దేవా! ఆకారణంబుచే నేనుగూడ నెల్లవిధంబుల మహోన్నతపదలాభంబు నందఁగలుగుదును. అని విజ్ఞాపనంబు చేయుటయు మహాక్రతుమూర్తియగు విష్ణుమూర్తి యట్లే యని చెప్పి కూర్మపృష్ఠంబువఱకును గలయధోలోకంబు లన్నియు నేకపాదంబుచేతను, బ్రహ్మలోకపర్యంతముం గల యూర్ధ్వలోకములన్నియు నేకపాదంబుచేతను నాక్రమించి యసురేశ్వరా! నాతృతీయపాదంబు నుంచుటకు స్థానం బెచ్చట నున్నది? ఈసమస్తప్రపంచమును నారెండడుగులకొలతకు సరిపోయినది. నీవన్నయట్లుగా మూఁడవయడుగునకుఁ దగినతావు నొసంగుమని యడిగెను.

అంత బలిదానవేంద్రుండు మందహాసంబు సేయుచు దేవాదిదేవా! నేను సృష్టికర్తను గానుగదా! ఈవిశ్వంబంతయును నీచేతనే కల్పింపంబడినది. జగన్మయా! నీదోషంబుచేతనే యిది యంతయు నల్పంబై పోయినది. ఇట్టిచో నేనేమి చేయుదును? కేశవా! అయినను నేనెన్నటికి నసత్యమాడువాఁడను గాను. కావున నీమూఁడవపదంబును నాపృష్ఠమ్మునం దుంచి నన్ను సత్యప్రతిజ్ఞునిగా ననుగ్రహింపుమని ప్రార్థించుటయు వేదమూర్తి యగుభగవానుండు ప్రసన్నుండై దై

త్యరాజా! నీనిర్మలభక్తిభావంబునకు నేను ప్రీతుండనైతిని. నీయభీష్టవరప్రదానంబు గావించెద నర్థింపు మని గ్రహించెను.

కాని బలిచక్రవర్తి యేమియు వరంబును గోరుకొనఁడయ్యెను. అప్పుడు జగన్నాథుండును, త్రివిక్రముండు నగువిష్ణుదేవుండు సంతోషించి యమ్మహాదానశీలుండగు నసురేశ్వరునకు రసాతలాధిపత్యంబును, అత్మాధిపత్యంబును భావికాలంబున నింద్రపదంబును, అవినశ్వరం బగు మహాయశంబును బ్రసాదించి సత్కీర్తికరం బగుబలిదానవేంద్రుని రసాతలరాజ్యసింహాసనంబునఁ బ్రతిష్ఠించి యథాపూర్వంబుగా స్వర్గరాజ్యము దేవేంద్రునకుఁ గరగతంబు గావించెను.

## గంగాదేవికి హరజటాజూటప్రాప్తి.

అని చెప్పి జలజసంభవుండు మరల నిట్లు చెప్పం దొడంగెను. నారదా! ఆసమయంబున మజ్జనంబునకుఁ గారణం బగువిష్ణుదేవుని సకలదేవతార్చితం బగుద్వితీయపాదము మదీయం బగు మందిరంబు నలంకరించుటయుఁ ద్రిభువనప్రశస్తం బగునవ్విష్ణుపాదము నేవిధముగా నర్చింపవలయునని భావించుచు నేనీవిశ్వంబంతయును బరికించితిని. ఆ ప్పుడునాకు సకలవస్తునిచయంబులకంటెను నాకమండలువే పవిత్రంబైనదనియుఁ, త్రిపురాసురారి యగుదేవదేవునిచే నిక్షేపింపఁబడినయందలి జలమే పవిత్రతమం బనియు నిశ్చయంబుగాఁ దోఁచుటయు వరంబును, వరణీయంబును, వరదంబును, శాంతికరంబును, పరమంబును, శుభంబును, శుభదంబును, నిత్యంబును, భుక్తిముక్తిప్రదంబును, మాతృస్వరూపంబును, భవరోగామృతౌషధంబును, పవిత్రంబును, పావనంబును, పూజ్యంబును, జ్యేష్ఠంబును, శ్రేష్ఠంబును, గుణాన్వితంబును నగు మదీయకమండలుజ్జలంబుచే ముందుగ నేనుపవిత్రుండనై మజ్జనకుండగు

విష్ణుదేవున కర్ఘ్యకల్పనంబు గావించితిని.

నేనట్లు కమండలుజలంబు నతిపవిత్రంబుగా భావించి యర్ఘ్య సంకల్పంబు గావించినంతనే కమండలుగర్భమునుండి సుమంత్రింబగు నర్ఘ్యజలంబు వెలువడి యావిశ్వమూర్తిచరణకమలంబు నభిషేకించుటయు నవ్వారిధార క్రమముగా మేరుశైలశిఖరంబునఁ బతితంబై నాల్గుభాగములుగా విభక్తంబై భూతలంబునఁ బూర్వదక్షిణపశ్చిమోత్తరదిశల ననుసరించి ప్రవహింపఁదొడంగెను. అప్పుడు దక్షిణముగాఁ బ్రవహించుచున్న జలధారను మహేశ్వరుండు తనజటాజూటంబున ధరియించెను. పశ్చిమవాహిని మరల మత్కమండలుమధ్యంబుననే ప్రవేశించెను. ఉత్తరవాహినిని విష్ణుదేవుండు పరిగ్రహించెను. సుఖప్రదంబగు పూర్వవాహినిని మహర్షులును, పితృగణంబులును, లోకపాలకులును బరమాదరంబున స్వీకరించిరి. అందుచేతనే యాజలంబునకు శ్రేష్ఠత్వంబు గలిగెను.

విష్ణుపాదంబునుండి విగళితంబై దక్షిణాభిముఖంబుగఁ బ్రవహించి మహాప్రభావసంపన్నుం డగుమహేశ్వరునిజటాజూటంబు నలంకరించియున్న జగత్పవిత్రంబగువారిధారయే సకలలోకంబులకును మాతృస్వరూపంబైనది. ఆదివ్యగంగాప్రభావమును స్మరించినంతమాత్రముననే సర్వాభీష్టంబులును సిద్ధింపఁగలవు.

## గౌతమచరిత్రము.

వత్సా! నారదా! మహేశ్వరజటాజూటంబు నలంకరించి విరాజిల్లుచున్న త్రిలోకపావనియగు గంగాదేవి యిరువురు మహాపురుషుల వలన రెండుభాగములుగా భూతలంబునకుఁ దీసికొనిరాఁబడియెను. అందొకభాగమును గౌతముఁ డనునొకబ్రాహ్మణుఁడు వ్రతదానజపతపం

బులచే మహేశ్వరు నారాధించి తత్ప్రసాదంబుచే భూమండలమునకుఁ గొనితెచ్చెను. రెండవభాగంబును మహాబలవంతుండగు భగీరథుం డనురాజేంద్రుండు తపోనియమంబులచే శంకరుని మెప్పించి తదనుగ్రహంబున నవనీతలంబునకుఁ గొనితెచ్చెను. ఈరీతిగా గంగాదేవికి ద్వైరూప్యంబు సంకల్పితం బయ్యెను. ఆచరిత్రంబు సవిస్తరంబుగాఁ జెప్పెద నాకర్ణింపుము.

ఉమాదేవి మహేశ్వరున కర్ధాంగియై యాతని కనంతప్రణయినియై యున్నసమయంబునందే గంగాదేవికూడ నాదేవదేవుని యమూల్యప్రేమలాభముం గాంచెను. పూర్వము గౌరీకల్యాణసమయంబున నామెడలం గలిగినమనఃకాలుష్యంబు కారణంబుగా సంభవించిన నామహాదోషమును నివారణంబు గావించుటకై దీనదయాపరుండును, శ్రీమంతుండు నగుశివుండు చింతాన్వితుండై పార్వతీదేవివంక దృష్టిప్రసరణంబు గావించుచు విశేషరూపంబున రసవృత్తి నవలంబించుటయు నమ్మహాదేవునియం దత్యుత్తమంబగురసోదయం బయ్యెను. అట్టిరసస్వరూపిణి యగుగంగాదేవియందు రసికత్వమును, ప్రియత్వమును, స్త్రీత్వమును, పావనత్వమును విశేషించి యుండుటంజేసి యాపరమేశ్వరున కన్నిటికంటెను గంగాదేవియే యధికప్రియపాత్రురాలై యుండెను. కావుననే యద్దేవదేవుం డాదేవిని నిరంతరమును ప్రేమతో భావించుచుండును. మఱియుఁ గొండొకకారణంబున గంగాదేవి యాశంకరుని జటాజూటంబునఁగూడ నుత్పన్నం బయ్యెను. ఈశ్వరేశ్వరుం డగుశివుం డాగంగాదేవి నతిగోపనంబుగా జటాజూటమధ్యంబున ధరించి యుండెను.

అట్లు శివజటాజూటంబున నిత్యానపాయినియై విరాజిల్లుచున్న గంగాభవానిం గాంచి భవానీదేవి యెంతమాత్రమును సహింపఁజాల

క నిరంతరమును జింతించుచుండెను. మఱియు నయ్యుమాదేవి యీమ
గ్రహించుచు నప్పుడప్పుడు గంగను బరిత్యజింపవలయు నని గంగాధరు
నిఁ బ్రార్థించి యనేకవిధముల బలవంతపఱచుచుండెను. కాని రసికశేఖ
రుండగు శంభుండుమాత్ర మేవిధముచేసైనను రసపరిత్యాగంబు సేయఁ
జాలక గంగాదేవి నట్టే జటాజూటమధ్యమునందు రహస్యముగాఁ దా
ల్చి యుండెను.

భవానీదేవి యిదియంతయుం గాంచి విచారించి యొకప్పు డే
కాంతముగా నుండి గజాననస్కందులను, జయను బిలిపించి వారితో
నిట్లనెను. చూచితిరా! కాముకుండగు కైలాసనాథుం డెంత చెప్పినను
గంగను విడువఁజాలకున్నాఁడు. ఆగంగ చంద్రశేఖరున కేకాంతప్రి
యురాలై యుండుట నామనశ్శల్యంబుగా నున్నది. ఇఁక నయ్యిరువు
రి సంబంధముఘకును శాశ్వతవిభేదముం గల్పించుట కుపాయ మేమి
యుం దోఁచకున్నది. అనియనేకవిధంబుల వారితో మంత్రాలోచనం
బు సేయుచు వినాయకు నుద్దేశించి వత్సా! నాప్రాణేశ్వరుం డగుశం
కరుండు గంగను నెత్తిపైఁబెట్టుకొని నిరంతరము నాదరించుచుండుట
నాకు విచారకరముగా నున్నది. దేవాసురయక్షగంధర్వాదులును, మ
ఱియే యితరరాజన్యులును, మీరును, నేనునుగూడ నెంతప్రయత్నిం
చినను మహేశ్వరుం డాగంగను బరిత్యజించునని తోఁచుట లేదు. కా
వున నేను మరల హిమాలయంబునకుం బోయి నాయుద్దేశముసిద్ధించుట
కై ఘోరతపంబు గావింపవలసియున్నది. అట్లు గాదేని మహాపుణ్యా
త్ముఁ డగుబ్రాహ్మణుం డెవ్వఁడైన దారుణతపంబు చేసి శంకరజ
టాజూటంబు నలంకరించి యున్న యాగంగనర్థించి భూతలంబున కవ
తరింపఁజేయుటకైనఁ బ్రయత్నింపవలయును.

అని చెప్పుటయు విఘ్ననాయకుండు తల్లివచనంబుల నాలకించి

అమ్మ! ఈవిషయంబున నన్నయు, నేనును, జయయును బాగుగ నాలోచించి కర్తవ్యంబు నిశ్చయించి మజ్జనసంకు గంగాదేవిని బరిత్యజించునట్టివిధానంబు గావించెదము. నీవీవిషయంబు నిఁక విచారింపవలదని నివేదించుటయుఁ బార్వతీదేవి యనాలకించి యక్కార్యభారమును వినాయకునియందుంచి నిశ్చింతురాలై యుండెను.

ఇట్లుండ మర్త్యలోకంబునఁ బదునాలుగు సంవత్సరంబులపర్యంతము నతిఘోరం బగునానావృష్టిసంభవించుటయు, స్థావరజంగమాత్మకంబగుజగంబంతయును దల్లడిల్లిపోవుచుండెను. అట్టివిపత్సమయంబునందుఁగూడ ధర్మనిష్ఠుం డగుగౌతమమునీంద్రుని సర్వకామప్రదంబగు పుణ్యాశ్రమంబున నెట్టికష్టంబును గానరాకుండెను. పూర్వకాలంబున నేను సమస్తప్రపంచమును మరల సృష్టింప సంకల్పించి దేవగిరియందొక మహాయజ్ఞమును గావించితిని. అందుచే నాపర్వతేంద్రమునకు బ్రహ్మగిరి యనునామంబు విఖ్యాతం బయ్యెను. గౌతమమునీంద్రుం డాపర్వతరాజము నాశ్రయించి సర్వదా నివసించుచుండెను.

ఆబ్రహ్మగిరియందలి మంగళమయంబును, పుణ్యమయంబు నగునమ్మునీంద్రుని పావనాశ్రమంబున నాధివ్యాధులును, దుర్భిక్షంబును, అనావృష్టియు, శోకభయంబులును, దారిద్ర్యదుఃఖంబులును గానరాకుండెను. అయ్యనావృష్టిసమయంబున నాతనిపుణ్యాశ్రమమునందు దక్క మఱియెందును హవ్యకవ్యాదులు లేకుండెను. ఆగౌతమమునీంద్రునివంటిదాతలును, హోతలును, యజ్వలును, మఱియెందును లేరు. ఆకాలంబున గౌతముని సత్కార్యంబులచే స్వర్గస్థు లగుసకలదేవతలును సంప్రీతు లగుచుండిరి. అందుచే దేవమానవలోకంబులయందంతటను గౌతమునిపవిత్రనామము సంకీర్తితం బగుచుండెను. అప్పుడీమానవసంఘమునం దాతఁడొక్కఁడే నిరంతరాయముగ స్వధర

రతుండై విరాజిల్లుచుండెను.

క్రమముగా సకలాశ్రమవాసులగు మునీంద్రులకందఱకును గౌతమునిమహాప్రభావముం గూర్చి తెలియవచ్చుటయు వారందఱును గలసి వెదకికొనుచు నయ్యాశ్రమంబునకు వచ్చి యమ్మునీంద్రునియాశ్రయముం గాంచి సుఖోపవిష్టులై యుండిరి. గౌతముండును వారినందఱ నాదరించి కొందఱిని శిష్యులవలెను, గొందఱిని బుత్రులవలెను, గొందఱిని దండ్రులవలెను భావించి యుచితరీతిని బరిపోషించుచుండెను. ఎవ్వరు దేనిని వాంఛింతురో, దేనిని గైకొందురో, దేనిననురూపముగ భావింతురో యట్టిభోజ్యపదార్థము లన్నియు వారికి సమర్పించుచు గౌతముండు తనయాశ్రమసమాగతులగు మునీంద్రులందఱకు ననేకవిధంబులఁ బరిచర్యలం గావించుచు సర్వదా సంతృప్తులఁ గావించుచుండెను. ఆగౌతమమునీంద్రునియాదేశముచే నోషధులన్నియును దబ్బులం బోలి యాశ్రమవాసులనందఱను నిత్యమును దనియించుచుండెను.

ఆసంయమీంద్రుండు త్రిమూర్తులను నిరంతరము నారాధించుచుండెను. ఆతనితపఃప్రభావముచే నోషధులన్నియు నేకకాలమునందే మొలకలెత్తి ఫలించి భావిఫలంబులకై మరల సంకురితంబులగుచుండెను. అందుచే నాతనికి సకలాభీష్టపదార్థములును సర్వదా సంసిద్ధము లగుచుండెను. గౌతముండును బ్రతిదినంబును దనయాశ్రమవాసులక్షేమమును బరిశీలించుచుఁ బ్రియపూర్వకంబుగ వారి నాదరించుచుఁ జాలకాలమువఱకు నందఱను స్వకుటుంబములోనివారిగా భావించి పోషించెను. సకలమునిజనంబులు నీవిధముగా నాతనియాశ్రమంబున సంతర్పితులగుటంజేసి మునిసార్వభౌముం డగుగౌతమునికీర్తి క్రమముగాఁ ద్రిభువనవిఖ్యాతం బయ్యెను.

అప్పుడు వినాయకుండు తల్లిని గుమారుని జయను నొక్కచో

జేర్చి యాలోచించి తల్లీ! దేవభవనంబున నిరంతరమును గౌతమము
నీంద్రునిదివ్యప్రభావము సంకీర్తింపఁబడుచున్నది. దేవతల కసాధ్యం
బు లగుకార్యములనుగూడ సాధించుట కాతపోధనుండు సమర్థుం డని
నేను విని యుంటిని. మహాతపోబలసంపన్నుం డగునాగౌతముం డెట్లై
నను బరమేశ్వరు నారాధించి సంప్రీతుం గావించి యద్దేవదేవుని
జటాజూటవిహారిణి యగుగంగాదేవిని భూతలంబున కవతరింపఁజేయఁ
గలఁడని నాకు సంపూర్ణమగు విశ్వాసమున్నది. కావున నాతం డెట్లైన
గంగకొఱకు గంగాధరుని బ్రార్థించునట్టియుపాయము నాలోచించి
యట్టిప్రయత్నముం గావించుట మనకిప్పు డవశ్యకర్తవ్యము. ఆతని
మూలముననే గంగాదేవి భూతలంబున కవతరింపఁగలదు.

అని విన్నవించి వినాయకుండు జననియనుగ్రహంబు వడసి యి
ప్పుడే బ్రహ్మసూత్రధరుండును, కృశశరీరుండు నగు గౌతమమునీం
ద్రుని యాశ్రమంబునుగూర్చి ప్రయాణంబు సాగించి యథాకాలం
బున నయ్యాశ్రమంబును జేరి యచ్చటిమునిగణంబులతోఁ గలసి
తానును గొంతకాలం బందుండి యొకనాఁ డమ్మునివరుల నందఱం
బిలిచి విప్రశేఖరులారా! చిరకాలమునుండి మనమీయాశ్రమంబున
గౌతమమునియనుగ్రహంబుచే నెట్టికొఱంతయును లేకుండఁ గాలక్షేప
ము గావించి యున్నాము. ఇఁక మనము స్వస్థానంబులకుఁ బోవుట
యుచితవిధానంబై యున్నది. కావున మనల నింతకాలంబువఱకు నా
దరించి పోషించిన గౌతమమునీంద్రునకు మనయుద్దేశముల నెఱింగించి
యాతనికడ సెలవు గైకొని పోవుదము. అని ప్రబోధించెను.

ప్రజ్ఞానిధియును, సకలసమ్మతుండు నగు నవ్వినాయకునివచనం
బుల కమ్మునివరులందఱు నంగీకరించి తమప్రయాణముంగూర్చి గౌత
మున కెఱింగించుటయుఁ బ్రేమమయుం డగునమ్మునీంద్రుండు వారి

పోకకు సమ్మతింపక మునిశ్రేష్ఠులారా! నేను కృతాంజలినై వినయ భావంబున మీయందఱకును జరణశుశ్రూషలం గావించెదను. పుత్త్రతుల్యుం డగు నావంటిపరిచారకుం డిం దుండఁగా మీవంటిభూసురాగ్రేసరు లన్యాశ్రమంబునకుం బోవుట యుచితంబు గాదు. మీనివాసంబుచేతనే పుణ్యమయంబై యున్నయీయాశ్రమము మీదేయని భావింపుఁడు. ఎల్లవిధంబుల స్వకీయంబై యెందును గొఱంతలేకయున్న యీయాశ్రమంబును విడిచి మీ రన్యస్థలమునకుం బోవలసిన యావశ్యకత యేమున్నది? కావున నాయెడల ననుగ్రహించి మీ రందఱు నిందే సుఖంబుగ నివసించి యుండుఁడని ప్రార్థించెను.

ఇట్లు చెప్పుచున్న గౌతముని ప్రశాంతవినయమధురవచనంబుల నాలకించి గణేశ్వరుండు తనప్రధానకార్యంబున కంతరాయంబు తటస్థింపనున్నదని విచారించి మరల నాబ్రాహ్మణులనందఱ నొక్కచోఁ జేర్చి మునివరులారా! మనమందఱమును గూడ నీగౌతమున కన్నదాసుల మైపోయితిమి. ఇట్టిమనలను స్వార్థపరుం డగుగౌతముం డూరక విడిచిపుచ్చునా? మన మెట్లు సామవచనంబులచే నాతనియనుమతిం బడసి స్వస్థానంబులకుఁ బోవఁజాలము. ఇంతకాలంబువఱకును మనల నెల్లవిధంబులఁ బోషించిన ద్విజశ్రేష్ఠుండగు గౌతముండు దండార్హుండు గాఁడుగదా! అందుచేతనే యాతని నెట్లయినఁ దప్పించుకొనిపోవుటకు నాకొకయుపాయంబు దోఁచుచున్నది. మీ రందఱు నంగీకరించినచో నేనట్టికార్యంబు నిర్వహించుటకుఁ బ్రయత్నించెద నని చెప్పెను.

అప్పు డమ్మునివరు లందఱును వినాయకుని యాలోచనంబున కంగీకరించి మహాత్మా! సాధుసత్తముండగు నీగౌతమునకుం దుద్రికకును, సకలలోకంబులకును, సమస్తబ్రాహ్మణసంఘంబులకును శ్రేయోలాభం

బు సిద్ధించునట్టి పరమోపాయంబును గావింపుము. అని ప్రార్థించుటయు గణేశ్వరుండు భూసురేంద్రులారా! పూర్వ పవిత్రుండగు నీగౌతమ మునీంద్రునకు మహోపకారం బగునట్టిమార్గమునే యనుసరించెద నని చెప్పి వారినందఱను మునుముందటికిని సమ్మతింపఁజేసి యీబ్రాహ్మణప్రవరులకందఱకును బ్రియంబు చేసి జగజ్జననియగు నిజజననికార్యంబును నిర్విఘ్నంబుగా నిర్వహింప నిశ్చయించి జయం బిలిచి యోశుభానసా! నీవితరు లెవ్వరికి నెఱుంగరానివిధంబున నొకగొప్పకార్యంబును దీర్చవలయును. నీవు గోరూపధారిణివై గౌతమాశ్రమంబునఁ బ్రవేశించి విశృతరూపంబున సందలిసస్యక్షేత్రమును విధ్వస్తంబు గావించుచుండుము. ఆసమయంబు నప్పుడువచ్చి నన్నొకచిన్నదెబ్బకొట్టినను దోడనే యంబా యని యఱచుచు జీవితావస్థయును, మృతావస్థయును గాని భావములో నీవు నిలిచినచోటనే కూలఁబడిపోవలయును.

అని బోధించుటయుఁ బార్వతీప్రియపరిచారిక యగుజయాదేవి వినాయకునిమతంబు ననుసరించి గోరూపముం దాల్చి గౌతమమునీంద్రునిశాలిక్షేత్రంబునఁ బ్రవేశించి యందలిసకలసస్యంబులను భక్షించుచు యథేచ్ఛావిహారంబు సేయుచుండెను. విప్రవరుం డగుగౌతముండు విశృతాకారంబుననున్న యాధేనువుం గాంచి యదలించి యొకజీర్ణతృణంబుతోఁ బ్రహరించుటయుఁ దత్క్షణమందే చీత్కారంబు సేయుచు నాయావుభూపతితంబై పోయెను. ఇట్లాగోవు కూలఁబడిపోయినంతనే బ్రాహ్మణసంఘంబునం దొక్కట్టైన హాహాకారంబుపుట్టెను. అప్పుడు బ్రాహ్మణులందఱును వినాయకపురస్సరంబుగా గౌతమునిచెంత కరుదెంచి ఓమునిపుంగవా! మేమిఁక నీయాశ్రమంబున నిలువఁజాలము. మేమన్యస్థానంబులకుం బోయి నివసించి యుండెదము. ఇంతకాలంబువఱకును నీవు మమ్మందఱను బుత్త్రులంబోలి పరమాదరంబునఁ బరిపాలిం

చితివి. కావున మేమిప్పు డేకగ్రీవముగా నీయనుమతికొఱకుఁ బ్రార్థించుచున్నాము.

అని మునివరులందఱు నేకవాక్యంబుగాఁ బలుకుటయు గౌతమ మునీంద్రుండు వజ్రాహతంబగుభూరుహరాజమ్మునుంబోలి నిశ్చేష్టుండై గమనోన్ముఖులై యున్నయాబ్రాహ్మణులయెదుట నిలువునఁ గూలఁబడిపోయెను. అప్పుడు బ్రాహ్మణులందఱును సాంత్వనవచనంబులతో మునీంద్రా! చూచితివా! రుద్రజననియు, జగత్పావనియు నగుగోదేవి నీపవిత్రాశ్రమంబునఁ బడిపోయినది. తీర్థదేవతాస్వరూపిణి యగు గోమాత యిందుఁ బతితయైపోవుట కారణంబుగా మేమిటనుండి వెడలిపోవుటయే యావశ్యకర్తవ్యం బైనది. ఇంకను మేమియాశ్రమము నందే నివసించి యుంటిమేని మాకొనరించుసత్కర్మానుష్ఠానంబు లన్నియును నిష్ఫలంబులై పోవును. కేవలతపోధనంబుకంటె మాకిక నన్యంబగుధన మేమున్నది? అదియే మాకుఁ బ్రధానంబైనది.

అని మునివరులందఱు నేకవాక్యంబుగాఁ బలుకుటయు మునివరుండగుగౌతముండు వారియెదుట వినయవినమితుండై నిలిచి మహాత్ములారా! మీరందఱు నిప్పుడు నాకు సహాయులై నిలిచియుండి నన్నెట్లో పవిత్రునిం గావింపుఁడు. అని ప్రార్థించుటయు బ్రాహ్మణపరివృతుండును, భగవానుండు నగువిఘ్నేశ్వరుం డప్పుడు గౌతముం గాంచి సంయమీంద్రా! ఈధేనువిప్పుడు మరణించునో, జీవించునో యెట్లు నిశ్చయించుటకు నవకాశము గానవచ్చుట లేదు. ఇట్టిస్థితిలో నీపాపకార్యంబునకు నిష్కృతినిగాని, గతినిగాని నిర్ణయించి చెప్పుట కుపాయ మేమున్నది? అని ప్రశ్నించుటయు గౌతముండు మహాత్మా! నే నేమిచేసినచో నీధేనువు జీవించి మరల లేచునో, ఎట్టిప్రాయశ్చిత్తంబువలన నాపాపంబునకు నిష్కృతిలాభం బగునో దయయుంచి నిర్ణయిం

చుటకు మీకంటెను సమర్థులెవరున్నారు? నాయెడల దయ
గ్రహించి యిట్టి మోహపాశము నుండి బురుష్టులు మీరు విధించిన కార్యమును మ
నఃపూర్వకంబుగా నిర్వహించుటకు నేను సంసిద్ధుఁడనై యున్నాఁడను.

అని యీవిధముగాఁ దపఃప్రభావసంపన్నుండును, శాంతమూ
ర్తియు, సచ్చరిత్రుండును నగు గౌతముండు ప్రార్థించుటయు బ్రాహ్మణ
రూపధరుండగు వినాయకుం డాతనిం గాంచి గౌతమమునీంద్రా! నేని
మ్మునివరుల మతంబుల ననుసరించి యొక యుపాయమును జెప్పుచున్నా
ను. దీనిని నీవును వీరును గూడ సంగీకరించి తీర్పవలయును. అవ్యక్తం
బగు బ్రహ్మదేవుని కమండలుమధ్యగతంబగు జలంబు మహేశ్వరజటా
జూటము నలంకరించియున్న విషయము మనమందఱము నెఱింగియే
యున్నాము. మునివరుండ వగునీవు మహాతపంబు గావించి నియమ
పూర్వకంబుగ నాజలము నిచ్చటికిం దెచ్చి భూపతితమైయున్న యీగో
మాత నభిషేకింపఁగలిగినచో నెల్లవిధంబులఁ బరిశుద్ధుండవు గాఁగలవు.
అప్పు డిట్టిసంకోచంబును లేక మేమందఱమును నీయాశ్రమంబున నివ
సించి యుండుము. అని వినాయకుండు చెప్పినంతనే స్వర్గమునుండి
విజయధ్వనులు చెలరేఁగెను. పుష్పవర్షంబు గురిసెను.

అంత గౌతముండు కృతాంజలియై భూసురవరులారా! మదీ
యం బగుతపోబలంబుచేతను వైశ్వానరుని యనుగ్రహంబుచేతను,
బ్రాహ్మణ్యులకృపారసంబుచేతను, మీయందఱిప్రసాదంబుచేతను నా
యుత్తమసంకల్పం బవశ్యంబుగ సంసిద్ధం బగుఁగాక! యనుటయు బ్రా
హ్మణులందఱు నట్లే యగుఁగాక యని యేకవాక్యంబుగాఁ బలికి గౌ
తముని యనుమతివడసి యన్న జలసమృద్ధంబు లగుతమతమయాశ్రమం
బులకుం బోయిరి. గణనాథుండును గృతకృత్యుండై జయాసహితంబు
గ వెడలిపోయెను. మునిప్రవరుండ గు గౌతముండు నిజతపోబలంబుచే

నిష్పాపుండై యావిచిత్రసంఘటనముం గూర్చి యనేకవిధంబుల భావించి ముహూర్తమాత్రంబున జ్ఞానదృష్టిచే సర్వంబును గ్రహించి యాత్మపా పాపనోదనమిషంబున దేవకార్యసాధనంబును, గౌరీదేవి కభీష్టసంపాదనంబును, సకలలోకోపకారకంబు నగునని నిశ్చయించి గంగానయనం బెల్లవిధంబుల శ్రేయస్కరంబని భావించి తన కెట్టిపాపంబును నిజంబుగ సంభవింపలేదని యెఱింగి ప్రీతుండై త్రిలోచనుండగు వృషభవాహనుండును, జగత్పతియు నగు దేవదేవు నారాధించుటకై యాబ్రహ్మగిరి నుండి సకలసురాసురసంపూజితంబును, ఉమామహేశ్వరసంశోభితంబు నగు కైలాసశైలంబునకుఁ బ్రయాణ మయ్యెను.

## గౌతమ్యాసయనము

వత్సా! నారదా! ప్రకృష్టజ్ఞానసంపన్నుం డగు గౌతమమునిచంద్రుం డట్లు కైలాసంబుఁ జేరి మౌనియై కుశాస్తరణంబున శుచియై యుపవసించి యీవిధంబున స్తోత్రము సేయ నారంభించెను. ఈశ్వరా! నీవు భోగార్థులగు జీవుల కభీష్టభోగప్రదానంబు సేయుటకై గుణవంతంబులును, మహత్తమంబులు నగు అష్టమూర్తులను ధరించి యుంటివి. సోమమూర్తివగు నిన్నెల్లరును సర్వదా మహాదేవనామంబున సంకీర్తనంబు సేయుచుందురు. సకలలోకసుఖసంపాదనంబుకొఱకును, సమస్తచరాచరభరణంబుకొఱకును, సంపదభివృద్ధిసంపాదనంబుకొఱకును మహేశ్వరుండ వగునీవు మహిమయరూపంబుల విరాజిల్లుచుందువు. దేవా! నీవు జలస్వరూపుండవై సృష్టిస్థితిలయంబులను గల్పించుచు భూమండలంబున కాధారుండవై యుందువు. శివుండవు, శాంతస్వరూపుండవును నగునీవు లోకంబులకు శర్మధర్మంబులను బ్రసాదించుచుందువు. దేవా! ఈజగంబంతయును నీచేతనే ప్రతిష్ఠితం బైనది. చంద్రార్క

ర్చుచుందువు. బహువిశ్వమూర్తి వగు నీ ప్రభావం బచింత్యంబై నది. ప్రభవంబున కాదికారణంబును, నిత్యంబును, సర్వలక్షణసంపన్నంబును, విలక్షణంబును, శివంబును నగు నీ దివ్యశక్తి వలన ననాదినుండియు ననవరతంబును సృష్టిస్థితి వృద్ధిలయంబులు సంభవించుచున్నవి. ఆది వ్యశక్తి నీ కధీనంబై నది. దాని కసాధ్యం బగునది యేదియును లేదు. మారుండ వగు నీ కాశక్తియే ప్రియురాలు. నిఖిలజగజ్జననియుఁ బ్రియు, మహాయశస్వినియు, సోమప్రియయు నగు నయ్యంబాదేవి ప్రీతికొఱకు జీవులు నిరంతరమును పరమాన్నఘనాదిదానంబులును, ధర్మాచరణంబులును తపోనుష్ఠానంబులును గావించుచుందురు. ఏ దేవికృపాపాంగమును దేవేంద్రుఁడుకూడ నపేక్షించుచుండునో, ఏతల్లినామోచ్చారణంబుచే సకలమంగళంబులును సంప్రాప్తంబు లగునో, ఏజనని సమస్త జగంబులయందును వ్యాపించి విరాజిల్లుచుండునో అట్టిచంద్రికావిమలకాంతిస్వరూపిణి యగు నమ్మహాదేవి నిరంతరమును విశ్వమండలమును విమలీకృతమును జేయుచున్నది. బ్రహ్మాదిస్తంబపర్యంతమునుగల చరాచరప్రపంచమునందలి జీవుల బుద్ధినయనచైతన్యంబులును, మనఃప్రముఖాంతఃకరణంబులును స్వప్రసాదంబున సఫలంబులుగాఁ జేయు జగద్గురుస్వరూపిణి యగు నాసుందరీమూర్తియే నిశ్చయముగా నావాగీశ్వరి. ఇతరులమాటయేల? చతుర్ముఖునకుఁగూడ మనోమాలిన్యమును గల్పింపఁజాలిన జగన్మాత యగు నవ్విశ్వేశ్వరియే అనేకవిధంబుల నాలోచించి పరమోపాయంబు నిశ్చయించి సమస్తప్రపంచంబును బవిత్రంబుగాఁ జేయుటకై గంగావతారంబు నంగీకరించియున్నది.

దేవా! విశ్వావాసు లగు సకలజీవులును శ్రుతివాక్యంబులచేఁ బరమేశ్వరుని ప్రభుత్వముంగూర్చి యాలోచించి వివిధప్రమాణపూర్వకంబుగా సకలధర్మంబుల ననుష్ఠించి నానాభోగంబుల ననుభవింపఁగ

లగుచున్నారు. పరమేశ్వరా! అవి యన్నియును నీవిభూతికలకు న
న్యంబులు గావు. సమస్తలౌకికాలౌకికకార్యంబులును క్రియలును కా
రణంబులును గూడ ననాదికర్తవగు నీసృష్టలనియే నిర్దిష్టంబులైనవి.
సారభూతంబును, ఏకమాత్రోపాసితవ్యంబును, పరమంబును బ్రహ్మ
పదంబు నగు నిన్ను భావించి నిన్నునుపాసించి యోగిగణంబులు ముక్త
లగుచుందురు. అట్టివారి కేకాలంబున రాకపోకలు లేవు. సాక్షాన్ముక్తి యను
నిన నుమాపతి వగు నీవే. భగవానుండవగు నీవు మాయావశంబున
నేయేరూపంబుల ధరించుచుందువో జగన్మాతయగు నీశ్వరిగూడ న
దనురూపంబు లగునవతారంబుల నెత్తుచుండును. తల్లి యగునామె
యందే పతివ్రతాధర్మము ప్రతిష్ఠితంబై యున్నది. జగత్పితరులగు నో
పార్వతీపరమేశ్వరులారా ! మీకు నమస్కారము.

అని యిట్లు గౌతముండు ప్రార్థించుటయు, వృషభధ్వజుండగు
మహేశ్వరుండు భవానీ సహితుండగుచు బ్రమథగణపరివృతుండై యాతని
యెదుట సాక్షాత్కరించి ప్రసన్నచిత్తంబున వత్సా! గౌతమా ! నీ
యుత్తమభక్తికిని స్తోత్రంబునకును వ్రతాచరణంబునకును నేను బరితు
ష్టుండనైతిని. దేవగణంబులకు దుర్లభుండనైనను నీయభీష్టంబును
దీర్చుటకు సంసిద్ధుండనైతిని. వరప్రార్థనంబు గావింపు మనుటయు వా
క్యవిశారదుండగు గౌతముండు విశ్వవిధాత యగునీశ్వరుని వాక్యశ్ర
వణంబున బ్రహర్షితపులకాంకితవిగ్రహుండై యానందబాష్పంబుల
విడుచుచు ఆహా ! ఏమి ! నాభాగ్యంబు ! నాధర్మము సార్థకంబైన
ది. నావిప్రపూజనము ఫలించినది. లోకగతి యెంతవిచిత్రమైనది !
అని భావించి మహాదేవా ! నీవు నాయెడలం బరితుష్టుండవైతివేని భ
వదీయంబగు జటాజూటంబున నివసించి యున్న సుఖసంపాదని యగు
గంగాదేవిని నాకుం బ్రసాదింపుము. సర్వదేవేశా ! త్రిపురాంతకా! నీ
కు నమస్కారము.

అని గౌతముండు ప్రార్థింపఁగాఁ ద్రిలోచనుండు ప్రీతుండై మునికులతిలకా! నీయుపకారంబుకొఱకును త్రిలోకప్రియంబుకొఱకు ను నిరంతరయత్నముగా నీవు గంగాదేవి నర్థింపఁగలిగితివి. ఇంకను నీ కేమి గావలయును? అని యనుగ్రహించినంతనే గౌతముండు మదీయంబగు నీస్తోత్రరాజముచే నెవ్వఁడైనను నిన్ను సంకీర్తనంబు గావించినంతనే యతనిసకలాభీష్టంబులును సంపన్నంబులగునట్లు చేయుము. జగన్నాథా! నీజటాజూటనివాసినియు, లోకపావనియు, ప్రేయసియు నగుగంగాదేవిని బ్రహ్మగిరినుండి యనతిదూరంబున నుంచుము. ఆదేవి సమస్తనదులయందు నుత్తమతీర్థంబై సాగరాభిముఖంబుగఁ బ్రవహించుఁగాక! అందలిజలంబులయందు స్నానమాత్రంబుననే మనోవాక్కాయికంబులగు బ్రహ్మహత్యాదిమహాపాతకంబు లన్నియును నశించుఁగాక!

శంకరా! చంద్రసూర్యగ్రహణములు, అయనములు, విషువ వైధృతిప్రముఖంబులగుపుణ్యసమయములును వటస్థించినప్పుడు సర్వ తీర్థస్నానంబు గావించినఫల మీతీర్థంబును స్మరించినంతనే లభింపవలయును. సత్యయుగంబునఁ దపంబును, త్రేతాయుగంబున యజ్ఞానుష్ఠానంబును, ద్వాపరంబున యజ్ఞదాననిర్వహణంబును, గలియుగంబునఁ గేవలదానంబును శ్లాఘ్యంబు లని నిర్దేశింపఁ బడినవి. ఇట్లు సమస్తదేశధర్మంబులును, దేశకాలయోగంబుచే బ్రసిద్ధంబులగు నఖిలోత్తమధర్మంబులును, సకలతీర్థస్నానంబులును, దానంబులును, వ్రతంబులును సంపూర్ణముగా నిర్వహించినచో నెట్టిపుణ్యంబు లభించునో యట్టిపుణ్యం బంతయు నీగంగాదేవిని స్మరించునంతనే లభింపవలయును. సాగరగామిని యగునీసురతరంగిణి ప్రవహించుచున్న ప్రదేశంబు లన్నిటియందును మీరధిష్ఠించి యుండవలయును. మఱియు నసదితర

యినీ! జననీ! నీవు నన్ను క్షమింపుము. శాంతురాలవు గమ్ము. సకలహితసాధనంబునకై సుఖగమనంబు సేయుము. అని ప్రార్థించుచుండు, గంగాదేవి దివ్యమాలికాలంకృతయు, దివ్యసుగంధానులేపితయు, దివ్యాలంకారవిభూషితయు నగు దివ్యాకృతిం దాల్చి, వత్సా! గౌతమా! నీవు సత్యవచనుండవైతివి. నేనిప్పుడు దేవభవనంబునకైనను, బ్రహ్మకమండలుమధ్యంబునకైనను, రసాతలంబునకైనను బ్రయాణంబు గావించెద ననుటయు, గౌతముండు 'ఓతల్లీ! త్రిలోకోపకారార్థమై నేను నీకొఱకుఁ దీర్ఘాలోచన నర్పించితిని. దేవీ! దయామయుం డగు శంకరుండు నాకు నిన్ననుగ్రహించెను. ఇవ్విషయంబున నీవు నాప్రార్థనంబు నన్యథా గావింపకుము' అని వేడుకొనుచున్న గౌతమునివచనంబు లాలకించి గంగాదేవి యించుక యాలోచించి తన్ను బదుఁనుభాగంబులుగా విభజించుకొని స్వర్గమర్త్యపాతాళంబులకుఁ బ్రచారంబు గావించెను. త్రిలోకగామిని యగు నాగంగాధార స్వర్గంబునఁ జతుర్భాగంబులుగను మర్త్యలోకంబున సప్తభాగంబులుగను, రసాతలంబునఁ జతుర్భాగంబులుగ విభక్తయయ్యెను. ఈవిధముగాఁ బంచదశభాగములై గంగాదేవి త్రిభువనంబులయందును బ్రవహించుచుండెను.

సర్వభూతస్వరూపిణియు, సర్వపాపవినాశినియు, సర్వాభీష్టప్రదాయినియు నగుగంగాదేవి నిత్యపావని యని వేదంబులును గీర్తించుచున్నవి. మర్త్యులు భూమండలంబునఁ బ్రవహించుచున్న యాదేవీమూర్తినేకాని స్వర్గరసాతలంబుననున్న యామెదివ్యమూర్తుల సందర్శింపఁజాలరు. గౌతమునిచే నిట్లవతారితంబైన గంగాదేవి సర్వదేవతాస్వరూపిణియై పూర్వార్ణవాభిముఖంబుగఁ బ్రవహించుచుండెను.

అనంతరము మునిశార్దూలుం డగుగౌతముండు సకలదేవర్షిగణ

నీస్థానత్రయమునందు భాగీరథీదేవి మానవులకు భుక్తిముక్తిప్రదాయినియై యుండును. అమరకంటకశైలంబున సరిల్లానుం బగు నర్మదానది ప్రవహించుచున్నది. ఈమహానది దానితో సమ్మిళితం బగుచున్నది. ప్రభాసతీర్థంబున సరస్వతీనది ప్రవహించుచున్నది. కృష్ణా, భీమరథీ, తుంగభద్రల సంగమస్థానమును, పయోష్ణీసంగమస్థానంబును ముక్తిప్రదంబులు. వత్సా! నానాదేశంబుచే నీగోదావరీనది ప్రవహించుచున్నస్థానంబులయం దంతటను మానవులకు స్నానమాత్రంబున సకలాభీష్టంబులు సిద్ధించును. కొన్నితీర్థంబులు కాలవిశేషవశంబునను, మఱి కొన్ని దేవసమాగమవశంబునను బుణ్యమయంబులై యుండును గాని యీగౌతమమీనదిమాత్రము సర్వకాలంబులయందును సర్వస్థానంబులయందును బుణ్యతమంబై యుండుననుటకు సందియంబులేదు. మునిశ్రేష్ఠా! ఈదివ్యవాహిని ప్రవహించుచున్న ద్వాదశయోజనమధ్యంబునను సార్ధత్రికోటితీర్థంబులు విరాజిల్లుచుండును.

ఈనదీమతల్లి గంగా, మాహేశ్వరి, వైష్ణవి, బ్రాహ్మి, గోదావరి, నంద, సునంద అను నామంబులచేఁ గీర్తింపఁబడుచుండును. బ్రహ్మతేజంబుచే సమానీతయైన యీగోదావరీనది కామదాయినియు, పాపనాశినియు నైనది. నాకు నిరంతరము నతిప్రియం బగు నీగోదావరి స్మరణమాత్రంబుననే సకలపాపంబులను నశింపఁజేయును. పంచభూతంబులయందును జలమే శ్రేష్ఠమైనది. దానితరువాతనే సకలభూతము లన్నియుఁ దీర్ఘభూతము లగుచున్నవి. ఈజలంబులలో భాగీరథి శ్రేష్ఠమైనది. దానికంటెను గోదావరీనది శ్రేష్ఠమైనది. హరజటాసహితంబుగ నానీతంబయిన దీనికంటె శుభావహంబు లగుతీర్థంబు లెవ్వియును లేవు. స్వర్గమర్త్యాదిలోకంబులయం దంతటను గౌతమీతీర్థమే సర్వార్థసాధక మైనది. అని గౌతమునకుఁ జెప్పి దేవదేవుం డగుమహేశ్వరుం డంతర్హితుం డయ్యెను.

కేతుంగరాజుండ నమ్మహాశ్వము నపహరించి కొంపోయి దాఁచియుంచెను. పరాక్రమవిదు లగు సగరసుతు లయ్యశ్వంబునకై భూమండల మంతయు నన్వేషించుచుండఁ గొందఱు రాక్షసు లాయశ్వమును రసాతలంబునకుఁ గొనిపోయిరి. మాయావు లగు రాక్షసులను సగరసుతులు గనుంగొనఁజాలకపోయిరి. వారు క్రమంబునఁ బర్వతములు సరోవరములు వనములు మొదలగు ప్రదేశములయందు వెదకి యయ్యశ్వంబు నెందును గానక దేవలోకంబు నందును బోయి యందెల్లయెడల నన్వేషించిరి గాని ఆయాగహయం బెందును గోచరింపకుండెను.

ఇటు మహారాజగు సగరుండు పుత్త్రులంబులచేఁ గృతప్రయత్నుండును, గృతసంకల్పుండును నై యయ్యశ్వంబు గానంబడకుండుటకై చింతించుచుండెను. సర్వశాస్త్రపారాయణు లగు సగరసుతు లట్లు యజ్ఞహయాన్వేషణంబు గావించుచు నెందును గానక పరితపించుచున్న సమయంబున నీయజ్ఞాశ్వంబు రసాతలంబున బంధింపఁబడియె దని యాకాశవాణి పలికెను. సగరసుతులు నామాట నాలకించి తత్క్షణమందే రసాతలగమనంబున కుద్యమించి భూతలంబును ద్రవ్వ నారంభించిరి. ఆసమయంబున వారు శుభార్థులై మృత్తికాభక్షణంబుననే శాంతు లగుచు రాత్రిందివంబులు భూఖననంబు గావించి రసాతలంబునఁ బ్రవేశించిరి. బలవంతులును గృతకృత్యులును నగు సగరనందను లిరీతిగా రసాతలంబునకు వచ్చి రను వార్త నాలకించి రాక్షసు లందఱును భయభ్రాంతులై మహానిద్రాముద్రితుండై యున్న కపిలమహాముని సమీపంబున నమ్మహాశ్వమును గొనిపోయి యాతనిశిరోదేశంబున దానిని బంధించిరి.

పూర్వకాలంబునఁ గపిలమునీంద్రుండు నిద్రయనుమాట నెఱుంగకుండ, బహుకాలంబు శ్రమపడి ప్రధానం బగు నొకదేవకార్యంబు

సాధించి శాంతుఁడై, యాతండు సురగణంబుల నవలోకించి నాకు ను
ఖనిద్రాస్థానంబును బ్రసాదింపుఁ డని కోరుటయు, దేవత లాతనికి రసా
తలంబును బ్రసాదించిరి. అప్పుడు కపిలుండు దేవతలం గాంచి నాని
ద్రాభంగంబు గావించువాఁ డెవ్వండైనను వీక్షణంబు భస్మీభూతుండు
గావలయును. అట్లగుటకంగీకరించినచో నేను నిరంతరాయముగ సుఖ
నిద్రం గాంచెదను. కాకున్నచో నాకీనిద్రవలనఁ బ్రయోజనంబు లేదు.
అని యర్థించి దేవతలసమ్మతిం బడసి గాని యాతఁడు రసాతలంబునఁ జేరి
శయనించి యుండెను. మహాయశస్వులగు రాజకుమారులు కపిలమునీంద్రుని
మహాప్రభావం బెఱింగినవారుగాన్నున యుద్ధంబు సేయకుండఁగనే సగరనం
దను లందఱును నొక్కసారిగ సమసిపోవుట కిదియే యుపాయము మని
నిశ్చయించి యయ్యశ్వమును గపిలునిసమీపంబునఁ గట్టిపెట్టి యేమి
జరుగునో చూతమని యందఱును సూక్ష్మభావముతో నాకసంబున
నిల్చి యుండిరి.

సగరసుతులు రసాతలంబునఁ బ్రవేశించినంతనే తమయశ్వము
ను, దానిసమీపమున శయనించియున్న పురుషునిఁ గాంచి యీతఁడే
యజ్ఞహారియై యశ్వము నపహరించె ననియు, నీతని వధించి తమ
యశ్వమును గొనిపోవలయు ననియు నిశ్చయించిరి. అందు గొందఱు
మనము యజ్ఞాశ్వమునే కొనిపోవలయునుగాని యితనిజోలిఁ బనిలేదు
యనిరి. మఱికొందఱు, ఇదేమి మాట? మనము శూరులమును, శా
సనకర్తలమును, రాజులము నై యుంటిమి. నేరములను దుర్వృత్తుల
ను విడిచిపెట్టుట క్షత్రియోచితస్వభావము గాదు. మనబలప్రభావం
బుచే నీతనివినాశవిధానంబు గావించితీరవలెను. అని యుద్ఘోషించి యం
దఱు నేకమతంబుగ నంగీకరించి పరుషవాక్యంబులచే నమ్మునిశ్రేష్ఠునిఁ
దిట్టుచుఁ బదతాడనంబులఁ గావింప నారంభించిరి. అప్పుడు కపిలము

నీమహేంద్రుండు కోపభరంబున మేల్కాంచి యాసగరనందనులవంక దృష్టి ప్రసారణంబు గావించినంతనే వారందఱును భస్మీభూతులై పోయిరి.

యజ్ఞదీక్షితుం డగుసగరుఁ డీవృత్తాంతం బేమియును దెలియనే లేదు. అప్పుడు మహాత్ముం డగునారదుండు సగరునిచెంతకుం బోయి కపిలసంస్థానంబును, యజ్ఞాశ్వస్థితియు, రాజపుత్ర నాశంబును, సగరనందనులవినాశంబును స్పష్టంబుగా నెఱింగించెను. అప్పుడు సగరుండు చింతాక్రాంతచిత్తుండై కర్తవ్యంబు నిశ్చయింపఁజాలక విచారించుచుండెను. అతని కసమంజసుం డనునింకొకపుత్రుండుం డెడివాఁడు. మూర్ఖుం డగునాతఁడు పురజనులబిడ్డల నెత్తికొనిపోయి జలంబులం దకారణముగఁ బాఱవైచుచుండెను. నగరజనులందఱు నీయత్యాచారమును సగరునకు విన్నవించుటయు నాతఁడు క్రుద్ధుండై యమాత్యులం బిలిచి దురాత్ముండగు నీయసమంజసుని రాజ్యమునుండి వెడలనడపవలయునని యాజ్ఞాపించెను. రాజశాసనంబున నమాత్యు లారాజకుమారుని బలవంతముగఁ ద్రోసివైచుటయు నాతఁడు వనవాసి యైపోయెను. ఇఁక మిగిలిన యఱువదివేలపుత్త్రులు నీవిధముగాఁ గపిలకోపానలంబున దగ్ధీభూతులై పోయిరి. ఇట్టిస్థితిలో నసహాయుం డగుసగరుం డేమిచేయఁగలఁడు?

ఆతఁడనేకవిధముల విచారించి యయ్యసమంజసునితనయుం డగునంశుమంతునిం దెచ్చి సకలరాజకార్యభారంబు నాతనిపై నుంచెను. అంశుమంతుం డప్పటికి బాలుండయ్యును ప్రసిద్ధునివలెఁ బోయి కపిలమునీంద్రు నారాధించి మరల నయ్యశ్వంబును గొనితెచ్చి పితామహునికర్పించి యాతనిచే నశ్వమేధయాగమును బూర్తి సేయించెను. ఆయంశుమంతునకుఁ దేజస్వియు, బలవంతుం డగుదిలీపుండను తనయుఁ డుదయించెను. ఆతనికి మతిమంతుం డగు భగీరథుం డుపుట్టెను.

కారంబు గావించినవా రున్నచో నాహితంబును గోరుచుండువా రెవ్వ రైన నున్నచో నేను వారిహితంబునుగోరి యమరేశ్వరుండవు, సురాసురపూజ్యుండవు, సోమశేఖరుండవు నగునీకు సమస్కరించుచున్నాను.

మఱియును భగవంతుండ వైన యోశంకరా! నాయుత్పత్తికిని నాయభివృద్ధికిని హేతుభూతు లైనవారును సమానగోత్రులును, సమానధర్ములును నైన నావారింగూర్చిన యభీష్టవరప్రదానంబును గావింపుము బాలేంద్రుశేఖరుండ వైన నీచరణకమలములకు హృదయపూర్వకముగా సమస్కరించుచున్నాను.

భగీరథుం డీరీతిని స్తోత్రము చేయుటయుఁ గరుణాసముద్రుండగు శివుం డాతనియెట్టయెదుట సాక్షాత్కరించి, అతిశయప్రేమముతో మహోన్నతు డైన యోభగీరథా! సురగణంబుల కసాధ్యమైనవరమునైనను నీకిప్పుడు ప్రసాదించుటకు సంసిద్ధుండనై యున్నాఁడను. శంకారహితచిత్తుండవై నీయభీష్టమును తెలుపుకొనుము. అని వక్కాణించిన తట భగీరథుండు సంతుష్టమానసుండై దేవా! శంకరా! అధోలోకంబునం బడి గతులు గానక యున్న నాపితృదేవతలనెల్ల నుద్ధరించి పరిత్రాణంబు గావించుటకై నీజటాజూటంబున నివసించి యున్న గంగాదేవిని నాకుఁ బ్రసాదింపుము. ఈవరమును నాకుఁ బ్రసాదించెదవేని నాకు సమస్తవరంబుల ననుగ్రహించినట్లు భావించెదను.

ఇట్లు ప్రార్థించుచున్న భగీరథుం గాంచి శంకరుండు సహాస్యవదనుండై వత్సా! నీకోరికననుసరించి సురతరంగిణి యగు గంగాదేవిని నీకు దానముచేసెదను. ఆమె నొక్కసారి ప్రార్థించెదవేని యామె నీకు లభించును. అనిపలుకుటయు భగీరథుం డాదేవ దేవునివచనంబుల నాలకించి సంప్రీతచిత్తుండై భక్తిభావంబుతో గంగాదేవిప్రీతికొఱకుఁ గఠోరతపంబును సంస్తవంబును గావించెను. అతఁడు బాలుండయ్యును

అబోలకోచితం బగునధ్యవసాయంబున గంగామహాదేవి ప్రసన్నతను గాంచినవాఁ డయ్యెను.

ఇవ్విధంబున మహేశ్వరునిచేఁ బ్రసాదింపఁబడిన నిర్ఝరతరంగిణి ని దీసికొని మహాత్ముం డగుభగీరథుండు రసాతలంబునకుం జని కపిల మునీంద్రుని సందర్శించి యాతనికి సకలవృత్తాంతమును నివేదించి య థావిధిగ గంగను సంస్థాపించి ప్రదక్షిణనమస్కారంబులు గావించి కృ తాంజలియై దేవీ! కపిలశాపంబుచే మత్పితృగణంబులు దుర్గతులై యున్నారు. తల్లీ! నీవు వారినందఱ నుద్ధరింపవలయు నని ప్రార్థించు టయు సకలలోకహితైషిణి యగుసురనదీమతల్లి సుప్రసన్నయై యనుగ్ర హించి సగరనందనుల నుద్ధరించుటకును, అగస్త్యునిచేఁ బానముచేయఁ బడిన సాగరమును మరలఁ బూరించుటకును, సకలజీవపాపాపనోదనం బుకొఱకును స్వర్గమునుండి భూలోకమున కవతరించి భగీరథప్రార్థనా నుసారంబుగా సగరసుతులను బవిత్రులుగాఁ జేసి సాగరఖాతమును నిం డించి యనంతరము సుమేరుశైలమును ప్లావితంబుఁజేసి హిమాలయం బును జేరి యటనుండి భారతవర్షంబున కవతరించి తన్మధ్యభాగమునుం డి మరలఁ బూర్వసాగరాభిముఖంబుగాఁ బ్రవహించెను. ఇది గంగా వతరణవృత్తాంతము.

ఈగంగాదేవి మాహేశ్వరి, వైష్ణవి, బ్రాహ్మి, పావని, హి మాలయశిఖరాశ్రిత, భాగీరథి యను నామంబులచేఁ గీర్తింపఁబడుచుం డును. ఈవిధముగా మహేశ్వరజటాజూటమునందలి దివ్యజలము ద్వి భాగములుగాఁ జేయఁబడి వింధ్యశైలంబునకు దక్షిణముగాఁ బ్రవహిం చున్నభాగము గౌతమీగంగానామముచేతను, ఉత్తరదిశనుండి ప్రవ హించుచున్నభాగము భాగీరథీగంగానామముచేతను వ్యవహరింపఁబడు చుండెను.

—— వరాహతీర్థవృత్తాంతము ——

అని యిట్లు బ్రహ్మదేవుండు చెప్పుటయు నారదుండు దేవా! నీవదనకమలంబులనుండి వెలువడుచున్న పుణ్యకథల నాకర్ణించుచున్న కొలఁదియుఁ దనివితీరుట లేదు. ఇంకను విభిన్నంబులగు తీర్థమాహాత్మ్యములంగూర్చి నీవలన వినవలయు నని నేనెంతయుఁ గుతూహలపడుచున్నాను. లోకవిధాతా! నీవు ముందుగా బ్రాహ్మణాసేతం బగు గోదావరీగంగయందలి విభిన్నతీర్థంబులంగూర్చిన యితిహాసంబులను సవిస్తరంబుగఁ దెలుపవలయు నని ప్రార్థించెను.

బ్రహ్మదేవుం డిట్లనియెను. కుమారా! సకలతీర్థభేదంబులును, వానిమాహాత్మ్యంబులును సవిస్తరముగా వర్ణించుటకు నాకుఁ గాని, యాకర్ణించుటకు నీకుఁగాని సామర్థ్యము లేదు. అయినను నేనిప్పుడు వానింగూర్చి సంక్షేపముగాఁ జెప్పెద నాలకింపుము. నేను త్రిలోచనుండగు దేవదేవునకు నమస్కారంబు గావించి శ్రుతికీర్తితంబులగు తీర్థమాహాత్మ్యంబులఁ బ్రశంసించెదను. ఎవ్వానిని భగవానుండగు శంకరుండు సాక్షాత్కరించి యుండునో యవి యన్నియును భుక్తిముక్తిప్రదాయకంబు లగుత్ర్యంబకతీర్థములు. విష్ణునామంబుచే విఖ్యాతంబై త్రిలోకపూజ్యంబై యున్నవరాహతీర్థంబునుంగూర్చి మున్ముందు ప్రశంసించుచున్నాను వినుము.

పూర్వకాలంబున సింధుసేనుం డనునొకరాక్షసుండు సకలదేవతలను బరాజితులం గావించి యజ్ఞమూర్తి నపహరించి రసాతలంబునకుం గొనిపోయెను. అందుచే మహీమండలమంతయును నిర్యజ్ఞంబై పోయెను. యజ్ఞం బిట్లు వినష్టం బగుటచేఁ బరలోకగతి వినాశంబు గాఁగల దని భావించి దేవతలందఱును గలసి శత్రువిజయంబునకై రసాతలంబునఁ బ్రవేశించి యారక్కసునితో నతిభీకరంబగుమహారణంబు గావిం

చిరి గాని తమ శక్తిని జయింపఁజాలకపోయిరి. అప్పుడు నిరుపాయులగునింద్రాదిదేవత లందఱును బురాణపురుషుండగు విష్ణుదేవుసన్నిధికిం బోయి రాక్షసహస్తగతంబగుయజ్ఞస్వరూపవృత్తాంతమును సవిస్తరంబుగా నెఱింగించుటయును శంఖచక్రగదాధరుం డగు నారాయణుండు ప్రసన్నుండై నేను వరాహావతారుండనై రసాతలంబునఁ బ్రవేశించి యాదుష్టరాక్షసుని సంహరించి పుణ్యమయం బగునయ్యజ్ఞంబును మరలఁ గొని తెచ్చెదను. మీరు విచారంబు విడిచి స్వర్గంబునకుం బోయి సుఖంబుగా నుండుఁడని యాశ్వాసించి వారిని బంపివైచెను.

అనంతరము చక్రధరుండగు విష్ణుదేవుండు గంగాదేవి రసాతలంబునఁ బ్రవేశించియున్నమార్గమును భేదించుకొని వరాహరూపముతోఁ బాతాళంబునకుం బోయి మహారణంబు చేసి యటనున్న దుష్టరాక్షసుల నందఱను సంహరించి యజ్ఞమూర్తి నుద్ధరించి తనముఖంబునందు నిలిపికొని [illegible] బహిర్గతుం డయ్యెను. దేవతలందఱు నాదేవదేవునిరాకకై బ్రహ్మగిరియందు నిలిచి ప్రతీక్షించుచుండిరి. వరాహమూర్తియును గదాధరుం డీవిధముగా మరలివచ్చి గోదావరీతీరంబున రుధిరమయంబులగు సర్వాంగములను బ్రక్షాళితంబులుగాఁ జేసికొనియెను. అప్పటినుండియు నచ్చటితీర్థమునకు వరాహకుండం బనునామము విఖ్యాతం బయ్యెను.

శ్రీహరి యీవిధంబుగా నాగంగాజలంబులయందుఁ గృతావగాహుండై వచ్చి యాత్మముఖస్థం బగునమ్మహాయజ్ఞంబును సురలదేవగణంబుల కర్పించెను. ఆవరాహమూర్తిముఖంబునుండి యజ్ఞం బప్పు డుత్పన్నం బయ్యెనుగావున నప్పటినుండియు యజ్ఞాంగంబులలోఁ బ్రధానం బగుస్రువంబునకు వరాహరూపంబు ప్రకల్పితం బయ్యెను. ఆవరాహతీర్థం బతిపవిత్రంబును, బుణ్యమయంబును, సర్వకామప్రదం

బు నైనది. అందవగాహనంబు సేయువారికి సకలయజ్ఞఫలంబులును సమకూడఁగలవు. ఆతీర్థంబునకుఁ బోయి యేపుణ్యాత్ముండు పితృదేవతలను స్మరించునో యాతని పితృగణంబులు సకలపాపవిముక్తులై శాశ్వతస్వర్గావాసు లగుదురు.

## —♦ కపోతతీర్థమాహాత్మ్యము. ♦—

నారదా! కుశావర్తతీర్థంబును గూర్చి సంపూర్ణముగఁ గీర్తించుట కెవ్వరికిని సాధ్యంబుగాదు. ఆతీర్థస్మరణమాత్రంబుననే మానవులు కృతకృత్యు లగుదురు. అది సకలాభీష్టప్రదాయకం బగుపుణ్యతీర్థము. మహాత్ముం డగుగౌతముండు గంగాదేవిని కుశలచే నావర్తితంబు గావించి యచ్చటికిఁ గొనితెచ్చుటచేతనే యాతీర్థమునకుఁ గుశావర్తంబను నామము గలిగెను. అందు స్నానదానంబులవలనఁ బితృదేవతలు తరింపఁగలరు. సరిల్లలామ మగునీలగంగ నీలాచలమునుండి ప్రవహించుచున్నస్థానమునందు నియమితచిత్తంబుతో స్నానము చేసి యేకొలఁదిసత్కర్మంబు నిర్వర్తించినను మహాఫలంబు లభించుటయే కాక యట్టివానిపితృదేవతలందఱు నుద్ధరింపఁబడుదురు.

ఉత్తమం బగుకపోతతీర్థము త్రిలోకవిఖ్యాతం బైనది. మహాఫలదాయకం బగునాతీర్థముంగూర్చినయితిహాసమును వర్ణించెద నాకర్ణింపుము. పూర్వకాలంబున బ్రహ్మగిరితటంబున దారుణప్రకృతియగు నొకవ్యాధుండు నివసించియుండి నిరంతరమును విప్రులను, సాధువులను, పక్షులను, మృగంబులను సకలజీవులనుగూడ ననేకవిధంబుల హింసించుచుండెను. పాపాత్ముం డగునవ్వ్యాధుడు మిగులఁ గోపశీలుండును; అసత్యవాదియు, భీషణాకారుండును, అత్యుగ్రుండును, వికృతదేహుండును, హ్రస్వభావుండును, నీలనేత్రుండును, ఉన్నతదంతుండును,

హ్రస్వచరణుండును, హ్రిస్వోదరుండును, గార్దభస్వరుండును, పాశహస్తుండును, క్రూరచిత్తుండును, దారుణచరిత్రుండునై యెల్లప్పుడును ధనుర్బాణములను ధరించి జీవహింసాపరతంత్రుఁడై సంచరించుచుండును. ఆతనిభార్యయుఁ బుత్రులునుగూడ నాతనికనురూపచరిత్రులే యై యుండిరి.

ఒకనాఁడక్కిరాతుండు భార్యచేఁ బ్రేరేపింపఁబడి వేఁటకై సాంద్రారణ్యమధ్యంబునఁ బ్రవేశించి వెదకి వెదకి యనేకమృగంబులను, బక్షులను సంహరించి మఱికొన్నిటిని బ్రాణములతోనే పట్టుకొని జాలమధ్యంబున బంధించి మహానందముతో నమ్మహారణ్యంబునఁ బరిభ్రమించుచుండెను. ఇట్లుండ వేళయతిక్రమించుటయు క్షుత్పిపాసల వలన నాతనికి దేహశ్రైశల్యంబు తటస్థించెను.

అది వైశాఖము. అపరాహ్ణము తిరిగిపోవుచుండెను. వ్యాధుండు మహారణ్యంబునఁ జాలదూరమువఱకును దిరిగితిరిగి పరిశ్రాంతుండై యిఁకవేఁటయందలియుత్సాహంబు విడిచి గృహాభిముఖుండై బయలుదేఱెను. చనుచుండఁగనే యంతలో నీలమేఘములు బయలుదేఱి యాకాశమంతయు నావరించుకొనియెను. తోడనే విద్యుల్లతలును, భీకరగర్జారావంబులును వెలువడియెను. ఝంఝామారుతములు చెలరేఁగి దెసలఁ బ్రకంపితములుగాఁ జేయఁదొడంగెను. ఆవెంటనే భీకరకరకాపాతంబులతో వర్షధారాపాతం బారంభమయ్యెను. అతిదుస్సహం బగువానసమయంబునఁగూడ నాలుబ్ధకుండు జలధారలందోఁగుచు నింటిమొగంబై పోవుచునే యుండెను. కాని కొంతసేపటి కాతఁడు త్రోవదప్పిపోయెను. మేఘములు కుంభవృష్టిగా వర్షించుచుండెను. వనప్రదేశం బంతయు జలమయమై యుండెను. అందుచే నాతనికి మిట్టపల్లములును, గోతులును, ముండ్లపొదలునుగూడ గోచరింపకుండె

ను. ఆపాపాత్ముని కచ్చటం దలదాచుకొనుట కొట్టియూంశ్రియము నగ పడదయ్యెను.

ఇట్టిస్థితిలో నాతండు తనలోం దానే « నేనేమిచేయుదును ? ఎచ్చటికిం బోవుదును? అంతకునిం బోలిన సకలజీవహంతకుండనగు నాకుం గూడ నీశిలావర్షము భయంకరముగా నున్నది! ఇచ్చట నాకాశ్రియం బిచ్చువా రెవ్వరు నగపడుట లేదు. ఒక్కచెట్టయినను, మిట్టయైనను గూడం గానరాకున్నది. ఏమిచేయుదును? అతివేగమున నేచెట్టుక్రిందికైనను బోయి యీవర్షావేగము శాంతించువఱకును దలదాచుకొనియెదం గాక !" అని భావించుకొనుచు దుర్గతగమనంబుతో ముందటికిం బోయి కొలందిదూరంబునం దొకమహావృక్షముం గాంచి సన్నిధింగన్న పేదవలె దానిక్రిందికిం బోయి నిలువంబడియెను. విశాలశాఖావిలసితంబును, బల్లవకుసుమఫలభరితంబు నగునమ్మహాభూరుహము నక్షత్రములలోం జంద్రునివలె, మృగంబులలో సింహమునవలె, నాశ్రమంబులలో గృహస్థాశ్రమమువలె, ఇంద్రియంబులలో మనంబువలె శ్రేష్ఠంబై సకలభూతంబుల కాశ్రియస్థానం బగుపర్వతరాజముం బోలి విరాజిల్లుచుండెను.

ఆతరువరము నాశ్రయించి యున్నయక్కిరాతునివసనంబులన్నియును వర్షధారలచేం దడిసి ముద్దలై యుండెను. ఆయాసముచే దేహమంతయు నవసన్నంబై యుండెను. ఆయవస్థలో నాతండు తనదారపుత్రులక్షేమముం గూర్చి భావించుకొనుచు వికలహృదయుండై యెప్పుడు వర్షము శాంతించునా, యెప్పుడింటికిం బోవుదునా యని యానే గపడుచుండెను. క్రమముగా నాదిత్యుం డస్తంగతుండయ్యెను.

ఆవృక్షరాజమునం దొకకపోతము భార్యతోడను, పుత్త్రపౌత్త్రులతోడను గలసి మహానందంబున సకలభోగంబుల ననుభవించుచు ని

శ్శంకచిత్తముతోఁ జాలకాలమునుండి యెంతో సుఖముగాఁ గాపురము సేయుచుండెను. పతివ్రతయైన యాతనియిల్లాలు జలానిలవహ్నిభయ వివర్జితం బగు నాతరుకోటరమునందు పతిసహితయై యతిప్రియంబు గఁ గాలక్షేపమొనర్చుచుండెను. కపోతము సర్వదా బిడ్డలతోఁ గూడి యచ్చటనే ప్రొద్దుపుచ్చుచుండెను. దైవవశంబున నీనాఁడు కపోతీక పోతంబులు రెండునుగూడ నాహారసంగ్రహంబునకై యావాసంబు విడిచిపోయెను. అందు కపోతముమాత్రము యథాసమయంబున గూఁటికి వచ్చి చేరెను గాని దౌర్భాగ్యముచేఁ గపోతి యక్కిరాతునిజాలంబునఁ దగిలికొనియెను. దాని నాలుబ్ధకుండు ప్రాణములతోనే పట్టుకొని వలలో బంధించి తెచ్చియుండెను.

అప్పు డక్కపోతము గృహిణీశూన్యం బగు గృహంబును మాతృహీనం బగు సంతానమును భయంకర మగు వర్షాపాతమును, నాక్రాంతంబగు నంధకారంబును దిలకించి యట్టియున్నసమయంబున భార్యావియోగంబును భావించుకొనుచు ననేకవిధంబులఁ బలవింపఁ దొడంగెను. పాపము తననెచ్చెలి యగుకపోతి యాచెట్టుక్రింద నున్న కిరాతునివలలోఁ దగులుకొనియున్న దన్నసంగతి యెఱుంగఁజాలక, ముక్తకంఠముతోఁ బ్రియురాలిగుణముల నీగతిగాఁదలపోయుచు విలపింపం గడంగెను.

నాహృన్నివాసినియు, కల్యాణియు నగునిల్లా లింకను నింటికి రాలేదు. ఆదేవి నాధర్మంబునకు జనని. నాప్రాణంబుల కధీశ్వరి. ధర్మార్థకామమోక్షంబులను పురుషార్థంబులకు నిత్యసహచరి. ప్రియురాలగు నామె నేను సంతోషముతో నున్నపుడు నగుమొగముతో నలరారుచుండును. కష్టముతో నున్నపుడు నాదుఃఖమును దూరముసేయుచుండును, నాయిల్లాలగు నామె నాయాలోచనములయందు సఖియై సర్వదా

నావచనానుసారంబుగఁ బ్రవర్తించుచుండును. అయ్యో! ఆదిత్యుండస్తం గతుండయ్యె చాలసేపయినది. కల్యాణి యగునామె యింకను రాలేదు. నాప్రేయసి, నాకంటె నతిరిక్తంబు లగు వ్రతంబులనుగాని మంత్రంబులనుగాని దైవక్రియలనుగాని ధర్మములనుగాని యజ్ఞములనుగాని యెఱింగినది గాదు. ఆమె నిరంతరగతంబును పతిప్రాణయు, పతివ్రతయు, పతిమంత్రయు పతిప్రియయు నై యుండును. ఏకారణముననో శుభానన యగునామె యింకను నిల్లు చేరలేదు. నే నేమి సేయుదును? ఎచ్చటికిఁ బోవుదును? గృహిణీవిహీనంబగు నీగృహము భయంకరారణ్యము వలెఁ గానంబడుచున్నది. లక్ష్మీస్వరూపిణి యగు నామె యున్నప్పుడు భయంకరసమయములయందుఁగూడ నీగృహము శోభాయుక్తమై విరాజిల్లుచుండెడిది. గృహిణియే గృహ మని చెప్పఁబడుచున్నది. ఆమె యింకను నిలు సేరకుండుటకు హేతు వేమై యుండునో! భార్యావియుక్తుండనై నే నొకనిముసమైనను ప్రాణములను భరింపఁజాలకున్నాను. ప్రియకరంబు లగు నీప్రాణములను బరిత్యజించెదనుగాక! అయ్యో! నోరెఱుంగని యీపసిబిడ్డల కేగతి గల్పించి ప్రాణములను విడువగలను? అని యనేకవిధంబుల వాపోవుచుఁ గపోతము దుఃఖింపందొడంగెను.

అప్పు డక్కిరాతునివలలోఁ దగులుకొని నిరుపాయయై పడియున్న కపోతి భర్తృవిలాపంబుల నాలకించి శోకగద్గదస్వరముతోఁ దనభర్తం గూర్చి ఖగరాజా! నే నీవ్యాధునిజాలమధ్యంబునఁ జిక్కుకొని వివశనై పడియున్నదానను. మహామతీ! హింసాపరుం డగు నీలుబ్ధకుండు నన్నుఁ బాశములచే బంధించి తెచ్చియున్నాఁడు. ఏమైన నేమి? నేను ధన్యురాలను. నీచే ననుగ్రహింపఁబడి నాజీవితము సఫలమైనది. ఏమనిన, నాపరోక్షమునందు మద్గుణకీర్తనంబు గావించుచున్న ప్రాణేశ్వరుని ప్రియమధురవచనంబులను వినఁగలిగితిని. నాయం దట్టిగు

ణంబు లున్నను లేకున్నను నేను గృతార్థురాల నైతి ననుట కెట్టిసంశ యంబును లేదు. ప్రాణనాథుండు పరితుష్టుం డగుటకంటెం బతివ్రతల కు భాగ్య మేమున్నది? పతి సంతుష్టుం డగునేని సతులయెడ సకలదే వతలును సంతుష్టు లగుదురు. స్వామి యసంతుష్టియే సతులకు నిశ్చ యముగా సర్వనాశనకారణమైనది. నీవే నాస్వామివి. నీవే నాదేవత వు. నాప్రభుండవును మిత్రుండవును పరమాశ్రయస్థానంబును నీవే. వ్రతంబును, పరబ్రహ్మంబును, స్వర్గంబును, మోక్షంబును నాకు నీ కంటె సన్యంబులు గావు. కల్యాణమూర్తీ! నీవు నాకొఱ కెంతమా త్రంబును దుఃఖింపవలదు. నీమనంబును, నీధర్మమునందే సుస్థిరంబు గాం జేసికొనుము. నేను నీయనుగ్రహంబుచే నఖిలసుఖభోగంబులును ననుభవించితిని. ఇంక నాకొఱకు విచారించుటవలనం బ్రయోజనం బే మియును లేదు. స్వధర్మనిర్వహణంబునకై సర్వేశ్వరుని ధ్యానించుచుం గాపాడుకొనుచుండుము.

అని యివ్విధంబున నాశ్వాసించుచున్న ప్రియురాలి యుపదేశ వాక్యంబుల నాలించి చటాలునం గొమ్మపై నుండి యక్కపోతము క్రిం దికి వ్రాలి సంబంధనిర్బంధయగ్నిని యగు తనహృదయేశ్వరిచెంత కరుదెంచి మృత్యప్రాయురాలై పడియున్న యమ్మెఱకు టెఱుకును, బంధింపంబడియు న్నభార్యను వీక్షించి ప్రియసీ! ఇప్పు డిక్కిరాతుం డచేతనప్రాయుం డై యున్నవాఁడు. కావున నిదియే మంచిసమయము. నీకు బంధ మోక్షణంబు గావించెదను. అని వక్కాణించుటయుం గపోతి తనప్రా ణనాథునిం గాంచి మహాభాగా! నీవు నాబంధమోచనంబునకై ప్ర యాసపడవలదు. ప్రాణిగణంబుల యన్యోన్యసంబంధము చిరస్థాయి గాదుగదా! ఖేచరంబు లగు విహంగగణంబులు వ్యాధులకు నాహార స్వరూపంబులుగా. నిర్దేశింపంబడినవి. జీవులకు జీవులే యాహారంబులు.

22

వచ్చి యాజ్వాలతాకాష్ఠంబును గిరాతునిసన్నిధినుంచి శుష్కతృణపర్ణంబుల దానిపై వైచి పక్షంబులచే విసరుచు నగ్నిని బ్రజ్వలింపఁజేసెను. అప్పు డయ్యనలజ్వాలలవలన శీతపీడితంబులై యవశంబులై యున్న యాలుబ్ధకుని యంగకంబు లన్నియును దేఱుకొనియెను.

అట్లు సచేతనుం డయ్యును నాఁకలిబాధచేఁ దూలిపోవుచున్న యావ్యాధుం గాంచి కృపారసతరంగితాంతరంగ యగుకపోతి జాలిపడి పావనచరిత్రుం డగుతనప్రాణేశ్వరుం గాంచి మహాభాగా! కర్తవ్యకుశలుండ వగునీవిప్పుడు నేర్పుతో నాబంధవిమోచనంబు గావింపుము. నేను నాదేహముచే క్షుధార్తుం డగునీయభ్యాగతునకుఁ దృప్తివిధానంబు నాచరించెదను. ఓసువ్రతా! ఇట్లు చేసితివేని లోకంబునం దతిథిపూజనంబు గావించుపుణ్యాత్ములకుఁ గరతలామలకంబు లగుపుణ్యఫలంబు లన్నియు నీవు లభింపఁగలవు.

అని కపోతి విన్నవించుటయుఁ గపోతంబు, శుభాననా! మదీయసహధర్మిణి వగునీవు, నేను జీవించియుండఁగనే స్వతంత్రముగ ధర్మాచరణంబు సేయుట యుచితము గాదు. ఇయ్యతిథికిఁ బ్రియాతిథ్యంబు గావించుటకు నేనే యర్హుండను. సకలధర్మవేదిని వగునీవింక ననుమతింపవలయును. అని చెప్పి ప్రత్యుత్తరంబు నపేక్షింపకుండఁగనే కపోతం బయ్యనలంబునకు ముమ్మాఱు ప్రదక్షిణంబు సేసి చతుర్భుజుండును, విశ్వాత్మకుండును, శరణ్యుండును, భక్తవత్సలుండు నగుమహావిష్ణువును సంస్మరించుచు, సాక్షాద్విష్ణుస్వరూపుండవగు నోయభ్యాగతా! నన్నాహారంబుగాఁ బరిగ్రహింపు మని ప్రార్థించి యగ్నిప్రవేశం బొనర్చెను. అగ్నిజ్వాలామధ్యంబున నాక్షణంబునందే నిర్జీవమై పడియున్న యక్కపోతముం గాంచి నిరంతరహింసాపరాయణుండును, వజ్రకఠోరహృదయుండును నగునక్కిరాతుండు, ఛీ! ఛీ! మానవదేహధారణముం

గాంచియున్న నాజీవితము నిరర్థకమైనది. కలుషదూషితం బగు నాకా యపోషణంబుకొఱకు నీపక్షిరాజము తనపవిత్రజీవితము నిప్పుడు తృణ ప్రాయముగా విసర్జించివైచినది. ఆహా! మానవుండ నయ్యును నేనం తటిక్రూరకర్ముండ నై పోయితిని! అని యనేకవిధంబులఁ బశ్చాత్తాప దుఃఖితుండై లుబ్ధకుండు పరితపించుచున్నసమయంబునఁ గపోతి యా తనిం గాంచి ఓమహాభాగా! సత్వరముగ నాబంధవిమోచనంబుఁ గా వింపుము. అదిగో! స్వర్గాభిముఖంబుగఁ జనుచున్న నాస్వామి య ప్పుడే చాల దూరమైపోవున్నాఁడు. అని హృదయావేగముతో నెలుం గెత్తి ప్రార్థించుటయుఁ, గిరాతుండు భీతుండునుంబోలెఁ దత్క్షణంబ పక్షిరమణిబంధవిమోచనంబుం గావించెను.

తోడనే యక్కపోతి విదగ్ధంబైన విభునిదేహమునకుఁ బ్రదక్షి ణంబుసేసి యగ్నిసన్నిధానంబు గావించుకొని పతితోడియనుగమనమే పతివ్రతలకుఁ బరమధర్మము. సతుల కిదియే ప్రశస్తమార్గం బని వే దంబులు కీర్తించుచున్నవి. ఈసద్ధర్మము జగమంతటను సమాదృతం బై యున్నది. పాములవాఁడు పుట్టలోనుండి పామును బలముకొలఁది బైకిఁ దీయునట్లు భర్త తనతేజముచే సహధర్మిణిని స్వర్గమున కాకర్షించు కొనును. పతి ననుగమించిన పతివ్రత సార్ధకోటివత్సరంబులపర్యంత ము స్వామితోఁ గలసి స్వర్గంబున సకలోపభోగంబుల ననుభవించు చుండును. అని ప్రశంసించుచుఁ గపోతి భూదేవికిని గంగాదేవికిని తన నివాసం బగు వనస్పతిరాజంబునకును బ్రణామంబుల నాచరించి, తన సంతానంబునకు సమాశ్వాసపూర్వకంబుగా మహాభాగా! నీప్రసాదం బుచే నాకిప్పుడు సతీధర్మనిర్వహణసౌభాగ్యము లభించినది. నీవిఁక నా సంతానమును క్షమింపుము. నేను నాభర్తతోఁ గలిసి స్వర్గధామంబు నకుఁ బోవుచున్నాను. అని పతివ్రత యగు నాశకుంతసతీమణి పలుకు

చు పావకజ్వాలాపరివేశంబుం గావించెను.

ఆసమయంబున వ్యోమమండలమునుండి జయజయధ్వానంబులు దశదిశలం బ్రతిధ్వనితంబు లయ్యెను. తత్క్షణమే యావిహంగదంపతులు విబుధదంపతులం బోలి సూర్యసన్నిభం బగు సుందరవిమానారూఢులై యాకాశంబున వెలుంగుచు హర్షావిష్టుండును, విస్మయవిహ్వలుండును నగు నావ్యాధు నవలోకించి మహామతీ! మే మిప్పుడు దివ్యధామంబునకుఁ బోవుచున్నారము. సెలవొసంగుము. నీవు మా కతిథివి. మాస్వర్గగమనంబునకు సోపానస్వరూపుఁడవు. నీకు నమస్కారము. అని పలుకుచున్న విమానారూఢు లగునవ్విహంగదివ్యదంపతుల నవలోకించి ప్రాణిహింసాపరాయణుం డగు నావ్యాధుండు తత్క్షణంబ ధనుశ్శరాదిమృగయాపరికరంబుల నన్నిటిని దూరంబుగ విసరి పాఱ నైచి కృతాంజలియై ఓదివ్యదంపతులారా! మీరు నన్నిచ్చటఁ బరిత్యజించి పోవలదు. అజ్ఞానుండగు నిమ్మూఢవ్యాధునియెడల నించుక సత్కృపాప్రదానంబు గావించుట సాధువు లగు మీకవశ్యకర్తవ్యము. నేనిప్పుడు మీకు మాననీయుండ నగునతిథిని. నాపాపనిష్కృతి కుపాయం బుపదేశించి మఱిపోవలయును.

అని పశ్చాత్తప్తహృదయుండగు లుబ్ధకుండు ప్రార్థించుటయుఁ బక్షిదంపతులు పరమాదరంబున నీవుగౌతమీతీరంబునకుం బొమ్ము. నీ కచ్చట శుభం బగుఁగాక. నీచేసినపాపంబు లన్నియును పరమపావనియగు గోదావరినదిసన్నిధిని నివేదింపుము. అచ్చట నీవొకపక్షంబు వఱకు నిలిచి ప్రతిదినంబు నందలి పవిత్రజలంబులలో నవగాహనంబు సేయంజాలితివేని నీసర్వపాపంబులును భస్మీభూతంబు లగును. అనంతరము మరల నొకసారి యాగంగావగాహనముం గావించితివేని ముక్తపాపుండవై పవిత్రుండవగు నీ కశ్వమేధఫలంబు లభించుటయేకాక

నీవు పుణ్యాత్ముండవు వయ్యెదవు. సరిద్వరయగు గౌతమీదేవి బ్రహ్మవిష్ణుమహేశ్వరులనుండి సముత్పన్నయైనది. కావున నందు మఱియొకసారి స్నానముచేసితివేని కలుషితంబగు నీదేహమును బరిత్యజించి శ్రేష్ఠంబగు విమానంబు నధిరోహించి నిశ్చయముగా స్వర్గధామమును జేరఁగలవు.

అని యానతిచ్చుటయు లుబ్ధకుండు సంప్రీతుండై పక్షిదంపతులవచనానుసారంబుగ సకలకర్మంబులను నిర్వర్తించి దివ్యవిమానారూఢుండును దివ్యరూపధరుండును దివ్యమాల్యాంబరభూషితుండును దివ్యాప్సరోగణసహితుండును నై పూర్వగతులగుకపోతదంపతులంబోలి యాతండును గౌతమీప్రభావంబున స్వర్గగతుం డయ్యెను. అప్పటినుండియు నచ్చోటి పావనతీర్థము కపోతనామంబునఁ బ్రసిద్ధంబయ్యెను. ఆతీర్థరాజమునందు, స్నానదానపితృపూజనజపయజ్ఞాదిసకలకర్మంబులును గూడ నక్షయఫలదాయకంబులు కాఁగలవు.

## —♦ కుమారతీర్థప్రశంస ♦—

కుమారా! కార్తికేయంబు, కౌమారంబు నను నామంబులచేఁ బ్రసిద్ధం బగు నొకతీర్థము విరాజిల్లుచుండును. ఆతీర్థనామశ్రవణమాత్రంబుననే మానవులు కులవంతులు, పుత్త్రవంతులు నగుదురు. పూర్వకాలంబున తారకాసురుండు నిహతుండై దేవతలు స్వస్థచిత్తులై యున్నసమయంబునఁ బార్వతీదేవి సంప్రీతచిత్తముతో జ్యేష్ఠపుత్త్రుండగు కార్తికేయుం గాంచి కుమారా! ఈత్రిభువనమధ్యంబున నీకు మనఃప్రియంబు లగుభోగ్యపదార్థంబుల నన్నిటిని నాయాజ్ఞచేతను నీజనకుం డగుమహాదేవుని యనుగ్రహంబువలనను యథాసుఖంబుగ ననుభవింపు మని యానతిచ్చుటయు మాతృవచనానుసారంబుగఁ గార్తికే

యుండు, మహోత్సాహంబుతో బలవంతముగా మనస్సుఖంబుకొఱకు దేవపత్నీగణంబుల ననుభవింపఁదొడంగెను. అమరరమణీమణులుగూడ నట్లే యక్కుమారునియెడల సమాసక్తహృదయులై సంచరింపందొడంగిరి.

ఓనారదా! అప్పుడు సమస్తదేవతాపత్నులును కార్తికేయునిచే ననుభుక్తలగుటం గాంచి సురగణంబు లాతనియకార్యంబును సహింపఁజాలక త్రిలోకమాత యగు పార్వతీదేవిచెంతకుం బోయి కుమారుని దుండగంబులను సవిస్తరంబుగా నివేదించుటయు, నద్దేవి మిగుల విచారించి కుమారునిం బిలిపించి యెన్నియో విధంబుల మందలించెనుగాని మదాసనుండుమాత్రి మెంతకును సన్మార్గంబునకు రాఁడయ్యెను. అప్పుడు కుమారవత్సల యగు భవానీదేవి సాభుశాపవశంబున నాత్మనందనుస కెట్టి యనర్థంబు వాటిల్లునో యని పుత్రస్నేహంబునఁ జింతాకులితహృదయయై దేవకార్యంబు నిర్వర్తించుటకును దేవపత్నీగణంబుల రక్షించుటకును బహుప్రకారంబుల నాలోచించి యొక్కయుపాయంబు నిర్దేశించి జగన్మయి యగు నాదేవి మదాసనుండు కామించు నమరకాంతలయందు దావహించియుండెను. అంతఁ గుమారుండు తాను కామించియున్న యేదేవతరుణీమణిచెంతకుం బోయి తిలకించినను ఆదివ్యకాంతయందు మాతృదేవత యగు నంబికామూర్తియే దృగ్గోచరంబగుచుండుటయు నాతఁడు లజ్జితుండై యామెకు నమస్కారంబు సేయుచు వెడలిపోవలసినవాఁడగుచువచ్చెను. ఇట్లాతనికి సకలదేవాంగనామూర్తులయందును నిజమాతృమూర్తియే కానవచ్చుచుండుటం జేసి జగం బంతయు మాతృదేవతామయం బయియున్నట్లు లాతనికిఁ దోఁచినంతనే వైరాగ్యోదయం బయ్యెను. అప్పు డాతనికి భోగప్రవృత్తినుండి నివృత్తి గలిగించుటయే తల్లియుద్దేశ మని యాతనికిఁ దోఁచెను.

తల్లియుపదేశ మదియే యైయున్నయెడలఁ దొలుదొల్తఁ దనకు భోగప్రవృత్తి గలిగించుటకుఁ గారణ మేమైయుండు నను సంశయముకూడ నాతనికిఁ గలిగెను. తల్లి తనయెడలఁ గావించిన యీసమస్తవిషయంబులు ను హాస్యాస్పదంబుగా నుండె నని యాతఁడు భావించుకొనెను.

కుమారుం డివ్విధంబుగ ననేకాలోచనంబులు గావించుకొని లజ్జితుండై గౌతమీతీరంబునకుం బోయి నదీగర్భంబునఁ బ్రవేశించి, తల్లీ! నాప్రార్థనము నాకర్ణింపుము. ఈక్షణమునుండి స్త్రీరూపధారిణు లగు సకలజీవులును నాకు మాతృసమాన లగుదురుగాక! అని వచించునంతలో సర్వజ్ఞుం డగు శంకరుండు పార్వతీసహితుండై సాక్షాత్కరించి, అఁగు మాఁగు మని నివారించుచుఁ బుత్త్రుని కెట్టివరప్రదానంబు గావింపవలయు నని యాలోచించుచుండఁ గృతాంజలిపుటుండగు స్కందుండు తండ్రిం జూచి యిట్లనియెను. దేవదేవా! నేను దేవసేనానాయకుండనై దేవేంద్రునివలె విరాజిల్లుచున్నాను. నీతనయుండగు నట్టిభాగ్యమే నాకుఁ జాలును. అన్యవరంబులతో నా కిఁకఁ బ్రయోజనం బేమి యున్నది? కాని, నీవు నా కొకవరంబును బ్రసాదింపవలయు నని భావించుచున్నాను. కావున నోదేవా! నే నిప్పుడు నాకొఱకుఁ గాదు—జగద్ధితంబును గోరి ప్రార్థించుచున్నాను. ప్రసన్నుండవై నీ వామోదింపవలయును. గురుపత్నీగమనంబు గావించిన మహాపాతకు లీగౌతమీజలంబుల నవగాహనంబు గావించినంతనే ధౌతపాతకు లయ్యెదరుగాక! ఈనదియం దోలలాడిన తిర్యగ్జాతులు గూడ నుత్తమజన్మంబులం గాంచి రూపగుణసంపన్నంబు లగుంగాక! ఇదియే నాప్రార్థనము.

అని కుమారస్వామి గోరుటయు నంబికానాథుం డట్లే యగుంగాక యని యనుగ్రహించెను. అప్పటినుండియు నాపుణ్యతీర్థము కా

ర్తికేయతీర్థంబు నాఁ బ్రఖ్యాతం బయ్యెను. అందు గావించిన స్నానదానాదులు సకలయజ్ఞఫలదాయకంబులు.

## కృత్తికాతీర్థవృత్తాంతము.

కార్తికేయతీర్థంబునకుఁ దరువాత కృత్తికాతీర్థము ప్రసిద్ధమైనది. అందు మజ్జనం బాచరించినంతమాత్రమున సోమపానఫలంబు లభించును. పూర్వకాలంబునఁ దారకాసురసంహారణార్థమై హుతాశనుండు భగవానుం డగుమహేశ్వరుని యమోఘవీర్యమును పానము గావించెను. అమ్మహాతేజము నాస్వాదించుటవలన దివ్యతేజుం డగువైశ్వానరు నవలోకించి యరుంధతి తక్కఁ దక్కినఋషిపత్నులందఱును గామసంచలితహృదయ లైరి. అప్పు డయ్యగ్నిదేవునివలన నయ్యార్వరును గర్భవతులై తపోనిష్ఠలును, వరిష్ఠలు నగుటం జేసి తమ కావించిన యసత్కార్యంబునకుఁ బశ్చాత్తాపహృదయలై యేమియు నుపాయంబు గానక విచారించుచుఁ బోయి గంగాజలంబులఁ బ్రవేశించిరి. తోడనే వారిగర్భంబులు నిస్సృతంబులై గంగాజలోపరిభాగంబున విలక్షణాకృతితోఁ దేలియాడుచు వాయువశంబున ఫేనాకృతితో నున్న యవి యన్నియుఁ గలిసికొనుటం జేసి వానినుండి యేకమూర్తియు, షడాననుం డగుకుమారుం డుదయించెను.

ఋషిభార్య లీవిధంబుగా గర్భపాతంబులు గావించుకొని తమ తమమందిరంబులఁ బ్రవేశించినంతనే వికృతరూపములతోఁ గానంబడుచున్నవారిం గాంచి ఋషులు సంశయించి "ఓచంచలహృదయలారా! సతీజనంబున కెన్నటికిని స్వేచ్ఛాచరణంబు సమంజసంబు గానేరదు. కలుషమతులగు మీకీయాశ్రమంబుల నిలుచుట కెంతమాత్రము నర్హత లేదు. శీఘ్రముగ మీ రిచ్చవచ్చినచోటికిఁ బొండు"

అని గర్జించి పరిత్యజించుటయు ఋషిపత్నులు చేయునది లేక తమ యకృత్యంబును నిందించుకొనుచు నతికరుణంబుగా దుఃఖించుచుండ నారదుండు వారిచెంతకరుదెంచి రమణీమణులారా! మీరూరక యేల దుఃఖించెదరు ? మహేశ్వరాత్మజుండును, దారకాంతకుండు నగుతావకాత్మజుండు గాంగేయుండును, ఆగ్నేయుండును నై విరాజిల్లుచున్నవాఁడు. మీరందఱు నేకమై పోయి యాతని నాశ్రయించినచో మహాత్ముండగు నాతఁడు మీయభీష్టఫలదానంబు గావింపఁగలఁ డని యుపదేశించెను.

దేవర్షి యగునారదుం డిట్లునివృత్తిమార్గంబు నిరూపించుటయు నారమణీమణులించుక యూఱడిల్లి తత్క్షణమే యందఱుంగలసి బయలుదేఱి యక్కుమారుని చెంతకుంబోయి తమవృత్తాంతం బంతయు సవిస్తరంబుగా నాతనికి నివేదించిరి. అప్పుడు కుమారుండు వారియెడలఁ గరుణించి యోతల్లులారా! మీరందఱును గలసి గౌతమీతీరంబునకుం బోయి యందలిపవిత్రజలంబులలో స్నానంబు సేయుచు మహేశ్వరుని నిరంతరము నారాధించుచుండుఁడు. నేనచ్చటికి వచ్చి మిమ్మందఱను స్వర్గంబునకుఁ బంపించెదను.

అని చెప్పుటయుఁ గృత్తికాగణంబులు కార్తికేయుని వచనానుసారంబుగా గౌతమీగంగం జేరి యందు మజ్జనంబులు గావించుచు మహేశ్వరునర్చించి పరమేశ్వరప్రసాదంబునఁ బవిత్రలై సురమందిరగమనంబు గావించిరి. అప్పటినుండియు నాతీర్థమునకు కృత్తికాతీర్థంబను నామంబు గలిగెను. కార్తికమాసంబునఁ గృత్తికానక్షత్రసంకలితంబగు శుభదినంబున నందవగాహనంబు సేయువారికి సకలయజ్ఞఫలంబులును సిద్ధింపఁగలవు. ఆతీర్థమును స్మరించుచుండువారును, దన్మాహాత్మ్యంబు

నాకర్ణించుచుండువారును సర్వపాపవిముక్తులై దీర్ఘాయుష్మంతు లగు దురు.

## —♦ దశాశ్వమేధతీర్థసంకీర్తనము. ♦—

బ్రహ్మదేవుం డిట్లు చెప్పందొడంగెను. మునివరులారా! దశాశ్వమేధతీర్థస్మరణంబున నశ్వమేధఫలలాభం బగును. విశ్వకర్మకు శ్రీమంతుం డగు విశ్వరూపుం డనుతనయుండు గలండు. అతనికిఁ బ్రథముండనుపుత్త్రుండు గలిగెను. ఆపుత్త్రునకు భౌవనుం డనునందనుం డుదయించి సర్వశాస్త్రజ్ఞుండును సార్వభౌముండు నయ్యెను. ఆమహాత్ముం డొకప్పుడు తనపురోహితుం డగుకశ్యపు నవలోకించి యోమునిచంద్రా! ఒక్కసారిగాదశాశ్వమేధంబులు నిర్వర్తింపవలయు నని నాకు మిగులఁ గుతూహలముగానున్నది. కాని యీయజ్ఞంబులనన్నిటిని గావించుటకుఁ దగినపుణ్యస్థలంబేదియో యాలోచించి నిశ్చయింపవలయు నని వేఁడుకొనియెను.

అప్పుడు కశ్యపుండు బాగుగ నాలోచించి మహీపాలశేఖరా! పూర్వకాలమునుండియు నీస్థలంబున మహాక్రతువులన్నియును నిర్వర్తింపఁబడుచుండెనో యాపవిత్రస్థానమే మనయజ్ఞానుష్ఠానంబునకును గూడ ననుకూలంబైనది. అని బోధించుటయు భౌవనుండు సమ్మతించి కశ్యపుండు నిర్దేశించినపావనస్థలమునందే యజ్ఞారంభంబు గావించెను. అనేకులగుమహర్షులు ఋత్విక్కర్మంబులయందు నియుక్తులై పని చేయుచుండిరి. పురోహితోపదేశానుసారంబుగా దశాశ్వమేధంబులును బ్రవృత్తంబు లయ్యెను కాని యెంతప్రయత్నించినను నయ్యజ్ఞంబులు సంపూర్ణంబులు గాక యుండెను.

అందుచే భౌవనుండు చింతాక్రాంతుండై సముద్రునిగూర్చి బది

త్యజించి మఱియొకప్రదేశమున మఖారంభంబు గావించెను గాని యచ్చటఁగూడ ననేకము లగునంతరాయంబులు తటస్థించెను. ఎంతయు త్సాహముతోఁ గార్యనిర్వహణంబు సేయుచున్నను యజ్ఞంబు లపరిపూర్ణంబులగుటం జేసి భావనుండు మిగులవిచారించి పురోహితుం డగు కశ్యపుంగాంచి మహాత్మా! మదీయంబులగునీయజ్ఞంబులు దేశకాలదోషంబుననో, నీదోషంబుననో, నాదోషంబుననో గాని సంపన్నంబులు గాక యున్నవి. ఇఁక నుపాయాంతర మేమున్నది! అని విచారముతోఁ బలుకుటయుఁ గశ్యపుండును జాలచింతించి భావనసహితుండై బృహస్పతికి జ్యేష్ఠభ్రాత యగుసంవర్తకునిపాలికింబోయి మహాత్మా! మేమొక్కసారిగా దశాశ్వమేధంబులు గావింప సంకల్పించి యుంటిమి. అట్టిసత్కార్యనిర్వహణంబున కనురూపం బగునుత్తమప్రదేశం బెయ్యదియో, యట్టిసత్కార్యంబును సామర్థ్యముతోఁ దీర్పంగలగురుం డెవ్వరో యానతీయవలయు నని ప్రార్థించెను.

ఋషిశ్రేష్ఠుం డగుసంవర్తకుం డప్పుడించుకసేపు ధ్యాననిష్ఠుండై యాలోచించి పూజ్యులారా! మీరు త్రిలోకగురుం డగుబ్రహ్మదేవుని చెంతకుం బోయి యీవిషయంబును నివేదింపుఁడు. అద్దేవుండు మీ యుత్తమ కర్మానుష్ఠానంబునకుఁ దగిన పుణ్యస్థలంబును నిర్దేశించి మీ కెఱింగింపఁగలఁడు. అని యుపాయంబు నిరూపించుటయు నప్పు డారాజపురోహితులిరువురును నాచెంతకు వచ్చి ప్రణామప్రార్థనంబులు గావించి సమస్తవృత్తాంతంబును సవిస్తరంబుగా నివేదించుటయు నేను బాగుగ నాలోచించి భౌవను నుద్దేశించి, రాజేంద్రా! మీ రిప్పుడు గౌతమీతీరంబునకుం బొండు. పుణ్యంబు లగు యజ్ఞకర్మంబు లాపవిత్రదేశంబునఁ బరిపూర్ణంబులు గాఁగలవు. మీ కిఁక వేఱొకగురునితో నావశ్యకంబు లేదు. వేదపారగుం డగునీకశ్యపుఁడే గురుశ్రేష్ఠుండై మీ

యజ్ఞకర్మంబుల సంపన్నంబులుగాఁ జేయఁగలఁడు. ఈగురుని యను గ్రహంబునను, గౌతమీప్రసాదంబునను నీ వచ్చటఁ గావించు నేకాశ్వమేధంబువలననే దశాశ్వమేధఫలంబు లభింపఁగలదు.

అని యుపదేశించుటయు, భౌవనుండు సంప్రీతుండై ప్రణామపూర్వకంబుగా నాకడ సెలవు గైకొని కశ్యపసహితుండై గౌతమీతీరంబునకుం బోయి యచ్చట నశ్వమేధయాగదీక్షితుం డయ్యెను. అప్పు డయ్యజ్ఞరాజం బగు హయమేధము సముచితారబ్ధంబై యథాకాలంబునఁ బరిపూర్ణం బయ్యెను. అప్పుడు రాజగు భౌవనుండు భూదానంబు గావించుట కుద్యుక్తుండు కాఁగా, ఋత్విగ్గణంబులును, బ్రాహ్మణులును, సభాసదులును గూడ నత్యాశ్చర్యముతో నాకర్ణించుచుండ నాకాశవాణి, "ఓరాజా! నీవు మీపురోహితుఁ డగుకశ్యపునకు సమస్తభూమండలంబును సంప్రదానంబు గావించుటకై సంకల్పించితివి. నీసత్సంకల్పమాత్రంబుననే సమస్తంబును సంపన్నంబైనది. కావున నీవిఁక భూదానసంకల్పమును బరిత్యజించి మహాఫలజనకం బగు నన్నదానంబును గావింపుము. ఈగంగాపులినతలంబునఁ గావించిన యన్నదానఫలము త్రిలోకమధ్యంబున మఱియొందును లభింపఁబోదు. శ్రద్ధాసహితంబుగ నన్నప్రదానమును గావించినచో నెట్టిపుణ్యంబు లభించునో ప్రశంసించు సామర్థ్య మెవ్వరికున్నది? బహుదక్షిణాన్వితం బగునీయశ్వమేధముం గావించి నీవు కృతకృత్యుండ వైతివి. నీకు భద్రం బగుఁగాక."

అని యాకాశవాణి బోధించినను, మహారాజగు భౌవనుండు మహీదానసంకల్పంబును విడువకుండుటచే భూదేవి స్వయముగా నాతని నుద్దేశించి సార్వభౌమా! మాటిమాటికి నన్ను దానముసేయవలదు. నేను జలమధ్యంబున నిమగ్నమై యుందును. కావున నీవు నన్నెల్లను

దానముచేయఁజాలవు. నీసంకల్పమును విడువు మని పల్కుటయు, భావనుండు భీతుండై, దేవీ! నే నెట్టిదానమును గావింపవలయు నని యడుగుటయు, భూదేవి మరల సకలబ్రాహ్మణసమక్షంబున నోరాజా! ఈగౌతమీతటంబునఁ దిలలు, గోవులు, ధనము, ధాన్యములు మొద లగు మఱియే యితరవస్తువులు దానముచేసినను అక్షయఫలప్రాప్తిగాఁగ లదు. ఇట్టిచో నీవు న న్నేల దానముచేయవలయును? ఈగౌతమీతీరంబునకు వచ్చి యేకగ్రాసమాత్రంబైన నన్నదానంబును గావించిన వాఁడు సమస్తదానంబులును గావించినవాఁ డగును. ఇఁక భూదాన ముతోఁ బ్రయోజన మేమున్నది? అని చెప్పుటయు సార్వభౌముం డగు భావనుండు, పృథ్వీదేవివచనంబులు పుణ్యసంగతంబు లని భావిం చి బ్రాహ్మణులకుఁ బ్రచురాన్నదానంబులను గావించెను. అప్పటి నుండియు నాతీర్థము దశాశ్వమేధిక మని ప్రసిద్ధం బయ్యెను. అం దవ గాహనంబు గావించువారికి దశాశ్వమేధఫలంబు లభియించును.

## పైశాచికతీర్థప్రస్తావనము.

బ్రహ్మదేవుండు మరల నిట్లనియెను. పైశాచికతీర్థము బ్రహ్మా దులగు మునిగణంబులచే నిత్యపూజితం బైనది. గౌతమీదక్షిణ తటంబునం గల యాతీర్థస్వరూపమును వర్ణించెదను. బ్రహ్మగిరిపా ర్శ్వంబున నంజననామకం బగు నొకశైలంబు గలదు. ఆపర్వతంబు న నంజన యనునొక యప్సరస శాపభ్రష్టయై నివసించుచుండెను. ఉ త్తమాంగముంబట్టి యామె వానరివలెఁ గానవచ్చుచుండెను. ఆమెభర్త కేసరి. ఆతని కద్రిక యను నింకొకభార్య గలదు. ఆమెయును శాపభ్ర ష్టయగుసచ్చరయే. ఆమె యుత్తమాంగము మార్జాలముం బోలియుం డును. అయ్యద్రికకూడ నంజనశైలమందే నివసించుచుండెను. ఒక

ప్పుడు బ్రహ్మాగ్రనాయుండగు కేసరి దక్షిణసముద్రస్నానమునకుం బోయి యుండెను.

ఆసమయంబున నగస్త్యమునీంద్రుం డయ్యంజనశైలంబున కే తెంచుటయుఁ బ్రణామపూర్వకంబుగ నయ్యంజనయు, నద్రికయు నమ్మునిసత్తముని యథావిధిగఁ బూజించిరి. అప్పు డగస్త్యమునీంద్రుం డు వారియెడలఁ బ్రసన్నుండై వరప్రార్థనంబు గావింపుఁ డని వక్కా ణించుటయు, నారమణీమణులలో నొక్కతె సర్వోత్కృష్టబలుం డగునొ కకుమారుని, రెండవయామె సర్వలోకహితుం డగునొక్కపుత్త్రునిఁ గోరుకొనిరి. అగస్త్యుండును నట్లె యగు నని యనుగ్రహించి దక్షిణాభి ముఖుండై వెడలిపోయెను.

అనంతరము గొంతకాలమున కొకనాఁడు, పర్వతోపరిభాగంబు న నంజనయు, నద్రికయు సవిలాసంబుగ నృత్యగీతవినోదంబులును, హా స్యాలాపంబులును గావించుచు సంచరించుచుండ వాయుదేవుండును, నిర్ఋతియు వారిం గాంచి కామావిష్టహృదయులై మందహాసవదనం బులతో సత్వరంబుగ వారిచెంత కరుదెంచి, ఓకాంతామణులారా! మేము వరప్రదుల మగుదేవతలము. మీ యిరువురును మాయిద్దఱకు ను భార్యలు గావలయును. అని కోరుటయు, నక్కాంతామణు లిరు వురును సమ్మతించిరి. అనంతర మంజనాదేవిగర్భంబున వాయుదేవుని వలన హనుమంతుండును, అద్రికాగర్భంబున నిఋతివలన నద్రినామ కుం డగు నొకపిశాచప్రవరుండును జనియించిరి. అప్పుడా కామినీమణులు వారిం గాంచి [illegible] మీయను గ్రహంబుచే మా కియిరువురుతనయులును లభియించినారు. కాని, దే వేంద్రునిశాపంబుచే మాయుత్తమాంగంబులు వికృతంబులును దూషి తంబులు నై యున్నవి. కావున మీరిప్పుడు మాదోషక్షాళనంబున

క్షుపాయంబు నిర్దేశించి యుద్ధరింపవలయును.

అని ప్రార్థించుటయు వాయుదేవుండును, నిఋతియు సతీమణు లారా! మీరు గౌతమీతీరంబునకుం బోయి యందు స్నానదానంబు లం గావించినచో శాపవిముక్త లయ్యెదరు. అని యుపదేశించి వారిని సంప్రీతచిత్తలం గావించి యంతర్హితు లైరి.

అప్పుడు పైశాచమూర్తియు, అద్రికకుమారుండును నగుఅద్రి, భ్రాతయగు హనుమంతునిప్రీతికొఱకు విమాతయగు నంజనాదేవిని దీసికొనిపోయి పావనగౌతమీజలంబులయం దవగాహనము చేయించె ను. ఇట్లే హనుమంతుండును, మార్జాలరూపిణియు, సవతితల్లియు నగు నద్రికను గోదావరిజలంబులలో స్నానముసేయించెను. అప్పటినుండి యు నాతీర్థము పైశాచం బనియు, ఆంజనం బనియు నుభయనా మంబులచేఁ బ్రఖ్యాతం బయ్యెను. సర్వకామప్రదం బగుబ్రహ్మగిరి నుండి తూర్పుగాఁ ద్రిపంచాశత్ యోజనపర్యంతముం గల ప్రదేశము మార్జాలం బనియు, తత్పరస్థానంబు హనూమంతం బనియుఁ బ్రథితం బు లయ్యెను. గౌతమీనదియందలి యీఫేనాసంగమస్థానము సర్వకా మప్రదంబును శుభకరంబు నై యుండును. అప్రదేశంబున కప్పటి నుండియు శుభనామము గలిగెను.

—◆ క్షుధాతీర్థోత్పత్తికథనము. ◆—

ఓనారదా! భూలోకవిఖ్యాతం బగుక్షుధాతీర్థము మహాపుణ్య ఫలదాయకంబును మనోభీష్టదాయకంబు నైనది. పూర్వకాలంబున వేదవిద్వరుండును, తపోధనుండును, మహర్షియు నగుకణ్వుండు క్షుధా తురుండై యనేకాశ్రమంబులఁ దిరిగి తిరిగి క్రమంబుగా నన్నపానసమృ ద్ధంబును నతిపవిత్రంబును నగుగౌతమాశ్రమంబుం జేరికొనియెను. అ

గంగాదేవీ! నీకు మరల మరల నమస్కరించుచున్నాను.

అని యిట్లు కణ్వమునీంద్రుండు స్తోత్రంబుచేయుచుండ మనోహారిణి యగుగంగాదేవియు, భీషణాకారిణి యగుక్షుధాదేవియు నాతని యెదుట సాక్షాత్కరించుటయు ద్విజశ్రేష్ఠుం డగుమునివరుండు కృతాంజలియై నమస్కరించి ఓసర్వమంగళమాంగళ్యా! బ్రాహ్మీ! మాహేశ్వరీ! వైష్ణవీ! త్రిలోచనీ! దేవీ! గోదావరీ! నీకు నమస్కారము. నీవుశివునిజటాజూటమునుండి బయలువెడలి గౌతమపాపహారణంబు గావించి సప్తవాహినులుగా విభక్తవై సాగరాభిముఖంబుగఁ బ్రవహించుచున్నావు. తల్లీ! గౌతమీ! నీకు నమస్కారము. సమస్తపాపాత్ములకును బాపస్వరూపిణీ! ధర్మకామార్థవిధ్వంసినీ! దుఃఖలోభమయీ! క్షుధాదేవీ! నీకును నమస్కరించుచున్నాను. అని ప్రార్థించెను. అప్పు డాదేవు లిరువురుఁ బ్రసన్నలై యేకవాక్యంబుగా నోసువ్రతా! కల్యాణమూర్తీ! నీయభీష్టంబు దెలుపు మని యనుగ్రహించినం తనే కణ్వుండు ప్రణతుండై వారిం గాంచి యథాక్రమంబుగా, ఓదేవీ గంగా! నీవు నాకు మనోజ్ఞంబు లగు కామ్యపదార్థంబులను, అపార వైభవంబును, ఆయుర్విత్తంబులను, భుక్తిముక్తులను బ్రసాదింపుము. పాపతరమూర్తీ! రూక్షస్వరూపిణీ! దారిద్ర్యదాయినీ! తృష్ణాజననీ! క్షుధా! నీవు నాయందుగాని, నావంశములో నెవ్వరియందుగాని యెన్నండు నావేశింపవలదు. క్షుధాతురులైనవా రెవ్వరైన మత్కృతం బగు నీస్తవంబుచే నిన్నుఁ గీర్తించినంతనే వారిదారిద్ర్యదుఃఖంబులు వదలిపోవుఁగాక! మఱియు, మహాపుణ్యమయం బగునీతీర్థరాజమునందు భక్తిభావముతో స్నానదానజపాదులం గావించువారు లక్ష్మీసంపన్నులగుదురుగాక! ఈతీర్థంబునం దైనను స్వగృహంబునం దైనను

ఈస్తోత్రమును బఠించువారు దారిద్ర్యదుఃఖదూరులై భయవిముక్తు లయ్యెదరుగాక !

అని వేడుకొన్నంతనే గంగాక్షుధాదేవు లిద్దఱును గాల్వునికి నట్లే వరప్రదానంబు గావించి నిజస్థానంబులకుఁ బ్రస్థానంబుసేసిరి. అ ప్పటినుండియుఁ గాల్వగంగ యనియు, క్షుధాతీర్థం బనియు నాతీర్థము పేరందెను. సర్వపాపహరం బగునాతీర్థము పితృగణంబుల కతిప్రియ మైనది.

## —— చక్రతీర్థచరిత్రము. ——

చక్రతీర్థనామంబున నింకొకమహాతీర్థము విఖ్యాతంబై యున్న ది. అందు భక్తిపూర్వకంబుగ మజ్జనంబు సేయువారు విష్ణులోకప్రాప్తు లగుదురు. శుక్లైకాదశీదినంబున నుపవసించి యాగణికాసంగమతీర్థంబు న స్నానంబు చేసినచో నక్షయపదలాభం బగును. పూర్వకాలంబున బహుధనసంపన్నుండగు విశ్వభరుండను నొకవైశ్యుఁ డుండెడివాఁడు. ఆతనికి ముసలితనమునందుఁ బుత్రసంతానము గలిగెను. ఆకుమారుఁ డు రూపవంతుఁడును గుణవంతుఁడును విలాసవంతుఁడును బ్రియదర్శ నుఁడునై యుండెను. విశ్వభరుం డాతనిఁ బ్రాణములకంటె నధికునిగ భా వించి పెంచుకొనుచుండఁ గొంతకాలంబున నక్కుమారుండు మృత్యు ముఖపతితుం డయ్యెను. ఆకారణముచే దుఃఖపీడితులై యున్న వైశ్య దంపతులు జీవములను భరింపఁజాలక పుత్త్రునితోఁగూడ మరణించు టకుఁ గృతనిశ్చయులై యార్తనాదంబు సేయుచుఁ గుమారా! గుణ సాగరా! నీవు మాప్రాణములకంటెను దుర్లభుండవై యుంటివి. దు రాత్ముండును, పాపచిత్తుండునగు కాలుఁడు యౌవనమునందే నిన్నప హరించియున్నాఁడు. దయావిహీనుం డగునాతని నేమనినిందింపఁగల

ము. అని యనేకవిధంబులఁగరుణరసంబు దొలుకాడఁ బలవించుచున్న యాదంపతులశోకంబు నాకర్ణించి యమధర్మరాజు కృపాకలితహృదయుండై యామృతపుత్రు నచ్చటనే పరిత్యజించి రమణీయంబగు గోదావరీతీరంబునకుం బోయి యందొకపులినతలంబున నుపవసించి జనార్దనధ్యానంబుఁ గావించుచుఁ గాలక్షేపంబు సేయుచుండెను.

అత్యల్పకాలంబుననే భూమండల మంతయును బ్రజాసంఘముచేఁ బ్రవ్యాప్తం బైపోయెను. అప్పుడు భూదేవి ఏమిది? ఇంతమందిప్రజలను నాయందు నిండించినవా రెవరు? ఇప్పు డొక్కజీవియైనను మృత్యుగ్రస్తం బగుటలేదు. ఈభార మెంతకాలము నేను మోయఁగలను? అనివిచారించుచు సురగణసహితుండై యున్న దేవేంద్రునొద్దకుం బోవుటయు భారాక్రాంతయగుభూదేవింగాంచి దేవేంద్రుండు ప్రణిపాతపూర్వకంబుగ, తల్లీ! నీయాగమనంబునకుం గారణంబేమనిప్రశ్నించెను. అప్పుడు వసుధాదేవి విబుధేశ్వరా! ప్రజ లెవ్వరును మరణించుటలేదు. నేనతిభారముచే నిరంతరము పీడిత నగుచున్నాను. దీనికిఁ గారణం బేమో యెఱుంగవలయునని నీచెంత కరుదెంచితిని. అని చెప్పుటయు నింద్రుండు, దేవీ! దీనికిఁ గారణంబు బొందుగలదు. దానిని నేనిదివఱకే గ్రహించియుంటిని. సురేంద్రుండ నగునే నెఱుంగనివిషయంబు లెవ్వియునులేవు. అని చెప్పినంతనే భూదేవి యింద్రుంగాంచి అట్లయిన నీవిప్పుడే యముని నాహ్వానించి ప్రజాసంహారమునకై యాతని నియోగింపుము. అని ప్రార్థించుటయు నమరనాథుండు సత్వరంబుగ శమనుం దోడ్కొనిరావలయు నని సిద్ధకిన్నరాదుల కాజ్ఞాపించెను.

దేవేంద్రునానతిని దలందాల్చి వా రతిత్వరితంబుగ యమపురంబునకుంబోయి యన్వేషించిరిగాని యముం డచ్చటఁ గానరాఁడయ్యె

ను. తోడనే వారు మరలి వచ్చి దేవేంద్రునకు సమస్తవృత్తాంతమును నివేదించిరి. అప్పుడుశతమఖుండు శమనజనకుం డగుసవిత్రునింగాంచి కాలుం డెచ్చటనున్నాఁడనిప్రశ్నించెను. అప్పుడు సూర్యభగవానుండు సురేంద్రా! కృతాంతుం డిప్పుడు గోదావరీతీరంబునందీవ్రతపంబుఁ గావించుచున్నాఁడు. దానికిఁ గారణం బేమియో నేనెఱుంగను. అని చెప్పినంతనే నిర్జరేశ్వరుండు శంకితుండై, ఎంతకష్టమెంతకష్టము. ఇంక నాయమరాధిపత్య మంతరించు నని తోఁచుచున్నది. అక్కాలుండు నిశ్చయంబుగా మత్పదంబును గాంక్షించియే గౌతమీతీరంబున మహాతపంబు సేయుచున్నాఁడు. దేవతలారా! ఈవిషయంబున నా కిట్లే తోఁచుచున్నది. అనివచించి యింద్రుండు తక్షణమే అప్సరోగణంబుల నాహ్వానించి ఓసురసుందరీమణులారా! నాశత్రుండగు కృతాంతుం డిప్పుడు తపోనిరతుండై యున్నాఁడు. అతనితపోభంగంబుఁ గావించుటయందు సామర్థ్యముకలవా రెవ్వరైన మీలో నున్నయెడల నాకుఁ బ్రత్యుత్తరంబిండు. అని సురేంద్రుండు వక్కాణించుటయు అప్సరస్సుందరులలో నొక్కతెయును మాఱుమాటఁ జెప్పఁజాలకపోయెను. అందుచే శక్రుండు క్రుద్ధుండై మీలో నెవ్వరును నామాటకు బదులు చెప్పరా? మంచిది. మీరు మీయిండ్లకుం బొండు. దేవతలారా! మీరందఱును ససైన్యముగ నిప్పుడే సన్నద్ధులు కండు. మనమే స్వయముగా నచ్చటికిఁ బోయి తపోబలంబుచే స్వర్గపదంబును బడయఁగోరుచున్న యాశత్రువును వినాశంబు సేయుదము.

అని యింద్రుం డాజ్ఞాపించినంతనే దేవసేన లన్నియును సజ్జితంబులయ్యెను. లోకరక్షకుండగు శ్రీహరి యాదేవేంద్రుని యభిప్రాయంబు నెఱింగి శమనరక్షణంబునకై స్వకీయంబగుచక్రమును బ్రేరణం

బుఁ గావించెను. ఆచక్రంబుపోయి నివసించినస్థానమే చక్రతీర్థనామం బున విఖ్యాతం బయ్యెను.

అనంతరము మేనక శంకితయై శతమఖుంగాంచి సురేశ్వరా! కాలునివంకఁ గటాక్షపాతంబుఁ గావించుట కేకామిని సాహసింపఁగల దు? దేవా! నీచేతులలోనైన మరణింపఁగలము గాని, కాలయముని కన్నులఁబడి నిలువఁజాలము. ప్రభూ! రూపయౌవనగర్వితయగు నీగణి కయొక్కతె యున్నది. ఈమెకూడ నీయధికారమునకు లోఁబడినది యే. ఈమె యమసమీపమునకుఁ బోవుటకై నిన్నుఁ బ్రార్థించుచు న్నది. కావున నీ వంగీకరింపవలయును. అనుటయు సర్వదేవతా ప్రభుండగు శక్రుండు మేనకావాక్యంబుల నంగీకరించి లతాంగియు నబ లయు నగు గణికను సత్కరించి ఓసుందరీ! గణికా! నీవు శీఘ్రముగఁ బోయి మత్కార్యసాధనంబుఁ గావింపుము. కృతకృత్యవై మరలి వచ్చినంతనే నీవు శచీదేవివలె మదేకప్రణయిని వయ్యెదవు.

అని యుత్సాహపఱచి సెలవిచ్చినంతనే అగణిక యాకాశగమ నంబున నచిరకాలంబుననే యమసన్నిధానంబునకుం బోయెను. అ చ్చట నామె మెల్లమెల్లఁగఁ దనదేహకాంతులచే దశదిశలును వెలుం గుచుండ విలాసవిహారంబులు సేయుచుఁ దపంబు సల్పుచున్న కాలుని చెంత సంచరింపఁదొడంగెను. అప్పు డామెహావభావ విలాసచేష్టితము లం గాంచినంతనే కాలుని మనంబును గలఁగిపోయెను. కాలుం డప్పు డు కామాగ్నిపూరిత నేత్రద్వయంబు నున్మీలితంబుగఁజేసి గణికాభిము ఖంబుగఁ గటాక్షపాతంబుఁ గావించెను. తోడనే యాగణికారత్నము నిలువున నీరై సరిదాకారంబున గౌతమీజలంబుల సంగమించి యాతీ ర్థమాహాత్మ్యంబున మరల గణికారూపముం దాల్చి యుత్తరగణికాకిన్న

నిజనివాసంబునకుం బోయెను. యముఁ డిట్లు పోవుచుండుటం గాంచి విష్ణుచక్రింబు భగవానుండును వనమాలియు నగుగోవిందుండు నివసించియున్న దివ్యస్థానంబునకుఁ బ్రస్థానంబు గావించెను.

—◆ అహల్యాసంగమతీర్థమాహాత్మ్యము. ◆—

కుమారా! పూర్వకాలంబున నేను కుతూహలాక్రాంతహృదయుండనై రూపగుణవతు లగు ననేకసుందరీమణులను సృష్టించియుంటిని. వారిలో నొకరమణీమణి సర్వోత్కృష్ట సౌందర్యశాలినియై యుండెను. రూపగుణవిలాసినియు, మనోహారిణియు నగునక్కన్యం గాంచి నామనంబునందు దీనిని భరించుటకును, వరించుటకును దగిన సమర్థుం డెవ్వం డున్నాఁడు? దేవదానవులలోఁగాని మునిమానవగణంబులలోఁగాని యీమెకుఁ దగిన వరుం డెచ్చటను నాకు గోచరించుటలేదు. అని యనేకప్రకారంబుల నూహించి యతి లోకరూపవతి యగు నక్కన్యకను దపోనిష్ఠుండును సర్వలక్షణసంపన్నుండును, వేదవేదాంగవేదియు, గుణజ్యేష్ఠుండును, ధీమంతుండును నగు గౌతమమునీంద్రునకు సమర్పించి ఓమునిశ్రేష్ఠా! యౌవనాగమం బగునంతవఱకును నీ వీమెను బరిపాలించుచుండుము. ఎప్పు డీమె యువతి యగునో యప్పు డీసాధ్వీమణిని నాచెంతకుఁ దీసికొనిరమ్ము. అని చెప్పి యాబాలిక నాతని కొప్పగించితిని.

మహాతపోనిష్ఠచే నిర్మలహృదయుండును, మునిశ్రేష్ఠుండును నగుగౌతముండు, యథోచితంబుగ నాబాలికను బోషించుచు నిర్దిష్టకాలంబున సాలంకృత యగు నయ్యువతీమణిని నిర్వికారచిత్తముతో నాచెంతకుఁ గొనితెచ్చెను. ఆకన్యకామణినామ మహల్య. అయహల్యం గాంచి యింద్రాగ్నివరుణప్రముఖు లగుదేవగణంబులు మత్సన్నిధానంబున కేతెంచి యీసుందరీమణిని మాకుఁ బ్రసాదింపవలయు

వని యనేకవిధంబుల వేఱువేఱుగాఁ బ్రార్థించిరి. ఇట్లే మునిగణంబులును సిద్ధసాధ్యగణంబులును యక్షరక్షోగణంబులును గూడ నామెకొఱకు నన్ను [illegible] దేవతలకన్న నెక్కువగా మణిని బ్రార్థించుచుండుటయు, విశేషించి యింద్రుండు దామోదరుల సత్ప్రార్థనానురాగంబును బ్రకటించుటయును నా కప్పు డారమణీమణి నెవ్వరి కొసంగుటకును నిష్టము లేకపోయెను. ఇంతమంది యిట్లడుగుచున్నను గౌతముఁడు నన్నడుగనే లేదు. అప్పుడు నేను మహాత్ముండగు గౌతముని ధైర్యగాంభీర్యాదులను జూచి విస్మితుండనై శుభానన యగు నీసుందరీమణి కన్యు లెవ్వరును ననురూపవరులు గాఁజాలరు. దీనిని గౌతమునకే యర్పించెదను.

అని నిశ్చయించియు సకలసురాసురగణంబులును ఋషిగణంబులును గూడ నీమెను వాంఛించియున్నారు. అందఱియభిప్రాయంబుల నీమె కలఁచివైచినది. ఇందఱును గాదని గౌతమున కీమె నర్పించుట యెట్లు? ఇట్టి స్థితియందు వీరిని సమాధానపఱచుట యెట్లు? అని యనేకవిధంబుల నాలోచించి, యాదేవర్షిసంఘంబుల నొక్కసారి విలోకించి యో మహాపురుషులారా! ఎవ్వఁ డీభూమండలము నంతయును బ్రదక్షిణంబు గావించి యందఱికంటె ముందుగ నాచెంతకరుదెంచునో యాతనికి నానందన యగు నీసుందరీమణి నహల్యను సంప్రదానము సేయుచున్నాను. ఇక్కార్యంబున నసమర్థులయినవారి కెన్నఁడు నీరమణీమణి లభియింపఁబోదు.

అని నేను నిర్దేశించినంతనే సకలదేవతలును గూడ నహల్యాలాభలాలసులై భూప్రదక్షిణంబునకై బహిర్గతులైరి. సకలదేవతలు నిట్లు ప్రస్థానంబు గావించుటయు నహల్యాలాభమునకై మునివరుండగుగౌతముండును బ్రయత్నంబు గావింపఁదలంచెను. ఆసమయంబు

న సర్వకామప్రదాయినియు, అర్థప్రసూతయు నగునొకదివ్యసురభి య
చ్చట గోచరించుటయు గౌతముండు దానిం గాంచి యాగోవునే భూదేవి
గా భావించి యాధేనువునకును నచ్చటనున్న దేవదేవుని దివ్యలింగము
నకును బ్రదక్షిణంబు గావించి తనలో సమస్తదేవతాగణంబులునుగూ
డ నొక్కసారి సమస్తభూమండలమునకును బ్రదక్షిణంబు సేసి వచ్చుట
కుముందుగనే నేను రెండుసారులు సకలభూమండలప్రదక్షిణంబు నొన
ర్చితి నని నిశ్చయించుకొని తోడనే నాచెంత కరుదెంచి నమస్కారం
బు సేసి కమలాసనా! విశ్వాత్మా! నీకు నమస్కారము. ఓపరబ్రహ్మ
మూర్తీ! నే నీసమస్తవసుధామండలమును బ్రదక్షిణంబు గావించి వ
చ్చితిని. దేవేశ్వరా! ఈవిషయంబున నేది యోగ్యమో యది యం
తయును నీవే స్వయముగా నెఱుంగుదువు. అని విన్నవించుటయు దివ్య
దృష్టిచే నే నది యంతయు నెఱింగి గౌతమునిం గాంచి మునీంద్రా!
నీవు నిశ్చయంబుగా భూప్రదక్షిణంబు సేసితివి. కావున మత్కుమా
రిక యగు నీయహల్యను నీకర్పించుచున్నాను. ఓవిప్రర్షీ! ఏనిర్మలధ
ర్మము నిగమంబులకుఁగూడ నవేద్యం బైనదో యట్టిదాని నీవొక్కరుండ
వే యెఱుంగఁగలిగితివి. అర్థప్రసూత యగు సురభి సప్తద్వీపవతి య
గు సాక్షాత్పృథ్వీస్వరూపిణి. నీవు దానిని ప్రదక్షిణంబుసేసి పృథ్వీప్ర
దక్షిణంబు నొనర్చినవాఁడ వైతివి. అంతియకాక దేవదేవుని దివ్య
లింగమునకుఁ బ్రదక్షిణంబు గావించి ద్విగుణీకృతఫలసిద్ధుండ వైతివి.
కావున సుప్రీతుండ నగు నోగౌతమమునీంద్రా! నీధైర్యంబునకును
విజ్ఞానంబునకును దపఃప్రభావంబునకును నేను సర్వాంతఃకరణంబులచే
సంప్రీతుండ నైతిని. ఋషిశ్రేష్ఠా! త్రిలోకరమణీలలామ యగు మదీ
యకన్యకారత్నమును నీకే యర్పించుచున్నాఁడను. అని చెప్పి యహ
ల్యను గౌతమునికరంబుల యందర్పించితిని.

అహల్యాగౌతముల కల్యాణమహోత్సవములు జరుగుచున్న సమయంబున భూప్రదక్షిణంబు గావించి దేవతలొక్కరొక్కరే య క్కడకు వచ్చి వివాహశుభక్రియలను బ్రత్యక్షముగాఁ గాంచి ప్రీతి దాయక మగు వారిదాంపత్యమునుగూర్చి వినుతించుచుఁ, దమతమ నివాసంబులకుం బోయిరి. శచీపతి యగుదేవేంద్రుండుమాత్ర మహ ల్యం గాంచి మాత్సర్యము వహించి యేమేనియుఁ జేయఁజాలక నిజ స్థానంబునకుం బోయెను. అహల్యాగౌతముల వివాహము జరిగినతరువా తఁ బ్రీతచిత్తుండ నగునేను సర్వకామసుఖావహంబును పవిత్రంబును న దీయంబు నగు బ్రహ్మగిరిని మహాత్ముం డగుగౌతమున కొసంగితిని. మునివరుం డగు గౌతముండును భార్యాసహితుండై రమణీయం బగు నగ్గిరిరాజంబునకుం బోయి యచ్చట నివాసంబును గల్పించుకొని సు ఖోపభోగంబుల ననుభవించుచుండెను.

ఇట్లుండ నొకప్పుడు స్వర్గనాయకుం డగుశచీనాథుండు గౌతమ మునీంద్రుని పవిత్రకీర్తిచరిత్రంబు నాకర్ణించి యాతనిపుణ్యాశ్రమంబు ను, అమ్మునిచంద్రుని, ననిందితచరిత్ర యగునాతనిభార్యను దర్శింపవ లయు ననుకుతూహలముతో భూలోకంబున కేతెంచి గౌతమాశ్రమం బును రూపలావణ్యవతి యగునాతనిప్రియసిని, వారిపై భవంబును గ నుంగొని విస్మయవిహ్వలుండై పాపాక్రాంతహృదయుం డయ్యెను. వీక్షామాత్రంబుచేతనే శతక్రతుం డహల్యయెడలఁ గామాకృష్టచేత స్కుం డయ్యెను. అప్పు డాతనికి స్వపరతారతమ్యంబును, దేశకాల భేదంబును బుషిశాపభయంబునుగూడ నించుకంతయు గోచరింపద య్యెను. సురాధిపత్యగర్వితుం డగు నాతండు నిత్యము నహల్యను ధ్యానించుచుండెను. దానంజేసి యాతనిసర్వాంగంబులు కామసంత ప్తంబు లగుచునే యుండెను. అప్పు డయ్యమరేశ్వరుండు తానాబు

ష్యాశ్రమంబునఁ బ్రవేశించియుండుట కుపాయం బేమి యని యాలో చించి బ్రాహ్మణవేషముతో వచ్చి యమ్మునీంద్రునకు శిష్యత్వముం గాంచి యయ్యాశ్రమంబున నివసించియుండెను. అట్లున్నను, అతని యభీష్టసాధనంబున కవకాశంబు లభింపదయ్యెను.

ఒకప్పుడు మహాప్రాజ్ఞుం డగు గౌతముండు పూర్వాహ్ణికక్రియలను నిర్వర్తించుటకై శిష్యసహితంబుగా నాశ్రమంబును వదలి చనియెను. అనాఁ డమ్మునీంద్రుం డాశ్రమప్రాంతంబులను గౌతమీ తరంగిణిని అందుండు నితరవిప్రవర్గంబులను వివిధాశ్రమసస్యక్షేత్రంబులను బరీక్షించుటకై నిశ్చయించుకొనియెను. దేవేంద్రుం డిదియే సమయం బని భావించుకొని తనమనోభీష్టసాధనంబున కుద్యుక్తుండై యాక్షణమునందే గౌతమరూపంబును ధరియించి రమణీమణి యగు నహల్యం గాంచి ప్రియా! నీగుణంబులచే నే నాకృష్టుండ నైతిని. నీరూపస్మరణంబుచే నాయడుగడుగునందును వైకల్యము ఘటిల్లుచుండును. అని మందహాసంబుసేయుచు నహల్యాకరగ్రహణంబు గావించి శతక్రతుండు గృహాంతరంబునఁ బ్రవేశించెను.

కాని, అమాయికయగు నాయహల్య యీకుతంత్రమును గ్రహింపఁజాలక జారుండగు నింద్రుండు నిజముగ గౌతముండే యని భావించి యాతనితో విహరించుచుండెను. ఆసమయంబున మహర్షి యగుగౌతముండు శిష్యసహితుండై యాశ్రమంబునఁ బ్రవేశించెను. గౌతమమునీంద్రుండు ప్రతిదినంబును గృహంబున కేతెంచునప్పటికిఁ బ్రియభాషిణియగు నహల్య యెదురేఁగి కేలూతయొసంగి యుపచారంబులచే నాతని సంతుష్టుంగావించి ప్రియవచనంబులతోఁ బ్రొద్దుపుచ్చుచుండుట వాడుకయై యుండెను. నేఁడట్లు జరుగకుండుటంగాంచి మహాప్రజ్ఞుండగుగౌతముండు విస్మయాక్రాంతచిత్తుం డయ్యెను. ఆశ్రమ

శ్చయముగా నాకావించినదుష్కార్యమతిగర్హితమైనది. స్వైరశరణి భ్రష్టప్రాదయులు చేయని యకార్యము లేమున్నవి? బ్రహ్మతేజోమయా! కరుణానిధీ! మహాపాపాత్మునగు నన్ను క్షమింపుము. సాధుగణంబులు కృతాపరాధులయెడలనైనను రూక్షభావం బెన్నటికిని జూపంజాలరు. అని యీవిధంబుగా కారుణ్యభిక్షంబు నర్థించుచున్న యింద్రునియెడల నమ్మునీంద్రునికోపము ప్రశమితంబు గాదయ్యెను. గౌతముం డప్పుడు రోషావేశంబున నింద్రునిం గాంచి దురాత్మా! భగానురక్తిచే నింతటినీచకృత్యముం గావించిన నీవు సహస్రయోనివై సర్వదా గర్హితుండవయ్యెదవుగాక! అని శపించి యింకను గోపంబు దీఱక యహల్యం గాంచి నీవు శుష్కనదివై యుండుమని శపియించెను. అప్పు డహల్య మునివరునిం బ్రసన్నుం గావించుకొనుటకై మహాత్మా! మనంబున నైనను నన్యపురుషస్మరణంబు గావించుకామిను లక్షయనరకప్రాప్తు లగుటయే కాక తమపూర్వపురుషులకుం గూడ దుర్గతులం గూర్తురు. నీవు నాయెడలం బ్రసన్నుండవై నావాక్యంబుల మన్నింపుము. ఈతండు నీరూపంబున వచ్చి నన్నుం గలసియున్నాండు. ఈయశ్వశాలారక్షకగణంబు లెల్లరును దీనికి సాక్షులు. అని చెప్పినంతనే వారందఱును సత్యము! సత్యము! అని యుద్ఘోషించిరి.

అప్పు డమ్మునివరుండు సత్యవృత్తాంతంబు సమస్తంబు నెఱింగి శాంతుండై పతివ్రత యగు నహల్యం గాంచి భద్రా! నీవు నావచనానుసారంబుగ నదివై భగవతియగు గౌతమితోం గలిసికొన్నప్పుడు మరల నీకు మత్ప్రియం బగురూపంబు ప్రాప్తం బగుంగాక! అని యనుగ్రహించినంతనే యహల్య నదీరూపధారిణియై ప్రవహించిపోయి గౌతమితోం గలసికొని మరలం బూర్వరూపంబును ధరించెను.

అప్పుడు దేవేంద్రుండు కృతాంజలియై మునివరా! నేను భవద్ద్రోహగతుండను. పాపాత్ముండను. నన్నుం బరిత్రాణంబు సేయుము

అని ప్రార్థించుచు మహర్షిపదకమలంబులకడఁ బతితుం డయ్యెను. అప్పుడు గౌతముండు కృపాన్వితుండై, పురందరా! నీవు పోయి గౌతమీజలంబుల నవగాహనంబు గావింపుము. తత్క్షణమందే పాపవిముక్తుండవై సహస్రాక్షుండ వయ్యెదవు. అని యనుగ్రహించెను.

అప్పటినుండియు నీయహల్యాసంగమతీర్థంబు పవిత్రతీర్థంబుల లోఁ బ్రధానం బయ్యెను. దీని కింద్రతీర్థం బనునామంబుగూడఁ గలదు. తీర్థసేవనుల కిది సర్వకామప్రదం బైనది.

## —◆ జనస్థానతీర్థవర్ణనము. ◆—

అహల్యాసంగమతీర్థమునకుఁ దక్షిణమున జనస్థానతీర్థము గలదు. చతుర్యోజనవిస్తీర్ణం బగునాతీర్థము స్మరణమాత్రంబుననే ముక్తిప్రద మైనది. పూర్వకాలంబున వైవస్వతాన్వయభూషణుం డగు జనకుం డనునొకమహారా జుండెను. వరుణనందన యగునాతనిసతీమణి ధర్మార్థకామమోక్షపురుషార్థంబుల కాధారస్వరూపిణియై గుణార్ణవనామంబునఁ బతిభక్తిపరాయణయై విరాజిల్లుచుండెను. ఆమహారాజునకు యాజ్ఞవల్క్యుండు పురోహితుండై యుండెను.

ఒకనాఁ డమ్మహీపాలుండు పురోహితునిం గాంచి మహాత్మా! మునిసత్తములు బాగుగఁ బరీక్షించి భుక్తిముక్తులు రెండును శ్రేష్ఠములైనవే యని నిర్ణయించి యున్నారు. అందు దాసదాసీజనంబులతోడను, రథగజతురగాదివాహనంబులతోడను, ధనధాన్యాదులతోడను మహావైభవసంపన్నులై యిష్టోపభోగంబుల ననుభవించుటయే యత్యుత్తమం బగుభుక్తిగదా! కాని యట్టిభుక్తి పరిణామవిరసం బైనది. ఇఁక రెండవది యగుముక్తియో—కేవలము నిరత్యయమైనది. కావుననే యది భుక్తికంటె నెల్లవిధంబుల శ్రేష్ఠతమం బైనది. ఇఁక నిప్పుడు మనము విమర్శింపవలసినవిషయ మేమనిన—భుక్తిమూలమున ముక్తిలాభముం బడయఁ గలుగుట యెట్లనువిషయమే. ముక్తి యెప్పు

మను సర్వసంగపరిత్యాగంబువలనను, ఘోరదుఃఖభోగంబులవలనను మాత్రమే లభించుచుండును. విజ్ఞాననిధులగు మీరిప్పుడు బాగుగ నాలోచించి సుఖమార్గమున ముక్తి లభించునట్టియుపాయమును నిర్దేశింపవలయును.

అని జనకుండు వేడుకొనుటయుఁ బురోహితుండగుయాజ్ఞవల్క్యుండించుక యాలోచించి రాజా! జలపతి యగువరుణదేవుండు నిత్యంబును నీప్రియంబు గోరు శ్వశురుండై యున్నాఁడు. నీవిప్పు డాతనిచెంతకుఁ బోయి ప్రార్థించినచో నిశ్చయముగా నమ్మహాత్ముఁడు నీకు హితోపదేశము సేయఁగలఁడు. అని బోధించుటయు జనకుండు పురోహితసహితుండై వరుణుపాలికిం బోయి యథాక్రమంబుగా ముక్తిమార్గంబునుగూర్చి యుపదేశింపవలయు ననిప్రార్థించెను.

అప్పుడు వరుణదేవుండు వత్సా! శ్రద్ధాసహితముగ నాకర్ణింపుము. కర్మపథము, అకర్మపథమునని ముక్తికి రెండుమార్గంబులు గలవు. అకర్మమార్గముకంటెఁ గర్మమార్గమే యుత్తమంబైన దని వేదంబులు చెప్పుచున్నవి. పురుషార్థచతుష్టయము సంపూర్ణముగాఁ గర్మబద్ధమై యుండును. కేవల మకర్మమార్గంబుననే ముక్తిప్రాప్తి యగుననుట వట్టికల్ల. కర్మమువలననే సర్వధర్మంబులునుసిద్ధింపఁగలవు. కావున మానవులు సర్వప్రయత్నంబులచేతను వేదోక్తంబులగుకర్మంబుల నిత్యము నాచరించుచుండవలయును. సత్కర్మానుష్ఠానమువలననే జీవులకు భుక్తిముక్తులు ప్రాపించుచుండును. కావున నకర్మంబుకంటెఁ గర్మమే శుభావహమైనది. కర్మము జాతిభేదములను, ఆశ్రమభేదములను ననుసరించియుండును. చతురాశ్రమంబులును గర్మంబునకు ద్వారరూపములై యున్నవి. అయాశ్రమంబులలో గృహస్థాశ్రమము పుణ్యమయంబైనది. దానివలననే భుక్తిముక్తులు సులభములగుచుండును.

అని వరుణుం డుపదేశించుటయు బుద్ధిమంతుం డగుజనకుండును, పురోహితుం డగు యాజ్ఞవల్క్యుండును సంప్రీతచిత్తులై జలపతి యగువరుణునకుఁ బ్రణామార్చనంబులు గావించి మహాత్మా! సర్వజ్ఞుం డవగు నీవు మాయెడలఁ బ్రసన్నుండవై యేదేశంబున నేతీర్థము భుక్తిముక్తిప్రదం బైనదియో యెఱింగింపవలయు నని ప్రార్థించుటయుఁ బశ్చిమేశ్వరుం డగువరుణుండు మహాభాగులారా! భూభాగంబున భారతవర్షము పుణ్యప్రదమైనది. అందును దండ[illegible] సర్వోత్తమం బైనది. ఆక్షేత్రంబునం గావించిన [illegible]ను భుక్తిముక్తిప్రదాయకమై యుండును. [illegible]లో గౌతమీగంగయే మానవులకు సర్వప్రధాన[illegible]యినదై విరాజిల్లుచున్నది. అందు గావించు స్నానదానాదులు భుక్తిముక్తిప్రదంబులు.

అని బోధించుటయు జనకుండును, యాజ్ఞవల్క్యుండును బరమానందభరితాంతఃకరణులైరి. కొంతకాలంబునకు జనకుండు గౌతమీతీరంబునకుం బోయి యచ్చట నశ్వమేధయాగానుష్ఠానంబు గావించెను. విప్రవరుం డగు యాజ్ఞవల్క్యుఁడే యందలి సకలకర్మంబులను సక్రమంబుగా నిర్వర్తించెను. ఆయజ్ఞఫలంబువలన నారాజేంద్రుండు ముక్తుం డయ్యెను. జనకమహారాజు గావించిన యాయజ్ఞప్రభావమువలన గౌతమీప్రసాదముచే నింకను జాలమంది మహాపురుషులు ముక్తిలాభంబు నందఁగలిగిరి.

అప్పటినుండియు నాదివ్యతీర్థము జనస్థాననామంబున విఖ్యాతం బయ్యెను. అది జనకవంశస్థులకంతఱకును యజ్ఞక్షేత్రం బయ్యెను. చతుర్యోజనవిస్తీర్ణం బగునాక్షేత్రము స్మరణమాత్రంబున సర్వపాపహారం బైనది. అందలి స్నానదానాదులును, పితృతర్పణంబులును, ఆతీర్థస్మరణసేవనంబులును మానవులకు సర్వకామప్రదంబు లైనవి.

# బ్రహ్మపురాణము

( మూఁడవసంపుటము. )

మూర్తిత్రయప్రణీతము.



విమర్శా దర్శకి

శిరరాజు పంతు…

# విషయసూచిక.



దలంపసాగెను. "ఓర్చుకొనశక్యముగాని సహస్రకిరణంబులవేఁడిమిలో నిరంతరము వెలుంగుచుండు నాహృదయనాథునిసన్నిధిని ననవరతంబును నివసించుట నాకు మిక్కిలి కష్టముగా నున్నదే! ఏమి చేయుదును."

నారదా! వింతయైన యీసంఘటనమును వింటివా? విశ్వకర్మనందని యగు నయ్యుషాదేవికి నమితప్రజ్ఞావంతు లగువైవస్వత మనువు, యముఁడు నను నిద్దరు పుత్త్రులును, పుణ్యనదీమతల్లి యగు యమున యనునొకకన్యయుఁ గలరు. సంతానవతియైనయాదేవి యానాఁ డట్లు తలపోసి తుదకుఁ బ్రయత్నపూర్వకముగాఁ దననీడను దనపోలిక గలయాఁడుదానినిగా సృష్టించి యామెతో నిట్లు పలికెను. "నీవును, నేనును సమానరూపవయోవిలాసంబుల నొప్పుచుంటిమి. కావున నీవు నాస్థానంబున నిల్చి, నాజీవితేశ్వరుని భక్తిశ్రద్ధలతో నారాధించుటయందును, ఆయనకుఁ బ్రియమును జేకూర్చుటయందును, మఱియు నాబిడ్డలను నితాంతప్రేమతో సంరక్షించుటయందును నెంతమాత్రమును వెలితిగానరాకుండ సంచరించుచుండుము. మఱియు నీయుత్పత్తివృత్తాంతముగాని, నాప్రయాణోదంతముగాని నా భర్తకును, నాబిడ్డలకును నెన్నఁడును, ఏవిధమునను దెలియనీయకుము. నే నిప్పుడే యిల్లు వెడలి పోవుచున్నదానను. ఈనిముసము మొదలుకొని నేను చెప్పినట్లు వర్తింపుము. ఇదె నాయాజ్ఞ. భద్రము సుమా!"

ఈమాటలకు ఛాయాదేవి సమ్మతించెను. అంతట నుషాదేవి గృహమునుండి వెలువడి తనప్రాణేశ్వరుని తీక్ష్ణతేజమును శాంతింపఁ జేయుభావముతోఁ బితృసన్నిధికిఁ బోయి తనవృత్తాంతమంతయు నాతనికి విన్నవించెను. త్వష్టప్రజాపతియు, నామె వాక్యములను

విని చకితుఁడై "భద్రా! పతివ్రతలగు నారీమణుల కిట్టి స్వేచ్ఛాప్రవృత్తి దగినపనికాదు. నీభర్తకును, బిడ్డలకును నేమి గతి కల్పించి వచ్చితివి? ఈనీసాహసమునకు మిక్కిలి భీతిల్లుచున్నాను. నామాట విని తిరిగి భర్తృగృహమునకుఁ బొమ్ము." అని మందలించెను. ఆమాటల కయ్యుషాదేవి "తండ్రీ! ఆ వేఁడిమి నేను సహింపఁజాలను, అక్కడకు వెడలఁజాలను." అని మాటిమాటికిఁ బలుకుచు శీఘ్రముగా నక్కడనుండి కదలి యుత్తరకురుభూములకుఁ దపస్సు చేయుటకై వెడలిపోయెను. అచ్చోట బడబా (ఆఁడు గుఱ్ఱము) రూపమును ధరియించి మార్తాండప్రతాపవంతుండగు తనపాణికాంతుని నిశ్చలభావములో మనంబున నిడుకొని తీవ్రమైన తపంబు నొనరింపం దొడంగెను.

ఇక్కడ యిట్లుండ, నచ్చట నుషాస్వరూపిణి యగు ఛాయాదేవి భర్తృపరిచర్య గావించుచుఁ గొలఁదికాలములో 'సావర్ణి, శనైశ్చరుఁడు' అను నిరువురుపుత్రులను, 'విష్టి' అను నొకపుత్రికను సంతానముగాఁ బడసెను. మొదట స్వసంతానమును సంతతి గలిగినతరువాత ఛాయాదేవి యుషాదేవిబిడ్డలకంటెఁ దనబిడ్డల నెక్కువగాఁ బ్రేమింపఁజొచ్చెను. తల్లియైనయీభేదభావమును గనిపట్టి యముండు క్రుద్ధుండై తనకాలితో ఛాయాదేవి నొక్కతన్ను తన్నెను. పుత్రుని యీయాగడమునకు సంక్షోభించి ఛాయాదేవి కుపితురాలై, "ఓరి పాపీ! నాయాజ్ఞచే నీరెండుపాదంబులును విశీర్ణంబు లగుఁగాక!" అని వైవస్వతుండైన యముని శపియించెను. యముండును విశీర్ణచరణుండై దుఃఖించుచుఁ దనతండ్రియైన సూర్యదేవునిసన్నిధి కేఁగి యావద్వృత్తాంతము నాతనికి విన్నవించెను. మఱియు నిట్లనియెను. "తండ్రీ! సురశ్రేష్ఠా! ఈమె నాతల్లి గాదు. ఏమన, చిన్నతనప్పటినుండి నాకు నీమె చేసినను తల్లి యించుక మందలించును

గాని యిట్టి తీవ్రశాపము నెన్నఁడు నీఁజాలదు. ఏ యాఁడుది యైనను గడుపారఁ గన్నబిడ్డల నీరీతి దుర్భరమైన యంగవైకల్యమునకుఁ బాల్పడుచునా? ఇంత బాల్యవయస్సున నే నీదుష్టాంగంబుల నెట్లు ధరించి యుండఁగలను? బిడ్డలు మంచివారైనను, చెడ్డవారైనను, వారేనేరము చేసినను తల్లి యైనది సహించుకొనును గాని యిట్టి కష్టకోపమును వహియింపదు. కావున, తండ్రీ! ఈమె నిశ్చయముగా నా జనని గాదు."

తనయుని యీ వాక్యములను భానుదేవుం డాకర్ణించి మిక్కిలి విచారము నొంది యిట్లనుకొనియెను. ''వాస్తవముగ నీమె యుమాదేవిఛాయ గాని యమునాదుల జనని యైన త్వాష్ట్రి గాదు. తల్లి బిడ్డల యెడ నిట్టి దుష్కార్యమును గావించియుండదు. దాని స్వభావము వేఱుగను దీని స్వభావము వేఱుగను గానంబడుచున్నది.'' ఇట్లనుకొని పిమ్మటఁ దనదివ్యజ్ఞానముచే సర్వము నెఱింగి యిట్లు తలపోసెను. ''విశ్వకర్మనందన యగు నుష నా ప్రచండతరతాపమును శమింపఁజేయఁగోరి యుత్తరకురుభూములయందు బడబారూపమునఁ దపంబు సేయుచుఁ గాలము గడపుచున్నది.'' ఆదిత్యుం డీవిధముగాఁ దలంచి తన ప్రాణప్రియను జూచు నభిలాషముతోఁ దాను సయిత మశ్వరూపమును ధరించి యామె యున్న స్థలంబునకుఁ బోయి, యచ్చట నున్న ఘోటీయాఁడుగుఱ్ఱమును గాంచి కామభావంబు విశద మగునట్లు గట్టిగా సకిలించుచు దానిని సమీపించెను. మోహాతుర మగు నయ్యశ్వమును గనియు, అట్టిదే యైనదాని హేషారవమును వినియు పతివ్రతాపరాయణయు, పతిధ్యాననిష్ఠితయు నశ్వరూపధారిణియు నగు నయ్యుష మిక్కిలి భీతిల్లినదై 'ఈయశ్వ మెక్కడిది?' అని యనుకొనుచు నయ్యశ్వమును ధర్షింపమిఁ దన ప్రాణేశ్వరునికడకుఁ బోవుతలంపుతో దక్షి

